# శ్రీకృష్ణలీలాతరఙ్గిణి

మహాకవి నారాయణతీర్థులు

---

ఆంధ్రీకరణము

తహావ్వర్-ఓ-గొలాదస్ దస్తగిర్ మస్తాన్సుల్తాన-సాహితీవల్లభ

శ్రీ రాజా వేంకటాద్రిఅప్పారావు బహద్దర్

ఉయ్యూరు సంస్థాన ప్రభువులు

---

పర్యాలోకనము

శ్రీమాన్ బొమ్మకంటి వీరరాఘవాచార్యులవారు

సంస్థాన పండితులు


పబ్లిషర్సు

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

1948

వెల రు ౩—౮—0

# విషయ సూచిక

# కీర్తనల అకారాది క్రమసూచిక

శ్రీ

# ష్ణ లీ లా త ర ఙ్గి ణి



## పీఠికా నాటిక

శ్రీ వేంకటరమా దేవి

[మహాకాశమున దివ్యహంసలస్వరూపములు దాల్చిన వేదముల రథముపై యానముసేయు బ్రహ్మ, సరస్వతి, సావిత్రి, గాయత్రి సంభాషించుట]

సరస్వతి.— నేడు వాహ్యాళిలో హిరణ్యగర్భులకు ఏకాలక్షేపము సమ్మతమో!

బ్రహ్మ—భూలోకమునుండి మన కందిన గ్రంథముల ప్రతిరూపతేజములలో పావనతమమును, రమ్యమునైనది సేవింతము.

గాయత్రి—అట్టి దే గ్రంథము ?

సావిత్రి—భూలోకమున ప్రఖ్యాతి చెందిన శ్రీకృష్ణలీలాతరంగిణి నూతనముగ ఆంధ్రానువాదముతో ప్రకటింపఁబడినది; ఇది సేవింప తగినది.

బ్రహ్మ—అవును. శ్రీమద్భాగవతకథ ననుసరించియు, అందు వర్ణింపఁబడని శ్రీ రాధాకృష్ణ ప్రేమ సంకీర్తనము గలిగిన శ్రీకృష్ణలీలాతరంగిణి పావనతమమైన దృశ్యకావ్యము.

సావిత్రి—స్వామీ శ్రీమద్భాగవతమున శ్రీరాధాదేవియొక్క ప్రశంస లేకపోవుటకు కారణమేమి?

బ్రహ్మ—ఇతరపురాణములందు శ్రీరాధాదేవి పవిత్రచరిత్ర వేదవ్యాసులు వివరముగా వర్ణించియేయుండిరి. ఆమె ఆదిగోపిక యగుటచేతను, ఆధ్యాత్మిక విచారణమే అందు ప్రధానవిషయమగుటచేతను, శ్రీమద్భాగవతమున గోపికథా కథనమే శ్రీరాధాదేవియొక్క అవతారసూచనగా నెంచి, వేదవ్యాసులు అందును గూర్చిన ప్రత్యేక ప్రశంస మానిరేమో!

గాయత్రి—ప్రత్యేకముగ, ఇట్లు నామధేయ నిర్వచనములను మానుటవలన, వ్యక్తులయొక్క ప్రత్యేకతనుగూర్చియే సంశయములు ఏర్పడుటకు అవకాశములు కలుగునేమో!

బ్రహ్మ—కలుగును; కలిగినవి. నేను స్వయముగ నొనరించిన శ్రీరాధకృష్ణుల కళ్యాణముయొక్క పవిత్రతకు వ్యత్యస్తమా ధోరణి పురాణములలో వ్యక్తమూటయుఁ గలిగినది.

గాయత్రి—అదెట్టిది దేవా!

బ్రహ్మ—గోలోకాధిదేవియు, శ్రీకృష్ణానపాయినియు నా శ్రీరాధాదేవి, భూలోకమున - గోకులమున - వృషభానుకళావతులకు పుత్రికగా నవతరించి, శ్రీకృష్ణావతార మహనీయకార్యక్రమమున తనభాగము నెఱవేర్చియుండుట మీరెఱుగుదురు.

సరస్వతి—ఎఱుంగుదుము.

బ్రహ్మ—బృందావననందగోపునికి పితృతీయ సోదరియు, సుచంద్ర కీర్తిదేవులకు పుత్రికయు, గోపీనాయికయు, రాపాణు డను గోపీనాయకుని భార్యయు నగు రాధికయను మఱియొకతె - వృషభాను పుత్రికయైన రాధాదేవికంటె వయసున పెద్దది - తత్కాలమున గోకులమున నుండుటయు మీకు తెలియునుగదా!

# పీఠికా నాటిక

గాయత్రి—అంత ?

బ్రహ్మ—అంతియేకాదు, శ్రీకృష్ణావతార ప్రథమకాలమున స్వామివారి బాల్యలీల లా గోపికాక్రీడావినోదములకు అనావశ్యకమైన మధురశృంగార రసభావములను కల్పించి, అందులకు లక్షణముగా, కవులు యువతీయువకుల ప్రేమకు తగిన శృంగారరచనలతో శ్రీగోపీకృష్ణబాల్యలీలలను వర్ణించిరి.

దేవులు ముగ్గురు—అకటా!

బ్రహ్మ—కావున నే అట్టి ప్రశంస అంతగా లేనిదియు, నాధ్యాత్మిక భక్తిభావములతో వెలయునదియు నగు ఈ శ్రీకృష్ణలీలాతరంగిణి, ఆంధ్రానువాదముతో మనము సేవింప తగినది.

సరస్వతీ! నీవు శ్లోకములను తదనువాదములను పఠింపుము; గాయత్రీ! నీవు వచనములను తదనువాదములను చదువుము; సావిత్రి! నీవు తరంగ కీర్తనముల గానము చేయుము.

సావిత్రి—ఆంధ్రానువాదముగల ఈశ్రీకృష్ణలీలాతరంగిణీగ్రంథమున, తెనుగు కీర్తనలపై రాగతాళములు ముద్రింపబడలే దేమి?

గాయత్రి—ఇఁక నిందు, తెనుగుకీర్తనల గమనికలను తెలిసికొనుట యెట్లు?

సరస్వతి—ఇందు, సంస్కృతభాగమున, శ్రీనారాయణతీర్థులవారి ప్రతి కీర్తనపై రాగతాళములు వివరింపఁబడియే యున్నవి; మఱి పునరుక్తిగ తెనుగు పాటలపై కూడ ముద్రించు టేల? అవియు నెదుటి పుటలలోని సంస్కృత కీర్తనల గమనికలు గలవే కదా!

బ్రహ్మ—అవును. శ్రీనారాయణతీర్థులవారిచే సంస్కృతమున గూఢముగ సూచింపఁబడిన మన వేదముల భావములను దేశభాషలో సులభముగఁ దెలుపుచు, ఈయనువాదము, మూలములో వలె అంత్యనియమముల యింపును, యతిప్రాసల సొంపును కూడ కలిగియున్నది. ఇఁక విశేషముగ సంబోధన సమాసములు గల సంస్కృతకీర్తనల ప్రతి చరణభాగమునకు తెనుగుపాటల చరణములలో కర్త కర్మ క్రియలుగల సంపూర్ణవాక్యములు వెలసియున్నవి. ప్రతి శ్లోకమునకు తగినపద్యమునువచనమునకుసరియైనవచనమును అలరుచున్నవి. మూలమును, అనువాదమును - సంఖ్యలక్రమమున - ఎదుటి పుటలలో ముద్రింపఁబడియున్నవి. ఈగ్రంథము ఎల్లరకు ఆనందకరమై, పవిత్రమై వర్ధిల్లుగాక!

---

# శ్రీ నారాయణతీర్థులవారి చరిత్ర

రచయిత : కవి సమ్రాట్టు విశ్వనాథ సత్యనారాయణ

గీ. కోన సీమ భీమేశు నుద్యాన సీమ
సాధు గోదాపయోగర్భ సస్యభూమ
తనరు నాంధ్రీ సతీ గళోద్దామ దామ
కూచిమంచి యనంగ నక్కోనసీమ 1

క. కలదొక్క యగ్రహార
మ్మలఘు సరస్వతికి రత్నహారము దానన్
గలరు జగతీ సుపర్వులు
తలిసిన దంపతులు పార్వతీ గంధర్వుల్. 2

ఉ. కాయము గన్న భక్తియన గల్గెను వారికిఁ బుత్త్రకుండు నా
రాయణ భక్తితత్పరత నట్టిద పేరును బెట్టి రింతలో
నాయన వేద వేదశిఖరాఖిల మేఖల యైన వాణి సం
ధాయుత భాసమాన రసనానటనంబులఁ దేల్చునట్టిదై. 3

సీ. గొంతెత్తిపాడెనా, కొమ్మలోఁ గోకిల
మసలు వసంతాగమ మ్మటంచు
సివమెత్తియాడెనా, చెట్టు పంగల నెమ్మి
కడఁగు వర్షాసమాగమ మటంచు
వేదరహస్యముల్ విప్పెనా, మ్రాన్పాటు
భజియింత్రు త్రయ్యర్థపారిషదులు
నామకీర్తనఁ జేసెనా, బాలకృష్ణుండు
ఘల్లుఘల్లున వచ్చి గంతులిడును
కూడి శివరామతీర్థులన్ గురువు నొద్ద
సాధువయి నేర్చె సర్వశాస్త్రములు తద్ద
నెగడె నింతలో విద్యలన్నింటఁ బెద్ద
గాగ నెంతెంత వారికిఁ గళలు దిద్ద. 4

గీ. మాధవానలు నవతార మహిమఁ జూపు
కాంచె బిల్హణ జయదేవ కవుల రూపు
చదివినది కాదు సంగీత శాస్త్రమందు
నూలుకొని పాడె నేని వీనులకు విందు. 5

చ. చిఱుతతనంబునందె తన శిష్యునిభావము బాలకృష్ణ సుం
దర తర సత్కథాపులకితం బగుచుండగఁ జూచి దేశికుం
డురుతర మోదవార్ధి యదియున్ దన భాగ్యమకాఁ దలంచె నం
దఱదగు భాగ్య మాంధ్రవసుధాస్థలి భాగ్యము గీతియోగ్యమున్ 6

ఆ. వయసువచ్చినంత బ్రహ్మవంశకిశోరుఁ
డెంత భక్తికలడో యంత సక్తుఁ
డయ్యెఁ దల్లిదండ్రు లనుకూలవతిఁ దెచ్చి
పెండ్లిఁ జేసినారు పెరిమఁగ్రుచ్చి. 7

క. వేదాద్రి యొద్దఁ గృష్ణకు
నాదరి బ్రాహ్మణుల యగ్రహారమునందున్
శ్రీ దేవి శుద్ది యయిన త
లోదరి నొక్కర్తు కూర్చి రాగి కను విందున్. 8

క. కూరిమి తలిదండ్రులతోఁ
బాలుఁడు వేదాద్రియందు భక్తివశత దై
త్యారిని నరసింహేశ్వరుఁ
జేరిక భజియించుచుండె సిరులొలయుంగన్. 9

క. ఇలు నొడలెంచక కవితా
విలసనములఁ దిరుగుచుండె విద్వాంసుండై
తలిదండ్రు లిచ్చుఁ గలఁగగఁ
బాలతుక పుట్టింట విన్నబోవుచు నుండన్. 10

గీ. చల్లపల్లి ముక్త్యాల సంస్థానములను
పండితాఖండలుండయి ప్రతిభఁ జూపి
మహితనాట్యప్రబంధ నిర్మాతయగుచుఁ
బారిజాతాపహరణంబు వ్రాసెఁ గృతిని. 11

చ. చిఱుతలు పూని పాదములఁ జెల్వుగ గజ్జెలు కట్టి తంబురా
యఱుతనుదాల్చి పంచమ సుధాధర మాధురి వొల్చు గొంతుతోఁ
బరము యశోద చిన్నిసుతుఁ బాడినఁ గూడిన వారి కన్నులన్
గిరగిర బాష్పముల్ తిరుగుఁ గృష్ణుఁడు కూడిన లోని మిన్నులన్ 12

క. ఆభక్తుని నాలుకపై
శోభించెను కృష్ణగీతి శుద్ధమహాస్సై
శ్రీభూమి యతని యెడదన్
స్వాభావిక రాగరేఖ సాగెఁదమస్సై. 13

క. ఇటులుండ నొక్కమేఘో
ద్భటగర్జానినదరేఖఁ బండినవర్ష
చ్ఛటఁబొల్చు శ్రావణం బది
పుటపుటనై వచ్చె దేశములు చిగురింపన్. 14

చ. పరువమువచ్చెఁ జెట్లకును బాటల మొల్చిన పచ్చగడ్డికిన్
విరిసినయొక్కనాటి తుదివేళకు సూర్యుఁడు నస్తమించి యు
ద్ధురమయి పోల్చె వానియెదతోఁడి విచిత్రపురాగరేఖ తాఁ
బరువిడె వానిబుద్ధి సతిపైకి దువారపుపొంగు లెత్తుచున్. 15

గీ. అపుడు తానున్నచోటికి నత్తవారి
యింటికిని మధ్యగా నెదురెక్కెఁ గృష్ణ
వఱదలుగఁ బొంగి చనుచుండి వయసుచేత
నెడద విప్రసూనున కెదురెక్కెఁ దృష్ణ. 16

శా. కాలాంతంబునఁబోలెఁ బొర్లుచుఁ దరంగమ్ముల్ మహాకాశవీ
ధీ లీఢంబులుగాఁగఁ గృష్ణ పొరలెన్ ధీరుండు లోహార్గళో
ల్లీలాబాహుఁడు పీనవక్షుఁడు మనోలీలావశుండై రుషన్
బోలేమాయని బారుటీతకుఁ బడెన్ బోత్రిప్రభుండోయనన్. 17

ఆ. నడుముకట్టిదూకి నడియేటఁ బడిపోవు
నతని కాలుసేతు లాడకుండ
నొక్క పెద్దసుడి మహోగ్రంబు ప్రాణాంత
భయము కలుగఁజేసె వాని కపుడు. 18

క. చేతోవీథి నిరాశా
ధూతముగా బ్రతుకునాస తూలఁగఁ గానీ
భీతిల నేటికటంచును
నాతురసన్న్యాసమాత్మ నవలంబించెన్. 19

శా. ప్రైషోచ్చారణ మంత్రమున్నొడివె దుల్పెన్ సర్వబంధంబు ని
శ్శేషంబైన మూర్ధజం బొకడు తీసెన్ ముండనాంకంబుగాన్
ఈషాపద్ధతి ప్రక్కలించి మదినిశ్లేయయ్యె సన్న్యాసిగా
ఘోషల్ వెట్టెడు కృష్ణనీరు తనులోఁగొంచేగు నన్నంతలో. 20

గీ. అతఁడు తనుదానెఱుంగక మృతినిగనక
యొడ్డునకుఁజేరె నద్దియేదో మహత్త్వ
తన్నుకొనుకీడు తాఁబాసిచన్న వెనుక
మనసు వెనుకటి సంగంబు నిలిచి హత్తు. 21

మ. జలగండంబు తొలంగె సన్న్యసన మిచ్చన్ జేసితింగాని యు
జ్జ్వలరాగాత్మకమై యెడందసతిపైఁ బాఱెన్ గురుల్ సెప్ప ర
ర్మిలిమై తొయ్యలి యామతింపదు బికారిం బో ల్పరివ్రాట్టునై
తొలగంబోవుట ధర్మమాయనుచు వాదుల్ పోవుచాత్మన్ ద్రుటిన్

ఉ. రాగవిరాగముల్ పయికిరాఁజను పొంగుల నొందునొందు తా
మాగి పరస్పరంబు నెదనాకులపెట్టగ మామయింటికిన్
మూగిన చీకటుల్ ముదురుముల్గఁ గట్టిన యర్ధరాత్రమం
దేగిన నత్తమామ లెదురేగి సపర్యలుసేయు చల్లునిన్. 23

గీ. మౌననిద్రావిభూషితు మదనజనక
మదన తన్మయ భావనా మృదువిభావు
భావమెఱుఁగక తద్భార్యఁ బంపి రతని
యున్నచోటికి సతియును నొదిగి యొదిగి 24

క. తను డాసిన భార్యకుఁ బె
ల్చన గదిలో నతఁడు దివ్యసన్న్యాసివలెన్
గనుపింప నామె వెనుకకుఁ
జని విస్మయమున్ భయంబు సమ్మర్దముగాన్. 25

ఆ. తోయజాక్షి తల్లితోఁ జెప్పె సన్న్యాసి
గారి యతఁడు మగఁడు కాదటంచు
శిరసు బోడి కావి చీరలు దండంబు
వింత తేజు కనుల వెలుగునంచు. 26

ఉ. అచ్చెరువొంది మామయును నల్లుని జూడగ నల్లుడల్లుఁడై
పొచ్చెములేక యుండె సతి బూమె లివేమని సంశయాత్ముఁడై
గ్రుచ్చియు పృచ్ఛసేయగ వికుంఠపతిన్ మదినెంచి యల్లుఁడున్
మచ్చిక సెప్పె నాత్మకథ మంతనమం దుదయద్విరాగుఁడై. 27

ఆ. తెలిసి యాత్మలోనఁ దెలివ జ్ఞానమహత్తుఁ
గలఁచి యాత్మలోని కలుషమత్త
మలచె నాత్మమెల్ల మాధవ సంవిత్తు
దొలచె బంధమెల్లఁ దోరహత్తు. 28

క. ఆయనఘు డంత నాత్మన్
తోయరుహానన మహాత్త్వ ప్రోవం జూపన్
ప్రాయశ్చిత్తిని గని నా
రాయణ తీర్థాఖ్యఁ జేర నరిగెఁ దిరుపతిన్. 29

ఉ. శ్రీగిరియందుఁ దీర్థులు ప్రసిద్ధి గడించెను యోగశాస్త్ర వి
ద్యాగురుఁడై యఖండ యతి ధర్మ సదా చరణ ప్రవీణుఁడై
శ్రీగిరినేత భక్తజనసేవధి శ్రీపతి వేంకటేశ్వరుం
దూగెఁ దదీయ గాన విభవోజ్జ్వలకీర్తనలందుఁ జొక్కుచున్. 30

మ. అలబోధేంద్ర సరస్వతీ ప్రముఖులౌ నాచార్యులున్ శిష్యులై
కొలువం బేర్చి సమస్తశాస్త్రముల వాకోవాక్య సిద్ధాంతముల్
సలుపన్ దక్షుఁడు తీవ్రభక్తి కలనార్చా ప్రీతగోవిందుఁడై
విలసన్నామజపై కదీక్షితుఁడు తృప్తింబొంది యుండెన్ గడున్ 31

గీ. శ్రీ సురేశ్వర కృతము పంచీకరణ సు
వార్తికంబునకుఁ వ్రాసెఁ బ్రతిభ మెఱయ
వివరణం బొండు 'దీపిక' పేరు వెలయఁ
దీర్థభూత నారాయణు తీర్థ లెలమి. 32

క. పాదులు గట్టిన శ్రీదా
మోదర భక్తునకు నచట నొక్కప్పుడు తీ
వ్రోదర దుర్వ్యాధి కలిగె
నేదారిని బూర్వజన్మకృత మోఁడు తప్పున్. 33

క. సేవించిన మందులు సం
భావించిన స్వామి కరుణ పనిసేయక తా
గావించిన పూర్వాఘమె
దేవించెను గడుపులోని తీవ్రత యెల్లన్. 34

మ. అరుదారన్ బిరుదార భక్తజన దీవ్యత్పాలనాదీక్షుఁడౌ
బరమేశుం డొకనాడు తోఁచియనె స్వప్నంబందు నామూర్తిము
న్నరిగెన్ దక్షిణదేశమొక్కడట కీవై యేగు నీబాధయున్
సురుగున్ గొంతకుఁ గొంతగా నుపశమించున్ వింతకున్ వింతగా. 35

గీ. పరముఁడనుకొన్నది వరాహపురము తీర్థఁ
డాత్మ ననుకొన్నది తిరువయూరు వ్యాధి
వ్యాధిగా నున్నయది. తోఁచదాయె యతికి,
కలఁగి యట నడుక్కోరణియన్ గ్రామమేగి. 36

క. భజియించున్ మధుసూదను
గజిబిజిపడు పుణ్యమెల్లఁ గాదను దాదృ
జ్నిజభక్తి జనితవేదను
రజని నొకట స్వప్నవీధి వ్రజపతి యనియెన్. 37

క. నాయన! వరాహపురికిం
బో! యన, నిటకేగుదెంచి పొగిలెదవన! రే
పే యన! వరాహయుగ్మం
బాయెడకుం దారిఁ జూపు నరుగుమనంగా 38

గీ. అడవిపందులు రెండయి పొడిచినట్టి
విదియ మొదలు నాలుగునాళ్ళ విధుశిశువుల
చెలువుకోఱలతోడ వేంచేసెనంత
భక్తమణి వానివెంబడిఁ బట్టెఁ బుంత. 39

క. జయజయ వేంకటరమణా!
జయజయ దైత్యేంద్రలోక శౌర్యాక్రమణా!
జయజయ ధ్వస్తభ్రమణా!
జయజయ మత్ప్రాణరమణ! జయజయ యంచున్. 40

క. చేరెను వరాహపురి, చే
కూరెను బో, వ్యాధిశాంతి, కూడిన తద్గ్రా
మారూఢ ద్విజసంఘము
తారుగ జనుదెంచి స్వాగతము పచరింపన్. 41

చ. కలఁగఁటివేల్పు చెప్పినప్రకారము వచ్చిన యాయతీశ్వరున్
వలఁగొని మ్రొక్కి బ్రాహ్మణులు వారకభక్తిమతుల్ రమేశ్వరున్
నిలువకపాడి, నిన్నుఁగరుణించెను స్వామి యనుగ్రహింపవే
నిలుకడగాఁగ నిందు నిలు నీవు కృపాబ్ధి! మమున్ గ్రహింపవే! 42

క. నారాయణ తీర్థులునున్
వారిట్లన నచట నిలచి వారాహపురిన్
నారాయణనామ కలా
పారాయణుఁడై వసించె భక్తిమతి సిరిన్. 43

శా. ఆనారాయణతీర్థు లంతట సముద్యద్భక్తి యేపార ల
క్ష్మీనారాయణ దైవతంబులకు నిర్మింపించెఁ బెన్గోవెలన్
సానందాత్ముఁడు మూలవిగ్రహప్రతిష్ఠన్ దానుగాఁ జేసియున్
దానై తెచ్చిన పూజయంత్రమును సంస్థాపించె నాకోవెలన్. 44

ఉ. ఆపగవోని భక్తిని మహాత్ముఁడు కృష్ణునిలీలలెల్లఁ దా
నాపగరాని రక్తిని మహాలయ తాళతరంగ రూపకా
వ్యోపదవెల్లు నయ్యుపద యుర్వర భక్తజనాళి పూర్వపు
ణ్యాపగ పొంగివచ్చినటు లయ్యెఁ దరంగ తరంగ గానమై. 45

శా. శిష్యోత్తంసులచే వరాహపురిలో శ్రీకృష్ణలీలా కథా
భాష్యంబుల్ పొనరించెఁ దా నభినవ ప్రస్తావనా నాట్య సం
తుష్యత్సర్వ జగంబుగా విమలసాధుప్రేక్షణీయంబుగా
శుష్యత్పాపుఁడు నవ్యనాటక కలాశోభల్ ప్రపంచించుచున్. 46

క. శిక్షోత్సవ మను పేరిట
వాక్యార్థము చేసెఁ గృష్ణ వైభవ లీలా
ధిక్యంబులు కవినట రా
సిక్యంబులు కొల్లగాగ సిద్ధాంతములన్. 47

క. ఆనాటినుండి తెలుగుల
కేనాటఁ బ్రసిద్ధమయ్యెఁ గృష్ణుల లీలా
శ్రీనాటకమ్ము తచ్చి
క్యానందోత్సవము నెల్ల రానందపడన్. 48

క. నారాయణ తీర్థుల వా
రా రీతిని మూడు వత్సరమ్ముల వఱకున్
వారాహపురి వసించిరి
చేరిరి 'తిరుపుంతురుత్తి' సిద్ధిఁ గనుటకై. 49

సీ. కౌస్తుభరత్నమో కడలి యనుంగు కూ
తురో యెఱ్ఱదనమంత యురమునందు
పున్నమచంద్రుఁడో పొంగారు కరుణార
సంబో యా యంత కంజాయలందు
వనమాలయో లేక పెనవేసికొను జగ
ద్భరమొ వ్రేలాడుకంధరమునందు
తామరపూవొ మొత్తని జీవలోకంబొ
యభయముద్రాంక హస్తాగ్రమందు
నా వెలింగెడు కటివేల్పు తావులెల్ల
గుబులుకొని పూవుదోట లాగునను వచ్చి
తెలివి నిగుడు నారాయణతీర్థు తెలివి
లోన దానొక్క తెలివిగాను లీనమయ్యె. 50

ఉ. భక్తిని వేదశాస్త్రచయ భాసురశక్తిని, దివ్యయోగ సం
యుక్తిని, నాట్యచిద్రసమహోదయరక్తిని, నాంధ్రభూమి సం
సక్తిని, దేశదేశములఁజాటి యుదారమహార్తి మూర్తియై
ముక్తినిఁ, బొందెఁ దీర్థు డవిముక్తపదంబున పట్టభద్రుఁడై. 51

# SRI NARAYANA THIRTHA

The spiritual Guru of Sri Bodhendra Saraswathi and mentioned by the latter in several of his works :—

From the History of classical Sanskrit Literature by Dr. M. Krishnamachariar (P. 345) in Adyar Theosophical Library.

TOPICAL PARA 301. "Narayana Thirtha is said to be the last incarnation of Madhavanala. (మాధవానలు). He calls himself the disciple of Sri Sivaramanadha Thirtha. He lived at Kuchimanchi Agraharam in Godavary District about 1,700 A. D. His Krishna Lila Tarangini embraces the story of Sri Krishna in 12 Tarangas. The Musical modes and rhythmic tunes are specified and explanatory verses are inscribed between the songs. The poem is fit for the lyre and shows sentiments of devotion.

Notes :—

1. Kuchimanchi Agraharam is mentioned in the Inam Register in a grant by *Kolavenu Buchama and Terumannarao* in Fasli 1151.

2. Incarnations : of Madhavanala Kavi.

   2nd............Bilhana.
   3rd............Brihanmangala.
   4th............Jayadeva.
   5th............Sri Narayana Thirtha.

---

## Letter from His Holiness Sri Sankaracharya Swamighal of Kamakotipeetham

Your letter dated 7—8—1944 was received and placed before His Holiness. I am directed to send herewith a copy of the book called "Sikhyotsawam" by Sri Narayana Kavi.

On page 3 of the Sanskrit introduction to the said book a short account is given of Sri Narayana Thirtha. The "Prasthavikam" of the book gives a more detailed account of the life of Sri Narayana Thirtha. In slokas 70 to 94 of the 1st Aswasa of the text reference is made to him again. A picture of Sri Narayana Thirtha is also found in the book. In addition to the references given above, tradition gives the following history of his life. He is said to belong to the Andhra Country. Shortly after he was married and at the time of the incident narrated below,

his wife was living at her parents' house which was on the other side of the river, probably the Krishna at Vedadri. Narayana Thirtha in his Purvasrama wanted to go over to her one day. While attempting to cross the river, which was then in full flood, he was being carried away by the floods. At that time he thought he might die, and wanted to become a Sanyasi. He took "Apath-Sanyasam" and pronounced preshochcharana Mantram. But fortunately he reached the other side safely. He then thought that since no one knew about his having made Preshochcharana, he might as well go to his wife's house. His wife's parents received him and during the night sent his wife to the bed chamber. The girl went near him but returned crying. Though she was pacified and sent back several times, every time she returned crying. He then asked her parents why she was crying like that. When she was asked, she said that when she went to her husband's presence, she saw there not her husband, but a Holy Sanyasi. On hearing this, Sri Narayana Thirtha thought that-though he wanted to hide the fact of his having renounced the world, God was not for it and that it was God's will that he should be a Sanyasi. He then told the people the real facts and renouncing everything, was going on pilgrimage to various places. We may take it that the incidents referred to in the book sent herewith are a continuation of the story given above. He is said to have lived in Varahur, a village on the Southern Bank of the Kudamurutti, a branch of the Cauvery, and to have attained Siddhi in Tiruppunthuruthi, also a village on the Kudamurutti. Both these villages lie on the road leading from Tiruvadi to Tirukkattuppalli in Tanjore Taluq. Every year a festival is held in the latter village on the Anniversary of his Siddhi. He was not one of the pontiffs of the Kamakotti Pitha.

It is Sri Bodhendra Saraswathi that was living at Govindapuram a village about 7 miles East of Kumbakonam. He was a great Advocate of Sri Bhagawan-Nama-Siddhanta and has written several works about Namasiddhanta. Two of the said books have been printed and we are arranging to send copies of the same to you. There is a Mutt at Marudanallur, a village 3 miles South of Kumbakonam called Sri Sadguru Swami Mutt established by Sri Sadguru Swamy, a lineal disciple of Sri Bodhendra. All the works of Sri Bodhendra are found in the Mutt. Most of them are unpublished, and are on palm leaves. They are now being copied so that they may not be lost to the world.

---

## NARAYANA THIRTHA

BY

Prof. P. Sambamoorty

*Head of Music Department, Madras*

The illustrious author of the 'Krishna Lila Tarangini' lived in the latter part of the 17th century. He is believed to be an incarnation of Jayadev. He was a Telugu Brahmin and belonged to the Tanjore District. His family is evidently one of those Pandit families to come and settle down in the southern Districts during the time of the 'Vijayanagar Kings' His parents were Gandharva and Parvathi. He had Upadesa from Sivaramananda Thirtha. At the end of the first Taranga, he refers to himself as "Sivaramananda Thirtha Pada sevaka." At the end of the song "దేవదేవం కల్పితం" (Taranga) also he refers to himself as "శివరామ తీర్థపదాంబుజభ్రమరేణ" Narayana Thirtha attained his proficiency in learning early in his life. He studied the Bagavatham and was interested in singing frequently the Astapadis of Jayadeva. He was an expert in Music and Bharatanatya. He was a Grahastas but became a Sanyasi early in his life and the circumstances that led him take to this Asrama are interesting.

His father-in-law's house lay on the other side of the river "Vennar" in Tanjore District. During his occasional visits to his father-in-law's house, a strong man that he was he invariably swam across the river and reached the other bank. Once when his wife was in her parents' house, he left his home to see her. As usual he plunged into the stream to swim across. As he was nearing the midstream a sudden current came and literally swept him off. He tried his best to reach the other bank but his efforts proved of no avail. Giving up hopes of survival and being a spiritual-minded man, he decided to take "Apat Sanyasam." Accordingly he threw away his sacred thread, plucked a hair off from his head (as a token of getting the head shaven) recited the Sanyasa Mantras and virtually became a Sanyasi. A few moments later, he happened providentially to strike against some undergrowths of weeds and catching hold of them, he found some respite. The floods in the meantime began to gradually subside. Relieved of exhaustion he resumed swimming, reached the other bank and dried his clothes. Having taken to Sanyasa Asrama, he was in a dilemma. He began to argue within himself" why not I go back to my father-in-law's house? after all who can possibly know that I have taken to this

Asrama?". After some time he resumed his journey and reached his father-in-law's house. There he was given the usual welcome. When however his wife came to see him, he (who had taken to Sanyasam and attained as it were a new janma) appeared to her (the embodiment of chastity), not as her husband but as a Maha Purusha with a spiritual halo about him. She went back to her parents and narrated her experience Her parents again came and saw him but to them however he appeared as their son-in-law. The parents consoled their daughter and asked her to go to him again. She went and returned back with the same experience once again. The parents of the girl who were conscious of the spiritual greatness of their son-in-law, were now faced with an awkward situation. They came before him and respectfully requested him to clear the mystery. This incident was a revelation to the son-in-law. He did not even dream of this ugly development. He confessed the truth and revealed the incident that led him to take to "Manasika Sanyasam" on the midstream. He realised the greatness of his wife. Subsequently he was initiated into the rituals of Sanyasa Asrama according to the traditional rites. As it was customary for a Sanyasi newly ordained to go to a holy place far away from the place of initiation, he took leave of them and started for the north. After visiting many holy places, he came to the Andhra Desa and stayed there for a number of years. He remained in Chellapalla and Mukthyala Samasthanams in Kistna District and in the latter place had sung in praise of Sri Vadadri Narasimhaswamy, the presiding Deity of the place.

Later in his life, he was seized with a severe stomach ache and went on a pilgrimage to Tirupathi to get cured by the grace of the Lord of the Seven Hills. As he reached the foot of the hills, he heard a devine voice saying "You will not get relief from your ailment here. You must go to a shrine in the south near Tiruvayar where one amsa of mine has already gone". Leaving Tirupathi, the Yatindra started for the south and came to Tiruvayar in the course of time. Prior to his advent to the south, a certain para Sanyasi from Tirupathi with an idol of Venkata Chalapathy and 'Uhhaya Nachehayar' was proceeding to the south on a pilgrimage. This incident was after the battle of Tallikota in 1565. He halted at different places for some years and at last came to the Temple at Varahur. He kept the idol in the shrine, offered puja to the Deity and stayed there for some months. Thinking of the journey he tried to remove the idol but the idol got rooted to the ground and would not move. Latter he heard a divine voice saying "I like to

stay here, do not disturb me". So the idol was kept in the place and this was the one referred to by the Divine Voice at the foot of the Tirupathi Hills, to Narayana Thirtha the present Utsavamurthy of the temple at Varahur is the one from Tirupathi. The Parayathindra at last came to the Naddukkaneri Village and slept in the pillar temple that night. During his sleep he had a dream in which a voice told him" Tomorrow morning after, your customary prayers, two Varahas (wild boars) will appear before you, follow them and the place where they disappear, you will be cured of your chronic ailment.

Next morning the Yatindra woke up, finished his bath and prayers and as per the divine ordain two wild boars suddenly appeared before him. As he offered prayers to God Vigneswara beckoning him to follow the animals, which had already begun to move in the direction of Varahur. Even now the pillar of this temple has the fingers pointed in the direction of Varahur. The Yathindra followed the animals and as they came to the outkilats of Varahur village, they plunged into the Canal Kadungal, swam across, entered the village and stood in front of the local Venkatramana Swamy Temple and disappeared. The Yatindra entered the temple and to his astonishment found that he had obtained instant relief from his dire ailment. He offered thanks to God for having guided him to that place and resolved to spend the rest of his life there. He built a Temple and himself made the Mulasthana Pratishta and Chakra Pratishta. The Mula Vigraham and puja materials are still in the Temple.

Some of the senior inhabitants of the village had a dream that the previous night a holy person was coming to their village on the following day and that they should welcome him. The villagers easily identified Narayana Thirtha as the man referred to in their dreams and welcomed him in a manner befitting his rank. The village which was known as Bhupathirajapuram till that day, came to be called Varahapuri on account of the advent of the holy boars. The village prospered after the advent of the Mahapurusha. This village is 15 miles to the north west of Tanjore. Being a Krishna Bhaktha and a devout student of the Bhagavata, Narayana Thirtha desired to write a work on the Leelas of Sri Krishna. He began the Krishna Leela Tarangini and completed it. He has given the essence of Bhagavata Dasama Skanda in his work. He taught the songs and Abhinaya for them to a number disciples and produced the whole work in front of the deity, himself acting as the Nrityacharya. In the Nata song "Jaya Jaya Ramanatha"in

the first Tarangini he refers to Varahapuri Venkatesha. In the 12th Taranga "Kamakshi Tava Prasadam" again he refers to the fact of his being cured from his ailment. The Yatindra had an idea of writing the Ekadasa Skanda also in the form an opera.' But when he concluded the Krishna Leela Tarangini he was blessed with the darshana of Sri Krishna in the Kalyana Kolam and he therefore did not proceed with the Ekadasa Skandam.

Many miracles are attributed to the Saint. In two of the songs in the Krishna Leela Tarangini the village is referred to with the original name of Bhupathi Rajapuram. After his advent to Varahur he lived only for two or three years. He entered into the state of Samadhi on the Sukla astami day of the Masi month (Krittika star, Thursday). His Samadhi is in Tirupunturuttı Village, a holy place immortalised by Tirugnana Sambandar in his Tevaram Hymns.

His is a jiva Samadhi and the mango tree under which he sat for meditation during his last days in the front of the Samadhi and to its north.

The Krishna Jayanti festival is celebrated with great eclat The entire "Krishna Leela Taranginin is faithfully sung by the devotees. Varahur Gopal, a Bhagavatar in recent times did much to popularise the Krishna Leela Tarangani. The portraits of Narayana Thirtha and Gopal Bhagavatar adorn the temple even now. He also composed songs for the temple rituals. Same songs of his relate to the festival of the Shrine at Varahur.

Beside the "Krishna Leela Tarangani" he has also written a Telugu play entitled "Parijatapaharana Natakam". This Nataka bears evidence to the fact that Narayana Thirtha visited Merattur.

Sonti Venkata Subbiah belongs to the Sishya Parampara of Narayana Thirtha. This and the fact that Astapadi and Taranga came to occupy an honoured place in Bhajans from the time of Bodhendra Sadguru Swamy, make us conclude that Narayana Thirtha lived in tha latter part of the 17th Century and earlier part of the 18th Century. The name of Narayana Thirtha in his Purvasrama is not definitely known.

---

# SRI NARAYANA THIRTHA

Dr. V. Raghavan

*Sanskrit Dept, University of Madras*

## Work 1:—KRISHNA LILA TARANGINI

Written at Bhupati Rajapuram *alias* Varahur; the village is referred to in the Tarangini is as also God Venkatesha at the village.

In Madras Government Oriental Manuscripts Library, there is an incomplete commentary on the Krishna Leela Tarangini by one Venkatesha who was assisted by one Govinda Thirtha. The manuscript contains only Tarangas 5-12 and its original came from Nellore District. The number of this Manuscript is R 4064.

2. Haribhakti Sudharnava, a Kavya based on the 10th Skanda of the Bhagavata, even as the Krishna Leela Tarangini. A manuscript, with some chapters missing, is found in the Madras Government, Oriental Manuscripts Library, D No. 12782.

The Mangalasloka of this poem is the verse "He mangini Tumagupatyam" etc., which is sung by all Bhagavatars as part of their preliminary song in their Hari Katha Kalakshepams.

3. In Advita Vedanta, he wrote a commentary called Vivarnadipika on Suresvaracarya's Panchakarana Vartika. A Manuscript of this sastra work is found in the Tanjore Library No. 7306 of the new catalogue of the Sarasvati Mahal Library.

4. The Parijathaharana Nataka, a Yakshagana in Telugu, see my article, an incomplete Manuscript in the Tanjore Library.

The Venkatesa stuti or sloka said to be a work of his in the Sanskrit Introduction of the sikyotsava is not by him. It is a stale composition by one who knows neither grammar nor metre.

There are a number of Narayana Thirtas and their works ought not to be confused as work of our Narayana Thirtha.

The Bhaktimimamsasutra vyakhya is also not by our Narayana Thirtha.

*Guru :—*

Sivarama thirtha or Siva Ramananda Thirtha, his own full name is Siva Narayana Thirtha; probably he is known as Siva Narayanananda Thirtha.

*Life :—*

I don't know of any authentic source from which he could get any reliable information about his life. Regarding traditional stories, they are given to you already by H. H. Sankaracharya and Prof. P. Sambamurthy.

In the notes supplied by H. H. Sankaracharya and by Sambamurthy there is reference to Vedadri in Andhradesa and the God Narasimha at that place. I may add that in Tarangini itself a song on the Narasimha at Vedadri is incorporated into the work. This seventh song is the place in Kalani in the eleventh Taranga, "Vedadri etc." this shows that song on Vedadri Narasimha was probably already composed by Narayana Thirtha and that he was in the Andhradesa before he composed the Parijata Nataka at Merattur or the Tarangini at Varahur. The Telugu Parijata Nataka shows that he was an Andhra-Merattur was a centre of music and dance.

*Date :—*

Merattur is called Achyutabdhi after Achyutappa Nayaka, the son of the founder of the Tanjore Nayaka line. In the last song of his Parijathaharana Nataka he refers to God Varadaraja at Achyutabdhi. Achyutappa's date is 1561--1614 A. D. Narayana Thirtha must be latter to this King's time.

As Thirtha was definitely earlier than Tyagayya we may take him to have flourished between about 1600 and 1750 A. D.

In the Tanjore Library there is a work called Panchakosamanjary written by one who calls himself a pupil of Sivanarayanananda Thirtha. Their manuscript belonged to King Tulaja and of Tanjore, A.D. 1765-1787. If our Narayana Thirtha or Siva Narayana Thirtha and this Siva Narayanananda Thirtha are the same we may take King Tulaja's time as the lower limit of Narayna Thirtha's date. Narayana Thirtha may have flourished between A. D. 1600-1765.

Tyagayya must have been a good student of the Tarangini, (or there are some phrases of Narayana Thirtha which Tyagayya has borrowed for his composition from the Tarangini compositions.

| | *Taranga* | *Thyagaraja* |
|---|---|---|
| 1. | Girirajasutasinnuh in the very beginning. | Girirajasutatanaya sadaya, in his simple song on Ganesa. |

| | | |
|---|---|---|
| 2. | Yaga Yoga Raga Bhoga Thaga in his Bhiravi Taranga (Ramakrishna Govidethi). | Found in Tyagayya's Ragasudharasa. |
| 3. | Taranga I song in Sourashtra aditala (Saravanabhava etc. | Vinakasetuvahana in Thyagayya's Hari Kamboji Piece. |
| 4. | Taranga I song in Anandabhairavi-Triputa(vayam Thmyah) Nikhilalokanidana. | Nikilalokanidana in Tyagayya's Nevadanyana in Saranga. |

The last song in Taranga 7 is mentioned by him as a sitadi.

---

# THE PARIJATHAHARANA NATAKA OF NARAYANA THIRTHA

BY

Dr. V. Raghavan Avergal

*Musical Academy Journal*

Recently, in the June of this year, I paid my second visit to Merattur near Ayyampet, Tanjore District, the place of Virabhadrayya and Venkatarama Bhagavatar, to see again the traditional dance drama, Prahlada Charita etc., of Venkatarama Bhagavatar, I was happy to note growth of interest in the younger generation in the matter of maintaining their traditional dance-drama. The inspiration of the youngsters in one Brahmasri Balasubramanya Sastrigal, a scholar in Sanskrit and a

musician, who evinced a great enthusiasm for the revival of this drama. I may say that in him is centred our hope to see this drama kept alive at Merattur.

While at Merattur, as well as at Nallur, which was once another centre for these dramas, I was fortunate to come across, two valuable manuscripts. At Nallur I saw with Bharatam Narayanaswami Iyer, a palm-leaf manuscript containing the story pieces of the well-known composer of dance-drama, Merattur Venkatarama Bhagavatar. With Brahmasri Balasubramanya Sastrigal of Merattur, I saw a palm-leaf manuscript of a hitherto unknown composition of Sri Narayana Thirtha.

The only musical work of Sri Narayana Thirtha which we knew till now is the Krishna Leela Tarangini in Sanskrit. Now this manuscript in Merattur reveals to us that Sri Narayana Thirtha visited and stayed in the village of Merattur, that the dance-drama tradition at Merattur is older than the times of Venkatarama Bhagavatar and of the earlier composer Virabhadrayya, and that Narayana Thirtha composed in Telugu also. This newly discovered musical play is called the Parijataharana nataka and takes its name after a well-known theme. Thanks to its owner, I am able to give here the following analysis of the songs in this short play :—

| | |
|---|---|
| 1st Leaf. | It opens with prayers to Ganesa, Sarasvati, Guru and Siva. |
| 2nd ,, | Missing. |
| 3rd ,, | The story begins here. |
| 4th & 5th Leaves. | Missing. |
| 6th Leaf. | Daru ; Conversation between Krishna and Rukmini. The Raga-nama is missing. The piece bears the more of Narayana Thirtha. |

| | |
|---|---|
| 7th Leaf. | Narada arriving and giving the Parijata flower to Bhama. |
| 8th ,, | Missing. |
| 9th ,, | Satyabhama sending a messenger to Krishna, narrating the event. |
| 10th ,, | Missing. |
| 11th ,, | Satyabhama's Duti speaking to Krishna. This is a Daru in Sankarabharana. |
| 12th ,, | Satyabhama's complaint. This is a Daru in Chanta ; it has the composer's Mudra. |
| 13th ,, | Same theme; Same Raga ; with composed signature. |
| 14th ,, | Same theme ; Raga Ahiri ; Tala Capu; with composer's signature. |
| 15th ,, | Same theme, same Raga and Tala. The Duti speaks; Daru in Madhyamavati and Misra. |
| 16th ,, | Satyabhama's words ; Daru in Ahiri and Adi ; with composer's Mudra. |
| 17th ,, | Same theme ; Madhyamavati-Adi ; with the signature of the composer. |
| 18th ,, | Conversation between Rukmini and Bhama ; Daru, Madhyamavati and Adi ; with Mudra. |
| 19th ,, | Bhama's complaint ; Daru ; Raga not given with Mudra. |
| 19th ,, | Krishna goes to Satyabhama's abode. |
| 20th ,, | Krishna consoles her. |
| 21st ,, | Krishna consoles her, Daru ; Punnagavarali. |

| | |
|---|---|
| 22nd Leaf. | Krishna consoles her. |
| 23rd ,, | Dialogue between the two ; Dara. |
| 24th ,, | Consoling of Bhama ; Narakasura appears on the way to Indraloka. Naraka's entry in a Daru. |
| 25th ,, | Killing of Narakasura ; bringing of the Parijata tree planting it in Bhama's residence ; Indra's Messengers appear at Dvaraka with Indra's message. |
| 26th ,, | Indra comes to Dvaraka, Daru. |
| 27th ,, | Indra's hymn to Krishna ; Daru in Bauli, Triputa Kamalanayana purana Purusa Kamsa Bhanjana Srinidhe Amaravandita Padapankaja Asritarti Vibhanjana. |

❖ ❖ ❖ ❖

*Saranam.* 'Saranam munindra sannuta' Saranam Kamalanayaka.

*Saranam.* ACHUTAPUKANTVASA SWAMY VARADARAJA PRABHO.

In this last place in Bauli which is a hymn to Krishna and serves also as Mangala, it may be seen that the deity mentioned, Varadaraja, is the one at Merattur, and that Merattur itself is mentioned with its older name Achuytapure, given to that village after King Achutappa Nayaka of Tanjore (A. D. 1561—1614).

Some of the pieces, as has been noted above, have the composer's signature "Narayana Thirtha Varada," and there is therefore no reason to doubt the authorship of this musical play.

# నారాయణతీర్థకవి

## (శ్రీరాజా వేంకటాద్ర్యప్పారావు)

సుప్రసిద్ధమైన శ్రీ కృష్ణలీలాతరఙ్గిణి రచియించిన మహనీయులు వీరు. సంస్కృతమున సులభమైన భక్తిసంబోధనల, కీర్తనల, మధురమైన శ్లోకముల, శ్రీకృష్ణకథామృతమును ఈ గ్రంథమున గ్రోలనివారుండరు.

ఈమహాకవి సంస్కృతమున శ్రీ వేంకటేశ్వర స్తుతిని, హరిభక్తసుధార్ణవమును కూడ రచియించినట్లు తెలియుచున్నది.

ఇక తెనుగునకూడ 'పారిజాతాపహరణమను నాటకమును రచియించినట్లును ఈగ్రంథము "తంజావూరు" సమీపమున "మెరటూరు" గ్రామములో బ్రహ్మశ్రీ బాలసుబ్రహ్మణ్యశాస్త్రిగారివద్ద తాము స్వయముగా చూచినట్లును, వి. రాఘవన్ M. A., Ph. D. వారు, మద్రాస్ మ్యూజికల్ ఎకాడమీ యొక్క 1942 సం॥- 1 to 4 వ సంచిక - 74-వ పేజీలో - నుదాహరించి యున్నారు.

సంస్కృతాంధ్రములలో కవులైన యీయతీంద్రులు, ఆంధ్రులనియూ, కూచిమంచి అగ్రహారము (గోదావరి జిల్లాలో 16-వ శతాబ్దము చివర) నకు చెందినవారనియు, మాధవానల అవతారపరంపరలో జయదేవుని తరువాత అవతార పురుషులనియు డాక్టర్. యం. కృష్ణమాచారియార్ వారి సంస్కృతకవుల చరిత్రలో నుదాహరింపబడెను.

కాని యీ శ్రీనారాయణ తీర్థులవారి పూర్వాశ్రమ నామధేయము ప్రఖ్యాతిగా తెలియదు. తెలిసినవారు గోదావరీ కృష్ణామండల విద్వాంసులు పత్రికాముఖమున లోకమునకు తెల్పెదరుగాక !

మద్రాసు మ్యూజికల్ డిపార్టుమెంటుపై అధికారి ప్రొఫెసరు కె. సాంబమూర్తి గారిపరిశోధనవల్లను, శ్రీ జగద్గురు కంచి కామకోటి పీఠాధిపతి స్వామివారి ఆశీర్వచనమువలను, ఎ. రామస్వామి అయ్యర్ వారిచే మైలాపూర్ బాల మనోరమ ముద్రణాలయమున ప్రచురింపఁబడిన "శిశోత్సవము" (ఊట్లపండుగ) అనెడి శ్రీ నారాయణకవి (వీరు శ్రీ నారాయణతీర్థులవారియొక్క శిష్యపరంపరకు చెందినవారు) యొక్క సంస్కృతప్రబంధమునుండియు వారలఅనుమతిపై కృతజ్ఞతతో గ్రహించిన శ్రీ నారాయణతీర్థులవారి సంగ్రహచరిత్రను ఈదిగువ క్లుప్తముగావివరించుచున్నాము.

వీరి తండ్రి గాంధర్వదేవుఁడు; తల్లి పార్వతీదేవి; గురువు శివరామానంద తీర్థులు. బాల్యముననే వీరికి విద్యాప్రవీణతయు, అభినయ సంగీతశాస్త్రముల పటుత్వముఁ గల్గెను.

వీరు వివాహానంతరము వేదాద్రిప్రాంతమున కృష్ణానదీతీరగ్రామమున భార్యతో హాయిగానుంట నివసించుచు గ్రామాంతరమునకు, ప్రవాహము తక్కువగానుండిన కృష్ణానదిని మోకాలిలోతు నీళ్ళలో దాటిపోయి యుండిరి. తమ పని చూచుకొని మరలివచ్చునప్పటికి పైభాగమున వరదలచే నది పొంగి ప్రవహించుచుండెను. వంచియు తకొండైన యీయన ధైర్యముగ నదిలో దిగి దాటుటకు ప్రయత్నింపగ ప్రవాహము వీరియనను త్రోసివేసెను. నదిలో కొట్టుకొనిపోయి యీయన జీవితాశ

వదలుకొనెను. కాని మనస్సును స్థిరము చేసికొని సన్న్యాసమున గాని మోక్షము లేదని గురువువల్ల నుపదేశము పొందిన వారగుటచే 'ఆపత్సన్న్యాస' విధానమున ప్రేషోచ్చారణముచేసి ముండనమునకు సూచనగా శిరముపై వ్రేలాడు నొక్క శిరోజమును పెరికివైచి యజ్ఞోపవీతమును త్యజించిరి. కాని అంతలో నీయనచేతికి కొన్ని తుంగలు ఆధారముగా చిక్కగా వానిసహాయమున నదీప్రవాహమును తప్పించుకొని తాము పోదలచినగట్టునకే చేరుకొనఁ గలిగిరి. కాని సన్న్యాసమును జేకొన్న తా నిప్పుడు భార్యవద్దకు పోవచ్చునా యను సంశయము కలిగెను.

తాను సన్న్యసించినట్లు మఱెవ్వరు నెఱుంగరుకదా యని మనస్సును గట్టి పరచుకొని కొంతసేపు గురువును భగవంతుని స్మరించి మామగారియింటికి పోయెను. అల్లునిరాకకు మామగారును సంతసించిరి. ఆరాత్రి యీయనయొద్దకు భార్య రాగా, ఈయన, ఆమె కనులకు నొక దివ్యతేజస్సుగల 'సన్న్యాసి' వలె కాన్పించిరట. ఆమె అంతతనతల్లిదండ్రులయొద్దకేగి తన భర్త కాని మఱియొక వ్యక్తియొద్దకు పంపిన కారణమడిగెనట. ఆమె తలిదండ్రులు పోయి చూడగా అల్లుడుఅల్లుడుగనే వారికి కాన్పించెను. వారు మగల తమ కుమార్తెకు నచ్చఁజెప్పి తిరిగి భర్తవద్దకు పంపిరి. మరల ఆమెకు దివ్యపురుషవ్యక్తియే గోచరమయ్యెను. ఆమె మరల వెనుకకు తప్పుకొని తనతల్లిదండ్రులను కఠినముగా మందలింపసాగెను. ఇంతకు వారు ఆశ్చర్యపడి భక్తాగ్రేసరునిగా తామిదివఱకే యెఱింగిన అల్లునియొద్దకు పోయి, తమ కుమార్తె యొక్క వింతభ్రమ తెల్పి, కారణమడిగిరి. అంత నారాయణతీర్థులు జరిగినదంతయు వారికి తెల్పి యికముందు తాను సంసారిగా ప్రవర్తించుట గురువాక్యముల ఉద్దేశము కాదని నిశ్చయించి సన్న్యాసాశ్రమమును క్రమవిధానమున స్వీకరించెనట.

అటుపిమ్మట నారాయణతీర్థులు అనేక దివ్యదేశములను సేవించుచుయాత్రలు సల్పుచుండగా వీరికి హృద్రోగ మేర్పడెనట. దానితో బాధపడుచు క్రమముగా తిరుపతినుండి దక్షిణమునకు యాత్ర చేయుచో భగవంతుడు వరాహరూపమున ప్రత్యక్షమై, వీరిని తంజావూరుప్రాంతమున 'వరఘూరు' అనెడి గ్రామముఁజేర్చి అక్కడ దేవాలయము నిర్మింపుమనియు, 'శ్రీకృష్ణలీలాతరఙ్గిణి' రచింపు మనియు ఆజ్ఞాపించి అంతర్ధానమయ్యెనట. నారాయణతీర్థులు అచ్చట ఆశ్రమ మేర్పరచుకొని తమ భక్తి సామర్థ్యములచే శిష్యబృందమును జేర్చుకొని దేవాలయమును కట్టించి శ్రీకృష్ణదేవ విగ్రహప్రతిష్ఠలను, తమతో తిరుమలనుండి కొనివచ్చిన శ్రీవేంకటేశ్వర విగ్రహము స్థాపనలను చేయించిరి. క్రమముగా వీరికి హృద్రోగమును పోయెను. అంతట వీరు భగవదాజ్ఞప్రకారము శ్రీకృష్ణలీలాతరఙ్గిణి రచించి భక్తులచే తరంగ నామామృతమును సేవింపఁజేయుచు ప్రతిసంవత్సరము 'శిక్యోత్సవ' మను ఉట్లపండుగను ప్రారంభించి చేయించుచు 'బోధేంద్రసరస్వతి' మొదలైన మహనీయులను శిష్యులను తరింపఁజేసి, అచ్చట వరఘూరునందే జీవసమాధి నొందిరి. ఇచ్చట నిప్పటికిని భాద్రపదమాసమున 'శిక్యోత్సవము' జరుపుచు భక్తులు కృష్ణలీలాతరంగములను నృత్యగానాభినయములతో కాలక్షేపము చేయుచుందురు. శ్రీనారాయణతీర్థులవారి చిత్రపటమును భక్తులకు అచ్చట దర్శనీయమగును.



# శ్రీకృష్ణావతార కాలక్రమము

కొవ్వూరు సంస్కృత పాఠశాల కార్యదర్శి శ్రీ శ్రీ చదలవాడ గోపీనాథమువారి యొక్కయు, శ్రీమాన్ బొమ్మకంటి వీరరాఘవాచార్యులవారియొక్కయు, S. N. K. బీజార్కన్ వారియొక్కయు,

శ్రీమాన్ నల్లాని చక్రవర్తుల అప్పలాచార్యులవారి శ్రీమన్ మహాభారత సంగ్రహము యొక్కయు అభిప్రాయములను సేకరించి, నూజవీడు హైస్కూలు చరిత్రోపాధ్యాయులు, ధన్యంరాజు అప్పారావుగారు సమకూర్చిన భారత భాగవత కథల కాలనిర్ణయము.

గత ద్వాపరయుగము చివర 126 సంవత్సరములు మిగిలియుండగ, శ్రీకృష్ణ భగవానులవారి అవతారము మధురానగరములో

శ్రీముఖ నామసంవత్సర, శ్రావణ బహుళ అష్టమి అర్ధరాత్రి వృషభ లగ్నమున అని శ్రీమద్భాగవతమునందును,

విజయ నామ సంవత్సర, శ్రావణ బహుళ నవమి మంగళవారము అర్ధరాత్రి రోహిణీ నక్షత్రయుక్త వృషభ లగ్నమున అని హోరానుభవదర్పణమునందును, వచింపబడి యున్నది. అనగా ఇప్పటికి 5044 క్రింద కలి ద్వాపర సంధిలో అని తెలియదగును. స్వామిఅవతారకాలము మొత్తము 125 సం॥ 7 నెలలు 8 రోజులు.

అవతారకాలము ముగియుటయే ఈ కలియుగారంభము అనగా క్రీస్తు పూర్వము 3225 (Bc.)

## శ్రీకృష్ణభగవానుల జాతక చక్రములు.

హోరానుభవ దర్పణము ప్రకారము.

| | | | |
|---|---|---|---|
| | గు | ల చం | రా |
| | | | శు బు |
| | | | ర శ |
| కే | | | కు |

S. N. K. బీజార్కన్ వారి ఇంగ్లీషు గ్రంథమునుండి.

| | | | |
|---|---|---|---|
| కే | | ల చం | |
| | | | గు |
| కు | | | ర |
| | | శు శ | రా బు |

(మధురలో దేవకీవసుదేవులకు జననమైనస్వామి కంసకారాగృహమునుండి, నందయశోదలగృహము ప్రవేశపెట్టబడిన తరువాత గోకులమున శ్రీకృష్ణలీలలు.

| కలిపూర్వ సంవత్సరములు | శ్రీకృష్ణుని వయస్సు |
|---|---|

128 ప్రజోత్పత్తి ఆ-శు-౫ శతశృంగ పర్వతాశ్రమమున యమధర్మరాజు వరమున, కుంతీపాండురాజులకు ధర్మరాజు జననము.

127 అంగీరస ... ... వాయుదేవునివరమున శతశృంగమున కుంతీపాండురాజులకు భీమసేనునిజననము, హస్తినాపురమున గాంధారీధృతరాష్ట్రులకు దుర్యోధనాదులజననము.

126 శ్రీముఖ శ్రా-బ-౮ జననము మధురలో కంసకారాగృహమున దేవకీవసుదేవులకు శ్రీకృష్ణజననము స్వామి గోకులమునకు యశోదవద్దకు మార్చబడుట, అక్కడ స్త్రీశిశువుగా నవతరించిన యోగమాయ కంసకారాగృహమునకు తేబడి, కంసుని ధిక్కరించి మాయమగుట (శ్రీకృష్ణులవారి 3 వ మాసములోపుగ) పూతనకు ముక్తి, శకటాసుర భంజనము, అయినతోడనే యశోదాదేవికి ప్రథమవిశ్వరూపసందర్శనము, గర్గాచార్యులవారివలన బలరామకృష్ణులకు నామకరణము చేయింపబడెను.

6 వ మాసమున బాలకృష్ణునకు అన్నప్రాశనము అయినతరువాత, తృణావర్తవధ స్వామిచే గావింపఁబడెను.

శతశృంగమున కుంతీపాండురాజులకుఇంద్రునివరమున అర్జునునిజననము

125 భావ శ్రా-బ-౮ 1 వ సం॥ పూర్తి స్వామి 2 వ సంవత్సరమురాగానే మృత్భక్షణలీల యశోదాదేవికి ద్వితీయ విశ్వరూప సందర్శనము.

అక్కడ శతశృంగాశ్రమమున, మాద్రీ పాండురాజులకు అశ్వినీదేవతల వరమున నకులసహదేవులజననము,

124 యువ శ్రా-బ-౮ 2 వ సం॥ పూర్తి ఉలూఖల బంధనము యమళార్జునభంజనము నలకూబరమణిగ్రీవ శాపవిమోచనము, గోకులమునుండి నందాదులు బృందావనమునకు నివాసము మార్చుకొనిరి. ఇంతటినుండి బృందావనలీలలు 3 సం॥ 11 వ సం॥ వరకు.

123 ధాత శ్రా-బ-౮ 3 వ సం॥ పూర్తి వత్సాసురవధ, బకాసురవధ, అఘాసురవధ, దేవతలు పుష్పవృష్టి కురిపించి స్తోత్రము చేసిరి.

122 ఈశ్వర శ్రా-బ-౮ 4 వ సం॥పూర్తి బ్రహ్మగోవత్సములను, గోపబాలురను అంతర్ధానము ఒక సంవత్సరమువఱకు చేయుట, స్వామిగోపబాలు

| కలిపూర్వ సంవత్సరములు | శ్రీకృష్ణుని వయస్సు |
| --- | --- |

రను వత్సరూపములతో నుండి తాము సర్వాంతర్యామియౌట, ప్రకటించిరి [బృందావనమున]

121 బహుధాన్య శ్రా-బ-ర 5 వ సం॥పూర్తి బ్రహ్మ, గోవత్సములను, గోపబాలురను తిరిగి యిచ్చి స్తోత్రముచేసెను. [గోలోకభగవానుని యిప్పుడు బ్రహ్మ గుర్తించెననియు (S. N. K. బీజార్కన్ గారి గ్రంథముప్రకారం) స్వామివారి 16 వ సంవత్సరమున శ్రీరాధాకళ్యాణము తాను స్వయముగ నెఱవేర్చెననియు, తెలియనగు]

చై-కృ-౧౪ ,, శతశృంగాశ్రమమున పాండురాజు నిర్యాణము ఇప్పటికి ధర్మరాజు 7 సం॥ భీముడు 6 సం॥ అర్జునుడు 5 సం॥ నకుల సహదేవులు 4 సం॥ వయసుగలవారైయుండి, తండ్రిగారి మరణానంతరము, హస్తినాపురమునకు గొంపోవంబడి, భీష్మునిప్రాపకమున నుండిరి.

120 ప్రమాది శ్రా-బ-ర 6 వ సం॥ పూర్తి బృందావనమున శ్రీకృష్ణునివల్ల ధేనుకాసురభంజనము, కాళీయమర్దనము, ప్రలంబాసురవధ, గ్రీష్మవర్ష శరదృతువులందు స్వామి బృందావన గోపబాలబాలికలతో గోవులను మేపుచు, ఆడుకొనుట, మురళీగానముచే నెల్లరను రంజింపచేయుట, మార్గశీర్ష మాసమునందు గోపకుమారికల కాత్యాయనీ వ్రతము, గోపకుమారికావస్త్రాపహరణలీల, బాలికలకు వరప్రదానము, బ్రాహ్మణులు ఆంగీరస యాగముచేయుట, ఆచెంత గోవులమేపు స్వామికి, గోపబాలురకు, బ్రాహ్మణభార్యలు యజ్ఞప్రసాదము సమర్పించుట.

119 విక్రమ శ్రా-బ-ర 7 వ సం॥ పూర్తి ఇంద్రయాగమును స్వామి మాన్పించుట, గోకులముపై వెల్లువ దేవేంద్రుడు కురిపించుట, స్వామి గోవర్ధనము నెత్తుట, ఇంద్రగర్వభంగము, కామధేనువ క్షీరాభిషేకము స్వామికి చేయుట, వరుణదేవునిచే పట్టుబడిన తన పెంపుడుతండ్రియా నందునిక్త్రై శ్రీకృష్ణుడు వరుణలోకమునకు పోయి, విడిపించి తెచ్చుట, బాల్యరాసక్రీడ, (S. N. K. బీజార్కన్ గారి గ్రంథము ప్రకారము) బీసెంటు దొరసానిగారి అభిప్రాయము ప్రకారమును, స్వామివారి 16 వ సంవత్సరమున అవగా మధురానగరమునకు పోవుముందు, మఱియొక రాసక్రీడ సూచింపబడినదని యెంచవలయును. అపుడే శ్రీరాధాకృష్ణ కళ్యాణము బ్రహ్మవల్ల నెఱపఁబడెను.)

| కలిపూర్వ సంవత్సరములు | | | శ్రీకృష్ణుని వయస్సు | |
|---|---|---|---|---|

118 వృష శ్రా-బ-ర 8 సం॥ పూర్తి సర్పరూపమును ధరించిన సుదర్శనుని శాపమును, స్వామి తొలగించుట

జ్యే-శుద్ధము [పాండురాజు మరణానంతరమున శతశృంగమునుండి హస్తినాపురము గొంపోబడి భీష్ముని ఆధీనమునందున్న పాండవులకు ఉపనయనసంస్కారము, ధర్మరాజుకు ౧౧ సం॥]

| | | | | |
|---|---|---|---|---|
| 117 | చిత్రభాను శ్రా-బ-ర | 9 సం॥ | | శంఖచూడ సంహారము వృషభాసురవధ, కేశిరాక్షససంహారము, వ్యోమాసురసంహారము, బృందావన గోపాలనలీలలు. |
| 116 | స్వభాను | 10 సం॥ | | |
| 115 | తారణ | 11 సం॥ | ౧౧ | |
| 114 | పార్థివ | 12 సం॥ | స్తీ | |
| 113 | వ్యయ | 13 సం॥ | | |
| 112 | సర్వజిత్తు | 14 సం॥ | | |

111 సర్వధారి శ్రా-బ-ర 15 సం॥ పూర్తి నారదమహర్షి స్వామికి కంస సంహారాది భవిష్యత్కార్యక్రమము వినిపించుట, ఇప్పటికి స్వామికి బాల్యము వదలి అవతారకార్యభారమువహించువయస్సు సమీపించుట చేతనే, నారదమహాముని వచ్చి కార్యమును జ్ఞప్తికి తెచ్చెనని యూహింపవలెను. కాబట్టి స్వామికి వయస్సు ౧౫ సం॥లు అనుటసమంజసము

110 విరోధి శ్రా-బ-ర 16 సం॥ పూర్తి [S. N. K. బీజార్కన్ గారి ప్రకారం] [11 వ సం॥రం భాగవతము ప్రకారము] కంసునియొద్దనుండి పంపబడిన అక్రూరుడు పిలువగ, బలరామకృష్ణులు బృందావనమునుండి మధురానగరమునకు ధనుర్యాగమునకై, బయలుదేరుట, గోపికలు స్వామిని విడువజాలక క్లేశపడుట, మార్గమధ్యమున యమునాతీరమున అక్రూరునకు విశ్వరూపసందర్శన మనుగ్రహించుట, ఇది స్వామివారి 3 వ విశ్వరూపసందర్శనము స్వామి బలరామునితో మధురాప్రవేశము చేయుట.

## మధురా కృష్ణలీలలు

[౧౬ సం॥ నుండి ౩౬ సం॥ వరకు S. N. K. బీజార్కన్ గారి ప్రకారం]

శ్రీమద్భాగవతము ప్రకారము 12 నుండి 36 వరకు

స్వామి అక్రూరుని రథముమీద మధురానగరమున బలరామునితో కూడ ప్రవేశించుట

| కలిపూర్వ సంవత్సరములు | శ్రీకృష్ణుని వయస్సు |
|---|---|

మఱునాడు వీధుల వెంటరథము పైవిహరించుచుండగ రజకనిగ్రహము, తంతువాయకసన్మానము, మాలాకారాసన్మానము, కుబ్జాసంభాషణము. ఆమఱునాడు ధనుర్యాగశాలా ప్రవేశము, కువలయాపీడమను ఏను గును జయించుట.

మల్లరంగమున బలరామకృష్ణులు, ముష్టికచాణూరుల గెల్చుట, కంసు నితో పోరాడి, శ్రీకృష్ణుడు కంసుని సంహరించుట. కంససహోదరు లతో పోరాడి, బలరాముడు వారిని సంహరించుట. బలరామకృష్ణులు తలిదండ్రులైన దేవకీ వసుదేవులను కారాగృహమునుండి విడిపించి, వారిచే లాలింపబడిరి.

కొన్నిదినములతరువాత కంసునితండ్రియైన ఉగ్రసేనునికి శ్రీకృష్ణుడు పట్టాభిషేకము చేయుట, నందాదిబృందావనగోపనాయకులు, ఉగ్రసేన పట్టాభిషేకమునకు రప్పింపబడిరి.

శ్రీకృష్ణుడు నందునికి అధ్యాత్మజ్ఞానమును, దుర్గాదేవిస్తోత్రము ఉప దేశించి, బృందావనమునకు పంపివేయుట.

109 వికృతి శ్రా-బ-ఆ 17 సంII పూర్తి (S. N. K. సీజార్కాన్ గారి అభి ప్రాయప్రకారం 18 శ్రీమద్భాగవతము ప్రకారము)

బలరామకృష్ణులకు, గర్గాచార్యులవల్ల ఉపనయనము, బలరామ కృష్ణులు, బ్రహ్మచారులై, గురుశుశ్రూష చేయుట, కాశీక్షేత్రములో వసించుచుండిన, సాందీపమహర్షి వద్ద, గురుకులవాసము చేసి, ధనుర్వే దము, ఉపనిషత్తులు అభ్యసించి, విద్యాపరిపూర్తి బడయుట, గురుదక్షి ణగ, మృతుడైన గురుపుత్రుని శ్రీకృష్ణుడు సజీవునిగ తెచ్చియిచ్చుటకై ప్రభాసతీర్థమునకు పోయి సముద్రునిచే పూజింపబడి, సముద్రమును ప్రవేశించి, పంచజనాసురుని సంహరించి, పాంచజన్యమను శంఖమును గ్రహించి, యమలోకమునకు పోయి, అచ్చటనుండి గురుపుత్రుని తెచ్చి, గురువునకు కాశిలో సజీవునిగ సమర్పించుట.

108 ఖర శ్రా-బ-ఆ 18 సంII పూర్తి S. N K. సీజార్కాన్ గారి మత ప్రకారం 14 శ్రీమద్భాగవతం ప్రకారం)

శ్రీకృష్ణుడు గోపికలకడకు ఉద్ధవుని పంపుట, గోపికల భ్రమర గీతలు ఉద్ధవుడు మరలివచ్చి గోపికల ప్రేమభక్తి స్వామికి తెల్పుట,

| కలిపూర్వ సంవత్సరములు | శ్రీకృష్ణుని వయస్సు |
|---|---|

స్వామి కుబ్జకు వరప్రసాదము అనుగ్రహించుట, శ్రీకృష్ణుడు, బలరాముడు, అక్రూరుని ఆతిథ్యమును పూజలను గొని బహూకరించుట.

పాండవుల క్షేమము విచారించుటకై, స్వామి అక్రూరుని హస్తినాపురమునకు పంపుట.

బాల్యమంతయు ప్రచ్ఛన్నముగ స్వామి, బృందావనమున నందగోపుని గృహమున గడపియుండుటచే, కంసవధానంతరమే పాండవులకు, శ్రీకృష్ణునకు ప్రథమపరిచయకాలమని యెంచవలయును.

107 నందన శ్రా-బ-ద 19 సం॥పూర్తి (S. N. K. బీజార్క్యాన్ గారి మత ప్రకారం 15 సం॥ శ్రీమద్భాగవతము ప్రకారము)

జరాసంధుడు (కంసునిమామ) మధురానగరముపై మొదటిసారి దండయాత్ర వచ్చుట, యాదవసేనలతో పోరాడి, ఓడి బలరామునిచే పట్టుపడుట, శ్రీకృష్ణుడు జరాసంధుని కరుణించి విడిపించుట.

106 విజయ శ్రా-బ-ద 20 సం॥పూర్తి తిరిగి మూడవ మాసమునకే, జరాసంధుడు కృతఘ్నుడై, మధురపై 2వ దాడిచేయుట, మరల ఓడిపోవుట, ఇట్లు జరాసంధుడు పదునెనిమిది సార్లు, మధురానగరముపై స్వామివారిపై 6 వ సం॥రం వరకు దాడులుచేయుచు, బాధింపుచు వచ్చెను.

105 జయ ఆ-శుద్ధము 21 సం॥ మధురానగరముపై జరాసంధుని తృతీయ దండయాత్ర.

పాండవుల కథ

ఇంతవఱకు హస్తినాపురమున ద్రోణునివద్ద విద్య నభ్యసించుచుండిన, పాండవ కౌరవులకు విద్యా, ధనుర్విద్యాభ్యాసపరీక్ష జరిగెను.

మధురానగరముపై జరాసంధుని చతుర్థ దండయాత్ర

104 మన్మథ ఆ-శు-౧౦ 22 సం॥ హస్తినాపురమున ధర్మరాజునకు 24వ యేట యువరాజ్యపట్టాభిషేకము ధృతరాష్ట్రుడు చేసెను.

103 దుర్ముఖి శ్రా-బ-ద 23 సం॥ పూర్తి జరాసంధుడు మధురానగరముపై అయిదవసారి దండెత్తివచ్చుట.

102 హేవళంబి 24 సం॥ జరాసంధుడు మధురానగరముపై ఆఱవ సారి దండెత్తివచ్చుట.

| కలిపూర్వ సంవత్సరములు | | శ్రీకృష్ణుని వయస్సు |
|---|---|---|

101 విళంబి 25 సం- జరాసంధుడు మధురానగరముపై ఏడవ సారి దండెత్తివచ్చుట,

100 వికారి 26 సం॥ జరాసంధుడు మధురానగరముపై ఎనిమిదవ దండయాత్ర చేయుట.

అక్కడ భారతకథ హస్తినాపురమున పెరుగుచున్న పాండవకౌరవ యువకవీరులకు పరస్పరకల్లోలములేర్పడగ ధృతరాష్ట్రుడు పాండవులను శార్వరి ఫాల్గుణ శుద్ధ అష్టమికి వారణావతములో నుండ బంపుట.

99 శార్వరి 27 సం॥ జరాసంధుడు మధురానగరముపై తొమ్మిదవ దండయాత్ర చేయుట.

98 ప్లవ 28 సం॥ జరాసంధుడు మధురానగరముపై పదియవ సారి దండయాత్ర చేయుట.

అక్కడ పాండవులు ఫాల్గుణ శుద్ధ చతుర్దశికి లాక్షాగృహ దహనమున తల్లియగు కుంతీదేవితో తప్పుకొనిపోవుట, మార్గమున అరణ్యంలో చైత్ర శుద్ధ పాడ్యమినాడు భీముడు హిడింబుని వధించి, హిడింబను వరించి ఘటోత్కచుని గనుట.

97 శుభకృత్ 29 సం॥ జరాసంధుడు మధురానగరముపై పదకొండవ దండయాత్ర చేయుట,

96 శోభకృత్ 30 సం॥ జరాసంధుడు మధురానగరముపై పండ్రెండవ దండయాత్ర చేయుట.

అక్కడ కుంతీపాండవులు, శాలిహోత్రముని ఆశ్రమమున నుండి, ధర్మములు వినుట.

95 క్రోధి 31 సం॥ జరాసంధుడు మధురానగరముపై పదమూడవ దండయాత్ర చేయుట.

అక్కడ కుంతీపాండవులు శాలిహోత్ర ఆశ్రమమునుండి క్రోధి సంవత్సర వైశాఖ శుక్లపక్షములో ఏకచక్రపురమునకు పోవుట, 1 వ సం॥

94 విశ్వావసు 32 సం॥ జరాసంధుడు మధురానగరముపై పదునాల్గవ దండయాత్ర చేయుట.

అక్కడ కుంతీపాండవులు ఏకచక్రపురనివాసులు 2 వ సం॥

కలిపూర్వ సంవత్సరములు | శ్రీకృష్ణుని వయస్సు

98 పరాభవ 33 సం॥ జరాసంధుడు మధురానగరముపై పదుహేనవ దండయాత్ర చేయుట.

అక్కడ కుంతీపాండవులు ఏకచక్రపురనివాసులు 3 వ సం॥

92 ప్లవంగ 34 సం॥ జరాసంధుడు, మధురానగరముపై పదహారవ దండయాత్ర చేయుట.

జరాసంధుడు మధురానగరముపై పదిహేడవదండయాత్రచేయుట.

అక్కడ కుంతీపాండవులు ఏకచక్రపుర నివాసులు 4 వ సం॥

91 కీలక 35 సం॥ జరాసంధుడు మధురానగరముపై తుదిసారి 18 వ దండయాత్ర చేసెను. కాలయవనుడు పారశీకపురాజును జరాసంధునకు సహాయముగ పశ్చిమదిక్కునుండి వచ్చెను. 3 కోట్లసైన్యము శత్రువులవని తెలిసి స్వామిముందుగ, కాలయవనునితో పోరాడి, ఓడిపోయినట్లు నటించి, భయముచే పాఱిపోవునట్లు భ్రమకల్పించి ముచుకుందమహర్షి తపస్సుచేయు గుహలో ప్రవేశించిరి. స్వామిని తఱుముకొనివచ్చి కాలయవనుడు ముచుకుందుని సమాధికి భంగము కలిగించి, ఆయన కోపాగ్నిచే దగ్ధము గావింపబడెను. తమ ప్రభువు దగ్ధమగుట చూచి, యవనసేనలు భయపడి పాఱిపోయెను.

అటుపిమ్మట జరాసంధ సేనలతో పోరాడఁజేసి, మధురాపురయాదవులను శ్రమపెట్టుటకు ఇష్టములేక తాము లేకున్నమధురను జరాసంధుడు వదలుననియెంచి, శ్రీకృష్ణుడు బలరామునితో ప్రవర్షణగిరి యనుదుర్గమునకు తప్పుకొనిరి. అదివిని జరాసంధుడు మధురను వదలి ప్రవర్షణగిరి ముట్టడిచేసి, ఆదుర్గమును కాల్పించినాశనముచేసెను. బలరామకృష్ణులు అటనుండి తప్పుకొని కొంతకాలము ప్రచ్ఛన్నముగఁ గడపి, పశ్చిమసముద్రముచేరుకొని,ఆతీరపుదీవిపైద్వారకానగరనిర్మాణమును ప్రారంభించిరి.

[అక్కడపాండవులు ఏకచక్రపురముననే ప్రచ్ఛన్నముగనుండిరి.]5సం॥

[ద్వారకా కృష్ణలీలలు స్వామి 36 వ సం॥నుండి 125 సం॥ వఱకు]

90 సౌమ్య 36 సం॥ ద్వారకానగర నిర్మాణము పూర్తియగుట, క్రమముగ శ్రీకృష్ణునిఆనతికి తెలిపి యాదవులందరు ద్వారకానగరము చేరుకొనిరి. బృందావనమునుండి నందాది గోపముఖ్యులు, యశోదాది గోపమాతలు మొదలైన భక్తకోటిని క్రమముగా ద్వారకానగరమునకు

కలిపూర్వ సంవత్సరములు | శ్రీకృష్ణుని వయస్సు

స్వామి చేర్పించినట్లు గర్గభాగవతము మొదలగు పురాణములలో రచింపబడె] శ్రీ రుక్మిణీకళ్యాణము స్వామి ద్వారకానగర నిర్మాణమును పూర్తి చేయించినతర్వాత త్వరలో జరిగెను.

అక్కడ కుంతీపాండవులు ఏకచక్రపురముననే ప్రచ్ఛన్నముగ నుండుట 6 వ సంవత్సరము.

89 సాధారణ శ్రా-బ-ర 37 సం॥ పూర్తి జాంబవతీకృష్ణుల వివాహము, సత్యాదేవిశ్రీకృష్ణులవివాహము, శ్యమంతకోపాఖ్యానకథాప్రారంభము.

అక్కడ కుంతీపాండవులు ఏకచక్రపురమున ప్రచ్ఛన్నముగ నుండుట 7 వ సం॥

88 విరోధికృత్ ,, ,, 38 సం॥ పూర్తి రుక్మిణీకృష్ణులకు ప్రద్యుమ్నకుమారుడు కలుగుట, పాండవులక్షేమము తెలిసికొనుటకు స్వామి హస్తినాపురమునకు పోగా, ద్వారకలో శతధన్వనుడు రాత్రి నిద్రించు సత్రాజిత్తుని చంపి శ్యమంతకమణి నెత్తుకొని పారిపోవుట.

అక్కడ కుంతీపాండవుల ఏకచక్రపురనివాసము 8 వ సం॥

87 పరీధావి 39 సం॥ పూర్తి తండ్రిగారు హతుడైనందుకు సత్యభామాదేవి విచారించి పిలువనంపగ, శ్రీకృష్ణుడు, ద్వారకకు మరలి వచ్చుట విని, శతధన్వుడు శ్యమంతకమణిని అక్రూరునివద్ద దాచి, మిథిలవఱకు పారిపోయెను. స్వామి మిథిలచెంతకు తఱిమి శతధన్వుని సంహరించి, మణి ఆయనవద్ద లేనందున, ద్వారకకు మఱలివచ్చిరి. స్వామి వలన భయము కలుగునని మణితో అక్రూరుడు కాశీపురమునకు పారిపోయెను. ద్వారకాపురజనుల కోర్కెపై స్వామి అక్రూరుని మరల గప్పించి, ఆయనచేత మణి ప్రజలకు నిరూపించి ఆ శ్యమంతకమణిని అక్రూరునికే యిచ్చివేసెను. మణిప్రభావమున కలిగిన వైభవముచే అక్రూరుడు యజ్ఞములు, పుణ్యకార్యములు చేసెను.

అక్కడ కుంతీపాండవులు ఏకచక్రపురవాసము 9 వ సం॥

ప్రమాదీచ ఆశ్వయుజ బహుళ కృష్ణాష్టమివఱకు.

86 ప్రమాదీచ 40 సం॥ పూర్తి ద్రౌపదీస్వయంవరము, పాంచాలపురములో ప్రకటింపబడగ, తల్లియూ కుంతీదేవితో (ప్రచ్ఛన్న బ్రాహ్మణవేషములో) పంచపాండవులును, సమస్తరాజులును, శ్రీబలరామ

| కలిపూర్వ సంవత్సరములు | శ్రీకృష్ణుని వయస్సు |
|---|---|

కృష్ణులు సాత్యకి మొదలైనయాదవులు, ద్రుపదనగరమున సమకూడిరి శ్రీకృష్ణుడు స్వయంవరసభలో పాండవులను గుర్తించి, మత్స్యయంత్రమును కొట్టుప్రయత్నమునుండి సాత్యకిని వారించెను. ఇతరు లెవ్వరును కొట్టజాలరైరి. అర్జునుడు మత్స్యయంత్రమును ఛేదించెను.

ప్రమా-శు ౧౩ ద్రౌపదీ వివాహము నాటికి

| | | |
|---|---|---|
| ధర్మరాజు వయస్సు | 42 | సం॥ |
| భీముని ,, | 41 | ,, |
| అర్జునుడు ,, | 40 | ,, |
| నకుల సహదేవులు | 30 | ,, |

85 ఆనంద మా-బ.౧ 41 సం॥ పూర్తి ద్రౌపది వివాహమైన తరువాత 1 సం॥రం 2 రోజులకు విదురుని పంపి, పాండవులను కుంతీద్రౌపదుల సహా హస్తినాపురమునకు ధృతరాష్ట్రుడు రప్పించుకొనెను. ధర్మరాజును యువరాజుగ గౌరవించి, అతనిచే రాజ్యపరిపాలనము చేయించెను.

స్వామి హస్తినాపురమున పాండవులను జూడనరిగి, అందుండగా అర్జునునితో యమునాతీరమునకు వేట కరిగినపుడు, సూర్యపుత్రియా కాళిందీదేవిని చూచి శ్రీకృష్ణుడు ఆమెను ప్రేమించి, హస్తినాపురమునకు తెచ్చి ద్రౌపదీదేవి సంరక్షణలో నుంచిరి. పిమ్మట స్వామి ద్వారకకు, కాళిందీదేవిని గొంపోయివివాహముచేసికొనిరి. ఈమె స్వామికి 4 వదేవి.

శ్రీకృష్ణుడు అవంతిరాజ సోదరియైన మిత్రవిందాదేవిని వరించి, వివాహముచేసికొనెను. ఈమె స్వామికి 5 వ దేవి.

84 రాక్షస శ్రా-బ.౮ 42 సం॥ పూర్తి శ్రీకృష్ణుడు కోసలదేశ రాజకుమార్తె అయిననాగ్నజితీదేవిని వివాహముచేసికొనెను. ఈమె స్వామికి 6వ దేవి.

83 నల 43 సం॥ పూర్తి స్వామి కేకయదేశ రాజకుమార్తె భద్రాదేవిని 7 వ దేవిగ గ్రహించిరి.

82 పింగళ 44 సం॥ పూర్తి శ్రీకృష్ణుడు మద్రదేశరాజకుమార్తెయైన లక్ష్మణాదేవిని మత్స్యయంత్రమునుకొట్టి, (అర్జునునకు ద్రౌపదీ స్వయంవరమునవలె) 8 వ భార్యగ గ్రహించెను. స్వామికి అష్టమహిషులను నామకయున్నను, శ్రీరాధాదేవితో 9 మంది భార్యలని తెలియవలెను. (శ్రీరాధాదేవిని గురించి పీఠికా నాటికలోని యంశములు చూడవలెను.)

కలిపూర్వ సంవత్సరములు | శ్రీకృష్ణుని వయస్సు

81 కాళయుక్తి శ్రా-బ-ర 45 సం॥ పూర్తి ఈ వత్సరములలో కౌరవ, పాండవ, యాదవ, రాజ్యములలో కల్లోలములు లేక, ప్రశాంతముగ కాలము గడచెనని యూహింపవలసియున్నది.

80 సిద్ధార్థి మాఘ-బ-౧ 46 సం॥ పూర్తి ధృతరాష్ట్రుడు పంచపాండవులను అర్ధరాజ్యము యిచ్చి, ఇంద్రప్రస్థమునకు పంపివేసెను.

79 రౌద్రి శ్రా-బ-ర 47 సం॥ ౧ సం
78 దుర్మతి ,, 48 సం॥

77 దుంధుభి ఫాల్గుణములో 49 సం॥ పూర్తి; ధర్మరాజు ననుజ్ఞపై అర్జునుని తీర్థయాత్రా ప్రారంభము. 1 వ సం॥

76 రుధిరోద్గారి శ్రా-బ-ర 50 సం॥ కల్లోలములు లేక ఈ కాలమును
75 రక్తాక్షి ,, 51 సం॥ ప్రశాంతముగ గడపెను. కౌరవ,
74 క్రోధన ,, 52 సం॥ పాండవ, యాదవాన్వయములు వృద్ధినొందెను.

౧ సం
73 అక్షయ ,, 53 సం॥ అర్జునుడు తీర్థయాత్రలో, ఉలూపి
72 ప్రభవ ,, 54 సం॥ అను నాగకన్యను వివాహము చేసికొనెను.
71 విభవ ,, 55 సం॥

70 శుక్ల ,, 56 సం॥ అర్జునుడు చిత్రాంగదాదేవిని వివా
69 ప్రమోదూత ,, 57 సం॥ హము చేసికొనెను. తీర్థయాత్ర
68 ప్రజోత్పత్తి ,, 58 సం॥ ౧ సం క్రమముగ చేయుచు ద్వారకానగ
67 ఆంగీరస ,, 59 సం॥ రమునకు చేరెను. అర్జునుని తీర్థ
66 శ్రీముఖ ,, 60 సం॥ యాత్ర మొత్తము 12 సం॥ తీర్థ
65 భావ ,, 61 సం॥ యాత్రచివర అర్జునుడు ద్వారకలో స్వామిని దర్శించి అచ్చట కొన్నిమాసములుండి స్వామిచే ప్రోత్సాహింపబడి, సుభద్రను వరించి ఇంద్రప్రస్థమునకు తెచ్చి కళ్యాణము చేసికొనుట.

64 యువ ,, 62 సం॥ అంత ఇంద్రప్రస్థముననుండగా
63 ధాత ,, 63 సం॥ ౧ సం కృష్ణార్జునులు మరల యమునాతీర
62 ఈశ్వర ,, 64 సం॥ మున వనవిహారమునకు విచ్చేసిరి.

ఆ సమయమున అగ్నిదేవుడు వారికి ప్రత్యక్షమై అర్జునునకు గాండీవమును అక్షయతూణీరమును శ్వేతాశ్వముల రథమును యిచ్చెను.

శ్రీకృష్ణార్జునులు అగ్ని ప్రీతిగ ఖాండవవనమును, అగ్నిచే దహనము చేయించిరి. ఖాండవదహనమునుండి అర్జునునిచే కాపాడబడి, మయుడు పాండవులకు దివ్యమైన సభను యిచ్చెను. ఇంద్రుడును ప్రీతుడై అర్జునునకు అనేక అస్త్రము లిచ్చెను.

కలిపూర్వ సంవత్సరములు — శ్రీకృష్ణుని వయస్సు

61 బహుధాన్య శ్రా-బ-ర 65 సం॥ స్వామివారికి · ఇంద్రుని వద్దనుండి
60 ప్రమాది ,, 66 సం॥ నరకాసురునివల్ల బాధను గురించి
59 విక్రమ ,, 67 సం॥ సందేశము వచ్చుటయు, స్వామి
58 వృష ,, 68 సం॥ ౧౧ సత్యభామాదేవితో ప్రాక్ జ్యోతిష
57 చిత్రభాను ,, 69 సం॥ పురముపైకి వేంచేసి నరకాసురుని
56 స్వభాను ,, 70 సం॥ జయించి, అదితికుండలములు మరల
55 తారణ ,, 71 సం॥ నిచ్చుటయు, ఇంద్రునివల్ల స్తోత్ర

మచేయబడిన అమరావతికి సత్యభామాదేవితోకూడ వేంచేసి, పారిజాతమును తెచ్చుటయు, నరకాసురునిసంహారమువల్ల విముక్తులు కాబడిన రాజకన్యకలలో తనను వరించినవారిని ద్వారకకు పంపి, కొదువవారిని వారివారిదేశములకు పంపివేయుటకు, మొదలైన లీలలు యీకాలమున జరిగినవి. శ్రీకృష్ణుడు పౌండ్రక వాసుదేవుని. కాశీరాజుని జయించిరి.

54 పార్థివ ,, 72 సం॥ ౧౧ శ్రీకృష్ణపుత్రుడౌ అనిరుద్ధకుమా
53 వ్యయ ,, 73 సం॥ రుని ఉషాకన్య ప్రేమించి, తన

మేడకు రప్పించుకొనెను. ఆమెతండ్రి బాణాసురుడు అనిరుద్ధుని నిరోధించెను. స్వామి బాణాసురుని జయించి, అనిరుద్ధుని విడిపించి, ఉషానిరుద్ధులను ద్వారకకు తీసికొనివచ్చి వివాహముచేసెను.

52 సర్వజిత్తు ,, 74 సం॥ పూర్తి అభిమన్యుని జననము
51 సర్వధారి ,, 75 సం॥ పూర్తి ఉపపాండవుల జననములు
50 విరోధి కా-శు-౧ 76 సం॥ నారదుడు ప్రోత్సాహ పెట్టగ,
మొదలు ధర్మరాజు రాజసూయమును సంక
శుక్ల-౧౪ ల్పించెను. ముందుగ దిగ్విజయము

చేయుటకై కృష్ణార్జునులు, భీముడు గిరివ్రజమునకు పోయి జరాసంధుని భీమునిచే వధింపజేసిరి.

జరాసంధునిచే బంధింపబడిన రాజులు, కార్తీక-శుక్ల-పౌర్ణమినాడు విడుదల గావింపబడిరి.

కా-శు-౫ జరాసంధుని కుమారుడౌ సహదేవునకు గిరివ్రజ పట్టాభిషేకము శ్రీకృష్ణుడు చేయించిరి.

50 విరోధి 76 సం॥ పూర్తి కురుక్షేత్రసంగ్రామసూచకమైన సూర్యగ్రహణము వచ్చెను. అప్పుడు కురుక్షేత్రమున యాదవ, పాండవ ముఖ్యులు వారి దేవీగణము సమావేశమయ్యెను. అచ్చటకు వచ్చినమహర్షులు సమస్తబంధువులు స్వామివారిని సేవించిరి.

| కలిపూర్వ సంవత్సరములు | శ్రీకృష్ణుని వయస్సు |
|---|---|

కురుక్షేత్రమునుండి మరలివచ్చినతరువాత తనతల్లి దేవకీదేవి ప్రార్థింపగా ఆమెకు తమకంటె ముందుజన్మించి కంసునిచే చంపబడిన 6 గురు పుత్రులను, సుతలలోకమునుండి, బలిచక్రవర్తిని మెప్పించి తెచ్చి, తల్లిగారికి స్వామి చూపి పంపిరి.

49 వికృతి చైత్ర-శుక్లమందు 77 సం॥ ధర్మరాజు రాజసూయము, శిశుపాల వధ, శ్రీకృష్ణునకు అగ్రపూజ ధర్మరాజు చేయుట.

ఆశ్వయుజ శుక్లము రాజసూయానంతరము శ్రీకృష్ణుడు పాండవులతో ఇంద్రప్రస్థమున నుండగ, సాళ్వుడు ద్వారకానగరము ముట్టడించెను. స్వామి ద్వారకానగరమునకు మఱలి సాళ్వుని, పౌండ్రకవాసుదేవుని, దంతవక్త్రుని, సాళ్వుని తమ్ముడైన విదూరథుని యుద్ధములో సంహరించిరి.

ఆశ్వయుజ శు.౧౦ ఇట్లు స్వామి ద్వారకలో శత్రుయుద్ధములో నుండగా పాండవులపై అసూయకలిగిన దుర్యోధనుడు శ్రీకృష్ణుడులేని సమయమున ద్యూతమునకు ధర్మరాజును పురికొల్పి ఓడించెను.

కౌరవులచే ద్రౌపదీవస్త్రాపహరణము యత్నింపబడగా శ్రీకృష్ణునిచే అక్షయవస్త్రప్రదానము ద్రౌపదికిఁ గలిగెను. ద్యూతములో ఓడి ధర్మరాజు రాజ్యమును గోల్పోయి తమ్ములతో, ద్రౌపదితోకూడి వనవాసమునకు పోయెను.

48 ఖర 78 సం॥పూర్తి పాండవులు వనవాసము చేయుచుండగా మొదటిసారి శ్రీకృష్ణుడు వారిని చూడవచ్చిరి. ద్రౌపది శ్రీకృష్ణునితో తన పరిభవము చెప్పుకొని ఊరడింపఁబడెను.

| | | | |
|---|---|---|---|
| 47 | నందన | 79 సం॥ | వనవాసమున, కొన్ని సంవత్సరములతరు |
| 46 | విజయ | 80 సం॥ | వాత స్వామి సత్యభామతో పాండవుల |
| 45 | జయ | 81 సం॥ | వద్దకు రెండవసారి వచ్చి ఆదరించిరి. |
| 44 | మన్మథ | 82 సం॥ | ద్రౌపదీదేవి సత్యభామకు పతివ్రతాధర్మ |
| 43 | దుర్ముఖి | 83 సం॥ | ములు తెల్పెను. |
| 42 | హేవిళంబి | 84 సం॥ | వనవాసము ముగియుముందు స్వామి |
| 41 | విళంబి | 85 సం॥ | 3 వ సారి పాండవులకు దర్శన మిచ్చి, |
| 40 | వికారి | 86 సం॥ | అభయమిచ్చిరి. |
| 39 | శార్వరి | 87 సం॥ | శ్రీకృష్ణునిచే ననుగ్రహింప బడిన |
| 38 | ప్లవ | 88 సం॥ | ద్రౌపదీదేవి తన భర్తలను దూర్వాసుని |
| 37 | శుభకృత్ | 89 సం॥ | పరీక్షలో నుత్తీర్ణులుగా చేసెను. |

కలిపూర్వ సంవత్సరములు | శ్రీకృష్ణుని వయస్సు

ఈకాలమున ద్వారకలో కుచేలోపాఖ్యానవృత్తాంతమును, స్వామి మిథిలాపుర రాజైన బహుళాశ్వుని, శ్రుతదేవుని మిథిలానగరవాసులను తరింపజేయును. పాండవ వనవాసము ముగింపగుటయు జరిగెను. మొత్తము 12 సం॥

36 శోభకృత్ ఆ-కృ-8 వఱకు 90 సం॥ అజ్ఞాతవాసము, విరాటనగరమున, పాండవులు విరాటనగరములో ప్రవేశించిన 10 నెలలతరువాత కీచకవధ, ఉత్తర దక్షిణ గోగ్రహణములు, సంభవించెను.

శ్రా-శుక్లపక్షం ఉత్తరాభిమన్యుల వివాహము స్వామి చేయించిరి.

ఆ-శుక్లపక్షం పాండవులు ఉపప్లావ్యమును ప్రవేశించిరి. స్వామి ద్వారకకు విచ్చేసిరి. కౌరవపాండవులు, సేనల సమకూర్పులోను సందర్భమున, దుర్యోధనుడు, అర్జునుడు ఏకకాలమున స్వామి సహాయము నడుగుటయు దుర్యోధనునికి తమసైన్యమునిచ్చి, తాము అర్జునసారథ్యమునంగీకరించి అర్జునునితో స్వామి ఉపప్లావ్యమునకు విచ్చేయుటయు జరిగెను.

కా-శు-౧౭ స్వామి కౌరవులయొద్దకు రాయబారము వెళ్లుట. 8 దినములు రాయబారము నడపి, తమను పట్టదలచిన కౌరవులనువిశ్వరూపమున భ్రమపెట్టి విదురుని నుద్ధరించి, మఱలివచ్చుట ఘటిల్లెను. అది స్వామివారి 4 వ విశ్వరూపదర్శనము.

మార్గ-శు-౧౩ పూర్తి 90 సం॥ ఉభయ సైన్యములు కురుక్షేత్రమున తారసిల్లెను. భగవద్గీతోపదేశము చేయుఅర్జునునకు స్వామివిశ్వరూపము చూపిరి. (ఇది స్వామివారి 5 వ విశ్వరూపసందర్శనము) యుద్ధారంభమై (శుద్ధఏకాదశినాడే గీతోపదేశమని గోపీనాథన్ గారిఅభిప్రాయము)

మార్గ-బ-౩౦ అమావాస్య పదునెదు దినములు ఘోరసంగ్రామమై భారత యుద్ధసమాప్తి యయ్యెను.

పు-శు-౧ దుర్యోధన పతనము అశ్వత్థామ ఉపపాండవులను సంహరించుట.

అశ్వత్థామను కృష్ణార్జునులు పట్టితెచ్చి విడుచుట ఈనాడు వాటిల్లెను.

పు-శు-౧౫ పౌర్ణమి ధర్మరాజు పట్టాభిషేకము, శ్రీకృష్ణుడుచేయుట.

మాఘ-శు-౧౧ భీష్ముని స్వచ్ఛందమరణము, భీష్మతేజస్సు శ్రీకృష్ణునిలో కలిసెను.

కలిపూర్వ సంవత్సరములు — శ్రీకృష్ణుని వయస్సు

35 క్రోధి జ్యే-శు-౨ 91 సం॥ పరీక్షిత్తుజననము, అశ్వత్థామ బాణాగ్నిచే నిస్ప్రహుడై జనించినపరీక్షితున్ని స్వామి జీవింపజేసి సంరక్షించిరి.

34 విశ్వావసు చై-శుక్ల-౧౫ పౌర్ణమి 92 సం॥ ధర్మరాజు వ్యాసాజ్ఞవలన అశ్వమేధ దీక్ష పూనెను.

33 పరాభవ చై-శుక్ల ౧౫ పౌర్ణమి 93 సం- అశ్వమేధయాగము పూర్తియయ్యెను. అర్జునుడు అశ్వసంరక్షణకై దిగ్విజయము చేయుచు, తనకు చిత్రాంగదవలన కుమారుడైన బభ్రువాహనునిచే జయింపబడి, సంధిచేసికొని, అశ్వమును తెచ్చెను.

32 ప్లవంగ శ్రా బ ౮ 94 సం॥ పూర్తి శ్రీకృష్ణుడు ఉదంకమహాముని ఆశ్రమమునకు వెళ్ళి, ఆయనకు దర్శనమిచ్చి, విశ్వరూపము తిరిగిచూపి తరింపచేసిరి. (ఇది స్వామివారి 6 వ విశ్వరూప సందర్శనము)

31 కీలక 95 పం॥
30 సౌమ్య 96 సం॥
29 సాధారణ 97 సం॥
28 విరోధికృత్ 98 సం॥
27 పరీధావి 99 సం॥
26 ప్రమాదీచ 100 సం॥
25 ఆనంద 101 సం॥
24 రాక్షస 102 సం॥
23 నల 103 సం॥
22 పింగళ 104 సం॥
21 కాళయుక్తి 105 సం॥
20 సిద్ధార్ధి 106 సం॥

శ్రీకృష్ణులవారు కురుక్షేత్రమునందు 12 సం॥లు అనేక యాగములు చేయించిరి. ధర్మరాజురాజ్యముచేయుచు సమస్తజనులను పరిపాలించుచుండెను. గాంధారి ధృతరాష్ట్రులు పుత్రశోకముచే హస్తినాపురములో నుండక, శతశూపాశ్రమములో నుండిరి. వ్యాసులవారచ్చటకు వచ్చి వారిని ఊరడించి గాంధారీదేవికోరగా యుద్ధమున పోయిన ఆమె కుమారులందరిని, తమ యోగశక్తిచే ఆమెకు చూపించిరి.

19 రౌద్రి చై శు ౨ 107 సం॥
18 దుర్మతి 108 సం॥
17 దుందుభి శుక్ల॥ప 109 సం॥
16 రుధిరోద్గారి 110 సం॥
15 రక్తాక్షి 111 సం॥

ధర్మరాజు మొదలగు పాండవులు శతశూపాశ్రమమున కొన్నాళ్ళుండి హస్తినాపురమునకు మఱలివచ్చిరి. గాంధారీ ధృతరాష్ట్రాది కురువృద్ధులు నిర్యాణము నొందిరి.

14 క్రోధన 112 సం॥
13 అక్షయ 113 సం॥
12 ప్రభవ 114 సం॥
11 విభవ 115 సం॥

శ్రీకృష్ణభగవానుల సంకల్పముచే పిండారకక్షేత్రమందు నారదాదిమహర్షులు సమావేశమైరి. సురాపానమత్తులైన యదుకుమారులు

కలిపూర్వ సంవత్సరములు　　　　శ్రీకృష్ణుని వయస్సు

వారిని అవమానింపగ, మునులు శాపమిచ్చిర.

మునులశాపముచే స్త్రీవేషధారియై, ఋషులను హేళనచేసి సాంబునికి ముసలముపుట్టెను, ఆముసలమును చూచి, భీతిల్లి యాదవులు దానిని సముద్రములో కలిపిరి.

| | | | |
|---|---|---|---|
| 10 | శుక్ల | 116 సం॥ | నారదమహర్షి ద్వారకానగరమునకు వచ్చి |
| 9 | ప్రమోదూత | 117 సం॥ | వసుదేవునికి భాగవత ధర్మము లుపదేశించిరి. |
| 8 | ప్రజోత్పత్తి | 118 సం॥ | జనకఋషభ సంవాదమును వివరించిరి. |
| 7 | ఆంగీరస | 119 సం॥ | శ్రీకృష్ణ భగవానులు బృందావనమునకు |
| 6 | శ్రీముఖ | 120 సం॥ | విచ్చేసి, తమ మహిమచే బాలకృష్ణ రూపము |
| 5 | భావ | 121 సం॥ | ధరించి నందయశోదాదులకు గోపగోపీజన |
| 4 | యువ | 122 సం॥ | మునకు దర్శనమిచ్చి తరింపజేసిరి. ఆధ్యాత్మిక |
| 3 | ధాత | 123 సం॥ | ధర్మముల నుపదేశించిరి. |
| 2 | ఈశ్వర | 124 సం॥ | స్వామి కరుణచే సమస్త గోప గోపీజనములు |
| 1 | బహుధాన్య | 125 సం॥ | గోపవృద్ధులు తమ తమ దివ్యధామములైన, |

గోలోక వైకుంఠాది దివ్యభూమలం గాంచిరి.

స్వామి మరలి ద్వారకానగరము విచ్చేసిరి. బ్రహ్మేంద్రాది దేవతాముఖ్యులు ద్వారకానగరమునకువచ్చి శ్రీకృష్ణభగవానుని సందర్శించి, పరమధామమైన తన గోలోకమునకు విచ్చేయమని ప్రార్థించిరి.

ద్వారకాపట్టణములో మహోత్పాతములు పుట్టెను, స్వామి యాదవులను ప్రభాసతీర్థమునకు పంపిరి. అచ్చట పరస్పరము కలహించి, యాదవులు నశించిరి, బలరాముడు స్వకీయమైన సంకర్షణ భగవానుని యందు లీనమయ్యెను, స్త్రీజనులు దేహత్యాగముచేసిరి.

ప్రమాది చై శు ౧　　ద్వాపరయుగము 8 లక్షల 64 వేల సం॥ పూర్తి ద్వారకానగరములోని ఉత్పాతములను గూర్చి విని, అర్జునుడు శ్రీకృష్ణుని సందర్శించ వచ్చెను. కృష్ణార్జునులు సముద్రతీరమునకు వాహ్యాళి విచ్చేసిరి. ముసలముయొక్క ముక్కతో చేయబడిన అగ్రముగల బాణము ఒక బోయడు లేడిచెవి యని భ్రమించివైచిన బాణము స్వామి పాదాంగుష్ఠమున తగులగ స్వామి నిర్యాణమును చెందిరి. ఇప్పటికి స్వామి వయస్సు పూర్తి, 125 సం॥ 7 నె॥ 8 రోజులు అంతకు ముందు గోలోకమునకు విచ్చేసిన శ్రీరాధాదేవి దివ్యగోపక బృందము ప్రత్యుత్థానము చేయగ, స్వామి గోలోకమునకు వేంచేయగా బ్రహ్మాదులు దివ్యవిమానములనుండి చేర్పించిరి.

| కలిపూర్వ సంవత్సరములు | శ్రీకృష్ణుని వయస్సు | |
|---|---|---|
| 1 | ప్రమాది చైత్ర శు ౭ | స్వామి గోలోకమునకు విచ్చేసినతోడనే కలియుగప్రవేశ మగుట తెలిసికొని అర్జునుడు దారకునితో రథముపై ద్వారకకు మరలి సప్తమిదినమున ద్వారకలో నుండె. |

భూకంపములు గలుగగా, మిగిలిన సమస్త యాదవబృందముతోను మిగిలిన యావన్మంది జనులతోను ద్వారకను వీడి, మధురకు వెడలెను. ద్వారకానగరము సముద్రమున గ్రుంగెను. అర్జునుడు యావన్మందితో మధుర చేరుకొని అక్కడ అనిరుద్ధ కుమారుడౌ, వజ్రునికి యాదవ రాజ్యాభిషేకము చేసెను,

అంతట అర్జునుడు హస్తినాపురమునకువచ్చి, శ్రీకృష్ణుని నిర్యాణము ధర్మరాజునకు తెల్పెను.

చైత్ర-శుక్లము పరీక్షిత్తు రాజ్యమును అభిషేకించి పౌర్ణమినాడు మహాప్రస్థానిక దీక్షకై పాంచాలీసహితులైన పాండవులు ఒక సంవత్సరము భూప్రదక్షిణము చేసి, విక్రమ సంవత్సరమున బదరికాశ్రమమును దాటి మేరుపర్వతసమీపమున ఊర్ధ్వలోకములను గాంచిరి.

---

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీ కృష్ణావతార స్వరూప నిర్ణయము

శ్రీ చదలవాడ గోపీనాధన్ గారు.

కొవ్వూరు సంస్కృత పాఠశాల కార్యదర్శి.

## యదువంశం — చంద్రవంశం :—

1. బ్రహ్మదేవుని మానసపుత్రుడైన అత్రిమహర్షి వంశమునకు చంద్రవంశ మని పేరు. ఆచంద్రవంశమందు యదువు అను గొప్పచక్రవర్తి యుండెను. ఆచంద్ర వంశమను ప్రఖ్యాతివహించిన యదువంశము శ్రీకృష్ణావతారకాలమందు ఉగ్రసేను డను రాజుయొక్క పరిపాలనలో నుండెను. ఆరాజు తనకూతురైన దేవకీదేవిని వసు దేవునికిచ్చి వివాహము చేసెను. అట్టి చంద్రవంశ మనె యదువంశమందు బ్రహ్మదేవునియాజ్ఞ చొప్పున దేవతలు తమతమ భార్యలతో అవతరించియుండిరి. వీరందఱు చంద్రవంశపు క్షత్రియులు.

**నందగోపుని వంశము :—**

2. నందుడు అష్టవసువులలో ప్రధానుడైన ద్రోణుడనే వసువు యశోదాదేవి ఆయన భార్య అయిన ధరాదేవి, వీరిద్దరు బ్రహ్మదేవుని యాజ్ఞచొప్పున నంద వ్రజమున పుట్టిరి. నందుని వంశమందు గోలోకవాసులైన గోపగోపికలు పుట్టిరి. మఱియు సురభీదేవి వంశసంబంధమైనగోవులు వేలకొలది గోకులబృందావనమందు విజృంభించియుండెను. ఆగోవులయందు బ్రహ్మదేవుని యానతిచొప్పున వేలకొలది ఋషులు తమతమ అంశములతో అవతరించియుండిరి. గోకుల బృందావనవాసులందరు గోసంరక్షణ పరాయణులైన వైశ్యకులసంభూతులు ద్విజులు గోలోకములోని శ్రీకృష్ణభగవానుల మూలప్రకృతియైన రాధామహాదేవి తమ చెలికత్తెలతో సహా వృషభానుడను గోపకునికిన్ని కళావతీయను గోపికకున్ను కన్నకుమార్తెయై ఆవిర్భవించెను. ఈమె అయోనిసంభవురాలు. ఈమెయే నందవ్రజవాసులలో ప్రధానురాలు. కాత్యాయనీ వ్రత మాచరించిన గోపికలు యీమెయొక్క చెలికత్తెలు. ఈప్రకారముగా నందవ్రజమంతయు గోలోకమునుండి అవతరించిన గోపగోపికలతో నిండియుండెను. వీరందరు గోసంరక్షణపరాయణులై యుండిరి.

3. ఈనందుడు గోకుల బృందావనములకు చిన్నరాజై మధురాపురరాజైన ఉగ్రసేనునికి కంసునికి కప్పము చెల్లించుచుండేవాడు.

4. ఈప్రకారముగా బ్రహ్మదేవునిఆజ్ఞప్రకారం దేవతాఅంశ సంభూతులై క్షత్రియులతో మధురాపట్టణము నిండియుండెను. నందవ్రజము శ్రీకృష్ణభగవానుల ఆజ్ఞప్రకారం గోలోకమునుంచి అవతరించిన గోలోకవాసులతో నిండియుండెను. మధురాపురితరువాత ద్వారకాపురివాసులైనయదువంశక్షత్రియసమూహమునకున్ను, బృందావనవాసులైన గోలోకవాసులకున్ను యెట్టిసంబంధమున్ను లేదు. ద్వారకాపురివాసులు బ్రహ్మాండాంతర్గతమైన దేవలోకమునుండి అవతరించినవారుబృందారణ్యవాసులు బ్రహ్మాండబహిర్గతమందున్న గోలోకవాసులు బృందారణ్యమందు విహరించినకృష్ణుడు గోలోకద్విభుజకృష్ణుడు, బ్రహ్మదేవుడు వక్కాణించినశుద్ధపరబ్రహ్మస్వరూపము బృందారణ్యకేలులు యావత్తు గోలోకకృష్ణపరబ్రహ్మము గోలోకవాసులైన గోపగోపికలతో ఆచరించిన లీలలు మధురాపురిలోను ద్వారకాపట్టణములోను వ్యవహరించినకృష్ణుడు వైకుంఠవాసియైనచతుర్భుజకృష్ణుడు, క్షీరసాగరశాయియైన శ్వేతద్వీపకృష్ణుడు, బదరికాశ్రమమందు నివసించియుండు బదరికాశ్రమకృష్ణుడు.

5. ఈప్రకారముగా 1. గోలోకవాసియైనద్విభుజకృష్ణుని 2. వైకుంఠవాసియైన చతుర్భుజకృష్ణుని 3. శ్వేతద్వీపనివాసియైన శ్వేతద్వీపకృష్ణుని 4. బదరికాశ్ర

మనినాసిద్ధైన బదరికాశ్రమకృష్ణుని, యీనలుగురి యంశములతో నవతరించిన శ్రీ కృష్ణావతారము.

6. వైకుంఠము బ్రహ్మాండ బహిఃప్రదేశమందు బ్రహ్మాండమునకు ఊర్ధ్వముగా ఒకకోటి యోజనముల దూరముననున్నది. చతుర్భుజములుగల లక్ష్మీనారాయణులు అధిష్ఠించియున్నారు. అట్టివైకుంఠమునకు ఊర్ధ్వముగా 50 కోట్లయోజనముల దూరములో గోలోకమున్నది. ద్విభుజములు ధరించిన శ్రీకృష్ణపరబ్రహ్మస్వరూపం.

గోలోక శ్రీకృష్ణ పరబ్రహ్మం ద్విభుజ స్వరూపం
| 50 కోట్ల యోజనములు
వైకుంఠం శ్రీమన్నారాయణమూర్తి చతుర్భుజ స్వరూపము
| కోటి యోజనములు
బ్రహ్మాండము
|
శ్వేతద్వీపకృష్ణుడు
చతుర్భుజుడు
|
నరనారాయణ ఋషులు
బదరికాశ్రమకృష్ణుడు

1. 1—11 సం॥లు బృందారణ్యలీలలు
2. 12—85 సం॥ వరకు మధురాపుర కృష్ణలీలలు
8. 86—90 సం॥ వరకు ద్వారకా కృష్ణలీలలు
4. 91—125—7—8 వరకు యుద్ధానంతరలీలలు

శ్రీకృష్ణావతారము పూర్తి అయినరోజునే ద్వాపరయుగము 8 లక్షల 64 వేల సం॥ పూర్తిఅయినది. కలియుగప్రారంభము అయినది.

అభినవ కాళిదాసు రచించిన, సంస్కృత చంపూ భాగవతమునకు,
సత్యవోలు సోమసుందర కవిగారు
కొత్తమిల్లివారి ఆంధ్రీకరణమునుండి,

—♦ రాధామాధవ వివాహాది కథావర్ణనము ♦—

గీ. వత్సములదాచు నపరాధ భరముదొలగ
రాధయను రమణీమణి రహినొనర్చి
బాలికను బడయగగోరి పరగు సింహ
ళాధిపతికిచ్చె వరముగా నజుడు మెచ్చి.

వ. తరువాత నట్టి సింహళాఖ్యద్వీపాధిపతియగు విజయవర్మ యనునతండు యౌవనంబుగలిగి వెలయుచున్న తన తనయ కనురూప వల్లభుంగానక దూయమాన మానసుండై యుండుటెఱింగి కమలాస నుం డతనికి స్వప్నదశయం దీరీతిగా నుపదేశించెను.

గీ. రాధికను మురవైరికారాధికగను
జేసినాదగు నిర్మాణ కౌశలంబు
సఫలమగునట్టిదానిగా నలిపి విదప
ధన్యుడవుగమ్ము నృపచంద్ర! ధారుణీంద్ర!

వ. అటుతరువాత నట్టి విజయవర్మయును నదియే సర్వసంప దలకు నిదానంబైన దానిగా దలంచుచున్నవాడై దామోదరుం బిలచి మహోత్సవంబు గావించి యారాధ నతని కర్పించెను.

---

శ్రీరామచంద్రః శ్రిత పారిజాతః - సమస్త కళ్యాణగుణాభిరామః
సీతాముఖాంభోరుహ చంచరీకః - నిరంతరం మంగళ మాతనోతు!

— శ్రీరామకర్ణామృతము



## — శ్రీ రాధాకృష్ణ శబ్దార్థ నిర్వచనము —

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడగు సర్వేశ్వరుని తిరు నామములలో సారతరమైన "కృష్ణ" యను తిరునామము స్మరించి సకలవిధములగు కోరికలను పొందవచ్చును. సనకసనందనాది మహర్షులును, పెరియాళ్వారు మొదలగు ఆళ్వారులును, ద్రౌపద్యాది స్త్రీలును, అత్యంతప్రేమతో నామస్మరణచేసి యానందము నొందిరి. కృష్ణునికంటె తన్నామస్మరణము త్వరలో ఫలమిచ్చును. వస్త్రాపహరణసమయమున దేహబంధువులచే రక్షణ గానక "కృష్ణ" యను తిరునామమే తనకు దిక్కని స్మరించి అక్షయ వస్త్రముల లభించిన ద్రుపద పుత్రియే యిందులకు దృష్టాంతము. ఇట్టి తిరునామముయొక్క నిర్వచన మందఱకును తెలిసికొనుట అత్యావశ్యకము.

## "కృష్ణ" శబ్ద నిర్వచనము

1. కృష్ణః=క + ఋ + ష + న + అ + ః॥ కకారఋకారషకార నకార అకార విసర్గములు చేరి "కృష్ణ" శబ్దమైనది. కకారమునకు బ్రహ్మయు, ఋకారమునకు అనంతుడును, షకారమునకు శివుడును, నకారమునకు ధర్ముడును, అకారమునకు శ్వేతద్వీపవాసియగు విష్ణువును, విసర్గమునకు నారాయణ ఋషియు అర్థము లగుదురు. సర్వమూర్తిస్వరూపుడును, సర్వాధారుడును, సర్వకారణుడు నగు ఈ స్వామి దివ్యతేజస్స్వరూపు డగుటచే కృష్ణు డనబడును.

2. కృష్ + న + అః=కృష్ణః ॥ జన్మాంతరకృతములగు కర్మములను బోగొట్టి తన కైంకర్యము నొసగువాడగుటచే కృష్ణు డనబడును.

3. కృష్ + న + అః=కృష్ణః ॥ కృష్ అనుధాతువునకు నిశ్చేష్టతయు, నకారమునకు భక్తియు, అకారమునకు ప్రాప్తియు, నర్థములగుటచే స్వరక్షణమునందు స్వాన్వయములేనట్టివానికి, తన పదపద్మ

---

# ప్రార్థనాతరఙ్గములు - సంస్కృతము

## —♦ భగవన్నామస్మరణము ♦—

1 కల్యాణీరాగము - ఆదితాళము

ప. బ్రూహి ముకుం దేతి
హే రసనే! పాహి ముకుం దేతి

1. అక్రూరప్రియ చక్రధ రేతి
హంస నిరంజన కంసహ రేతి

2. రాధారమణ హరే రా మేతి
రాజీవాక్ష ఘనశ్యా మేతి

3. కేశవ మాధవ గోవిం దేతి
కృష్ణా నంత సదానం దేతి

4. అచ్యుత కృష్ణ హరే రామేతి
హరినారాయణభూప రేతి

భక్తి నిచ్చువాడు కనుక కృష్ణుఁ డనబడును.

4. కృష్ + న + అః=కృష్ణః॥ కృష్ ధాతువునకు నిర్వాణంబును, నకారమునకు మోక్షమును, అకారమునకు దాతయు నర్థంబులగుటచే నిర్వాణసుఖరూపమగు మోక్షం బొసంగెడివా డగుటచే కృష్ణు డనబడును. [మఱికొన్ని అర్థములు వేఱొకచో కానవగును]

### "రాధా" శబ్ద నిర్వచనము

రాధా=ర + ఆ + ధ + ఆ॥

రకారముచే రమాభిధేయ యగు లక్ష్మియు ఆకారముచేత నాదిగోపికయగు నీలయు, ధకారముచేత ధరా శబ్దార్థంబగు భూదేవియు, ఆకారముచేత నాపగ యగు విరజయు గ్రహింపబడును.

రాధాకృష్ణ నామస్మరణముచే కృష్ణుడే లభించు ననగా మోక్షము మాట చెప్పనేల? కాన రాధాకృష్ణ స్మరణము చేసి భక్తులు తరింతురుగాక!

బొమ్మకంటి వీరరాఘవాచార్యః, ఉయ్యూరు ప్రభువరాస్థాన విద్వాంసః

---

## ప్రార్థనాతరఙ్గములు - తెనుగు

1 కీర్తన

ప. పాహి! ముకుంద! యనే! ఓజిహ్వా!
పలుకు! గోవిందా! యనే! ఓ జిహ్వా! ॥పాహి॥

1. అక్రూరప్రియ! చక్రధర! యనే
హంస రంజనా! కంసహనన! యనే ॥పాహి॥

2. రాధాపతి! కృష్ణ! రామానుజ! యనే
రాజీవనయన! రమ్యశ్యామ! యనే ॥పాహి॥

3. కేశవ! మాధవ! కిల్బిషహర! యనే
శ్రీశ! లోకేశ! సిద్ధానంద! యనే ॥పాహి॥

4. అచ్యుత! గిరిధర! హరి! రామా! యనే
హరి! నారాయణతీర్థవరదా! యనే ॥పాహి॥

## —♦ పరమశివ ప్రార్థన ♦—

2 సౌరాష్ట్రరాగము - ఆదితాళము

ప. శివ! శివ! భవ! భవ! శరణం - మమభవతు సదా తవస్మరణం

1. ఇంద్రకీలగిరివేశ! జగ దీశ! కనకదుర్గేశ!
2. గంగాధర! చంద్రచూడ! - జగ న్మంగళ! సర్వలోకనీడ!
3. కైలాసాచలవాస!— శివ కర! పురహర దరహాస!
4. భస్మోద్ధూళితదేహ! - శంభో! పరమపురుష! వృషవాహ!
5. పంచానన! ఫణిహేష! - శివ పరమపురుష! మునివేష!
6. ఆనందనటనవినోద! - సచ్చి దానంద! విదళితఖేద!
7. మాన్యవిజయవాటీధామ! శంభో!-మల్లికేశ!శుభనామ!
8. నవవ్యాకరణస్వభావ! - శివ నారాయణతీర్థదేవ!

## —♦బెజవాడలో ఇంద్రకీలాద్రిపై వెలసిన శ్రీదుర్గాంబ స్తవము♦—

3 ఆరభిరాగము - ధ్రువతాళము

ప. జయ జయ వైష్ణవి! దుర్గే! అంబ! జయ జయ కల్పితసర్గే! అంబ!
జయ జయ తోషితభర్గే! అంబ! జయ జయ శ్రీ కనకదుర్గే అంబ!

1. శ్రీకర సద్గుణజాలే! అంబ! సింధూర రంజితఫాలే! అంబ!
పాకశాసనమణినీలే! అంబ! ప్రాలేయభూధరబాలే! అంబ!
2. పాలితకిసలయచాపే! అంబ! పార్వతి లోకైకదీపే! అంబ!
కాళిక! కోమలరూపే! అంబ! ఖండిత త్రిభువనతాపే! అంబ!
3. భక్తజనామరభూజే! అంబ! భాసితలోకసమాజే! అంబ!
రక్తమృదులపాదాంభోజే! అంబ! రంగదుత్తుంగ వక్షోజే! అంబ!
4. శంకరి! సత్కృపాపూరే! అంబ! సంభృత సన్మణిహారే! అంబ!
సాంకవలిప్తశరీరే! అంబ! సంగతాంగకేయూరే! అంబ!
5. వీణావినోదిని! గిరిజే! అంబ! విద్రుమమణిసన్నిభగిరిజే! అంబ!
మానితలోకసమాజే! అంబ! మదనగోపాలకసమాజే! అంబ!

---

## 2 వ కీర్తన

ప. శివ! శివ! భవ! నీవ శరణము — మాకు — సతత మిమ్ము నీస్మరణము
1. ఇంద్రకీలగిరి నొనరి — జగ — మేలి కనకదుర్గతోఁ దనరి
2. శశిని గంగను తలఁజేర్తువు — సర్వ — జగతికి శుభ మొనగూర్తువు
3. కైలాసగిరి వసింతువు — మేలౌ — లీలనవ్వి, త్రిపురములఁ గ్రుంతువు
4. శంభో! భూతి వెలయు మేన — పరమ — శివ! వెలయుదునంది పైన
5. ఫణిరాజు సింహముఁ దనర — తగెదు — భవ్యముని తేజం బొనర
6. తాండవానంద మొసంగ — భక్తుల — దనరింతువు వెత లడంగ
7. మావిజయవాటికయందు — శంభో — మల్లేశ్వరుం డన నుందు
8. తొమ్మిదివ్యాకరణములొందు — నీసేవ — దొడరి నారాయణతీర్థులంద

## 3 వ మూలానుకరణముగల అంత్యనియమముల కీర్తన

ప. జయ! విష్ణుసోదరి! దుర్గా! తల్లీ! జయ! జగము కల్పించు దుర్గా! తల్లీ!
జయ! శివు నలరించు దుర్గా! తల్లీ! జయ! జయ! శ్రీకనకదుర్గా! తల్లీ!

1. సిరి సుగుణము లుగ్గుపాలే! తల్లీ! సింధూరపుబొట్టు నుదుట మేలే! తల్లీ
సరి! నీలమణి నిగ్గులజాలే! తల్లీ! గిరిరాజు కూర్మి నీపాలే! తల్లీ!

2. చిగురు చాప మలరు నీదావే! తల్లీ! జగతి! పార్వతి! నీ పెంపు ప్రావే! తల్లీ
తగుఁను కాళి! నెమ్మదునౌ రూవే! తల్లీ! తరుగు వెత దయగల నీ మావే! తల్లీ!

3. భక్తుల కల్పకమా నీపూజే! తల్లీ! ప్రబలు లోక మెల్ల నీ తేజే! తల్లీ!
రక్తి నునుపదము తమ్ముల రాజే! తల్లీ! రమ్యమౌ నీ నిండు మోజే! తల్లీ!

4. శంకరుదేవి దయ నీతీరే తల్లీ! చాల నెనయుమణిహారములపారే! తల్లీ!
సంకుమదము మైపూత నేరే! తల్లీ! స్వర్ణభూష లొనరుకురులఁబారే! తల్లీ!

5. వీణపాట నలరు నీకై! జే! తల్లీ! వెలయు పగడములగిరిజకై! జే! తల్లీ!
రాణించు ప్రజ నేలు నీకై! జే! తల్లీ! రహిఁకృష్ణునిచెల్లెలనీకై! జే! తల్లీ!

క. నిగమములను గొని జలనిధి
నగపడకయె మునుఁగు దనుజు నణచుటకొఱకై
సొగ సగు మగవాలుగవై
పగతు డణఁగ నిగమములను బ్రహ్మకు నిడవే!





క. సురలకు సుధ నిడఁ గుదురుగ
గిరి నడుమున నునిచి జలధి క్రింద నిలచియున్
సురలకు నమృతము నొసఁగిన
ధరణిధరణకిణగణాఢ్యుఁ దలతుఁ గమఠమున్

క. కర మరుదుగ కిరి వపుషను
తిరముగ ధరియించి నీవు దిక్కరదమునం
దిరవుగ ధరను ధరింపగ
హారిణధర నిమగ్నమైన |యాంకమయె హారీ!





క. వరసుతు డని తన మనమున
నిరవుగ మది నించుకైన నిడక కఠినతన్
బిరబిర నిడుములఁ గుడువ న
సురఁ ద్రుంచియు శిశువుగాచు శుభనరసింహా.



క. బలి నిడు మని మూ డడుగుల
నిల నడిగియు వటువు తనువు హెచ్చఁగఁ బెం
పొంద, లలితముగ జగముల వడిఁ
గొలిచిన నిను మఱిఁ దలంతు కువలయదేవున్.



క. ఇరువదియొకపరి నృపులను
పోరిఁబోరి వధియించి రుధిరపూరము చేతన్
అరుదుగఁ బితృతర్పణమున్
జరిపించిన పరశుధరుని శరణము గనెదన్.

క. శతముఖ ముఖ సురతతి స.
న్నుతి వేడన్ దశరథునకుమాన్యసుతుఁడవై
క్షితి తనయకొఱకు రావణు
నతిసునిశిత శరగణముల హరియించితివో.





క. హల ముసలములను గరముల
నలవరచియు రాజరాజా ననుఁగు తనయ
హాలహతి నతిభయయుతగను
నల కరిపురిఁ జేసినట్టి హరి! బలరామా!

క. జన్నములఁ బశువధంబును
గ్రన్ననఁ జూపించు శ్రుతిని కరుణారసని
శ్యోన్నతమతి నిందించితి
సన్నుత బుద్ధావతార ! సన్నుతిచరితా !





క. తురగము నెక్కియుఁ జాపుల
నురువడిదునుమాడఁ జేత నురుకరవాలం
బరఁదుగ నలవరుచు రమా
వర! వరకల్కి స్వరూప! వరశుభగిరిపా!

---

కంద ద్వయ రుక్మవతీ విలసిత గర్భ

## క్రౌంచవృత్తము

| | రుక్మవతి | | కమలవిలసితము. |
|---|---|---|---|
| కం. | శ్రీరమ ణీలా చిత్త సు - ధీరా! | - | స్థిర శుభ ఫలద ! రుచిర శుభ నామా ! |
| | నూగిసమాజ్ఞాత్మైక్యద! - శూరా! | - | సుర వర విజయద ! శుభగిరి ధామా! |
| కం. | సారసమాల్య స్రగ్ వృత! - శౌరీ! | - | సరసిజ భవ భవ సతత సుకామా! |
| | కారణ మూలాకార వి - కారా! | - | కర సరసిజ ధృత ఘన దర భామా ! |

---

బొమ్మకంటి వీరరాఘవాచార్యాః.
ఉయ్యూరు ప్రభువరాస్థాన విద్వాంసః.



శ్లో॥ "మేఘైర్మేదుర మంబరం వనభువ శ్శ్యామా స్తమాలద్రుమైః
నక్తంభీరు రయమ్ త్వమేవ తదిమం రాధే! గృహం ప్రాపయ"
ఇత్థం నన్ద నిదేశత శ్చలితయోః ప్రత్యధ్వకుంజ ద్రుమమ్
రాధామాధవయో ర్జయంతి యమునాకూలే రహః కేళయః॥

తన్వీవృత్తము.

"శ్రీఁగొను రాధా! ఘనములు నభమున్ జేరె, తమాలములను వనభూముల్
మూఁగె నిరుల్, భీరువు నిశినితఁడౌ, ముందిలు నేర్పు మితని నీక నీవే"
వేఁ గని నందుండిటులనిపనుపన్ వేడ్కఁగ నా యమున దరిని దారిన్
రాఁ, గరమొప్పెన్ దరువులఁ బొదలన్ రాధకుఁ గృష్ణునకతిశుభలీలల్

శ్రీ

శుభవ్రతస్య తపః ఫలం లక్ష్మ్యంచితోరసం

ప్రహ్లాదచిత్తవసతి మస్మత్కులధనం విభుం (స్మరామి)॥

— { రాజ్యలక్ష్మీ పరిణయమ్
  { శ్రీరాజా వేంకటరంగయ్యాప్పారావు బహద్దరువారు



భుజంగప్రయాతమ్॥ సదా సజ్జనానాం ముదం సందధానం

నిదానం శుభానాం నిధానం గుణానాం

శుభాద్రౌ వసంతం సతాం హృద్వసంతం,

భజే సంతతానందముక్తాంతరంగః॥

సీ. జయ రామచంద్రరాట్ శంసిత శుభధామ! జయ శోభనాద్రిరాట్ చరిత విభవ!

జయ నారయాప్పరాట్ సత్కృత సోపాన! జయ రంగయాప్పరాట్ సౌఖ్యభోగ!

జయ నరసింహరాట్ శక్తహృదయవాస! జయ వేంకటాద్రిరాట్ శంసితాఖ్య!

జయ రాజవీద్వరీక్ష్మాసాల వందిత! జయ పాపయమ్మరాట్ సారసాధ్వ!

జయ శుభాద్రీంద్ర సంస్థిత సౌధవర్య! జయ నిరంతర సురవంద్య శక్తపాద!

జయ మహాభక్తహృత్పద్మసౌఖ్య నిలయ! జయ రమాశ్రిత! నరసింహ! సరసరూప!

బొమ్మకంటి వీరరాఘవాచార్యాః,

ఉయ్యూరు ప్రభువరాస్థాన విద్వాంసః.

## శ్రీ "కృష్ణ" శబ్దనిర్వచనము.

1. క + ఋ + ష + ణ + అ + ః॥ కకారమునకు లక్ష్మీనాథుడును ఋకారమునకు రాముడును, షకారమునకు షాడ్గుణ్యపరిపూర్ణుడగు శ్వేతద్వీపాధిపతియును, ణకారమునకు నారసింహుడును, అకారమునకు యజ్ఞస్వరూపుడగు విష్ణువును, విసర్గమునకు నరనారాయణులును వాచ్యులగుదురు. ఈ యార్గురును ఏశబ్దమునందు లీనులై యుండిరో, అట్టి "కృష్ణః" అను శబ్దము పరిపూర్ణతముడైన గోలోకప్రభువును దెల్పుచున్నది

2. కృష్ణః=(నీలమేఘమువలె) నల్లనివాడు॥ తనరూపమును దర్శించునట్టి భక్తుల సకలతాపములను పోగొట్టువాడు.

3. కృష్ణః=భక్తుల పాపములను పోగొట్టువాడు.

4. కృష్ణః=భక్తులను సంసారజలధినుండి పైకి ఆకర్షించువాడు.

5. కృష్ణః=తనరూపసందర్శనముచే భక్తులను వైషయికసుఖములనుండి మరల్చి తనవైపునకు లాగుకొనువాడు.

శ్రీరస్తు

# శ్రీకృష్ణలీలాతరఙ్గిణి



సరస్వతీ ప్రార్థన

శ్లో॥ దోర్భిర్యుక్తా చతుర్భి స్స్ఫటికమణిమయీ, మక్షమాలాందధానా
హస్తేనైకేన పద్మం సితమపిచ శుకం పుస్తకం చాపరేణ
భాసాకుందేందు శంఖ స్ఫటికమణి నిభా భాసమానా సమానా
సా మే వాగ్దేవతేయం నివసతు వదనే సర్వదా సుప్రసన్నా॥

శ్రీ ర స్తు

# శ్రీ కృష్ణలీలాతరఙ్గిణి - సంస్కృతము

## ప్రథమ తరఙ్గము



### గణేశ ప్రార్థన

శ్లో॥ హిమగిరితనయాపత్యం హేమాచలచాపసముదితం తేజః,
కిమపి మహాత్తమ హృద్యం స్మర్తవ్యం విఘ్నతిమిర హరణాయ॥ 1

శ్లో॥ గిరిరాజసుతాసూనుః కరిరాజవరాననః,
పరిపంథిగణధ్వంసీ సురసేవ్యో విరాజతే॥ 2

శ్రీరస్తు

# శ్రీకృష్ణలీలాతరఙ్గిణి - తెనుగు

## మొదటితరఙ్గము



గణేశుని వినుతి

చ. హిమనగ నందనాసుతుని, హేమధరాధర చాపధారికిన్
కొమరుని, దివ్యదీప్తియుతు, కోమలు, నాద్యుని, నెంతయో మహా
త్త్వము నమరేంద్ర సేవ్యు, నరి దారుణవారణునిన్, గజాస్యునిన్
తిమిరములట్లు విఘ్నముల దీర్చెడు సూర్యసమాను, గొల్చెదన్.

1 సౌరాష్ట్ర రాగము-ఆటతాళము (మోహన-చాపు)

ప. జయజయ స్వామిన్ జయజయ
అ. జయజయ జితవైరి వర్గప్రచండ
1. మూషకవాహన మునిజనవంద్య
దోషరహిత దళితాసురబృంద
శేషభూషణ శైవవారిధిచంద్ర
పోషితపరిజన పుణ్యైకకంద
2. అద్రిసుతాసుత అనవద్యసహిత
భద్రభక్తభవ భయహర ముదిత
రుద్రోదిత ఋజు మస్తకచరిత
సద్రూపసరసిజ సముదితవినుత
3. లంబోదర ధీర లావణ్యసార
కంబుసుధానిధి కర్పూరగౌర
సాంబ సదాశివ సత్కృతిచతుర
సామవేదగీత సకలాధార
4. శక్రాదిసురగణ సన్నుతచరణ
శాతకుంభమణి దివ్యాభరణ
ధిక్కృతఘనవిఘ్న తిమిరావరణ
ధీరనారాయణ తీర్థసుకరుణ

గరుడ ప్రార్థన

శ్లో॥ అమృతకలశహస్తం శ్రీపతే ర్ధ్యానకేతుం
సురరిపుతిమిరారిం సోమసూర్యాదిగీతమ్,
అమితబల మశేషప్రాణినాం ప్రాణభూతం
నిగమమయశుభాంగం భావయామ్యాప్తకామమ్. 3

శ్లో॥ వైనతేయం విరాజంతం విష్ణువాహన ముత్తమమ్,
వైకుంఠాశ్రయ మామ్నాయకాయం గాయామి కామదమ్.

1 వ కీర్తన—శ్రీ విఘ్నేశ్వర ప్రార్థన

ప. జయ! జయ! స్వామీ! జయ! జయ!

అ. ప. వంపౌ తొండము వైరుల నొంచగ
పెంపౌ కరి మోము, గం భీరత నించగ

1—చ. వరమును లెంచగ వాహన మెలుకగ
దురితము పాయగ దుష్టులు వారగ
ఉరగ భూషలు తగ ఉదధి శైవులు తాను శశిగ
పరిజనుల పుణ్యమను తరువునకు మొదలౌదువుగ

2. గిరిసుత తల్లిగ చరితము గొప్పగ
తరుగ భవ భయము దాసుల మెప్పుగ
శిర మలరారగ శివనందనుడవుగ
వర లెదు వాక్సతి మఱి నిన్ను బొగడగ

3. పాడవౌ నుదరము పొంకము మించగ
ఉడురాజు కర్పూరము ఒనరు సంకు తెల్పుగ
కడు నేర్పుగ శివుని ఘన సేవకు తగ
సడర సామ గానము అఖిలాధారుడవుగ

4. సురలింద్రుడు నీ చరణము లెన్నగ
వరమణి భూషణ వైభవ మెసగగ
తెరలి విఘ్నము లను తిమిరములు తొలగ
వర నారాయణతీర్థు కరుణించి బ్రోవగ

గరుత్మంతుని నుతి

ఆ. వె. అమృతకలశహస్తు హరి యాన కేతుని
నసుర తిమిర శత్రు నమిత బలుని
నాప్త కాము నెంతు, నఖిల జీవాధారు
సోమ సూర్య వినుతు శ్రుతి శరీరు. 3

కం. సేవించెద గానమునన్ పావను వైకుంఠనిలయు, భాస్వరు వరదున్
శ్రీవిష్ణువాహనోత్తమునావినతాసూనుగరుడునామ్నాయతనున్.

2 ముఖారిరాగము - అటతాళము

ప. శ్రీనారాయణవాహన - శ్రిత మునిజనమండలపావన

అ. వినతావరతనయ వేదాంగశుభకాయ
వివిధవిశ్వాలయ వీరమాంసాలయ

1. సకలజగత్ప్రాణదాయక - సుర సన్నుతసర్వవినాయక
వికటాసురరిపువిదారక - విశ్వ విపులకల్యాణవిధాయక
అకళంకసితకంఠ ఆశ్రితవైకుంఠ
వికచకమలతుండ విగతమోహకాండ
శకలితపాషండ శత్రుహరప్రచండ
అధికబలోద్దండ అద్భుతదోర్దండ

2. అశుభతిమిరచండభాస్కర - సామ విశదఘోషపక్షభాసుర
మశకీకృతసకలాసుర - మంజు మణిరశనాశేషశుభకర
అసురభయంకర అమృతకలశహర
కుసుమనిచయభార క్రూరభుజగహార
అసదృశాచలాకార ఆశ్రితశుభకర
లసదరుణాధర లీలామయశరీర

3. నిరవధికామలపరాక్రమ - నిత్య నిర్మల ఖలదురితవిక్రమ
మురరిపుచరణాబ్జసంభ్రమ - ముని నారాయణతీర్థమతిరమ
అరవిందలోచన అఘబంధమోచన
సురరిపుశాసన సోమరవినయన
పరిజనపాలన పామరవిదళన
గురుకృతసేవన గోకులభవన

భక్తవరనుతి

శ్లో॥ ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుక శౌనక భీష్మ దాల్భ్యాన్,
రుక్మాంగదార్జున వసిష్ఠ విభీషణాదీన్
పుణ్యానిమాన్ పరమభాగవతాన్ స్మరామి. 5

## 2 వ కీ ర్త న - గ రు డ ప్రా ర్థ న

ప. శ్రీనాథుని వాహనమ! గరుడ! చేసెదు, మునిపాలనము

అ. ప. వినతనందనుడవు వేద మయుండవు
పెను పలు నెలవుల గొని నను బ్రోతువు

1. జగతి ప్రాణముల నించి – నీవు – ఖగపతి! సురనుతి గాంచి
పొగరుగల ఖలుల ద్రుంచి–ఎల్ల – భువనములకు మేలెంచి
తెగటార్చి శత్రువుల తెలుపౌ మెడ శోభించి
దిగిచి మోహము, తమ్మి తీరౌ ముక్కున మించి
బిగి రెక్కల జిగితో పెంపౌ బల్మి వహించి
తెగడి విమతుల మూకల ధిషణ హరి నాశ్రయించి

2. నెరసులను నిరాలకు రవి వన – సామవేద–స్వరఘోషమున రెక్కల జవమున
చిరుతదోమలన దురుసుల్ చన – మణుల – చెన్నొ నడుము పట్టి సొంపున
వెరపించి యసురుల వే నమృతము గొని బల్మిన
విరి సరము లన మేటి ఉరగముల పూని లీలన
సరిలేని గిరియో యన సిరు లొసగి నివారి గన
చిరునవ్వు కెంబెదవిన వర లెదవు మేలౌ రూపున

3. గెర లేదు ని నేల్ శూరతకు – నెప్పుడు సరియొ! ఖలులు నీ ధీరతకు
హరి పదాబ్జము గొల్చు స్థిరతను తగుదువు– వర నారాయణ తీర్థ పరతకు
విరితమ్మి కనులతో దురితము బాపుటకు
సురరిపుల నణచు చూపు సూర్యచంద్రుల పోలుటకు
పరుషత లుడుగ జేసి భక్తులను గాచుటకు
గురువుల సేవనమున గోకులమున వెలయుటకు

## భ క్తు ల స్తు తి

గీ. పూజితుల దాల్భ్య నారద పుండరీక
శౌనక వ్యాస శుక పరాశర వసిష్ఠ
భీష్మ పార్థాంబరీష విభీషణులను
దలతు ప్రహ్లాద రుక్మాంగదుల హనుమను.

శ్లో॥ నీలాచలవరనిలయం నిఖిలజగన్నాథ మేక మాకలయే,
నీరధివటతరునికటం నిజసేవకబృందహితవిధాతారమ్. 6

3. సౌరాష్ట్రరాగము - త్రిపుటతాళము. (జగన్నాథ స్తవము)

ప. సుభద్రాబలభద్ర సుదర్శనసహిత
అ. ఇభరాజతారక ఈశ మామవ దేవ
1. లవణజలధితీర లలితనీలాచల
నవమణిపరిశోభి నవ్యదివ్యభవన
2. వటవిటపినికట వరసింహాసన
నిటలాక్షవిధికృత నిత్యమంగళాచరణ
3. మార్కండేయజలధి మధ్యగణేశహిత
దుర్గతిహర అష్ట దుర్గాపరివేష్టిత
4. పతితజనపావన పరమదివ్యమంగళ
అతికరుణాకర అద్భుతమహాప్రసాద
5. జగన్మోహనమంటప జయశబ్దబహుళ
జగదేకనాయక జితసురారిమండల
6. వినతాతనయసేవ్య వినతమంగళకర
విదళితభవబంధ వేదవనసంచార
7. నారదాదిమునిగేయ నామధేయ సుఖద
నారాయణానంద తీర్థభావితానంద

శ్లో॥ సర్వజ్ఞానక్రియాశక్తిం సర్వయోగీశ్వరప్రభుమ్
సర్వవేద మయం విష్ణుం ప్రభవిష్ణు ముపాస్మహే॥ 7

ఆ. నీరధికిని చెంత నీలాచలముపైన
గొప్ప మఱ్ఱి దాపు కోవెల గల
ఘనుని సర్వమయు జగన్నాథు మానాథు
భక్త విహిత కరుని బ్రస్తుతింతు

3 వ కీర్తన - జగన్నాథ ప్రార్థన

ప. వరలు భద్ర హలియు వర చక్రము లెనయు

అ. ప. కరిని గాచినావు వరద! నన్ను బ్రోవు

చ. 1. ఉప్పు కడలి దరిని ఒప్పు నీల గిరిని
గొప్ప మఱులోనరు, నీ కోవెలల నగరిని

2. వెలగు వట వనమున సింగపు పీఠమున
అల శివ పద్మజుల యాశీర్వచనమున

3. మార్కండేయ జలధి మధ్య గణేశు గాచి
కోర్కె దీర్చ వచ్చి కులదుర్గల బ్రోచి

4. దీనులను మేల్ గాంతు దివ్యశుభము నింతు
జానొ కృపనెంతు చాల ప్రసాదింతు

5. జగతి కీవె పతివి తగ క్రూరుల నొంతు
జగన్మోహన మంటపమున నొగి జయనుతిగాంతు

6. వినత సుతుడు గొలువ వేద వని చరింతు
జనన బంధముడిపి వినతుల శుభ మెంతు

7. నారదాదిమునులు నామ మెన్ని యలర
నారాయణ తీర్థు నందింపుము సార్థు

గీ. సర్వ విజ్ఞాన చేతన శక్తి యగుచు
సర్వయోగీంద్రులకుఁ బ్రభు స్థానమగుచు
సర్వ వేదమయాంతర సారమైన
శ్రీశు వైష్ణవ ప్రభ నుపాసింతు మెపుడు.

4. నాటరాగము - జంపెతాళము

ప. జయజయ రమానాథ జయజయ ధరానాథ

అ. జయజయ వరాహపురి శ్రీవేంకటేశ - జయజయ

1. నిగమగోచర నిత్య నిర్మలానందఘన
విగళితమహామోహ విమలవిజ్ఞాన
ఖగయానసంచార ఖండితాసురనికర
సకలగుణసంపన్న సత్యపరిపూర్ణ

2. మధుసూదనానంత మాయయా కృతభువన
విధుదివాకరనయన వేదాంతభవన
విధిముఖసురేంద్రనుత విపులకల్యాణయుత
విమలయోగిధ్యేయ వివిధమునిగేయ

3. మురనరకసంహార మూఢమతిజనదూర
పరిజనశివంకర పరావరశరీర
నిరవధికకారుణ్య నిఖిలలోకశరణ్య
సరసనారాయణతీర్థ సద్గురువరేణ్య

శ్లో॥ కృష్ణ కృష్ణ కృపాసింధో భక్తసింధుసుధాకర
మాముద్ధర జగన్నాథ మాయామోహమహార్ణవాత్. 8

5. సౌరాష్ట్రరాగము - త్రిపుటతాళము

1. మత్స్యకూర్మవరాహనరమృగ - వామనామరభార్గవ
కుత్సితారివిరామదశరథ - రామబలరామాభవ - కృష్ణకృష్ణ

2. కృష్ణ కృష్ణ కృపాసముద్ర వి - తృష్ణ బుద్ధ గుణాకర
కృష్ణ కల్కిశరీర ఖలజన-కృంతనామర సుఖకర-కృష్ణకృష్ణ

3. నిత్యశుద్ధసుఖానుభూతి - నిరంజనాఖిలరంజన
ప్రత్యగేకరసైకవిగ్రహ - పరమపావన పావన - కృష్ణకృష్ణ

4. గోపగోపీగోధనావన - గూఢపరతత్త్వామృత
తాపహర నారాయణతీర్థసం-తారకవిజయగోపాలక-కృష్ణకృష్ణ

4 వ కీర్తన - శ్రీవరాహ వేంకటేశప్రార్థన

ప. జే! జయ! లక్ష్మీశ! జే! జయ! ధాత్రీశ!
అ. ప. జే! వరాహ క్షేత్ర శ్రీ వేంకటేశ
చ. 1. నిగమములు నిను బొగడి నిర్మలానందు డను
తెగడి భ్రాంతుల నెల్ల తెలియదగు నిన్నె యను
ఖగచారివై ఖలుల ఖండించు మేటి వను
సుగుణ సంపద నిజము సొగడ నిను నిందు నను
2. మాయాజగములం దీర్చు మధురిపు డనంతు డన
నీ యంశు లినుడు శశి నెలవు వేదాంతమును
ఆ యింద్ర విధు లెన్న అధిక కల్యాణు డను
గాయకులు ముని యోగి ఘను లెంచు దైవ మను
3. ముర నరకులను గెల్చి మూఢులను దోలితను
పరిజనుల మేల్ గూర్చు పరమావతార మను
శరణు భామల కెల్ల కరుణ కవధివె యను
వరనారాయణతీర్థ గురుదేవు డీవె యను
కం. కరుణాసాగర! లోకే
శ్వర! వరభక్తాంబురాశి చంద్రా మమ్మున్
గురుమోహజలధి మాయల
కెరలనియక, యుద్ధరింపు కృష్ణా! కృష్ణా! 8

5 వ కీర్తన - అవతారప్రార్థన

1. మీను కూర్మము ఘోణి నరహరి - మేటి పొట్టియు విప్రుడై
జానకీపతి రుక్మిణీపతి - శాక్యమౌనియు కల్కియై - కృష్ణ! కృష్ణ!
2. పూని దుష్టుల ద్రుంచి దివ్యుల - బ్రోచి సౌఖ్య మొసంగగా
జ్ఞానమిత్తువు దయకు వారిధి-సద్గుణాప్తి యొసంగగా-కృష్ణ! కృష్ణ!
3. మార్చెదవు శాశ్వతముశుభమా - మాన్యభామల మోదమున్
చేర్చెదవుపలుశోభలోకజా-చెల్వులోఅనువాదమున్-కృష్ణ! కృష్ణ!
4. కూర్చె దే ధర గూఢ తత్వమొ! - గోప గోపీ గోతతిన్
తీర్చరా! శివనారాయణ - తీర్థతాపములాఘతిన్-కృష్ణ! కృష్ణ!

—♦ అధికారి నిరూపణము ♦—

శ్లో॥ వాసుదేవే భగవతి భక్తిప్రవణయా ధియా,
వ్యజ్యతే భక్తసారాఢ్యా కృష్ణలీలాతరంగిణీ. 9

—♦ ప్రబంధప్రతిపాద్యకథాసంగ్రహము ♦—

ఆదౌ కృష్ణావతార స్తదను నరహరే ర్బాలలీలావిలాసో
వత్సానాం పాలనంతచ్చరిత మథగవాం పాలనం ప్రౌఢభావః.
గోపీవస్త్రాపహార స్తదను గిరివరోద్ధారణం రాసలీలా
కంసాదీనాం నిరాస స్తదను జలనిధౌ ద్వారకాయాం ప్రవేశః. 10
రౌహిణేయస్య కృష్ణస్య వివాహ స్తదనంతరమ్,
రుక్మిణ్యాద్యష్టమహిషీ సహితో గీయతేఽమరైః. 11
ఇత్యేవం సంగ్రహేణోక్తా కృష్ణలీలాతరఙ్గిణీ,
ఆద్యః కృష్ణావతారోఽయం సంగ్రహేణాభినీయతే. 12
ఉగ్రసేన స్తతః కంసో దేవకీవసుదేవయోః,
తయోః కారాగృహే వాసః కంసేన విహితః కిల 13
బ్రహ్మ సురేంద్రో ధరణీ సనకాద్యా స్తతో హరిః,
భగవత్ప్రార్థనా తేషాం తత్తత్ స్థాననివేశనమ్. 14
నారదస్యోపదేశేన షట్సుతానాం విదారణమ్,
దేవక్యా స్సప్తమో గర్భః సంకర్షణ ఇతీరితః. 15
గోకులే కృష్ణగమనం దుర్గాయా మథురాగమః,
కథాయా స్సంగ్రహ స్త్వేవం చరిత్రేఽస్మి న్నిగద్యతే. 16

గీ. కృష్ణలీలాతరంగిణి విష్ణుభక్తి
సారశోభిత, భగవతి సత్యరూపు
వాసుదేవుని గొల్చి యుపాసన గొను
బుధులమతులకే హృద్యమై బోధపడను. 9

—♦ సారాంశము ♦—

ఆదిని శ్రీకృష్ణావతారమును పరి బాలలీల సొంపున్
ఆదట గోవత్సంబుల పాలన నచ్యుతు ప్రౌఢత పెంపున్.
గోపీవస్త్రాపహరణ లీలయు గోవర్ధన ధారణమున్.
ఆపయినన్ రాసలీల కంసాద్యసురవరుల మారణమున్ 10
జలధి ద్వారకం గట్టి యేలుటయు బలరాము వివాహమ్మున్
లలి రుక్మిణ్యా ద్యష్ట భార్యలతో వెలయు నమర గేయమ్మున్.11
తనరు నిదియు శ్రీకృష్ణలీలాతరంగిణి యనగ నొప్పున్
మును శ్రీకృష్ణావతార మభినయమున గను సుజనుల మెప్పున్.12
ఉగ్రసేనుకథ, కంసుడు భయమున నూర్జితుడై ఋజు పథమున్
నిగ్రహించి దేవకిని వసుదేవు నిర్బంధించిన విధమున్. 13
దేవరాజు సనకాది మునులు భూదేవి సురలజుడు చనుటన్
శ్రీవిష్ణుని ప్రార్థించుట ధన్యత చెందుట సుస్థితి మనుటన్. 14
నారదు నుపదేశమ్మును దేవకినందనులన్ గాంచుటయున్
క్రూరుడు కంసుడువారినార్వురన్ గొనిచని హింసించుటయున్. 15
కృష్ణజననమును గోకుల గమనము కెరలు గాఢనిశ యందున్
వైష్ణవీదుర్గమధురాగమమున్ వర్ణింపంబడు నిందున్. 16

# కథా ప్రారంభము



అథ తత్రాదా వుగ్రసేనాగమనమ్—

6 దరువు - సౌరాష్ట్రరాగము - ఆదితాళము

అగ్రేసరో మహాత్మనాం    అగ్రగణ్యో౽పిధీమతాం
ఉగ్రశాసనకాగ్రణీ    రుగ్రసేనో విరాజతే

అథ కంసాగమనమ్—

7 దరువు - సౌరాష్ట్రరాగము - ఆదితాళము

శఠో హంతా దధర్మకృ    న్మహామూఢో మహాబలీ
కఠోరహృదయో నిత్యం    కంసాసుర స్సమాయాతి

అథ దేవక్యాగమనమ్—

8 దరువు - నాదనామక్రియారాగము - ఆదితాళము

ఆయాతి దేవకీ దివ్యసుందరీ - విష్ణు
మా యేవ సాక్షా దియ మమరనారీ
నరాధిపవర గేహినీ శ్రీ
నారాయణీయ దివ్యమూర్తి జననీ
ఇందువదనారవిందలోచనా శుభ
కుందరదనా కుటిలకుంతలఘనా

# కథాప్రారంభము



వ. అంతట మొదట నుగ్రసేనుని ప్రవేశము—

6 వ కీర్తన - ఉగ్రసేనునిగూర్చి.

గొప్ప యాతడు మహాత్ములన్ కోవిదులన్ .కోవిదుడున్
తప్పనిశాసనముగల ప్రభువై యొప్పె నుగ్రసేనుడున్నన్

వ. అంత కంసుని ప్రవేశము—

7 వ కీర్తన - కంసునిగూర్చి.

విరసుడు మూఢు డధార్మికుడున్ గరువపోతు బలవంతుడై
కరకుమతి నెప్పుడు మెలగున్ కంసుడు రాక్షసు వంశన్

వ. అంత దేవకీదేవి ప్రవేశము—

8 వ కీర్తన - దేవకీదేవినిగూర్చి.

దేవకి విచ్చేయు దివ్యసుందరి - ఈమె
భావింప విష్ణుమాయ దేవనారి;
నరపాలువీటి కన్నె - శ్రీమన్
నారాయణుని గన్నతల్లి
విరితమ్మి కనులతో - వరలు చందమామ మోము
సరిమొల్ల పల్వరుస యిరుల మించు వంపు కురుల దేవకి

అథ ఉగ్రసేనానుజ్ఞయా వసుదేవాగమనమ్—

9 దరువు - శ్రీరాగము - ఆదితాళము

అసురారణ్యకుఠారో వసుమత్యాం మహామనసా
వసుధాధిపతిలకో వసుదేవో విరాజతే

—♦ అశరీరవాణీశ్రవణము ♦—

౫. అథ దేవకీవసుదేవయోః వివాహోత్సవానంతరం వసుదేవ
గృహప్రవేశసమయే తయో స్సారథ్యం కుర్వతి కంసే దేవ
క్యా స్త్వష్టమో గర్భః కంసమృత్యు రిత్యశరీరవాక్యం శ్రుత్వా
కంసో వసుదేవం ప్రత్యాహ. 17

—♦ కంసప్రతిజ్ఞ ♦—

శ్లో॥ వసుదేవ హనిష్యామి కరిష్యా మ్యాత్మనోహితమ్,
దేవకీం భగినీ మేనాం మృత్యుబీజం మమాప్యహమ్. 18

అథ వసుదేవః కంసం ప్రత్యాహ—

10 మంజరీ - కాంభోజిరాగము - జంపెతాళము.

హే కంసరాజసుత హే నరశ్రేష్ఠ
హే సత్యసంధకుల జలధిభవరత్న
హే సౌమ్యగుణయుక్త హితజనాసక్త
కల్యాణవేద్యాం చ కలితబహుభద్రాం
ముంచ భగినీ మద్య ముహు రధికహృద్యాం
సత్యం వదామి తవ సత్యసంధోఽస్మి
దాస్యామి తజ్జాత వత్సా ననింద్య
మా సాహసం కర్తు మర్హసి సదైవ
తవ భగిన్యైవ సహ సుఖ మధివసామి
భవనే తవైవ వర మస్తు శుభ మద్య

వ. ఉగ్రసేనుని అనుజ్ఞచే వసుదేవుడు వచ్చుట—

9 వ కీర్తన - వసుదేవుని గూర్చి.

రాజిలె భువి యదువరుడు తేజ మెసగ వసుదేవుడనంగా
ఆజి నసురులను నడవుల నితడు వే జయించును కుఠార మనంగా

— అశరీరవాక్కు వినిపించుట —

వ. అంత దేవకీవసుదేవుల పెండ్లి అయిన తరువాత వసుదేవుడు తన మేడకు విచ్చేయునపుడు వధూవరులకు రథసారథ్యము చేయు కంసుడు వినగా "దేవకియొక్క ఎనిమిదవ శిశువు కంసునికి మృత్యు వగును" అని అశరీరవాక్కు మ్రోగెను. కంసుడు అది విని వసుదేవునకు నిట్లనెను.

గీ. చెలియలే యైన దేవకిన్ శీఘ్రముగను
జంపవలయును వసుదేవ చంపునెడల
నాకు మృత్యుకారణ మీమె లేక తలఁగు
మతి వెరపు లేక నాకింక హితము గలుగు.

వ. అంత వసుదేవు డిట్లు కంసుని బతిమాలెను—

10 వ కీర్తన - వసుదేవుడు కంసుని వేడుట.

ఓ కంస! ప్రభుపుత్ర! ఓ నరోత్తముడ
నీ కులము సత్యాబ్ధి నీవు రత్నంబు
సౌమ్యుడవు సుగుణుడవు స్వజనప్రియుడవు
పెండ్లిభద్రముగూర్చి ప్రేమఁ జేసితివి
తన్వి నీ చెల్లెను దయతోడ పంపు
సత్యము పల్కెద సత్యసంధుండ
ఈమెబిడ్డల నెల్ల నిత్తు నీకయ్య
ఘాతుకత్వం బేల గావింతువయ్య
నీ చెల్లెతో నెమ్మి నివసింతు నయ్య
నీ మేడ మే లెపుడు నెలవొందునయ్య

—♦ దేవకీవసుదేవుల కారాగృహప్రవేశము ♦—

గ. అథ వసుదేవ వాక్యం శ్రుత్వా కంసస్తౌ కారాగృహం ప్రావేశయత్.

అథ బ్రహ్మాగమనమ్—

11-1 దరువు - సాదనామక్రియారాగము - ఆదితాళము.

ఆయాతి చతురాస్యో బ్రహ్మా సదసి
గాయం గాయం ధ్యాయం ధ్యాయం విష్ణుంచేతసి
దండకమండలుధారీ దానవవైరీ
అండబ్రహ్మాండవిధాతా అఖిలజనయితా

అథ దేవేంద్రాగమనమ్—

11-2 దరువు - శ్రీరాగము - ఆదితాళము.

బృందారకాదివినుతో మందం మందం మహీంసుఖం
అంతరంగే విచింతయన్ ఇంద్రో మహాన్ విరాజతే

—♦ భూదేవి భగవంతుని శరణంబు వేడుట ♦—

అథ ధరణ్యాగమనమ్—

11-3 దరువు - మధ్యమావతి - ఆదితాళము.

లావణ్యమూర్తి ర్ధరణీ సమాయాతి లలితభూసురధారిణీ
సర్వలోకహితకారిణీ సదా దేవీ సత్యలోకసంచారిణీ

శ్లో॥ దృష్ట్వా సురేంద్రం బ్రహ్మాణం బ్రహ్మణోఽనుజ్ఞయా సహ,
బ్రహ్మణా చ సురేంద్రేణ విష్ణుం సా శరణం గతా. 20

గ. అథ భగవాన్ అపరిమిత చిదానంద సత్యపరిపూర్ణః పరమాత్మా అనాద్య నిర్వచనీయా చింత్యశక్తిః మాయా విలసితలోకానుజిఘృక్షయా పరిగృహీత దివ్యమంగళ విగ్రహమూర్తిః శ్రీమన్నారాయణః క్షీరాబ్ధౌ శేషపర్యంక శయనో మహాసహ

వ. అంత వసుదేవుని వాక్యము నాలించి కంసుడు ఆ వధూవరులను కారాగృహమున నుంచెను.

వ. అంత బ్రహ్మ ప్రవేశము—

11-1 వ కీర్తన.

నలుమోము లలర నలువ సభకు విచ్చేసెన్
తలచి తలచి మది చెలగ చెలగ - పాటల - తా విష్ణు నుతించి
దండ కమండలువుల గొని దనుజుల గొంచి
అండ బ్రహ్మాండముల తీరికల - నన్నిటి నిర్మించి

11-2 వ కీర్తన - ఇంద్రుడు వచ్చుట.

సురలుగొలిచి తను పొగడన్ అరుగుచు మెల్లగ భూగరిమన్
మరిమరి మదిలో నెంచుచున్ సురేంద్రు డచట నె మహిమన్

11-3 వ కీర్తన - భూదేవి వచ్చుట.

సుందరిమైన వసుంధర వర భూ సురులతోడ వచ్చెన్
అందరి మేల్గోరి సత్యలోకసభ యందు దపుడు చొచ్చెన్

గీ. ఇంద్రుగని తనతో గొనియేగి ధరణి
యజునిదర్శించి, వాగీశు ననుమతమున
నతడు నమరులు మునులు తన్ననుగమింప
సర్వరక్షకు విష్ణుం దా శరణు పొందె. 20

వ. అంతట భగవంతుడు, పరిమితి మించిన జ్ఞానము, ఆనందము, సత్యము, నిండినవాడు, మొదలు మించినవాడు, వాక్కును, మనస్సును అతిశయించు శక్తిగలవాడు, మాయచే వెలయు లోకమును అనుగ్రహించుటకొరకు గైకొనబడిన దివ్యమంగళ విగ్రహముగలవాడు, శ్రీమన్నారాయణుడు, క్షీరాబ్ధిపై శేష పాన్పున పరున్నవాడు మహానుభావుడై నిత్యుడై వర్ధిల్లెను.

సదాఽఽస్తే. త మేన మసురభార భరాక్రాంతా గోరూప ధారిణీ ధరణీ సురపతిముఖ సురపరివేష్టితా సతీ అనన్య శరణా శరణ మాజగామ. 21

అథ సనకాదీనాం ఋషీణాం భగవన్నామ మాహాత్మ్యం ఖ్యాప యతా మాగమనం గీయతే—

—♦ శ్రీమన్నారాయణుసన్నిధికి సనకాదు లేతెంచుట ♦—

12 భైరవి రాగము - ఆదితాళము.

ప. రామకృష్ణ గోవిందేతి నామసంప్రయోగే
అ. కామ మిహ స్నాతవ్యం సర్వోత్తమ ప్రయాగే
1. దిగ్దేశకాలానపేక్షు సిద్ధసర్వసులభే
సద్గురుకృపాసముద్ర సంగహేతులాభే
2. రామనామగంగా స మ్మిళిత కృష్ణనామ
యామునే గోవింద నామ సరస్వతీప్రథితే
3. యోగిమానసపరమ హంసకులకలితే
వాగీశ విష్ణు రుద్రాది వాగ్విహారిలలితే
4. సర్వలోకాలోక కామ సాంగ ఫలదానే
నిర్విశేష నిత్యానంద లాభసునిదానే
5. ఋగ్యజుస్సామాది వేద శాఖమూలవిలసితే
రాగలోభాదిసంతాప శాంతికరచరితే
6. స్నానసంధ్యాజపహోమ తర్పణానపేక్షితే
హానివృద్ధ్యాదిరహి తాఖండసుఖఫలదే
7. స్నానం మానసికం తస్య స్మరణం వాచనికం
కీర్తనం కాయికం తస్య కీర్తనే సునర్తనం
8. యాగయోగరాగభోగ త్యాగసంబంధం వినా
భక్తివిరక్తివిజ్ఞాన ద్వారాముక్తిఫలదే

రాక్షసభారముచే ఆక్రమింపబడ్డ భూదేవి గోరూపము ధరించి నదై దేవేంద్రాది దేవతలతో కూడినదై ఇతర శరణు లేనిదై ఆభగవంతుని శరణుం జొచ్చెను.

వ. అంత సనకసనందనాది మహామునులు భగవన్నామ ప్రభావమును వివరించుచు, వచ్చుచు, ఇట్లు గానము చేసిరి.

12 వ కీర్తన - భగవన్నామమాహాత్మ్యము.

ప. రామా! కృష్ణా! గోవిందా! యను నామధ్యానగానమే

అ. ప. ప్రేమగొల్వనా ప్రయాగ పెంపుమించు స్నానమే

చ. 1. ఏకాల దిక్ దేశమైన నెనయు సులభ మోక్షమే
చేకూరు నన్నిట మేలౌ శ్రీగురుకటాక్షమే

2. రామనామ గంగ కృష్ణ నామ యమునతోడుగాఁ
ఆమెయిన్ గోవిందాయను నామమె సరస్వతిగా

3. మునిమానస పరమహంస లనయము సేవించగా
వనజభవ హరి రుద్ర నామ వాక్కు లలరైమించగా

4. ఇందునందు కోర్కెలనెల్ల పొందిం మనీతీర్థమే
చెందనౌ సర్వస్వనిత్యా నందమొందుసార్థమే

5. నాలుగువేదమ్ములశాఖలకిది మూలమానాధారమే
ప్రీలగసంతాపమ్ములు, మనసున విలసిలుశాంతికితీరమే

6. స్నానసంధ్యజపహోమాదుల సత్ఫలమ్ములువచ్చునే
హానివృద్ధిలేనినిండౌ యానందమునిచ్చునే

7. మానసస్నానమునామస్మరణే మరివాక్ స్నానముకీర్తనే
ఆనందంబగు శరీరస్నానము - హరికీర్తనతోనర్తనే

8. యాగయోగముల, భోగరాగముల అనుబంధములకు దూరమే
త్యాగము భక్తి విరక్తి విజ్ఞానము దనరు ముక్తిఫలసారమే

9. బ్రహ్మవిద్యాలక్షణ / నిరీక్షణవిచక్షణే
బాధితఘోరసంసార / వారణతత్కారణే
10. సర్వపాపౌఘతిమిర / చండసూర్యమండలే
సాధునారాయణతీర్థ / తీర్థరాజవిమలే

గ. ఏవం సనకాదిభిః ప్రశంస్యమాన దివ్యనామధేయో భగవాన్ శేషశాయీ ఆవిరాసీత్, తదేత దభినీయతే. 22

13 దరువు - శంకరాభరణరాగము - చాపుతాళము.

అశేషలోకకారణం / అనాదిమధ్య మవ్యయం
సశేషశయనో విభు / ర్విశేషతో విరాజతే
మహాఫణీంద్రశయనో / మహామునీంద్రసేవితో
మహాలక్ష్మీమహీయుతో / మహావిష్ణు ర్విరాజతే.

గ. ఏవం భగవతి ప్రసన్నే ప్రణీతపూర్వకం మహావిష్ణుం ప్రతి ధరణ్యువాచ. 23

శ్లో॥ శరణముపగతాఽహం త్వాం శరణ్యం జనానాం
నిఖిలభయవియోగం యోగిచింత్యం మహాంతమ్
సురరిపుగణభారం దుస్సహం దుర్భర మ్మే
పరిహర పరమాత్మన్ భక్తిసిద్ధైక మూర్తే. 24

14 సౌరాష్ట్రరాగము - ఆదితాళము

ప. శరణం భవ కరుణాం మయి / కురు దీనదయాళో
కరుణారసవరుణాలయ / కరిరాజకృపాళో
అ. అధునా ఖలు విధినా మయి / సుధియాసురభరితం
మధుసూదన! మధుసూదన! / హర మామకదురితం
1. వరనూపురధర సుందర / కరశోభితవలయ
సురభూసురభయవారక / ధరణీధర కృపయా
త్వరయాహర భర మీశ్వర / సురవర్య మదీయం
మధుసూదన! మధుసూదన! / హరమామకదురితం

9. అరసి బ్రహ్మవిద్యాలక్షణ మెరుగ జేయుమంత్రమే
మరిఘోరసంసారబాధ తరియింపన్ మేల్ తంత్రమే
10. దురితములనునిరుల నెల్ల తరచుసూర్యుని తేజమే
వరనారాయణతీర్థు బ్రోచు హరినామత్రయరాజమే

వ. ఇట్లు సనకాదులచే ప్రశంసింపబడిన దివ్యనామధేయములు గల భగవంతుడు శేషశయనమునందు నెలయువాడు, ఈరీతి ప్రత్యక్షమగుట అభినయింపబడుచున్నది. 22

13 వ కీర్తన - శ్రీమన్నారాయణుని వర్ణన.

వెలసె నెల్లజగములన్ వెలయ జేయునాథుడై
చిలువ రేనిపాన్పుపై తొలియ నడిమి కడలపై
అలరి శేషమాన్యుడై గొలుచు మునుల సేవకై
కలిమి యిలల వలపునై ఘనత విష్ణు వెలుగుపై

వ. ఇట్లు భగవంతుడు ప్రసన్నుడుకాగా, సాష్టాంగనమస్కారపూర్వకముగ భూదేవి శ్రీమహావిష్ణువునకు, శరణు విన్నవించుకొనెను. 23

తరళము :—శరణు! జీవులకున్ శరణ్యుడ! సర్వభీతినివారణా!
వర! మహాత్మ! యోగిసేవన! పక్షినాయకవాహనా!
సురవిరోధిసమూహభారము, జూడు! దుర్భరమాగదా!
పరిహరింపుము; దుస్సహంబిది! భక్తమనోరథా!

14 వ కీర్తన - భూదేవి శరణము.

ప. కరుణింపుము శరణంటిని హరి! దీనశరణ్యా
కరిరాజును కృపగాచిన కరుణాబ్ధివరేణ్యా
అ. ప. విధిగా నొదవెను నాకదె వికటాసురభరమున్
మధుసూదన! తొలగింపుము మత్ పాప నికరమున్
1. నును పెండెరమున పాదము గొనువిప్రసురాళిన్
గని యిమ్మొభయమ్మున్ దయ కరకంకణకేళిన్
విను భూధర! దేవేశ్వర! పెనుభారము జాలిన్
చన జేయుము మధుసూదన! సరగన్ బాపాళిన్

2. ఘృణిమండలమణికుండల ఫణికుండలశయన
అణిమాదిసుగుణభూషణ మణిమంటపసదన
వినతాసుతఘనవాహన మునిమానసభవన
మధుసూదన! మధుసూదన! హరమామకదురితం

3. అరిభీకర హలిసోదర పరిపూర్ణసుఖాబ్ధే
నరకాంతక నరిపాలక పరిపాలితజలధే
హరిసేవక శివనారా యణతీర్థపరాత్మన్
మధుసూదన! మధుసూదన! హరమామకదురితం.

—♦ బ్రహ్మాదులు భగవంతుని స్తుతించుట ♦—

శ్లో॥ ఇతి వివిధవచోభిః ప్రార్థయంత్యాం ధరణ్యా
మఖిలభువనమిత్రం శత్రుసంహారమీశమ్,
విధిముఖసురవర్యాస్తుష్టువుర్విష్ణుమాద్యం
నిఖలనిగమవేద్యం స్వార్థసంసిద్ధిహేతుమ్. 25

శ్లో॥ క్షీరాబ్ధిమధ్యభుజగేంద్రమహాసనాయ
దేవాయ నాభికమలోదితపద్మజాయ,
యోగీంద్రభావ్యగగనామలనిత్యబోధ
భూమాభిధాయ పురుషాయ నమః పరస్మై. 26

15 శంకరాభరణ (ఆనందభైరవి) రాగము - త్రిపుటతాళము.

ప. నారాయణాయ నమో మాధవాయ

అ. నాగేంద్రశయనాయ నందితాఖిలలోకాయ

1. నాభికమలజనితవిధిముఖాయ - నూతనజలధరాభాయ
నానాచరాచరనారీనరరూపాయ
నారదాదిమునివర్యనందితఘనమాయాయ

2. అగణితగుణగణాయఆగమగేయాయ - విగళితభయశోకాయ
గగననిర్మలబోధగంభీరభావాయ
భగవద్భక్తహృదయపద్మభానురూపాయ

2. మణికుండలములు శోభిల ఫణి కుండలి పైనన్
అణిమాదికశుభసిద్ధుల గుణధామములోనన్
క్షణమాఖగపతిపై ముసి మునిజనముల్ ముదమూనన్
రణధీరత మధుసూదన రారమ్మ బిరానన్
3. అరివర్గము నణగింపగ గురుసౌఖ్యము జేర్పన్
నరకంబును నరులొందని పరిపాలనఁ దీర్పన్
వరనారాయణతీర్థుని పరమార్థము గూర్పన్
హరి! పూనుము రామానుజ నవతార మెలర్పన్

గీ. సకలభువనావనుని శ్రీశు శత్రునాశు
చాలగా నిల్లు భూదేవి సన్నుతింప
బ్రహ్మదేవతల్ పొగడిరి, పరమపురుషు
ఆద్యు వేదవేద్యుని పరమార్థసాధ్యు. 25

సుగంధివృత్తము

క్షీరవార్ధిమధ్యవెల్గు శేషతల్పశాయికై
సూరిభావ్య భూమనామ శుద్ధలోకియాయికై
సారసాత్మ నాభిజాత సర్గసంవిధాయికై
శౌరికై నమశ్శతాళి సర్వభద్రదాయికై ?

15 వ కీర్తన - దేవతలు శ్రీమన్నారాయణుని వేడుట.

ప. నారాయణుని మ్రొక్కెదన్ - శ్రీరమణుని

అ. ప. నలుదెస జగములెల్ల నారాయణుని యగుచు నేయు

1. నలువ మున్నొదవిన నాభికమలమున ... లిమబ్బు నిలిపిన
పలుతీర్ల వస్తుజీవులు నాలుమగలన
నలరు మాయ దీర్చు నారదాది మునులే బొగడువాని

2. బహుసద్గుణముల నీ-పాటల వేదముల్ భయశోకములను దోల
మహనీయ భావనిర్మలత గగనము బోల
విహితభక్తహృదయ కమలవిశ్వసూర్యుడౌ వాని

3. కరధృత రథచరణ కంబుపంకజ – కౌమోదకీ శార్ఙ్గాయ
నిరవద్యగళశోభి నిజకౌస్తుభ భూషాయ
పరిహృత పరపక్ష పక్షిరాజ వాహాయ

4. జగదేకనాథాయ జాతమదనాయ – జితవైరిమండలాయ
నిగమ నిశ్శ్వాసాయ నిత్యానంద రూపాయ
నిరుపమ గోకుల నీత నవనీతాయ

5. ఆమయాదివిరహితాయాఖిలమాయాయ – కామకోటి సుంద[రాయ
నామరూపరహితాయ భూమస్వరూపాయ
సోమసూర్యనయనాయ సామగానగేయాయ

6. వారిజలోచనాయ వాసుదేవాయ – వరమునిపారిజాతాయ
కరుణాకరభక్తకారుణ్యసారాయ
నారాయణతీర్థ నత చరణాబ్జాయ

శ్లో॥ ఇతి స్తుత్వా జగన్నాథం కృతాంజలిపుటాస్సురాః,
ముహుర్ముహు ర్నమంత స్తమూచు శ్చాత్మహితం వచః. 27
శ్లో॥ భగవా నపి తా నాహ భక్తినమ్రా నసౌ సురాన్,
అవతీర్య యదో ర్వంశే కరిష్యామి హితం తు వః. 28

క. ఇత్యేవం భగవతో వాసుదేవస్య వదన సుధానిధిగళితాం స్ఫుటతర పదరసమనోహారాం వచనసుధాధారాం సురభూసుర బలాధారాం శ్రవణాంజలిపుటైః పాయంపాయం – శనైః శనైః స్వస్వభవనాభిముఖాః – తచ్చరణస్మరణ చంద్రికాపనోదితశోక మోహా నలాంధకారాః – చతురాననా ద్యయ స్సర్వే

3. కమలంబు శంఖచక్రములు-కత్తియు విల్లుగదహస్తముల దనర
రమణీయ కౌస్తుభ రత్నంబు మెడనొనర
విమతులెల్లరు పాఱ విహగేంద్రుపై వాని

4. జగతికెల్ల విభుడై స్మరునిగన్నవాడై శత్రులపై విజయుడై
నిగమంబులే శ్వాస నిత్యానందమే రూపు
నెగడ గోకుల నవనీతంబు గొనువాని

5. కలకలేక మాయ నెలసి-మన్మథకోటి గెలుచు నందముతోడ
నెలవు పేరు రూపు కొలమీరు భామతోడ
జలజారియు రవియు కనులౌ సామగాన వినుతివాని

6. వారిజనేత్రుడవై వాసుదేవుడవై ముని - వరుల పారిజాతమై
సారమౌ కృప భక్తజనుల నేలనౌవాని
నారాయణతీర్థు లెంచు నవ్యపాదాబ్జములవాని

కం. అని సురలు జగన్నాథున్
వినుతింపుచు నంజలులను వేమరునిడుచున్
వినతులు సల్పుచు తమతమ
మనవు లొనరజేసికొనిరి మాధవు నెదుటన్. 27

కం. సురలన్ భక్తివినమ్రుల
నరయుచు భగవంతు డనియె నవతారమునే
ధరపై యదువంశంబున
బరపి, యొనర్చెదను మీకు భద్రము హితమున్. 28

వ. ఇట్లు భగవంతుడౌ వాసుదేవుని వదనమను అమృతంపునెలవు నుండి స్రవించునదై వివరమైనమాటలరుచిచే మనోహరమైన దైన వాక్సుధాధారను దేవతలకు బ్రాహ్మణులకు బల మొసంగుదానిని చెవులను దోసిళ్లచే గ్రోలిగ్రోలి నెమ్మదిగ నెమ్మదిగ తమ తమ గృహములకు అభిముఖులై, ఆస్వామి యొక్క పాదములస్మరణయను వెన్నెలచే శోకము, మోహము అను చీకట్లు తొలంగినవారై బ్రహ్మమొదలు సర్వదేవతలు

గీర్వాణాః - కరతలకలిత కపిత్థోపమం స్వకార్యం మన్వానా
స్సంపూర్ణమనోరథాః - స్వస్వభవన మావివిశుః. 29

మథురానగర వృత్తాంతమ్

శ్లో॥ దదౌ కంసాయ దేవక్యాశ్శిశుం ప్రథమజం నృపః
అష్టమం స రిపుం మత్వా దదౌ కంసఃపున శ్శిశుమ్. 30

శ్లో॥ తద్వృత్తం నారదో జ్ఞాత్వా త్వరయా కంసమందిరమ్,
సమాగతో నిమిత్తజ్ఞ శ్శిశూనాం నిధనం ప్రతి. 31

అథ నారదాగమనమ్—

16 దరువు - పంతువరాళిరాగము - రూపకతాళము.

నారాయణ నారాయణ నారాయణేతి సతతం
వారంవారం గాయన్ భక్త్యా నారదోఽయం విరాజతే

అథ కంసంప్రతినారదవచనమ్—

శ్లో॥ అష్టానా మష్టమత్వే తు న విశేషోస్తి కశ్చన,
ఉపేక్షసే కథం మూఢ యత్కర్తవ్యం కురుష్వ తత్. 32
ఏవ ముక్తో నారదేన షట్సుతా నవధీ త్ఖలః,
సంకర్షణస్తు రోహిణ్యా మానీతో యోగమాయయా. 33

—♦ శ్రీకృష్ణావతారఘట్టము ♦—

అథ భగవదావిర్భావః—

17 దరువు - మధ్యమావతీరాగము - ఆదితాళము

శంఖీ చక్రీ గదీ పద్మీ శార్ఙ్గీ కిరీట కుండలీ
శ్రీవత్సకౌస్తుభీదివ్య - పీతాంబరో విరాజతే

అరచేత లభించిన వెలగపండువలె తమ కార్యములు సిద్ధించినట్లు తలంచి సంపూర్ణమైన మనోరథముకలవారై తమ తమ లోకము లకుఁ జనిరి.

—♦ ఇంతలో మథురాపురములో జరిగిన వృత్తాంతము ♦—

కం. తొలి గలిగిన తమ శిశువున్
తొలకక వసుదేవుఁడొసగ, తోడనె కంసుం
డల శిశువు నిచ్చె క్రమ్మర
యలుగక, "యెన్మిదవ శిశువె యరి నా" కనుచున్. 30

కం. నారదు డిది గని వడిగా
చేరుకొనుచు కంసునగరు "శిశువుల వధచే
దీరును పూర్వనిమిత్తం
బీరహి" నని లోకహితము నెంచి విధిగతిన్ 31

16 వ కీర్తన - నారదమహాముని వచ్చుట.

నారాయణ! నారాయణ! నారాయణ! యని యేతతిన్
తీరా తీరా పాటలభక్తిన్ - నారదుడు వచ్చె నీతతిన్

వ. అంత కంసునితో నారదు డిట్లు పల్కెను.

మ. "ఎనమండ్రందున పిన్నవాని నొకనిన్ హింసించినన్ లాభముం
డునె? కర్తవ్యము నిట్లుపేర్కఁ గనుమాధుండెవదు వే?" యన్నమా
ని నియుక్తిన్ గొని, కంసుడాతనయు, వానిన్ బోలె నా దేవకీ
తనయాళిన్ మరినైదుమందినట నిర్దాక్షిణ్యుడై చంపగన్. 32

గీ. ఘనత దేవకీ సప్తమ గర్భమందు
నొనరు సంకర్షణాంశను యోగమాయ
మార్చె, దేవకీ సవతియున్ మాన్యయైన
రోహిణికి, తా యశోదలో రూఢి నెనసె. 33

—♦ శ్రీకృష్ణుడు అవతరించుట ♦—

వ. అంత అవతరించిన భగవంతుడు ఇట్లు వెలసె—

17 వ కీర్తన.

లలిపీతాంబర కిరీటకుండల - ములు, గద, శంఖము చక్రముతో
జలజకౌస్తుభ శ్రీవత్సములతో - వెలసెను శ్రీహరి శార్ఙ్గముతో

శ్లో॥ హరి రథ నిజశక్త్యా మూర్తి మాస్థాయ దేవః
ప్రకటిత నిజరూపః ప్రాదురాసీ న్ముకుందః,
యదుకులవర గేహే దేవకీ గర్భవాసా
న్ముదిత మమరబృందం దేవమస్తౌ దనంతమ్. 34

— బ్రహ్మాదులు కృష్ణు నుతించుట —

శ్లో॥ కల్యాణం వితనోతు కౌస్తుభమణిం కంఠే దధాన శ్శిశుః
కల్యాణీ మపి మే కరోతు శుభదాం వాణీం ప్రవీణాం ధియం
దేవక్యా వసుదేవ యాదవపతే శ్శంఖీ రథాంగీ గదీ
పద్మీ నందక శార్ఙ్గ చాపమకుటీ పీతాంబరః కుండలీ. 35

18 కల్యాణిరాగము - ఆదితాళము.

ప. జయ జయ శ్రీనివాస జయ జీమూతాభ - జయ జయ
అ. భయ కారణ వినాశ భక్తమానస నివాస
1. కమల దళ నయన కనకమయ వసన
రమణీయ చంద్రానన రంజిత భువన
కమలావల్లభ దీన కామిత ఫల నిదాన
కామకోటిసమ మోహన
మంజులకంజవదన మహామోహామథన
మంగళఫలదాన మానీంద్రబృందాధీన

మత్తకోకిల : అంత శ్రీహరి దేవదేవుడు నాత్మశక్తి సుమూర్తియై
ఎంతో తేజమునన్ ముకుందుడు నిద్ధరూపున దేవకీ
కాంతగర్భము పండ యాదవకాంతు లోగిట నుండగా
సంతసంబున దేవబృందము సంస్తుతించి రనంతునిన్ .34

సీ. వరకిరీటమ్ము మేల్ శిరముపై నలరార
కుండలమ్ములు కర్ణకోటి దనర
కంఠహారమునందు కౌస్తుభ శ్రీ వెల్గ
శంఖ చక్రాంబుజ శార్ఙ్గచాప
కౌమోదకీ నందక ప్రముఖాయుధ
వర్గలక్షణహస్త వైభవమున
నవ్యపీతాంబర నైగనిగ్యమ్మున
క్రమ నీలశరీర కాంతు లొనర
మాన్యతమమైన తన మహా మహిమ నెన్న
మాకు శుభవాణి, కల్యాణి, ధీకళాప్తి
దేవకీ వసుదేవుల దివ్యశిశువు
శిష్టకల్యాణనిధి దయసేయుగాక.

18 వ కీర్తన - శ్రీనివాసస్తుతి.

ప. జయ! జయ! శ్రీనివాస! జయ మేఘభాస- జయ! జయ!

అ. ప. భయములు నశించగ భక్తులు నిన్నెంచగ

1. కనుదమ్ములు దనరగా కనకవసన మొనరగా
నునుశశి మో మొనయగా జనులు దనియగా
వనజాలయ దేవిగా వరములొసగె దీవెగా
మనోజుని నెంతో మింతుగా
ఎనయు మోము తమ్మిగా హెచ్చు మోహ మణగగా
మొనయు ఫలము లిత్తుగా మునులు నీకు పొత్తుగా

2. సుందరచరణార వింద మణినూపుర
మంజుళముక్తాహార మందరధర
కుందరదన సుర వందిత మనోహార
చంద్రికాసమస్మేర బాల
నీరద ఘననీల పారా వార విహార పర
పాలిత భూరాది లోక నికర

3. విపులపుండరీకాక్ష విశ్వ సంత్రాణ దక్ష
అపహృతాసురపక్ష ఆర్తసంరక్ష
తాపసజనరక్ష తారణాధ్వరదీక్ష
ఆపదుద్ధార కటాక్ష
అశేషదుష్టశిక్ష నానానిగమలక్ష
నారాయణతీర్థ పక్ష శ్రీగోకుల సంరక్ష

శ్లో॥ దేవక్యాశ్శిశుభావ మేత్యభగవాన్ నారాయణః శ్రీపతిః
సర్వజ్ఞానమహాలభూతి సహిత స్సత్పార్థనైః కర్మభిః,
ఆదిత్యేందుసహస్రకోటిసదృశా భాసా గృహం భాసయన్
పిత్రో స్స్నేహసుధామహోదధిశశాంకోఽుదయం హరిర్గీయతే.

— దేవకీవసుదేవులు కృష్ణు స్తుతించుట —

19 కేదారగౌళరాగము – ఆదితాళము.

ప. మంగళాలయ మామవ దేవ పంకజాసనభావితభావ

1. దేవకీవసుదేవ తనూజ దివ్యకిరీట దళిత భవబీజ
సర్వయోగి విచింత్య పదాబ్జ సంగతాఖిల సాధుసమాజ

2. అపరిమితానంద బోధస్వరూప అతికరుణాకర కర ధృతచాప
కపటదైత్యహార ఖండితపాప కనకాంబరధర కలిత కలాప

3. మకరకుండల కేయూర విభూష మనసిజశతకోటిమంజులవేష
వికచ కమలసన్నిభ విపులాక్ష విమలహృదయ గోపాలక రక్ష

4. కలిత శ్రీకౌస్తుభ కమనీయకంఠ కరుణారస భర మిళిత వైకుంఠ
పరిపాలయ భువి భాగ్య వితరణ గురుభక్తనారాయణతీర్థశరణ

2\. వెలయు పాద పద్మముల కల మణుల యందెల
తెలిము త్యపు సరముల తేల్చి మంధరముల
లలి మొల్ల పల్వరుసల నలరు సురల వినతుల
నెల కల చిరునవ్వు దేల బాలా
నలుపు మబ్బులవిగ్రల పాల దొలకు జలధి నోలి లీల
మెలగు నెల్ల భువన జాల ముల నేలు చాల

3\. విరితామర కనుల మించి విశ్వసంత్రాణమెంచి
అరుతా రాక్షసుల నొంచి ఆర్తుల రక్షించి
అరసి మునుల మంచి అధ్వరముగ గాంచి
కరుణ నాపన్నుల కటాక్షించి
దురుసుల శిక్షించి తొలివిద్యల లక్షించి
వరనారాయణతీర్థుల సిరి గోకులమున పెంచి

శా. జ్ఞానాధిక్య విభూతులన్నిగల యానర్వాత్మ లక్ష్మీశుడా
శ్రీనారాయణమూర్తి సచ్చరితచే శిష్టార్తిచే ప్రీతుడై
తా నా దేవకిసూనుడై జనక వాత్సల్యాబ్ధి శీతాంశుడై
పూనెన్ కోటి సహస్రచంద్రరవులై పుట్టింట సారూప్యమున్.

19 వ కీర్తన — దేవకీవసుదేవులు స్వామిని దీవించుట.

ప. మేలా నెలనై—ఏలుమా దైవమై—హేలనలువనిను—నెంచును సేవమై

1\. భవ్యమునులు నీపదముల నెంచగ — భక్తులసంగతి భవదళితుడవై
దివ్యకిరీటపుదీప్తిని వెలసెదు — దేవకీవసుదేవ సుతుడవై

2\. కనకాంబరమున దనరుపింఛమున — కరుణానందాఖండుడవీవై
దనుజుల దుష్టుల దండించుటకా? — కనుపించెను ఘనకరచాపుడవై

3\. గురుకుండలముల నెరిభూషణములసురుచిర వేషముమరుమరిమించన్
విరితమ్మికనుల సరసస్మితవదనమున—వర లెదుగోకులపరతవహించన్

4\. కరుణాఖండవు కలుములొసగెదవు—వరకౌస్తుభగళ! వైకుంఠపతివి
హరిభక్త నారాయణతీర్థు నేలగ—ధర పాలింపగ పరమమా గతివి.

శ్లో॥ అలౌకిక మిదం రూప మాలోక్యానకదుందుభిః,
హారే స్వభార్యః ప్రోవాచ కంసా ద్భీత స్తనన్యధీః. 36

శ్లో॥ సర్వాధార రమాంపతేఽథ భవతా తచ్చింతనీయం విభో
యత్క ర్తవ్య మశేష శేషవిభునా బ్రహ్మాద్యైరత్రావిధౌ,
ఏవం రూప మమానుషం మునివరధ్యేయం సమాచ్ఛాదయ
స్వామిన్ మానుషబాలభావ మధునాస్సందర్శయాస్మాన్ ప్రతి.

20 ముఖారిరాగము - ఆటతాళము.

ప. రక్ష రక్షాసురశిక్ష రాజీవదళాయతాక్ష

అ. అక్షీణకృపాకటాక్ష ఆశ్రితపక్ష సంరక్ష

1. సర్వమనోరథాధ్యక్ష సర్వలోకావనదక్ష
సర్వవేదాంతైకలక్ష సర్వయోగీంద్రసంరక్ష

2. అప్రమేయ బలవీర్య అనుపమ మహౌదార్య
అపరిమిత గాంభీర్య అవ్యయాఖండితైశ్వర్య

3. అచ్యుతానంత గోవింద అత్యంతనిర్మలానంద
విచ్యుతసంసారకంద విశ్వమంగళ ముకుంద

4. పతితజనపావన పంకజసుందరానన
పతగపతివాహన పండితపరిపాలన

5. తానకరూప ముదారం ధారయ శాంతసంసారం
దర్శయ మానుషాకారం దేవ బాలకశరీరం

6. చింత యాథ యద్విధేయం చేతసా చిర మనుభావ్య
అంతరాయోమాభూదద్య ఆగమబృందసంవేద్య

7. అద్యమే జన్మసాఫల్యం అద్యమే వంశ నైర్మల్యం
సద్య ఏవ సమజని సంభూతే త్వయి భూమని

8. కలి కల్మష నాశనం కామితఫలనిదానం
నారాయణీయచరితం నారాయణతీర్థగీతం

ఆ. వె. లోక గరిమమించు శ్రీకాంతు తేజంబు
దివ్యరూపము వసుదేవుడు గని
కంసువలన భయముగలిగి దేవకిగూడి
నిశ్చలంపు భక్తి నెగడి వేడె. 37

మత్తకోకిల: మాయెడం దయదాల్చు తండ్రి! సమస్తచేతన నాయకా
చేయనోపని యార్యరక్షణ, చిత్తగింపు రమాపతీ!
ఈ యమానుష దివ్యతేజము నింక దాచుము; సన్ముని
ధ్యేయ! మానుష బాలలీలలఁ దేలి, దర్శన మీఁగదే! 38

20 వ కీర్తన - దేవకీవసుదేవులు తమకు జనియించిన స్వామిని ప్రార్థించుట.

ప. కావు! కావు! ఖలులద్రుంచి కంజదళనేత్రముల గాంచి
అ. ప. బ్రోవుమమ్ము కటాక్షించి నీవారిపక్షము వహించి
1. మనోరథములకెల్ల పతివి మరి లోకముల గాచు ధృతివి
ఘనవేదముల లక్ష్యోన్నతివి మునులకెల్ల నీవే గతివి
2. అనితరము నీబలశౌర్యమ్ము అపరిమితమౌ గాంభీర్యమ్ము
అనుపమము నీయౌదార్యమ్ము అవ్యయము పూర్ణైశ్వర్యమ్ము
3. తరుగుకొనలేకే శుభమంద వరలగ నానందము గోవింద
మరిసంసృతిమూలముతుదిజెంద నెరపెదు మేల్జగములకు ముకుంద
4. దీనుల సముద్ధరింతువు తేజరిలు మోమున మింతువు
వైనతేయు నారోహింతువు జ్ఞానుల పరిపాలింతువు
5. ఈయుదారాద్భుతమౌరూపు ఎటులగన మాకన్నులోపు
నీయవతారము మాకు ప్రాపు నెగడింపవె నర బాలురూపు
6. వేదమెరిగి వెలయుచుందు వేదిచిరమను భవమునందు
భేదమొందక మదికి చెందు ప్రేమతో సెల వీదగునందు
7. నేడే మా జన్మము సఫలము నేడే మావంశము నిర్మలము
నేడు నీ యవతారమున ఫలము నెగడె, భూమ! శుభములకూలమున
8. దూరమౌ కలియుగదురితము కోరికల మేల్గూర్చు నిరతము
నారాయణుని జన్మచరితము నారాయణతీర్థ విరచితము

—♦ వసుదేవుడు భగవత్ప్రేరేపణచేఁ గృష్ణుని గోకులమునకుఁ జేర్చుట ♦—

శ్లో॥ ఇతి నిగదతి తస్మిన్ యాదవేంద్రే సభార్యే
భవభయతిమిరారిర్దేవకీభాగధేయమ్,
సకలనిగమగుహ్యం దర్శయన్ స్వీయభావం
పరమకరుణయాతౌ సాంత్వయన్నేత దాహ.

21 వ పూరికల్యాణీరాగము (సావేరి) - ఆదితాళము.

ప. అవధారయ మా మీశ్వరం దేవాదిదేవం - అవధారయ

అ. తవ తాత తపసా సంతోషితో౽హం
తావకతనయాత్మనావనౌ సమవతీర్ణాఖిలసారం

1. ఆగమాంతైకమానక మనన్యభావం
అగణితలోకనాయకం
విగళితమోహ మేకం విమలయోగితారకం
గగనాకారక మేకం గతాగతనివారకం

2. మధురాపురం సమానయ మామక యోగ
మాయా మిహ నిధాపయ
అథ గోకులే నయమామ - నవద్యానందాలయం
విధినా కృతనిలయం వివిధయోగిసుగేయం

3. సంకర్షణాఖ్య మవ్యయం సాధువిధేయం
సంభూత మాశ్రితాభయం
శృంగారాదినిలయం శ్రీరామనామధేయం
సంగతం మత్సహాయం సర్వలోకాభ్యుదయం

4. సురవైరిభూరిసంకులం ధరణీతల మిద మ
సురహరణోద్యమం
పరిభావయ మామితి పరమాత్మగీత మిహ
వరనారాయణతీర్థవిరచిత మేత దితి

శ్లో॥ సుప్తేషు కంసదూతేషు ద్వారే షూద్ఘాటితేషు చ,
మదాజ్ఞయా యమునయా దత్తమార్గేణ మాం నయ. 40

కం. యాదవ ముఖ్యు సతనిసతి
నాదరమున భవభయాపహారి గని కృపన్
వేదరహస్యము దేవకి
మోదమునౌ తనసురూపమును జూపి యనున్. 39

21 వ కీర్తన - అవతరించిన భగవంతుని ఆజ్ఞ.

ప. దేవాధిదేవు నీకు - నను - భావించి తండ్రి! విను

అ. ప. నీవిమల తపమును - నిండె నామెప్పును
నేవిశ్వరూపుడను - భువి - మీ వరతనయుడను

1. ఎల్ల వేదాంతముల - నేకభావము నేను
ఎల్లజగముల పతినేను -
ఎల్లభ్రాంతులదీర్చి - హితము యోగుల కిత్తు నేను
ఎల్లయాకాశ మేను - ఏకర్మజన్మరాసీను

2. యోగులెల్ల కీర్తించు - నా గోకులమందు మించు
బాగా నందునింటికి ననుగొంచు
నేగు మది నా నెలవంచు - నేర్పాటు, నన్నటపెంచు
వేగ నిట మధురకు నా - యోగమాయను దెచ్చియుంచు.

3. వెలసె సంకర్షణుడు - బలరాము సరసికుడు
చలింపని నాసహాయుడు -
కలిమి లోకములకెల్ల - కలిగించు ధీరుడు
లలి సాధుపరుడాశ్రి - తుల కభయాధారుడు

4. ధరయెల్ల రక్కసుల - కిరవై గడు కలతల
దొరకొంట హరింతు ఖలుల
పరమాత్మ నేనంచు - నరయుడీ గీతముల
వరనారాయణతీర్థు - సరసమౌ రచనల

ఆ. వె. గాఢనిద్రవోవు కంసదూతల దాటి
ప్రోలుఘనకవాట వితతి దాటి
తగ మదాజ్ఞ దొరకు దారి యమున దాటి
గొనుము మము నయింపు, గోపవాటి. 40

శ్లో॥ ఇతి కథితవ తీశ్వరే లక్ష్మైవ
ప్రణయవశా దకరో ద్యదుప్రవీరః,
సుఖ మధివ సతిస్మ గోకులాఖ్యం
హరి రఖిలాంతరచిత్రభోపి మాయయా. 41

— ♦ దు ర్గా వి లా స ము ♦—

అథ మధురాయాం య ద్వృత్తాంత దుపవర్ణ్యతే—

గ. స ఖలు నరపతే దుగ్రసేన స్యాగ్రిమసూనుః - సమధిగతాసుర ప్రకృతికః - కంసాసురనామా - అవినయ దుర్విభావ్య గర్వమ దాంధకార పరిభూత వివేకదర్శనః - పరిహృత కాలనేమి కళేబ రోప్యపరిహృత తద్వాసనాజాల పరివేష్టితః - నిజపరిజనైస్సత్వర మవబోధిత స్సన్ - అతిమందగతి ర ప్యమందగతిః - దేవక్యా స్త్వష్టమో గర్భః కంసమృత్యు రిత్యశరీరవాక్యం శ్రుత మనుసం దధానో - వేపమానో వసుదేవ మందిర మిందిరా సుందర మా జగామ. 42

శ్లో॥ భాగినేయీ మసౌ దృష్ట్వా దుష్టాత్మా తత్ర మందిరే,
గృహీత్వా పాద మేతస్యాః క్షేప్తుం భూమౌ మనో దధే. 43

శ్లో॥ పదా సంతాడ్య కంసం సా యోగమాయా సుదుర్జయమ్,
అంతరిక్షం గతా విష్ణో ర్దుర్గా భూత్వా స్తుతామరైః. 44

దు ర్గా స్త వ మ్

శ్లో॥ దుర్గే దుర్గతహారిణి త్రిజగతాం సర్గాదిసిద్ధార్థకే
స్వర్గాదీష్టఫలప్రదాననిపుణే త్రాయస్వ నశ్శాంకరి,
సా త్వం సర్వజనాంతరాంతరచిదంశానన్యసిద్ధాత్మికా
సారాసారవివేకదృష్టివిదితా సర్వైకసాక్ష్యాత్మనా. 45

కం. భగవంతు నాజ్ఞ భంగిగ
నెగడించె యదుప్రవీరనిధి ప్రేమమునన్,
జగదంతర్యామియు సుఖ
ముగ గోకులమందు గోప్యముగ వసియించెన్. 41

వ. అంత మధురానగరములో జరిగిన వృత్తాంతము వర్ణింపబడును. ఆమధురానగరమునకు రాజు ఉగ్రసేనుడు. అతని పెద్దకుమారుడు, రాక్షసాంశగలవాడు, కంసాసురుడనుపేరు గలవాడు, అవినయము మిగుల గర్వము అను అంధకారముచే కప్పబడి వివేకదృష్టిలేని వాడు, వెనుకటికాలనేమి కళేబరము పోయినను ఆ జన్మయొక్క దుష్టవాసనలచే చుట్టబడ్డవాడు, తన పరిజనులచే (శ్రీకృష్ణజన్మ గురించి) వెంటనే తెల్పబడ్డవాడై తొట్రుపాటున తీవ్రముగా నడచుచు మరల మందముగా నడచుచు ("దేవకీదేవి యొక్క ఎనిమిదవ కాన్పు కంసునికి మృత్యు వగును") అను అశరీర వాక్కును మరల మరల జ్ఞప్తికి తెచ్చుకొనుచు, కలఁగుచు వసుదేవుని మందిరమును సిరులచే నలరుదానిని సమీపించెను. 42

ఆ. వె. పురిటి యింటిలోన వరలు బాలను గని
భాగినేయి యనక పదములూని
కఠినకర్ముడైన కంసుండు భువిపైని
నురిమి చంపఁదలచె కరుణమాని. 43

తరళము: అదియు విష్ణు యోగమాయ, యనఘదుర్గ కంసునిన్
పదముఁ బెం. కూలదన్ని, భవ్య తేజ మొప్పగా
నొదవె నంతరిక్షమందు నుర్వి ఖలులు బెగడగా
ముదముతోడ నమరులెల్ల మొనసి సన్నుతింపగా. 44

శా. దుర్గా! దుర్గతి బాపి కావుము మమున్, తోడన్ త్రిలోకాళికిన్
సర్గక్షేమలయాధి దేవివగుచున్ సర్వాంతర వ్యాప్తిమై
స్వర్గాతీతములౌ ఫలంబులొసగన్, సారార్థ విజ్ఞాన సం
సర్గా! శాంకరి! సర్వసాక్షివిగదా! సానందభక్తిప్రదా! 45

22 ఆహిరీ (కాంభోజి) రాగము - చాపు (అట) తాళము.

ప. జయ జయ దుర్గే జితవైరివర్గే

అ. వియదనిలాదివిచిత్రసర్గే

1. సుందరతరచరణారవిందే
సుఖపరిపాలితలోకబృందే
నందసునందాది యోగివంద్యే
నారాయణసోదరి పరానందే

2. సరసమణినూపురసంగతపాదే
సమధిగతాఖిలసాంగవేదే
నరకిన్నరవరసుర బహుగీతే
నందసుతే నిఖిలానందభరితే

3. కనకపటావృత ఘనతరజఘనే
కల్యాణదాయిని కమనీయవదనే
ఇనకోటి సంకాశదివ్యాభరణే
ఇష్టజనాభీష్టదాననిపుణే

4. అనుదయ లయ సచ్చిదానంద లతికే
ఆలోల మణిమయ తాటంక ధనికే
నానారూపాది కార్యసాధనికే
నారాయణతీర్థ భావిత ఫలకే

శ్లో॥ ఇత్యాది గీర్భిర్గీర్వాణగణైర్గీతా ప్రసాద్యతాన్,
సా వైష్ణవీతి విఖ్యాతా త్రిషు లోకేషు పూజ్యతే. 46

శ్లో॥ దురంతచింతాగ్రాహేణ గ్రస్తోదయం కంసకుంజరః,
అలబ్ధశరణోస్వస్థ స్సదనం స్వీయ మాగతః. 47

ఇతి శివరామానందతీర్థపాదసేవక శ్రీనారాయణతీర్థ విరచితాయాం - శ్రీకృష్ణలీలాతరఙ్గిణ్యాం-శ్రీకృష్ణ ప్రాదుర్భావ వర్ణనం నామ ప్రథమతరఙ్గ స్సమాప్తః.

22 వ కీర్తన - దుర్గాస్తవము.

ప. జయమా! శ్రీకనకదుర్గా! శాత్రవులపై జయమా!
అ. ప. దయతత్త్వములగూర్చు తల్లీ! జయమా.
1. అందమా పాదారవింద యుగముతో
అలరెదు కృపనేలి అఖిల లోకముతో
నంద సునందులను నత యోగి గమితో
నారాయణుని చెలియలా నవ్యానందముతో
2. లలిపాదముల మణు లలరు నందెలతో
వెలయుదు సినుగోల్పు వేదమ్ములతో
చెలగు నర సుర కిన్నరుల గానములతో
అల నందు తనయవై పలువేడుకలతో
3. సరిగె పట్టుచీరె వరలు జఘనముతో
సిరులొల్కు మోముతో చికురభారముతో
మరి సూర్యమించు నగల మహిత తేజముతో
వరము లిత్తువు భక్తపరమా ప్రేమముతో
4. జనన లయముల మించి యనయు మోదముతో
దనరు మణులవెల్గు తాటంకముతో
పనుల దీర్పగదమ్మా! బహు రూపార్థముతో
కను నారాయణతీర్థు కడువాత్సల్యముతో
కం. ఈరీతి సన్నుతించిరి
సారవచోరచనలెసగ శాంకరి నమరుల్,
పేరున వైష్ణవి, యామెను
శ్రీరహిని ద్రిలోకపూజ చెందు ననయమున్. 46
కం. భయపడి మొసలికి లోనై
నయమెఱుగక శరణులేక నవయు కరివలెన్
పయిఁజూడ వెఱచి కంసుడు
మయిమయి తన నగరుసొచ్చె మదిఁ జింతిలుచున్. 47

ఇది శ్రీ శివరామానంద తీర్థులను గురువుల పాదముల సేవించు శ్రీ నారాయణ తీర్థయతీశ్వరులచే రచింపబడిన శ్రీకృష్ణలీలాతరంగిణి యందు శ్రీకృష్ణావతారవర్ణనము అను ప్రథమతరంగము సంపూర్ణము.

శ్రీరస్తు.

# శ్రీకృష్ణలీలాతరఙ్గిణి - సంస్కృతము

## ద్వితీయతరఙ్గము



— బాలలీలాకథాసంగ్రహము —

శ్లో॥ నందగోపశ్చ గోప్యశ్చ యశోదారోహిణీసుతౌ,
రామకృష్ణౌ తయోస్సమ్యగ్లాలనం రామకృష్ణయోః. 1
గర్గాచార్యాభిగమనం తయోర్నామకృతిస్తతః,
పూతనాశకటాదీనాం మర్దనం తదనంతరమ్. 2
నవనీతాదిచౌర్యం చ యశోదాయై నివేదనమ్,
యశోదయా కృతం కృష్ణస్యాహ్వానం ప్రణయాన్ముహుః. 3
ఉలూఖలే దామబన్ధో యమళార్జునభంజనమ్,
యశోదాయాం చ కృతం స్తోత్రం విశ్వరూపప్రదర్శనమ్. 4
యశ [illegible] ప్రదర్శనమ్,
ఇత్యేవం బాలలీలాయాః కథాసంగ్రహ ఈరితః. 5

శ్రీరస్తు

# శ్రీకృష్ణలీలాతరఙ్గిణీ - తెనుగు

## ద్వితీయతరఙ్గము.



—♦ తోహారలు ♦—

నందగోపుడున్ యశోద రోహిణి నందనులన్ బెంచుటయున్
సుందరులౌ గోపికలా బాలుర శుభలాలన గాంచుటయున్ 1
ఆచార్యుడు గర్గుడు వేంచేయుట, అభిధానము లుంచుటయున్
ఏచికృష్ణుడట పూతననొంచుట హెచ్చి శకటుఁ ద్రుంచుటయున్ 2
వెన్నపాలు దొంగిలుట యశోదకు కన్నులు చెప్పించుటయున్
సన్నిధికిన్ శ్రీకృష్ణుని యశోద సారెకు రప్పించుటయున్ 3
అచ్యుతు రోటికి యశోదగట్టుట, యమళార్జున భంజనమున్
విచ్యుతులౌ నాయకుల ప్రార్థన, విశ్వరూప దర్శనమున్ 4
లీలాకృష్ణుని మహిమల యశోద చాల నుతించిన విధమున్
మేలుగ వర్ణింపంబడు నీకథ బాలక్రీడా పథమున్ 5

—♦ నందయశోదాదులు రామకృష్ణుల లాలించుట ♦—

నందస్యాగమనమ్—

1 భైరవిరాగము - ఆదితాళము.

గోపై రనుగతో నిత్యం గోబృందాని విచారయన్
గోపాలకస్వామీ నంద గోపో మహాన్ విరాజతే

2 మధ్యమావతీరాగము - ఆదితాళము

వల్లవయువతీకదంబం ఆయాతి వర మరుణాధరబింబం
శృంగారవిలసిత పృథులనితంబం విఖ్యాతవివిధవిలాసవిడంబం
కరధృత దధి దుగ్ధ కమనీయఫలజాత
నిరుపమ సంతోష నీలకుంతలమిహ

శ్లో॥ పరం పరస్మా దసిపాఙ్కకర్మ
క్రమేణవేద్యం కరణైరవేద్యమ్
నిజేచ్ఛయా ప్రాప్తమనుష్యవేషం
సుతం యశోదా సుఖ మాప దృష్ట్వా. 6

శ్లో॥ ప్రభాతే గోకులే నందగేహే గోకులవాసినః,
ఆవిర్భావం హరే శ్శ్రుత్వా వివిశు ర్నందమందిరమ్. 7

గ. అవతీర్ణే భగవతి గోకులభూమి భాగే తత్రత్య చందన మందార నాగపున్నాగ చంపకాశోక పనస రసాల ప్రముఖాః కుసుమఫల సంపదో దివ్యసౌగంధ గంధిత దిఙ్మండలాః విగళిత మాధ్వీఝురీ సంచరన్మత్త మధువ్రత ఝుంకారాలంకార రమణీయ కుసుమఫల భారానతశాఖాభిః అవనీగతాభిః అత్యంతభక్తినమ్రా ఇవ భగవతో వాసుదేవస్య సాష్టాంగలక్షణం ప్రణామం కుర్వాణాః,

వ. నందుని ప్రవేశము—

1 వ కీర్తన - నందుని వర్ణన.

మందలు మందలు గోవులపై బృందావన గోపాలుగపై
నందగోపు డధినాయకుడై పొందుగ నేలును మహితుండై

2 వ కీర్తన - గోపికల వర్ణన.

గొల్లమిటారులగుంపుల్ వచ్చిరి గొనబౌ కెంబెదవుల సొంపుల్
మొల్లంపు చిరునగుల ముద్దవ పెంపుల్ చెల్లనొయ్యారం పు చిరుగాలుల్కెంపుల్
పెల్లుగ పంపె పాలు పెరుగు పాత్రల పాణుల్!
ఉల్లాస మొనయంగ నొప్పు నీలవేణుల్!

కం. తొలిచేత ఫలము క్రమముగ
తెలియు పరంపరగ, తొలుత తెలియంబడునే?
ఇల, మనుజుడై, నిజేచ్ఛన్
వెలసిన సుతుంగని యశోద వేడుకపడదే! 6

ఆ. వె. తెల్లవారగానె తెలిసె వ్రేపల్లెలో
నందునింట గలిగె నందనుడని
అచట బాలు మాత నరసి సేమమొలుంగ
జానపదులు చనిరి సంతసమున. 7

వ. భగవంతుడు అవతరించగా, గోకులమున అన్నిభూములలో అచ్చ టచ్చటనుండు చందనము, మందారము, నాగము, పున్నాగము, చంపకము, అశోకము, పనస, రసాలము మొదలైన వృక్షములు కుసుమ ఫలసంపదలతో దివ్యమైన పరిమళము దిక్కులయందు వ్యాపించగా, స్రవించుచున్న తేనెల గ్రోలి చరించు తుమ్మెదలు ఝుంకారము సొంపుగా చేయుచుండగ, ఫలముల బరువుతో కొమ్మలు వంగగా భక్తిచేత భూమిని ఆనుకొని భగవంతుడౌ వాసుదేవునికి సాష్టాంగ లక్షణమైన ప్రణామము చేయు చున్నట్లుండెను.

తత్రత్య మాధవీ జాతీ మల్లికాదిలతాః సంతతమందపవన స్పందనవిగళితకుసుమభారైః అవతీర్ణస్య శ్రీభగవతో నారాయణస్య పరమప్రేమలక్షణాం భక్తి మాతన్వంత్యః పుష్పాంజలిం సమర్పయం త్యఇవ స్వకీయప్రార్థనయా సురభూసురకార్యార్థం క్షీరమహోదధేః గోకులమవతీర్ణస్య శ్రీనివాసస్య సంతోషా యాంతరానీత క్షీరసాగర పయోధరాధరేయం అసంఖ్యాత గోరూపధరేతి సాధుభి రుత్ప్రేక్షితా గావః ఖగమృగనారీనరాదయః సర్వే చ జనాః సంప్రాప్తస్వస్వసం పదో బభూవుః. 8

శ్లో॥ అన్యోన్యం వ్రజనార్యో నందస్యాంతఃపురే శిశుం దృష్ట్వా,
ఇతి జగు రావిర్భూతం లక్షణతస్సద్ధి వైష్ణవం తేజః. 9

3 కాంభోజి రాగము - ఆదితాళము.

ప. శ్రీపతి మిహ నందగోపగృహే పర

అ. మాగత మాకలయే - అయే సఖి - ఆగత మాకలయే

1. పరమపురుషచిహ్నం భద్రద మవధారయ
పద్మాంకుశాదిరేఖం - అయే సఖి - పద్మాంకుశాదిరేఖం
పరిపూర్ణభావం ప్రకటీకరోతి దివ్య
పాణిపదాబ్జగతం భజదార్తిహర మమోఘం

2. పశ్య పశ్యాధునా పాదపబృందాని
విశ్వస్య మే వచనం - అయే సఖి - విశ్వస్య మే వచనం
భృశ మివ భూమహా దిశిదిశి సఫలాని
భవ్యసుగంధికుసుమై రతినిబిడాని జాయంతే

అక్కడక్కడ మాధవి, జాజి, మల్లిక మొదలైన పూదీవెలు ఎల్లప్పుడు మందమారుతముచే జారుపట్టి పుష్పములసమూహముగలవై యుండె. అవి యవతరించిన శ్రీభగవంతుడౌ నారాయణునియెడల, పరమప్రేమగల భక్తితో గూడినవై పుష్పాంజలి సమర్పించు నట్లుండెను. వారలప్రార్థనపై, దేవభూసుర కార్యార్థమై పాలసముద్రము నుండి గోకులమునకు అవతరించిన శ్రీనివాసునియొక్క సంతోషము కొఱకు అచ్చటనుండి వచ్చిరా! అనునట్లు సంఖ్యలకు మించినగోవులు పాలసముద్రమువంటి పొదుగులతో వచ్చిన భూమియా అని సాధువులచే నుత్ప్రేక్షింపఁబడగా, పక్షులు, మృగములు, స్త్రీపురుషాది సర్వజనులు సర్వవిధములైన సంపదలతో వర్ధిల్లుచుండిరి. 8

సుగంధి : గోపకాంత లంత చెంతగూడి నందు లోగిటన్
దీపదీప్తి మించు విష్ణు దివ్యతేజు బాలకున్
జూపికొంచు నొండొరుల్ సుశోభితాస్య హాసముల్
ప్రాపుగల్గ, లక్షణాంగుఁ జూడి యాడి రందఱున్. 9

౩వ కీర్తన - గోపకలు, యశోదాకృష్ణునిఁ జూచి మెచ్చుట.

ప. నంద గోపుని యింట - నారాయణుడు కల్గె

అ. ప. అందేగి కనరమ్మ - ఓచెలులార - అందేగి కనరమ్మ

1. వినరమ్మ మేల్నించు - వీని కచ్యుతు లీల
దనరు శుభ రేఖలమ్మ - ఓచెలులార - దనరు శుభ రేఖలమ్మ
తన హస్తపద పద్మ తలముల పరిపూర్ణ
తను వీనిగొల్తుమమ్మ - కష్టములెల్ల - తలగు నిశ్చయమమ్మ

2. రమ్మ రమ్మదె చూడు - రాజిల్లు వృక్షముల్
నమ్మడీ మాటలమ్మ - ఓచెలులార నమ్మడీ మాటలమ్మ
కమ్మనౌ వాసనల్ గ్రమ్మ నల్దిక్కుల
ఇమ్మహి నించెనమ్మ - పూలపండ్ల - కొమ్మను నట్లమ్మ

3. అరవిందలోచనే ఆవిర్భవతి జగ
దతితరా మిహ రమతే – అయేసఖి – అతితరా మిహ రమతే
నిరుపమానంద నిత్యబోధ స్వరూపం
పర మనుగీత మిదం నారాయణ తీర్థయతినా

శ్లో॥ కరిష్యామ శ్శిశోరస్య మంగళాచరణం వయమ్,
స్మరిష్యామః పరం దైవం లక్ష్మీనారాయణం ముదా. 10

4 కేదారగౌళరాగము – ఆదితాళము.

| | |
|---|---|
| ప. కలయ కల్యాణాని | నారాయణ |
| అ. బలభద్రావరజాయ | నారాయణ |
| 1. సరసిజ నయనాయ | సకల లోక హితాయ |
| నరలోకసంభవాయ | నారాయణ |
| శరదిందు వదనాయ | శతమన్మథ సమాయ |
| నిరవధి కరుణాయ | నారాయణ |
| 2. నందగోప సుతాయ | నగరాజధీరాయ |
| సుందరచరణాయ | నారాయణ |
| ఇందిరామందిరాయ | ఈప్సితఫలదాయ |
| చందనాదిగంధితాయ | నారాయణ |
| 3. గురుతర కరుణాయ | గోకుల భూషణాయ |
| పరిజనపాలనాయ | నారాయణ |
| నిరుపమసుందరాయ | నీలమేఘ నిభాయ |
| పరమపురుష లక్షణాయ | నారాయణ |
| 4. నవపల్లవ కరాయ | నవమణిభూషితాయ |
| కవిజననాయకాయ | నారాయణ |
| అవనీవల్లభాయ | ఆశ్రిత వత్సలాయ |
| శివనారాయణతీర్థ | సంసేవితాయ |

3. అరవిందాక్షు డీత - డవతరింపగ జగతి
వరలె మరిమరి యమ్మ - ఓ చెలులార - వరలె మరి మరి యమ్మ
వరనారాయణతీర్థ - గురుయోగి గానంబు
సరిలేని రుచుల దమ్మ - శాశ్వతమైన - పరమానంద మమ్మ

కం. కోరెద మలరుచు లక్ష్మీ
నారాయణు భవ్యకీర్తనము పాటలలో
దీరగ లాస్యము సల్పుచు
నారీమణులార! శిశువునకు మేలొసగన్.

4 వ కీర్తన - గోపికలు బాలకృష్ణుని స్తుతించుట.

ప. అలరారుమయ్య! శుభముల నారాయణా!
అ. బలరామునితమ్ముడవై నారాయణా!

1. నీ కన్నుదమ్ముల చూపు లోకములకు మేలుగూర్చ
గైకొంటి విహలోక జన్మ నారాయణా!
రాకేందు బోలుమోము రతీపతుల కోట్లనేలు
నీకరుణకు మేరగలదె నారాయణా!

2. అందమైన పాదముల ఆ మేరుగిరి ధీరతల
నందగోప నందనుండవై నారాయణా!
చందనపరిమళవక్ష మిందిరాదేవికి నెలవు
చెందజేతువు మేలికోర్కెల నారాయణా!

3. కరుణ నెంతెంతో నింప పరిజనులను పాలింప
వరలెదా గా గోకులమున నారాయణా!
పరమపూరుష లక్షణముల నెరనీలి మబ్బుఁ బోలెదు
సరిగలదె నీసొంపులకు నారాయణా!

4. నునుచిగుళ్ళ బోలుచేతుల నొనరు మణుల నగలు శోభిల
నిను నుతించు కవుల నేలెదు నారాయణా!
కనికరించి భూమి నోముము వినతులందు వత్సలుడవౌ
గొను నారాయణ తీర్థసేవ నారాయణా!

గ. ఇత్యేవం గోకులపురవరనార్యః వాసుదేవ మశేషజగతా మాది కర్తారం నారాయణ మవతీర్ణ మజానంత్యః విష్ణుమాయయా విమోహితాః మానుషశిశు మివ మత్వా తస్యాయురారోగ్యైశ్వర్యాభివృద్ధయే కృతస్వస్త్యయనాః తతోఽన్య మివ నారాయణం ప్రార్థయామాసుః. ప్రాగేవ వాసుదేవ సంకర్షణాఖ్యౌ రోహిణేయౌ గోపీభి స్సంవర్ధిత స్తత్ర విహరతిస్మ.

—♦ గర్గాచార్యుడు బాలురకు నామకరణము సేయుట ♦—

అథ గర్గాచార్యాగమనమ్—

5 మధ్యమావతీరాగము - ఆదితాళము.

నిర్గతమోహతిమిరో నిర్మలమానసోనిత్యం
స్వర్గాపవర్గాధికారీ గర్గాచార్యో విరాజతే

గ. గర్గోపి నిర్గతమోహ తిమిరపటలో దివ్యదృష్టి స్తయో ర్బలభద్ర కృష్ణనామనీ నందేన కిల కారయామాస. 12

—♦ పూతనాగమనమ్—

శ్లో॥ కంసేన ప్రేరితా కాచి త్పూతనా శిశుఘాతినీ,
కృష్ణం స్తనంధయం మత్వా తస్మై స్తన్యవిషం దదౌ. 13
తద్భావం సర్వవిద్ జ్ఞాత్వా స్తన్యపానమిషేణ తామ్,
జఘాన సా పత ద్భూమౌ దర్శయం త్యాసురీం తనుమ్. 14
తతో దృష్ట్వా జగన్నాథం గోపబాల మివ స్థితమ్,
చక్రు స్స్వస్త్యయనం తస్య గోపగోప్యోపి తం జగుః. 15

6 శహన నాదనామక్రియారాగము - జంపెతాళము.

ప. మంగళాని తనోతు మధుసూదన స్సదా
గంగాధరోపి తవ సాపి గంగా

అ. శృంగారవారిధే శ్రీవత్సకౌస్తుభా
లంకార శిశుభావ భయవిభంగ

వ. ఇక నిట్లు, గోకుల పురములో నారీమణులు వాసుదేవుని సకల జగములకు ఆదికర్తను శ్రీమన్నారాయణుని అవతరించినవానిగా, తెలిసికొనక విష్ణుమాయచే భ్రాంతికి లోనై ఆస్వామిని మనుష్య శిశువనియే భావించి ఆయనయొక్క ఆయురారోగ్య ఐశ్వర్యాభి వృద్ధికొఱకు మంగళాచరణములు చేయుచు, శ్రీమన్నారాయణుని వేరుగ ప్రార్థించిరి. అంతకుముందే సంకర్షణ భగవానుడు వాసు దేవుడు, రోహిణీదేవికి జనించి గోపికలచే పెంపఁబడి ఆగోకులము నందే వెలయుచుండెనుగదా!

అంతట గర్గాచార్యునిప్రవేశము—

5 వ కీర్తన.

అజ్ఞాన మను నిరుల నడచు విమల నిత్యచర్యులు
విజ్ఞాన స్వర్గమోక్షము వెలయించు గర్గాచార్యులు

వ. ఆ గర్గాచార్యులును అజ్ఞానమనుతిమిరపటలమును ఛోగొట్టువారై దివ్యదృష్టిగలవారై ఆ శిశువులకు పాలకజనకుఁడో నందునిచే బల రాముడు, కృష్ణుడు అను నామకరణములు చేయించిరి. 12

తోహరలు: కంసుడు పంపగ పూతనయనుశిశుఘాతినియొక్క తెవచ్చెన్
శంసలేక కృష్ణునకు పాలొసగుసాకున విషకుచమిచ్చెన్ 13
సర్వజ్ఞుడు తద్భావము గనుగొని స్తన్యపాన మిష దానిన్
ఉర్విగూల్చె,రాక్షసి పడిచూపెనుఉగ్రమైనతనమేనిన్ 14
దానికడన్ శిశులీల జగత్పతి దనరియాడఁ గని దరికిన్
జానపదులు చనిభయపడి సల్పిరిచాలదీవనలు హరికిన్. 15

6 వ కీర్తన – పూతనను సంహరించిన కృష్ణుని గోకులవాసులు దీవించుట.

ప. గంగాభవాని యా గంగాధరుడు శౌరి
మంగళము నీ కెపుడొసంగెదరు గాక

అ. శృంగారముల కడలి! శ్రీవత్స కౌస్తుభ శు
భాంగ! వర్ధిలు బాల యలఁత లేక

1. అస్తు తే భద్ర మిహ దుస్తరభవాంభోధి
విస్తరభయాపహార వస్తుసుఖద
కస్తూరికాతిలక విస్తీర్ణఫాల జగ
దస్తితాపాదక సదాస్తరహిత

2. అక్షీణసంప దిహ రక్షతు ధరేయ మధ
శిక్షతు హరిస్తవ విపక్షనిచయం
దక్షిణామూర్తిరపి దాక్షిణ్య మావహతు
వీక్షతాం త్వాం సకలసాక్షీ సదయం

3. దుర్గాణి వారయతు దుర్గా సరస్వతీ తే
భర్గోపి భర్జయతు పాపవర్గం
స్వర్గాది సకలసంసర్గ సాధక మిహ
మార్గస్సదావతు త వాపవర్గం

4. పరిపూర్ణ బోధరస పరిపంథిహర సరస
నిరవధిక సంపదం దిశతు భూమా
విరచిత మిదంతు శివ నారాయణానంద
తీర్థేన పరమపురుషార్థ ఫలినా

౫. సా ఖలు నంద గోప మహిషీ యశోదాఖ్యా సకలలోకాధార మనాధార మపరిమిత మహిమాన మప్యాత్త మహిమాన మవకల్ప్య స్వాంక మారోప్య విద్యుత్పుంజమధ్యాభి వ్యక్త నూతన జలధరవద్విద్యోతమానం శ్రీకృష్ణం కరకమలాభ్యాం ముఖాభి మర్శనం కృత్వా భూతి తిలక కరణాదినా ప్యాశీర్భి స్సంవర్ధయామాస.

— శకటాసుర తృణావర్త మర్దనమ్ —

శ్లో॥ నిహతే శకటే పద్భ్యాం తృణావర్తే చ మర్దితే,
కృష్ణేన విష్ణునా సోఽయం స్వస్థః క్రీడతి బాలవత్, 17

1. ఈద సాధ్యముగాని దీ జన్మమను కడలి
మీఁద భయములు లేక మేలౌనుగాక
ప్రోదిమై కస్తూరిబొట్టు నుదుటను వెలయు
నీదయను జగమెల్ల నెమ్మి మను గాక
2. స్థిరసంపదలను భూదేవి కూర్చును గాక
హరి నీ రిపులనెల్ల నణగించు గాక
మరి దక్షిణామూర్తి కరుణ నించును గాక
గురుజగత్సాక్షి రవి వరమిచ్చు గాక
3. వాక్కు శక్తియు నష్ట వారించెదరుగాక
చిక్కులను ముక్కంటి ఛేదించుగాక
పెక్కులౌ ధర్మముల పెంపౌ సుసాధనల
నిక్కమౌ నీచరిత నెలకొల్పుగాక.
4. అరుల నొంచగ బోధ పరిపూర్ణమౌ గాక
నెరవైన కలిమి శ్రీవరు డొసఁగుగాక
పరమపురుషార్థమౌ ఫలము కలుగునుగాక
హరి నారాయణతీర్థ పరుడౌనుగాక.

వ. ఆమె వెలయుగదా! నందగోపాలుని దేవియౌయశోద, సకల లోకములకు ఆధారమైనవానిని, తన కాధారావశ్యకత లేని వానిని పరిమితికిమించిన మహిమగలవానిని, (ఆమె) మహిమ లేనివా డనుకొని, (అనగా సామాన్య బాలు డనుకొని) తన తొడపై నిడుకొని, మెరపులతో ప్రకాశించుక్రొత్తమబ్బువలె వెలయువానిని, శ్రీకృష్ణుని, తన హస్త పద్మములచే ముఖము తుడిచి విభూతి తిలకమునుంచుట మొదలగు ఆశీర్వచన రక్షక క్రియలను ఆయనకు సల్పెను.

ఆ. వె. పాదముననె శకటుఁ బడదన్ని, యా తృణా
వర్తు మింటినుండి వసుధఁ గూల్చి,
విష్ణుతేజుడైన కృష్ణుండు బాలుండు
చిన్నిగోపికలను చేరి యాడె.

X. అథ జానుచరాభ్యాం రామకృష్ణాభ్యాం సహ యశోదాయా ఆగమనం గీయతే—

7 ద్విజావంతీరాగము - ఆదితాళము.

1. నందగేహినీ మందగామినీ
సుందరాననా యశోదా సురమోహినీ
2. నందితామరీ నీలకబరీ మందం
మంద మాయాతి మధుర భాషిణీ
3. లోకనాయకం యోగితారకం
బాలక మథ యాతి భగవంతంకృష్ణం
4. అంబుజాసనం అబ్జలోచనం
కంబుకర్ణమపి శ్రీ రామనామానం

అథ యశోదా సుతమాహ—

ద్వి. 1. సకల లోకాధార చిదాకార
ప్రకటితాగమజాల పద్మావిలోల
2. అగణిత గుణగ్రామ ఆత్మాభిరామ
మృగమదాంకిత ఫాల మిత్రానుకూల
3. ఖగరాజ వాహ ని ర్గత భవమోహ
నగరాజ వరధీర నానా విహార
4. వికచ వారిజనేత్ర విస్ఫురద్గాత్ర
శకలితాసురజాల శాంత్యేకమూల
5. భగవన్ భయాపహర భక్తమందార
నిగమ శీర్షారామ నిత్యాప్తకామ
6. సకల సన్నుత గుణ సాధుసంత్రాణ
మకరధ్వజాకార మంజుళహార
7. కలిత కౌస్తుభశోభ కాలమేఘాభ
బలభద్ర కృతఖేల బాలగోపాల

వ. అంతట మోహాకాళ్ళచే దోగాడు బాలురౌ బలరామకృష్ణులతో గూడ విచ్చేయు యశోదాదేవియొక్క ఆగమనము గానము చేయఁబడును.

7 వ కీర్తన - యశోద బలరామకృష్ణుల లాలించుట.

1. నందుని యిల్లాలు మందగతుల వచ్చె
సుందరాస్య యశోద సురలగమి మెచ్చె
2. అందమైన వేణి నచ్చరలే పొగడ
పొందుగ మెల్లమెల్ల పొలుపు పలుకు నెగడ
3. మొనసి జగము గాచి ఘనయోగుల బ్రోచి
తనరు బాలకృష్ణు దైవతాంశు జిష్ణు
4. నోమియాడు శంఖ మొనరు తెల్పువాడు
రాము డగ్రజాతుండు రాజిలు మోమువాడు

అంత యశోద తన కుమారు నిద్దఱు లాలించెను—

ద్వి. 1. ఇందిరాపతివను నెల్ల లోకములు
అందించు వాడవను నఖిల వేదములు
2. అభిరాముడాత్మకను నతులగుణములు
శుభతిలకుండను సుహృదుల గములు
3. ఖగవాహనుండను గగన చారములు
నగధీరుడను వీడు నతవిమోహములు
4. శాంతికి నెలవను సౌమ్యనేత్రములు
దాంతుండవను నోడు దనుజ సంఘములు
5. భయముడుపు దైవమను భక్త కూటములు
దయ వరదుడను వేదముల సూత్రములు
6. సుగుణమ్ములన్ సాధు శుభనుతిఁ గాంచి
నెగడు భూపుల మరునిన్ గడున్ మించి
7. లలి కౌస్తుభమున నీలపు మబ్బులీల
బలభద్రుతో నాడు బాల గోపాల

8. మదనగోపాల సన్ మానిత శీల
ముద మేహి దేహి సుత మునిబృంద వంద్య

9. సారసాక్ష ముకుంద సచ్చిదానంద
ధీరనారాయణ తీర్థసుగీత

శ్లో॥ జానుభ్యాం పాణిపద్మాభ్యాం వ్రజంతం నందనందనమ్,
ఆనందయంత మబలా స్సబలం పరమం జగుః. 19

8 మోహన (నవరోజ్) రాగము - చాపుతాళము.

ప. మాధవ మాధవ కృష్ణ మంగళాలయ శ్రీకృష్ణ

అ. సాధక ఫలద కృష్ణ సబల శ్రీకృష్ణ

1. నందనందన ముకుంద సుందరముఖారవింద
నందితగోపికాబృంద నతజనానంద
ఇందిరా హృదయానంద ఇందువదన గోవింద
మందరధర సునంద వంద్య సానంద

2. దివ్య కస్తూరీ తిలక దీనజన పరిపాలక
భవ్యయోగి భయవారక భక్తోద్ధారక
అవ్యయ భూతిదాయక అగణిత లోకనాయక
నవ్య నవనీత రసిక నందబాలక

3. చారు నూపుర కోమల చరణ బాలచాపలం
సరస సద్గుణజాల సంగీతలోల
నీరదనీల నిర్మల నిత్య శుద్ధాగమమూల
నారాయణతీర్థపాల నతజనాలోల

శ్లో॥ ఇత స్తత స్సంచరంతం జగన్మోహన విగ్రహమ్,
కరాభ్యా మథ జానుభ్యాం లాలయంతి వ్రజాంగనాః. 20

8. మునులకందని శీలమును జూపు లీల
మనసు రంజిలు నాన్న మదన గోపాల
9. తీరుచూపుల నెల్లఁ దెలియుమాటలను
ధీరనారాయణ తీర్థు పాటలను

మత్తకోకిల : అల్ల నల్లన చిన్నిచేతుల నందు నిందును వ్రానుచున్
మెల్ల మెల్లన జానువుల్ భువిమీద మోపుచు నానుచున్
చల్ల చల్లని నవ్వువెన్నెల చాలగా వెదజల్లుచున్
గొల్లతల్లుల నల్లపిల్లడు గూడె వేడుక లల్లుచున్. 19

8 వ కీర్తన - గోపికలు కృష్ణుని లాలించుట.

ప. మాధవా! శ్రీధవా! కృష్ణ! మహిశుభుడవై వెలయుటెల్ల
అ. సాధకులకు రాముని గూడి సఫల మొసంగుటకో
1. గిరిని దాల్చినావు నందు వరతనయుడవౌటల
వరలుమోముతమ్మి గోపీ తరుణు లెంచుటకో
సిరి యురమున వెలయ ముక్తు లరయు రూపములరు నీవు
ధర గోవిందుడౌట దాసపరత మించుటకో
2. ఎన్నోలోకము లేలునీవు హితయోగుల కభయమీవు
చిన్ని కృష్ణుడౌట దీనుల మన్నించుటకో
చెన్నైన కస్తూరిబొట్టు చెలగ నిత్యపదవు లిత్తువు
వెన్నల రసము గొనుట భక్తుల వేడ్క దీర్చుటకో
3. చదువుల మొదలైన నీవు సరస గుణ రాశివీవు
మృదుల శ్యామలుడౌట వినతుల మేలొనగూర్చుటకో
పదములందెల మ్రోగగనాడు బాలుడు సంగీత లోలుడౌట
ముదమున నారాయణతీర్థుని మొనసి యేలుటకో

సుగంధి : అప్ప పప్పయంచు తల్లి నందు నిందు ద్రిప్పుచున్
తప్పటడ్గు కాలచేత తాకి దోగివైచుచున్
చెప్పుమన్న "నత్త తాత" చిన్నిమాటలాడుచున్
ఒప్పులయ్య లాలనంబు లొందె గోపికాళిచే. 20

9 యదుకులకాంభోజిరాగము - ఆదితాళము.

| | | |
|---|---|---|
| ప. ఏహి ముదం | దేహి శ్రీ | కృష్ణ కృష్ణ - మాం |
| పాహి గో | పాలబాల | కృష్ణ కృష్ణ |
| 1. నందగోప | నందన శ్రీ | కృష్ణ కృష్ణ - యదు |
| నందన | భక్తచందన | కృష్ణ కృష్ణ |
| 2. కలభగతిం | దర్శయ శ్రీ | కృష్ణ కృష్ణ - తవ |
| కర్ణా | చలయ శ్రీ | కృష్ణ కృష్ణ |
| 3. ధావ ధావ | మాధవ శ్రీ | కృష్ణ కృష్ణ - నవ్య |
| నవనీత | మాహార శ్రీ | కృష్ణ కృష్ణ |
| 4. విక్రమబలం | దర్శయ శ్రీ | కృష్ణ కృష్ణ - విధి |
| శక్రాది | సన్నుత శ్రీ | కృష్ణ కృష్ణ |
| 5. భవ్య నట | నం కురు శ్రీ | కృష్ణ కృష్ణ - బల |
| భద్ర స | హోదర శ్రీ | కృష్ణ కృష్ణ |
| 6. చంచల మణి | కుండల శ్రీ | కృష్ణ కృష్ణ - చారు |
| చంపకనాసా | మౌక్తిక శ్రీ | కృష్ణ కృష్ణ |
| 7. కుంకుమ పం | కిల దేహ శ్రీ | కృష్ణ కృష్ణ - భక్త |
| శంకర | చరణ శ్రీ | కృష్ణ కృష్ణ |
| 8. సాధు సాధు | కృతి మిహ | కృష్ణ కృష్ణ - లోక |
| సాధక | హితాయ శ్రీ | కృష్ణ కృష్ణ |
| 9. నారదాది | మునిగేయ | కృష్ణ కృష్ణ - శివ |
| నారాయణ | తీర్థ వరద | కృష్ణ కృష్ణ |

శ్లో॥ విన్యస్యైకం భువి భువనభృత్పాద మేకం చ హస్తం
మాత్రా చానుప్రణిహిత మథ స్వాదు హైయఙ్గవీనమ్,
హస్తే కృష్ణాన్ సకలజగతాం సారభోక్తాహ మాత్మే
త్యాచక్షాణో విహరతి జగన్మోహనో నందసూనుః.

9 వ కీర్తన - యశోద కృష్ణుని లాలించుట.

ప. రార! మోద! మీరా! శ్రీ కృష్ణా! కృష్ణా! - నన్ను
అ. ఏర! గోప బాల! యేలర! కృష్ణా! కృష్ణా!
1. కొడుకై నంద గోపు గావవె! కృష్ణా! కృష్ణా! - యదుకుల
మడరఁ జల్లగ భక్తులఁ బ్రోవవె! కృష్ణా! కృష్ణా!
2. ఆడవో వేణుంగుగున్నె కృష్ణా! కృష్ణా! - ఏదీ
చూడనీ చెవు లూర్పునేర్పు కృష్ణా! కృష్ణా!
3. పరుగు పరుగు లెత్తర! మాధవ! కృష్ణా! కృష్ణా! - క్రొత్త
నెరవా వెన్న నీ కిచ్చెదరా! కృష్ణా! కృష్ణా!
4. సత్తువెంతో నాపైఁ జూపు! కృష్ణా! కృష్ణా! - చాల
మెత్తురా బ్ర హ్మేంద్రులు నిన్ను! కృష్ణా! కృష్ణా!
5. ఆడరా మే లైన యాట! కృష్ణా! కృష్ణా! - హెచ్చి
కూడరా బలరాముతోడ! కృష్ణా! కృష్ణా!
6. అలరు మణుల ప్రోవులూచు! కృష్ణా! కృష్ణా! - బంగరు
బులాకిపై ముత్తముగూర్తుర! కృష్ణా! కృష్ణా!
7. కుంకుమ లేపము పూయనీరా! కృష్ణా! కృష్ణా! - ప్రేమ
కూర్తువుసౌఖ్యము పదభక్తులకు! కృష్ణా! కృష్ణా!
8. మేలు మేలు మేలయ్యెనిట! కృష్ణా! కృష్ణా! - నీకే
పోలుజగతి సాధులమెప్పు! కృష్ణా! కృష్ణా!
9. నారదాదుల పాటవినరా! కృష్ణా! కృష్ణా! - శివ
నారాయణ తీర్థుఁ గనరా! కృష్ణా! కృష్ణా!

మత్తకోకిల : ఒక్కపాదము నొక్కజానువు నొక్కహస్తము భూమిపై
చక్కమోపి మరొక్కహస్తముచాచి కమ్మని వెన్నలన్
మక్కువం దన తల్లిచేఁగొనె, మాన్యలోక సుసారమే
నొక్కటన్ గొనుదైవమన్నటులొప్పుకృష్ణుడుముద్దుగా. 21

గ. తథావిధ మిహ గోపరమణీ చిత్తమత్త మాతంగ మహనీయాలా నభూతం శ్రీకృష్ణం నందగోప మహిషీ స్వసుత మివలాలయం తీద మాహ.

10 ఆనందభైరవి (తోడి) రాగము - చాపు (ఆది) తాళము.

ప. ఏహి ముదం మమ దేహి - జగ - న్మోహనకృష్ణ మాం పాహి

అ. ఏహి సమాహితదీనజనావనమోహరహితమునిముక్తివితరణ

1. కమనీయకౌస్తుభ శోభ - కర - కలితనవనీత ఘనాభ
సముదితగోకులకలభ - సర్వ - సహమానయతివర్యసులభ
అమరేంద్రవల్లభఅసురసుదుర్లభ - విమతమదవిభంగవీరపద్మనాభ

2. చరణానుకరైరలంతే - బహు - సంచరణేన గోపాల
కరధృతనవనీతకబళం - తవ - కర్దమంమాకురువిమలం
పరిపూర్ణ నిజకామ పాతకగణభీమ-వరనూపురాభరణవసుధాభరణ

3. కంకణకేయూరభూష - కనక - కింకిణీకృత బహుఘోష
కుంకుమపంకిల వేష - కుటిల - కుంతల గోకులభూష
కింకరహితకర కీర్తిసుధాకర - మంగళకర నారాయణతీర్థతోష

శ్లో॥ లాలయంతీ యశోదా సా నందస్య మహిషీ సుతమ్,
చరంతం కర్దమభువి త్వరయా జగృహే హరిమ్. 23

గ. అయం హి పరమాత్మా పరమ ప్రేమాస్పదతయా పరమానంద ఘనః - స్వభక్తానుగ్రహచికీర్షయా స్వేచ్ఛయా ప్రాప్తగోపబాలక విగ్రహః - శనైశ్శనైః గోపబాలై స్సహ పద్భ్యామేవ సంచరన్ - అనంతకల్యాణగుణరత్న లీలాకల్లోలాస్పదతయా అత్యంత సౌందర్య రసజలనిధి రపార కరుణాసుధానిధి రిహ జయతి భగవాన్ నందకుమారః. తస్య నవనీత చౌర్యాదిలీలాసక్తస్య సబలస్య చోరశిఖామణేః ఆగమనం గీయతే. 24

వ. ఇట్టి విధముల, ఇచ్చట గోపకాంతలయొక్క మనస్సులను మదించిన ఆడపనుంగులకు కల్పస్తంభమువంటి శ్రీకృష్ణుని, నందగోపాలుని దేవియగు యశోద తన సుతునిగా లాలించుచు ఇట్లు పలికెను.

10 వ కీర్తన - యశోద కృష్ణుని లాలించుట.

ప. రారా! జగన్మోహనాకారా! కృష్ణా! రక్షించి ముదము నాకీర

అ. ప. [illegible]

1. [illegible]
[illegible]
[illegible]

2. [illegible]
[illegible] వెన్నముద్ద [illegible] చేత - కేళి [illegible], తాళురా
[illegible] గురుగుల [illegible] సొంపగ [illegible]

3. [illegible] - [illegible] గంటల్ కింకిణ యనురా
[illegible] - [illegible]
సరిగా [illegible] మనరా వర నారాయణతీర్థ వర్ణనల్ వినరా

కం. పసుప్రలిడి బురద చోటుల
పసులకు దొరకక చరించు బాలుని కృష్ణున్
వర వాత్సల్యము చేఁ గొని
త్వరగాఁ లాలించి తల్లి ధామము చేర్చెన్ 23

వ. ఇతడే కదా పరమాత్మ, పరప్రేమకు తావు, పరమానందముచే ఘనుడు-తనభక్తులను అనుగ్రహించుకోర్కెతో, స్వేచ్ఛగా గోపబాలుని రూపముఁగొనెను. నెమ్మది నెమ్మదిగా గోపబాలకులతో కూడి నడచువాఁడై, అనంతములైన కళ్యాణగుణ రత్నములను అలల విలాసమునకు నెలవై, అపారమైన సౌందర్యరసమనుసీటితో నిండిన సముద్రమై, దరిలేని కృపయను అమృతమునకు నిధియై, విలసిల్లు భగవంతుడే నందకుమారుడు. ఆయనయొక్క నవనీత చౌర్యము మొదలౌ వేడ్కలయం దాసక్తియు ఆయన బలరామునితో కూడి చోరశిఖామణియై ప్రవర్తించుటయు గానము చేయఁబడును. 24

11 ముఖారిరాగము - ఆదితాళము.

ప. కృష్ణం కలయ సఖి! సుందరం - బాల
అ. కృష్ణం గతవిషయ తృష్ణం జగత్ప్రభ
విష్ణుం సురారిగణ జిష్ణుం సదా - బాల
1. నృత్యంత మిహ ముహు రత్యంత మపరిమిత
భృత్యానుకూల మఖిల సత్యం సదా - బాల
2. ధీరం భవజలధి పారం సకలవేద
సారం సమస్తయోగి తారం సదా - బాల
3. శృంగారరసభర సంగీతసాహిత్య
గంగాలహరీఖేల సంగం సదా - బాల
4. రామేణ జగదభి రామేణ బలభద్ర
రామేణ సహావాప్త కామేన సదా - బాల
5. రాధారుణాధర సుధాపం సచ్చిదానంద
రూపం జగత్త్రయ భూపం సదా - బాల
6. దామోదర మఖిల కామాకరం ఘన
శ్యామాకృతి మసుర భీమం సదా - బాల
7. అర్థం శిథిలీకృతా నర్థం శ్రీనారాయణ
తీర్థం పరమపురు షార్థం సదా - బాల

గ. స ఖలు మహానుభావో లీలయా పరికలితాఖిలాండకోటి బ్రహ్మాండ నాయకో మధుసూదననామా వ్రజపురవనిసుందరీ పరివేష్టితో వశీకృతమహామాయోపి మాయాపరవశో బాలక ఇవ లీలావినోదం దర్శయన్ - కలభగమనకలభాషణ కమలేక్షణ మృదు మంద హాసాది విలాసైః నిజపరిజనానానందయన్ - సకలలోకసంరక్షణే జాగరూక స్సన్ స్వకీయ పరబ్రహ్మభావ మనుసందధానో నంద గోపమందిరే నందసూను రివ విహరతిస్మ. 25

11 వ కీర్తన

ప. అలరు చిన్నికృష్ణుడు అడుగో చెలియ!
అ. తొలగించు భ్రాంతుల వెలయించు జగముల
పాలించు నసురుల గెలుచు నెప్పుడు, చెలియ!
1. నృత్యమ్ము మరి సల్పు నెమ్మి దాసుల గెల్పు
సత్యం బెచట నిల్పు నిత్యమ్ము మేల్ దెల్పు
2. సంసారమను కడలి సాధుల్ గడవ బల్కు
శంసల్ దీర వేద సారమ్ము ధృతి జిల్కు
3. సరసుడౌను చాల చదువు పాటల దేల
నురలు గంగను బోల వరలు కేళి లీల
4. ఎనయు సొంపుల యతడు ఎల్ల జగతి మహితుడు
ఘనుడ వాప్తకాముడౌ తనయున్న రాముని తోడు
5. శేషై యేలు జగమ్ము ఆకు నందిందు సుమ్ము
రాడు చూడమమ్ము రాధకు కెంబెదవి సొమ్ము
6. ఎనయు బొజ్జ ప్రతాడు ఎన్నో కొర్కులం గోడు
తనువు మబ్బుకు నీడు దనుజుల వెఱపించు చూడు
7. పారమే శుభార్థములకు దూరమే యనర్థములకు
సారమే పరమార్థములకు నారాయణతీర్థులకు

వ. అతిడేకదా మహానుభావుడై లీలచే కల్పింపబడు సకలబ్రహ్మాండ
ములకు నాయకుడై, మధుసూదనుడను పేరుకలవాడై, గోకుల
కాంతలచే చుట్టబడి, తనకులోనౌ మాయగలవాడైనను, మాయకు
పరవశుడై, బాలునివలె, లీలావినోదము చూపుచుండె. ఏనుగు,
గున్నవలె నడచుట, మృదువుగా మాటలాడుట, తామరలవంటి
కనులతో చూచుట, మృదువుగ మందహాసము చేయుట మొదలౌ
విలాసములచే తన పరిజనులను సంతోషపెట్టుచుండె. సకలలోక
ములను సంరక్షించుటందు, జాగ్రత్త గలవాడయ్యెను, తనయొక్క
పరబ్రహ్మభావము తనలో తాను మఱువక, అనుసంధించుకొనుచు
నందగోపాలుని మందిరమందు, నందకుమారుడై విహరించు
చుండెనుగదా!

శ్లో॥ వ్రజభువినందకుమారే వ్రజ బాలబృందకుముదపూర్ణేన్దౌ
విహరతి తస్య చరిత్రం వ్రజపురనార్యో జగుర్యశోదాయై. 26

12 కేదారగౌళరాగము - ఆటతాళము.

ప. కలయ యశోదే తవ బాలం ఖలబాలకఖేలనలోలం

1. అపహృతబహుతరనవనీతం అనుపమలీలానటనకృతం
కపటపటుగానుమబాలకచరితం కనకకందుకకేళనవితతం

2. పశుపాలబలంబితపక్షదాండం హాసతినునోనతసూర్యాండం
అధికబంధోద్ధృతజగదండం ఆనందబోధరసమఖండం

3. మల్లబాలకఖేలనచతురం మనసిజకోటిలావణ్యాధరం
కల్యాణగుణానవమణినికరం కమనీయకౌస్తుభమణిశేఖరం

4. నవనీతచోరబాలకచరితం నందాదివ్రజపుణ్యతరుఫలితం
ధ్రువపదఫలమేత దతిలలితం భువినారాయణతీర్థయతిభణితం

గ, అయి సఖి యశోదే - తవ తు యశోదాత్వ మన్వర్థయన్ -
భగవాన్ గోపబాలపరివేష్టితో-బలభద్రసహాయః - తత్ర తత్రా
శక్యసంస్పర్శోన్నత గృహనిబద్ధేషు శిక్యేషు సంచిత గోరసగ్రహ
ణోపాయానభిజ్ఞాన్ గోపబాలాన్ ప్రతితదుపాయనిచయ మాచా
రత శ్శిక్షయన్ - ఆరురుక్షూ న్ వారూఢయోగీ - తత్రత్యదధి
దుగ్ధనవనీతాదిక మాకంఠ మాపీయాన్యా నపి పాయయన్ -
తత్రత్యగోపబాలబిడాలాదిభ్యోనిక్షిపన్ - క్వాపి క్వాపి కరపల్లవ
కలితవేత్రాదినా విరచితశిక్య భాండవివరా న్నిస్సరంతీ ర్దుగ్ధదధి
ధారాః - స్వయంపిబ న్నన్యానపి పాయయన్ - భాండాని చా
స్ఫోటయన్ - విశ్వాత్మా నిత్యసిద్ధవిపులతర పరానంద రసతృప్తోపి
స్వేచ్ఛయా పరిగృహీతమూర్తిమత్తయా గోరసపరితృప్తః; స్వయ

ఆ. వె. గోకులమ్మునందు గోపబాలకులందు
సరస కుముద పూర్ణచంద్రుఁ బోలి
వేడ్క మెలఁగు కృష్ణు వింతలీలల నెంచి
తల్లి కనిరి గోప తరుణు లిట్లు. 26

12 వ కీర్తన - గోపికలు యశోదతో కృష్ణునిగూర్చి చెప్పుట.

ప. కనవే యశోదా నీ కొడుకున్ చనియాడు పలువలతో నీ దుడుకున్

1. కల్ల పోకడలెన్నొ గడియించున్ చల్లగా మావెన్న సంగ్రహించున్
తల్లీ! దొంగలౌకుర్రల తగఁబెంచున్ పెల్లుగ బంతులయాటను ప్రేమించున్
2. పాపముచీకటప్రొద్దున మేలాక్రించున్ ప్రతివీధి పెరుగుకుండల పగుల్చున్
ప్రాపై జగముల నుద్ధరించున్ బ్రహ్మానందమున సంచరించున్
3. మరికౌస్తుభము దిద్ది కనుచుందువే మావాడే సుగుణముల మణియందువే
మరు మించు కోటిర ట్లనుకొందువే మల్లులపై పోరు నేర్పు వినుచుందువే
4. వెన్నదొంగని చర్య లెన్నగలమే వ్రేపల్లె నందాదుల పుణ్యఫలమే
విన్న శాశ్వతగతికి తావలమే చెన్నొ నారాయణతీర్థు వాక్జాలమే

వ. ఓచెలీ! యశోదా! నీయొక్క యశోదాత్వము తగియున్నది. భగవంతుని లక్షణములు గలిగిన నీ కుమారుడు గోపబాలకులచే చుట్టుకొనబడ్డవాడై, బలరాముని సహాయముతో, అక్కడక్కడ చేతి కందనంత ఎత్తైన యిండ్లలో కట్టబడిన ఉట్లలో నుంచఁబడిన పెరుగుపాలను సంగ్రహించు నుపాయములను బాగుగా తెలిసినవాడై, గోపబాలురకుఁ గూడ ఆ యుపాయములను తాను చేయుటచే నేర్పుచు, ముముక్షువులను పైకి ప్రాకించుటలో నేర్పరియా యోగివంటివాడై, అచ్చటచ్చట పెరుగు, పాలు, వెన్న మొదలైనవి కంఠమువఱకు తాను గ్రోలువాడై, యితరులచేత త్రావించుచు, అక్కడనున్న గోపబాలురకు, పిల్లులు మొదలైన జంతువులకును పోయుచు, ఒక్కొక్కచోట చిగురువంటి చేతులలోనున్న బెత్తములచే నుట్లలోని కుండలకు రంధ్రములు చేసి, వానినుండి కారుచున్నపాలు, పెరుగు ధారలను, తాను త్రాగుచు యితరులచేత త్రాగించును. మఱియు భాండముల పగుల్చును. ప్రపంచమంతట వ్యాపించి నిత్యము, సిద్ధము, విపులతరముఅయిన, పరమా

మన్యాంశ్చ తర్పయన్; ముఖ్యప్రాణ ఇవ వాగాదీ నశ్రాంతో విశ్రాంతిస్థాన మితరేషాం నిజానుచరైస్సహ సానంద మిహ విహరతి నందసూనుః. 27

శ్లో॥ వీథ్యాం వీథ్యాం వ్రజభువి సుఖం సంచరంతం ముకుందం
మధ్యే మధ్యే ఘృతదధిపయః పాయయంతం పిబంతమ్,
బుద్ధ్వా బుద్ధ్వా వహ మిహ మితి। స్వాంత మాభాసయంతం
భూయోభూయః సుత మనునయం త్వాహ చేదం యశోదా. 28

13 కాంభోజిరాగము - చాపుతాళము.

ప. ఆయాహి మాధవ కృష్ణ - హేకృష్ణ - ఆయాహి

1. సంగవసమయేఽతీతే సవితరి మధ్య మాగతే
మంగళా చారోచితే త్వయి
అంగజ సలిలావృతే అధిక శ్రమసంయుతే
అంగజ! ఖేలనై రలంతే - హేకృష్ణ

2. చంద్రమండల సమాన చారు దధిఖండ ఫేన
సాంద్ర నవనీతాద్యాహారం.
మందిరే మమగృహాణ మంజునూపురాభరణ
సుందర సుఖయ సాదరం - హేకృష్ణ

3. పల్లవవ దతికోమలపాద పంకజయుగళ
మల్లికా జాజి సుగంధిత
ఫుల్లపంకేరుహ దళభూరినేత్ర సుకపోల
పల్లవీ మానసాలంకార - హేకృష్ణ

4. ఆలోలమణికుండల అనవద్యమౌక్తిక జాల
బాలభావ! ఖేలనలోల!
నళినసుందరనాభ నవనీతాహారవిలోభ
నారాయణతీర్థసులభ - హేకృష్ణ

నందరసముచే తృప్తుడైనను, స్వేచ్ఛగా గ్రహించిన మూర్తి గల వాడగుటచే ఈ పెరుగు, పాలచే తృప్తతను, పొంది ఇతరులచేత పొందఁ జేయుచున్నాడు. ముఖ్యప్రాణము, వాక్కు మొదలైన ఇంద్రియములకువలె తాను ఇతరులకు విశ్రాంతిస్థానముగా నుండి విశ్రాంతిలేని ఆనందముతో అనుచరులతో నందుని కుమారుడు విహరించుచున్నాడు. 27

ఉత్సాహ :— వెడలి హితులు తాను పల్లెవీథివీథిఁ దిర్గుచున్
తడవ తడవ పాలు పెరుగు త్రావి త్రావఁ జేయుచున్
కడకు బుద్ధి బుద్ధి తానె గాగ నిండి వెల్గుచున్
అడరుసుతు యశోద యిట్టు లనునయించె మఱిమఱిన్. 28

13 వ కీర్తన - యశోద కృష్ణుని పిలుచుట.

ప. రావోయి! నాకన్నా కృష్ణా! రావోయి నా ముద్దుల కృష్ణా! రావోయి రావోయి శ్రీకృష్ణా

1. ప్రొద్దున చల్లని వేళ గతించె ప్రొద్దు మధ్యాహ్నమును గాంచె
కొద్దిగ విశ్రాంతి సమయమే తెంచె
నిద్దపు మేను చెమటనించె నిండుగా నలసట వహించె
వద్దిఁక యాటకు తఱియు మించె - నాచిన్నికృష్ణా!

2. చందమామ నిగ్గులజాలు చక్కని పెరుగు నురుగులఁ దేలు
పొందా కమ్మని వెన్నను గ్రోలు
మందిరమున నీకు మేలు మణులనగలఁ గూర్తు తాళు
అందముగ నిదురింపపోలు - నాచిన్నికృష్ణా!

3. పల్లవములలీల మెత్తన, పదములు నీవి నొప్పిగొనెన?
మల్లి జాజి పూల నద్దెదన?
చెల్లు! నీవిరితమ్మి కనులన చిన్నిబుగ్గల నిగ్గులన
గొల్లపడంతుల మెప్పులం గొన - నాచిన్నికృష్ణా!

4. తీరా మణుల కుండలముల తేటా ముత్తెపు హారముల
చేరు బాలుర నాట సాయముల
కోరు నవనీత ఖండముల కొందు పద్మనాభ! విమల
నారాయణతీర్థ గానముల - నాచిన్నికృష్ణా!

శ్లో॥ ఇత్యేవం ప్రార్థయంతీ సా గోవిందం నందనందనమ్,
యశసా పూరయంత్యేషా యశోదా సా నయద్గృహామ్. 29

శ్లో॥ ఆనీయ స్వగృహం బాలం సబలం బాలవత్సలా,
నీలమేఘనిభాకారం యశోదా సమతోషయత్. 30

—♦ యమళార్జున భంజనము ♦—

శ్లో॥ కదాచి దాద్ధత్య మనంతవీర్యే
హారా విలోక్యాప్రతిమం యశోదా,
బబంధ దామ్నా త మశేషబంధు
ములూఖలే బాలవిలాసలోలమ్. 31

శ్లో॥ ఆకృష్యోలూఖలం తస్మాద్యమళార్జునమధ్యగః,
బభంజ బలవాన్ కృష్ణ స్తా వర్జునతరూ హరిః. 32

శ్లో॥ నారదమునివరశాపా ద్యమళార్జునవృక్షభావ మాపన్నౌ,
యక్షసుతౌ సవిచిత్రందామ్నా బద్ధోప్యమోచయద్బంధాత్. 33

అథ శాపవిముక్తయో ర్యక్షసుతయో రాగమనం గీయతే—

14 కాంభోజి రాగము - అటతాళము.

వృక్షభావబంధముక్తౌ కృష్ణేన యక్షసుతా వనురక్తౌ
లక్షితవిషయవిరక్తౌ సతతం లక్ష్మీపతిపాదభక్తౌ
ప్రక్షీణకల్మష భారతయా హరి భక్తిసుధారసగిర ముద్గిరన్తౌ

శ్లో॥ తం తుష్టువతు రత్యంత సంతుష్టౌ దివ్యసుందరౌ
కుబేరతనయౌ యక్షౌ దామోదర మరిందమమ్. 34

కం. ఈరీతి కృష్ణు లాలన
హరించి యశోద చనవు సల్పుచు మైమై
చేరిచె గేహము; నంద కు
మారుడు గోవిందుడెనసె మాతృహితోక్తిన్. 29

కం. తనయుని హితులన్ రాముని
తనయింట యశోద తన్పఁ దనియించె సుతున్
ఘననీలవర్ణు, భక్తులఁ
దనుపన్ తృప్తుండుగాడె దాసవరదుడున్. 30

గీ. అతిశయోత్సాహియగా కృష్ణు నమితమైన
దుండగము నొక్కటింగని దుడుకుతనము
నాప, బాలఖేల విలాసు నఖిల బంధుఁ
బట్టి త్రాటితో రోటికిఁ గట్టె తల్లి. 31

సుగంధి: తల్లి రోటఁగట్టి యేగ! తానుఁ దాని లాగుచున్
డొల్లఁ ద్రోసి, నవ్వుతో, నటుల్ నిటుల్ పెనంగుచున్
మెల్లమెల్ల మద్దిచెట్ల మేటిజంట సందునన్
అల్లఁదాపి, యీడ్వ చెట్లు లంతఁ గూలె నార్భటిన్. 32

కం. బంధమ్మున దానుండియు
బంధము విడిపించె వృక్షభావగతులకున్
సంధిల నారద శాపము
నంధులో యన మహిమ విడిన యక్షసుతులకున్. 33

వ. ఇక శాపము తీరిన యక్షకుమారులయొక్క ఆగమనము గానము చేయఁబడును.

14 వ కీర్తన

చెట్లజన్మమువదలి శ్రీకృష్ణుదయప్రేమ చెంది రా యక్షసుతులు
పాట్లులోట్లులేని పదవినిగని శ్రీహరికి భక్తి పాద ప్రణతులు
కోట్లుసమర్పించి కోమలవాక్యముల నిట్లుగానముసేసిరింపైనసన్నుతులు
కం. వారలుయక్షోత్తములుకుబేరుసుతులుదివ్యరూపవిభవులు, శ్రీశున్
జేరిముదమునసనుతించిరుదారులురిపుదమనుకృష్ణుదామోదరునిన్.

15 కళ్యాణిరాగము - ఆదితాళము.

ప. దామోదర తావక పర భావ మహం సదా జానే

అ. శ్యామధామన్ భూమన్ సామాదిసర్వనిగమవాసంజానే

1. పుండరీకపురమధ్య పురుషభావేనసిద్ధం
చండభానుకోటిప్రకాశం చిద్ఘనాకాశం
పండితపరిభావితం పాపసంఘువివర్జితం
ఖండితమాయావిలాసం కారణమఖండరసం

2. సత్యకామాదిగుణకం సర్వహృదయాభాసకం
నిత్యమంగళనివహం నిర్గతమోహం
ప్రత్యయబాధితశోకం ప్రతిభాతసర్వలోకం
మృత్యుజన్మాదివిరహం సత్యలోకాది సర్వదేహం

3. కమలాసనాదిగీతం కామయానాదిఫలితం
శ్రీ మదశేషవిభవం ధీరానుభావ్యం
సమరసతయా నిత్యం విమలయోగి విదితం
అమరరమ్య శ్రీగోకుల కమనీయ గోపాలశరీరం

4. నరకభయవారకం నామరూప నిర్వాహకం
పరిపూర్ణానందదాయకం భక్తతారకం
సురగురుగీతమేకం సూదితాసురనాయకం
నరనారాయణతీర్థ వందితపాదపద్మకం

శ్లో॥ దేవం బ్రహ్మపురాంతస్థం పుండరీకాంతరస్థితమ్,
చిదాకాశం జగద్బీజం వాసుదేవం త మాశ్రయే. 35

శ్లో॥ భగవతి యమళార్జునస్య భంగం
కృతపతి గోకులవాసిభి ర్యశోదా,
సపది నిజకృపావిముక్తబంధం
హృది పరిరభ్య చకార మంగళాని. 36

15 వ కీర్తన - యజ్ఞకుమారులు శ్రీకృష్ణుని స్తుతించుట.

ప. దామోదర ! పరమాత్ముడవని మేమెఱుగుదు మెప్పుడైన
అ. ప. శ్యామలకాంతులమహిమని సామగానముల వేదమంత్రముల

1. పురుషోత్తమ నీసేవదొరకున్ పుండరీకపురమునన్
వరలుసూర్యులకోటిద్యుమదిన్ వరవిజ్ఞానమునన్
నెరసులన్నిటిఁ బాపెదవుగా నెరివిజ్ఞానుల భావనన్
విరియ జేయుదుమాయ నెచటన్ పరిపూర్ణమహా పెంపునన్

2. తలపులెల్లను సుఫలమొసగన్ వెలిగెదెల్లర మనసు లెసగన్
నెలవుగా మే లెందుఁ బెరగన్ నెఱయు మోహము తఱుగన్
అలఘుధిషణన్ వెతలుతొలఁగన్ అఖిల జగములు దీప్తి వెలగన్
పొలసి పుట్టుట లేకయుండన్ పుణ్యలోకము లెల్ల నిండన్

3. కోరుగ మనము భక్తులొందన్ కొలుచు బ్రహ్మపాటలందున్
శ్రీరహిన్ పూర్ణశుభములన్ ధీరుల భావములన్
తీరైన సమరీతులొనరన్ తెలిసి యోగులు దనరన్
చేరి సురలు మ్రొక్క గోకుల శ్రీరమణున్ గోపాలదేవున్

4. నరకభయము తీర్చుటకే కద నామరూపము లొందితౌగద
పరిపూర్ణానంద మొసగుట భక్తుల నేలుటకే కద
గురువుగానము నీకొనర్చుట క్రూరముఖ్యుల నణచుటకు గద
సరసమా పాదమునఁ దనరుట వరనారాయణతీర్థునకై గద

ఆ. వె. అఖిలలోకబీజమైన చక్రమునందు
ఘనచిదాత్మజఠర గగనమందు
హృదయపుండరీక సదమల స్థలమందు
బ్రహ్మపురిని వెల్గు ప్రభుఁ గొలుతుము. 35

కం. దొరలించె కృష్ణుఁ డర్జున
తరువుల నని యచటివారు తన కెరిగింపన్
త్వరఁజని కట్లూడ్చి కృపన్
మరి సుతు నెద హత్తి సల్పె మాత శుభవిధుల్. 36

గ. అథ కదాచి దరవిందలోచనే భగవతి వాసుదేవే సబలే గోప బాలబృంద పరానంద సుధామహోదధిపూర్ణ శశాంక బింబే స్వకుక్షిపరిరక్షితానేకకోటి బ్రహ్మాండనాయకే కృత్రిమమానుష బాలచాపలేన సందర్శితమృద్భక్షణాదిచరితే సుచరితే విహరతి - తదీయలీలావిలసిత తచ్చరితం - బలభద్రముఖా దాకర్ణ్య స్వకీయ బాలహితైషిణీ దండోద్యతకరా సంతాడయంతీవ తత్సవిధమాగతా యశోదాభయా దివ ముఖవిదారణం కుర్వతి తస్మిన్-సకల మపి జగదండ మాత్మానం సవిస్మయ మాలోకయామాస. 37

శ్లో॥ కర్తారం సర్వలోకానాం మాయామానుష బాలకమ్
కుక్షౌ సంరక్షితాశేష ముచ్చైః స్తౌతీతి సాదరమ్. 38

16 శంకరాభరణరాగము - త్రిపుటతాళము.

ప. హరి మీడే శ్రీహరి మీడే - దేవం - హరి మీడే

అ. గురుతరాసురభారహర మహ మీడే

1. అఖిలాండకోటిబ్రహ్మాండనాయక మిహ నిఖిలభువనకర్తారం
ప్రకటితనిజవిశ్వరూప మనామయ మఘటితఘటనాకారం

2. స్వర్ధామమస్తకసూర్యచంద్ర నయనవిధ్వస్తమోహ మహం
వర్ధితాఖిలవేదవాచ మాశాశ్రుతి మనిలాసు మఖిలదేహం

3. విశ్వహృదయ దేశవిపులమహీచరణశాశ్వతానందఘనం
నిశ్వసితాగమనిర్మలవిజ్ఞాననిత్యకల్యాణనిదానం

4. భక్తజనసమూహ భద్రదం భవభయముక్తమమరమృదుగీతం
ముక్తసంగమునీంద్రముక్తిదాననిపుణమూలమాగమబోధితం

5. తరణిశశిమండలకోటికోటిభాస్వర మరవిందభవకారణం
హరిభక్తిశివనారాయణతీర్థకృత మిద మఖిలపాతకహరణం

వ. అంతట నొకనాడు, పద్మాక్షుడు భగవంతుడు అగు వాసుదేవుడు, బలరామునితో, గోపబాలురసమూహముతో, పరమానందమను సముద్రమునకు పూర్ణచంద్రుడై వెలయుచు తన కుక్షిలో రక్షింపబడు, అనేకములైన బ్రహ్మాండములకు ప్రభువై, కల్పించుకొనిన, మానవ బాల్యచాపల్యము చూపుచు మన్ను భక్షించుట మొదలైన, శుభలీలలతో విహరించుచుండెను. ఇట్టి లీలలచే నొప్పువిధమును, బలభద్రుని మాటవలన విన్నదై, యశోద తన కుమారునకు మేలు కోరునదై, బెత్తమును చేతబూని కొట్టఁబోవునట్లు, భయపెట్టి శ్రీకృష్ణుని నోరు తెఱపించెను. అపుడు తన కుమారుని నోటియందు సమస్తమైన బ్రహ్మాండమును, తన్నుకూడ ఆశ్చర్యముతో చూచెను.

ఆ. వె. సర్వలోకకరుని సర్వంబునుం దన
కుక్షిలోన దాచు రక్షకు, పరు
మాయమించు సుతుని మనుజబాలక రూపు
సన్నుతించె తల్లి సాదరమున. 28

16 వ కీర్తన - యశోద కృష్ణుని స్తుతించుట.

ప. హరిసెంతున్! శ్రీహరి సెంతున్! శ్రీకాంతున్ - హరి సెంతున్

అ. ప. దురసులఁ గూల్చి భూ - భరము బాపిన శ్రీ - హరి సెంతున్

1. కలిగించి భువనముల ఘనత బ్రహ్మాండముల కగణ - పాలన దీర్చునిన్నున్
వెలయించి నీరూపు విశ్వమని రుజలమోతి అలవిగాని వెల్ల గూర్చు నిన్నున్

2. సురలోకమై శిరము సూర్యచంద్రులైకనులు కెరలు మోహపడంచు నిన్నున్
వరవేదమైవాక్కు, మరిదిక్కులైన్ శ్రుతులు, వాయువుపూర్పు, జగమెతనుగౌనిన్నున్

3. సెలవు జగతి హృదయమై యిలయెల్ల పాదమై యలరునిత్యానందు నిన్నున్
లలిమూర్పు జ్ఞానముల లక్షణము ధర్మమై వెలయు కల్యాణఖనివౌ నిన్నున్

4. భక్తుల సంఘములకు భద్రమ్ముగూర్తువని పాటల సురలెన్ను నిన్నున్
ముక్తిగను మునులవిరక్తికి మూలమని మొదటి చదువులు పల్కు నిన్నున్

5. కోటిసూర్యచంద్రుల కోట్లదాటు దీప్తి కోట్లబ్రహ్మలఁగన్న నిన్నున్
తేటౌ నారాయణ తీర్థునిభక్తిదెల్పు పాటవిని కొఱతదీర్చు నిన్నున్

శ్లో॥ గోవింద ఘటయానందం పరమామ్నాయగోచర,
శ్రీనందతనయా శేషయోగిధ్యేయ పదాంబుజ. 39

17 కాంభోజిరాగము - జంపెతాళము.

ప. గోవింద ఘటయ పర మానంద మమృత మిహ
అ. శ్రీనందతనయ బహు యోగీంద్రసురవినుత
1. అగణిత గుణగ్రామ అపరిమితనిజకామ
నిగమపరమారామ నిఖిల మోహవిరామ
నగధర ఘనశ్యామ నతజనకుముదసోమ
అఘహరణ సర్వసమ అసురమండలభీమ
2. పరమపురుషాశేష పాల పరిజనతోష
పరిహృతాఖిలదోష పతగవాహనశేష
పర్యంక మృదుభాష పరమమంగళవేష
నిరవద్యగోపపురి నియత వరమణిభూష
3. నవమహాక్తికాహార నందగోపకుమార
భవబంధనవిదూర భద్రద సుఖాకార
అవనతజనాధార అపరిమిత శుభచార
నవనీతచోరనర నారాయణావతార
4. శరదిందుసమవదన శతమన్మథసమాన
గురుతరానందఘన కుందసుందరరదన
పరిపంథిగణదళన పాలితాఖిల భువన
సరసనారాయణతీర్థ సత్యఫలదాన

శ్లో॥ ఇత్యేవం ప్రార్థయంతీం తాం యశోదం నందనందనః
భూయ స్సందర్శయామాస బాలభావం స్వలీలయా. 40

ఇతి శ్రీ నారాయణతీర్థ విరచితాయాం - శ్రీకృష్ణలీలాతరఙ్గిణ్యాం
బాలలీలావర్ణనం నామ ద్వితీయతరఙ్గః:

ఆ. వె. అఖిల యోగివర్యు లర్చించు పదముల
పరమ వేదవీధి ప్రభుత వెల్గు
నీవు తనయుడైతి; నిర్మలానందంబు
చెందఁజేయు; నాకు నందునకును. 39

17 వ కీర్తన - యశోద కృష్ణుని స్తుతించుట.

ప. గోవిందు నిను నందు కొడుకంద్రు సురమునులు
అ. శ్రీవరా! మాకిమ్ము స్థిరమైన మోదమ్ము
1. సుగుణములఁ గడునించు శుభకల్పనలఁ గాంచు
నిగమముల రంజించు నెరిమోహ మడంచు
నగమెత్తి రక్షించు నవ్య నీలిమ మించు
తగు సమత్వముఁ బెంచు దనుజల యఘము మాన్చు
2. పరమపురుషునిబోలు భక్తులెల్లర నేలు
గరుడు నెక్కఁగఁజాలు దురితమ్ములను దోలు
ఉరగశయ్యను మేలు గురియుమాటలఁ దేలు
నెరిమణుల నగలోలు వర గోపపురిబాలు
3. మొనయు ముత్తెములఁ గొను మురియు తండ్రినిగను
మను సిరుల సొంపులను మాన్చు భవబంధమును
వినతుల కాధారముగను వెలయుచును నీతిగను
ననుఁ గనుము; వెన్న నర నారాయణా! కొను
4. పలువరుస మొల్లలన లలిమోము చంద్రుడన
అల స్మరులు నూర్గురన ఆనంద మహిమమున
ఖలు రిపుల నడతువన కని భువనపాలన
తెలియ నారాయణ తీర్థు నిజఫలమన

ఆ. వె. తనమహత్వమెంచి ఘనవత్సలతమించి
సన్నుతించు తల్లి సంతసిల్ల
తిరిగి బాలభావ మరవిందనయనుండు
నందసుతుడు లీల నందుకొనియె. 40

ఇది శ్రీ నారాయణతీర్థులచే రచింపఁబడిన శ్రీకృష్ణలీలాతరంగిణి
యందు బాలలీలావర్ణనము అనుపేరుగల రెండవ తరంగము.

శ్రీ ర స్తు

# శ్రీ కృష్ణలీలాతరఙ్గిణి-సంస్కృతవ

## తృతీయతరఙ్గము



## కథానుక్రమణిక.

— వత్సపాలనవర్ణనము —

శ్లో॥ అథాభినీయతే కృష్ణకృతం గోవత్సపాలనమ్,
ఆదౌ నంద స్తతో గోప్యో బలభద్ర స్తతో హరిః.
బలేన సహ కృష్ణేన వత్సానాం పాలనం కృతమ్,
కృతే వత్సాపహారే చ బ్రహ్మణా కృతసంస్తుతిః.
యజ్ఞపత్నీ స్తుతి శ్చాత్ర సంగ్రహాస్తు తృతీయకే,
నందాద్యాగమనం పూర్వం గోపబాలై ర్బలేన చ.
సహైవాగమనం బాలకృష్ణ స్యాథానుగీయతే,

శ్రీరస్తు

# శ్రీకృష్ణలీలాతరఙ్గిణి - తెనుగు

## తృతీయతరఙ్గము.



## కథానుక్రమణిక.

తోహారలు: శ్రీకృష్ణుఁడు గోవత్సపాలనముఁ జేసిన యీ కథయందున్
గోకదంబనంద గోపికాహాలి శ్రీకృష్ణ వినుతి ముందున్. 1
బలకృష్ణులువనిఁ గాచుగోవులన్ బ్రహ్మ మాయచేయుటయున్
తెలిసికృష్ణుమాహాత్మ్యము, బ్రహ్మనుతించి వినతి వేడుటయున్ 2
యజ్ఞపత్నులుహరిన్ వినుతించుట యారగింపులిచ్చుటయున్
ప్రాజ్ఞులిందు రాగతాళ వృత్తుల భవ్య ఫణితి మెచ్చుటయున్
నందుడు గోపసుతులు రాముడు గోవిందుడు వచ్చుటలిందున్
ముందుగ గానముసేయఁ బడును నీమూడవతరంగమందున్ 3

—♦ రామకృష్ణులు గోవులఁ గాచుట ♦—

నందగోప స్యాగమనమ్—

1 మధ్యమావతీరాగము - ఆదితాళము.

గోపై రనుగతో నిత్యం  గోబృందాని విచారయన్
గోపాలకస్వామీ నంద  గోపో మహా న్విరాజతే

అథ గోపీనా మాగమనమ్—

2 వి శ్యహావతీరాగము - ఆదితాళము.

వల్లవయువతికదంబం ఆయాతి  వర మరుణాధరబింబం
శృంగారవిలసితపృథులనితంబం  విఖ్యాతవివిధవిలాసవిడంబం
కరధృతదధిదుగ్ధకమనీయఫలజాతం  నిరుపమసంతోషనీలకుంతలమిహ

అథ బలరామ స్యాగమనమ్—

3 నాదనామక్రియారాగము - ఆదితాళము.

హలీ బలీ చ ముసలీ  లలితాంగద కుండలీ
నీలాంబరీ శ్వేతరూపీ  బలభద్రో విరాజతే

అథ శ్రీకృష్ణ స్యాగమనం దేవాంగనాభి ర్గీయతే—

4 హుసేనిరాగము - ఆదితాళము.

ప. ఆలోకయే శ్రీ  బాల  కృష్ణం సఖి
ఆనందసుందర  తాండవ  కృష్ణం
1. నవనీతఖండ  దధిచోర  కృష్ణం - భక్త
భవపాశబంధ  మోచన  కృష్ణం
2. నీలమేఘశ్యామ  సుందర  కృష్ణం - నిత్య
నిర్మలానందబోధ  లక్షణ  కృష్ణం
3. చరణనిక్వణిత  నూపుర  కృష్ణం - కర
సంగతకనక  కంకణ  కృష్ణం
4. కింకిణీజాల  ఘణఘణిత  కృష్ణం - లోక
శంకిత తారావళి  మౌక్తిక  కృష్ణం

నందగోపుని ప్రవేశము—

1 వ కీర్తన.

మందలు మందలు గోవులపై   బృందావన గోపాలురపై
నందగోపు డధినాయకుడై   పొందుగ నేలును మహితుండై

అంతట గోపికల ప్రవేశము—

2 వ కీర్తన.

గొల్లమిటారుల గుంపుల్ - వచ్చిరి   గొనబౌ కెంబెదవుల సొంపుల్ !
మొల్లంపు మేనుల ముద్దైన పెంపుల్   చెల్లనొయ్యారంపుసిరులొల్కు నింపుల్ !
పెల్లుగ పంక్తిపాలు పెరుగుపాత్రలపాణుల్   ఉల్లాస మెనయంగ నొప్పునీలవేణుల్ !

అంత బలరాముని ప్రవేశము—

3 వ కీర్తన.

హాలముగద కుండలములన్   బలమౌ కవచమునన్
తెలిమేను నీలాంబరమునన్   బలరాము డలరి విచ్చేయున్

వ. అంతట శ్రీకృష్ణస్వామివారి ప్రవేశము దేవతాస్త్రీలచే గానము చేయఁబడుచున్నది.

4 వ కీర్తన.

ప. పరికింతుము సొంపౌ శ్రీ   బాల కృష్ణున్ - చెలి
తరియింతుము కొల్చి మన   తాండవ కృష్ణున్
1. ధ్రువమౌ పెరుగు వెన్న   దొంగిలు కృష్ణున్ - భక్తుల
భవపాశబంధముల   బాపు శ్రీకృష్ణున్
2. నీలిమబ్బుల నిగ్గు   నెనరౌ శ్రీకృష్ణున్ - ఎపుడు
మేలౌ ఆనందమున   మెప్పించు కృష్ణున్
3. ఘల్లుఘల్లుమను కాళ్ళ   కడియాల కృష్ణున్ - చేతుల
మొల్లంపు బంగారు   మురుగుల కృష్ణున్
4. గన గన యను మువ్వ   గజ్జెల కృష్ణున్ - జనుల
దనరించు ముత్తెములే   తారలౌ కృష్ణున్

| | | |
|---|---|---|
| 5. సుందరనాసామౌక్తిక | శోభిత | కృష్ణం - నంద |
| నందన మఖండవి | భూతి | కృష్ణం |
| 6. కంఠోపకంఠశోభి | కౌస్తుభ | కృష్ణం - కలి |
| కల్మషతిమిర | భాస్కర | కృష్ణం |
| 7. వంశనాదవినోద | సుందర | కృష్ణం - పరమ |
| హంసకులశంసిత | చరిత | కృష్ణం |
| 8. గోవత్స బృంద | పాలక | కృష్ణం - కృత |
| గోపికాజాల | ఖేలన | కృష్ణం |
| 9. నందసునందాది | వందిత | కృష్ణం - శ్రీ |
| నారాయణతీర్థ | వరద | కృష్ణం |

శ్లో॥ నందసూను రథ గోపసూనుభి
ర్మండితేందువదన శ్శనై శ్శనైః
ఖ్యాపయ న్నఖిలదీనబంధుతాం
వత్సపాలనవిధౌ స దీక్షితః. 4

౫. అసౌ ఖలు భగవాన్ - అపరిమిత కరుణారసాలవాలో భూమా ఖ్యో నిజజన సంతాప హరణప్రవీణః పరిగృహీత గోపకుమార భావో వేణువిషాణ వినాదవిశేషైః - ఉపవనపరిమిళితాన్ ఆగమ భాగవచో విలాసై రివ పరతత్త్వ పరిమిళితా నశేషయోగి చిత్త వృత్తి విశేషానివాశేష గోవత్సాన్ - నిజకరకలిత వేత్రసంచార విలాసై ర్నియమేన సంచారయన్ - సముదిత మహోత్సాహ హాసావలోకన భాషణాదిభిః - అఖిలానపి గోపబాలానానందయన్ వైమానికబృంద నయనమహోత్సవో - మోహాతీత విశుద్ధబోధ మూర్తిరపి - విహరతి హరి రిహ దీనబంధుః. 5

5. వెలయు ముత్తెపునాస విలసిల్లు కృష్ణున్ - నందు
డలర నిండౌ సిరుల కలలొల్కు కృష్ణున్
6. మెడసరుల కౌస్తుభము మెఱయు శ్రీకృష్ణున్ - కలిలో
వెడగు చీకటి నినుడై విరియించు కృష్ణున్
7. మురళిగానము వేడ్క మ్రోయించుకృష్ణున్ - పొగడు
పరమ హంసలు మెచ్చు చరితుడౌ కృష్ణున్
8. దూడల నావుల మేపి తోలించు శ్రీకృష్ణున్ - గొల్ల
చేడియల గుంపులతో నాడు శ్రీకృష్ణున్
9. నందాదులౌ మునులే నతిసేయు కృష్ణున్ - శ్రీ
నారాయణతీర్థ స న్నానించు కృష్ణున్

సుగంధి : అంతనంత నందసూనుడంబుజారి మీఱు మేల్
కాంతి మంతమైన మోము క్రమమహాస్మితమ్ముతో
నింత యింత వత్సకోటి నెల్లఁగాచె దీక్షమై
చెంతగోప సూనులొప్ప శిష్టదీన బంధుడై. 4

వ. అంత భగవంతుడౌ కృష్ణుడిట్లు వర్ధిల్లెను. అపరిమితమైన దయకు మొదలై, "భూమ" అనబడి, తన భక్తులయొక్క సంతాపమును పోగొట్టుటయందు ప్రవీణుడై, తాల్చిన గోపకుమారుని రూపము కలవాడై, వేణువుల కొమ్ముల వాద్యములతో, సమీపవనముల యందు కలిసి సంచరించునవియు, వేదములయందు వాక్యములో యనునట్లు, సొంపుగ పరమాత్మయైన తనతో కలసి తిరుగు నవియు, సమస్త యోగుల చిత్తవృత్తులవంటివౌ గోవత్సములను తనయొక్క చేతిబెత్తముతో, తీరుతీరులుగ త్రిప్పి, మేపుచు, పొడ చూపునట్టి, గొప్ప యుత్సాహముతో, చిరునగవులతో కూడిన చూపులతో, వాక్యములు మొదలౌ విలాసములతో అందరు గోప బాలురను ఆనందింపజేయుచు, విమానములందుండు దేవతలనేత్ర ములకు మహోత్సవము నొనగూర్చుచు, మోహమును అతిశ యించు జ్ఞానానందస్వరూపిస్థైనను, శ్రీహరి దీనబంధువై యిచట విహరించుచుండెను. 5

శ్లో॥ వైమానికాః పరం తత్వం మత్వా గోపాలనందనమ్,
పరస్పరం జగు ర్భక్త్యా గోవత్సానుచరం హరిమ్. 6

5 పంతువరాళిరాగము - రూపకతాళము.

ప. కలయత గోపికా కారుణ్యరసపూర కాలమేఘాభిరామం
అ. చలదధరాంచిత చారుమురళీనాద కలితకైవల్య కామం
1. కుత్సితాసురతిమిరకోటిసూర్యమమరకుముదకుముదబాంధవం
మత్స్యకూర్మాదిశ్రీమహనీయావిర్భావంమాయోల్లసితవైభవం
సత్సుఖామృతజల సతతఖేలననిరతం సాధుజనాత్మదేవం
వత్ససంరక్షణం వాత్సల్యపరిపూర్ణం వల్లవబాలభావం
2. అక్షీణసంపదా మాశ్రయమఖిలసం రక్షణదీక్షాధరం
పక్షీశవాహనం పంకజభవభవ భావితభద్రాకారం
కుక్షిస్థబ్రహ్మాండ కోటివిరాజితం కుటిలకుంతలసుందరం
వీక్షణసముదితం వివిధవిశ్వాకారం విమలవిజ్ఞానసారం
3. కరసరోరుహగత కనకనిర్మితవలయ కమనీయతరవిగ్రహం
గురుతరమౌక్తిక గుణమణిగణభారం గోపీసంతాపాపహం
సురరాజరిపువత్స సురసూదనచరిత సులలితమతిసుగ్రహం
వరనారాయణతీర్థ వరణీయపరమార్థావరణమోహావినిగ్రహం

శ్లో॥ యజ్ఞం యజ్ఞభుజం విష్ణుం గోపబాలైస్సమన్వితమ్,
దధ్యన్నపూర్ణశిక్యాఢ్యం జగుర్వైమానికా వనే. 7

భైరవిరాగము - త్రిపుటతాళము.

ప. పశ్యత పశ్యత భగవంతం - గోప
బాలకశిక్య మపహరంతం
అ. రస్య ధవళ దధి మిళితాన్న పూరిత
రమణీయ కలశ విశేషాశ్రితం

కం. దేవతలు విమానములన్
బోవుచు గోపాలకృష్ణుఁ బొగడిరి, తమలోఁ
భావన పరతత్వముగా
గోవత్సానుచరు, హరిని గురుతరభక్తిన్. 6

5 వ కీర్తన - దేవతలు శ్రీకృష్ణుని స్తోత్రముచేయుట.

ప. కనరమ్మ గోపికల కరుణారసముఁజిల్కు కాలమేఘముఁబోలువానిన్
అ. తనరు మురళీగానమున కెంబెదవిగదలు ఘననాత్మారాముఁడౌ వానిన్

1. దురుసురకక్కసులిరులు విరియరవినై, శశిగ సురలను కల్వల నేలువానిన్
విరళించి మాయ, జలచర కూర్మరూపముల నెరిమహిమ నెగడించువానిన్
నిరతము నానందాబ్ధి కెరలిఁగూడుచు సాధు గుణులమది నైపహా వానిన్
కరుణించు గోపబాల వరుఁడై దూడలమేపు పరమవాత్సల్యంబు వానిన్

2. కొలలేని సంపదల నెలవై పుట్టువుమించి బలదీక్షఁ కాపాడు వానిన్
పులుఁగుదొర కొతంచునఁబువపర మేను లెంచు పొలుపైన నెమ్మేనివానిన్
పలుకోట్ల బ్రహ్మాండములు బొజ్జలోఁ దిరుగ లలివం ప్రజలపాలవానిన్
వెలసిసాక్షిగ విశ్వములరూపు తానై విజ్ఞానసారమౌ వానిన్

3. బంగారు మురుగుల్ హంగైన కేల్దమ్మి లంగల్లు సోయగము వానిన్
రంగైన ముత్యాలెసఁగ, సుగుణాళిఁగోపి కొంగనల జెంగదీర్చువానిన్
పొంగువత్సాసురుని ద్రుంగించి భక్తహిత ముంగూర్చు సులభుఁడౌ వానిన్
సంగీతపరమార్థచణు నారాయణతీర్థ శృంగార రంగఁడౌ వానిన్

ఆ. వె. యజ్ఞభోక్తయగుచు యజ్ఞస్వరూపుఁడౌ
విష్ణు వడవి చిన్నికృష్ణుఁ డగుచు
గోప బాలకులను గూడి యుట్లనుచద్ది
యారగించు టరసి, యమరులనిరి. 7

6 వ కీర్తన - దేవతలు శ్రీకృష్ణుని స్తోత్రముచేయుట.

ప. మేలు! కాంచు! కాంచు! హరి మించున్ - గోప
బాలుర చిక్కముల దొంగిలించున్
అ. కేల కమ్మని తెల్లని పెరుగన్నమున నిండు
వీలౌ సొంపౌ పాత్ర వేడ్కతోడ వహించున్

1. శరమారుత మానస సమవేగవంతం
శతకోటి గోపబాలానపి లాలయంతం
సురుచిరపరిహాససుధా ముద్గిరంతం
సురలోకవనితాగణ మాకర్షయంతం

2. శాఖామృగ లంఘనానుకరణ చతురం
శ్యామసుందరాకార మతులవిహారం
అఖిలలోకాధార మిహ వత్సానుచరం
అధికసాహసోత్సాహవీర్య ముదారం

3. ప్రణయకలహకోలాహల మతిసరసం
ప్రకటితనిజపరమానందవిలాసం
క్వణితకింకిణీఘుణంఘుణలలితలాస్యం
క్వాపి క్వాపి మధుమధురగీతరసాస్యం

4. సరసమసృణకబళ మిహ తు భుంజానం
సబలసకలగోప మఖిలనిదానం
తరళకుండలహార మతినర్మహాసం
వరనారాయణతీర్థహృదయవిలాసం

—♦ అఘాసురవధః ♦—

శ్లో॥ ఆనీతం శిక్యభాండస్థం దధ్యన్నం గోపబాలకైః,
భుక్త్వా వనేచరః కృష్ణ స్త్వఘాసురముఖం యయౌ. 8

శ్లో॥ అఘాసురముఖావిష్టా స్సవత్సా గోపబాలకాః,
ప్రాప్తమోహాపనుత్త్యర్థం ప్రార్థయంతో జగుర్హరిమ్. 9

శ్లో॥ పరమకరుణయా మాం పాలయ త్వాం ప్రపన్నం
నిజపరిజనకామం పూరయాచింత్యకీర్తే,
నిరవధికకృపాబ్ధే నిర్మలానందమూర్తే
భయజలనిధిమగ్నం దీన ముత్తారయేశ. 10

1. అలుగో! గాలియో! మనసో! యనగా పరువెత్తున్
చెలఁగి గోపబాలకుల కోట్ల హత్తున్
చెలువౌ సరసములాడి సేయు గమ్మత్తున్
అలయచ్చరలే వలతు రాతని పొత్తున్
2. లీల కొమ్మలమృగము లలివతో లంఘించున్
మేకాశ్యామల రూపుమించఁ చరించున్
ఏలులోకముల నన్నిటి నిట దూడల బెంచున్
చాల బలముత్సాహము శౌర్య మౌదార్యమునించున్
3. ఆట పోట్లాటల నతినేర్పు గలుగున్
చాటించి యానంద సారమై వెలుగున్
సీసైన కిణకిణల నృత్యముల మెలగున్
తేటా పాట లందందు తియ్యఁగ చెలగున్
4. పెరుగన్నపు ముద్దల నెరిరుచుల గ్రోలున్
మరిగోపకుల రాముఁ కెరలించి యేలున్
వరల భూషలు! చాటా సరి నవ్వులోలున్
వరనారాయణతీర్థ పరుడై మదితాళున్
గీ. ఉట్టికావళ్ళ పెరుగన్న మొనర దెచ్చి
గోపబాలురు తాఁ గొని, కూడి యడవి
తిరుగుచున్ కృష్ణుడేగె భీకరుని యెడకు
నలయఘాసురు పెనునోటి బిలముకడకు.
గీ. కొండచిల్వ యగా నయ్యఘు గొప్పనోరు
కొండగుహ యనుకొని వత్స గోపసుతులు
వేడ్క నటదూరి చీకట వెడల లేక
వివశతం బాప శ్రీకృష్ణు వేడిరిట్లు.
ఉత్సాహ. పరమకరుణ మమ్ముఁగావు భయజలధి నిమగ్నులన్
పరిజనులము నీకు, కోర్కె బడయ నుద్ధరింపుమా
నిరవధిక కృపాబ్ధి! విమలనిత్య కీర్తిధారణా!
వరతర పరితోషభూష! వర్ధనా! జనార్దనా! 10

7 సౌరాష్ట్రరాగము - ఆదితాళము.

1. పరమకరుణయామాంపాలయ-కృష్ణ భక్తమనోరథంపూరయకృష్ణ
పరిపంథిగణ మిహవారయ-కృష్ణ భయసాగరపతితంతారయ-కృష్ణ
2. మధుకైటభాదివిజయాదవ-కృష్ణ మత్స్యకూర్మాదిరూపసాదర కృష్ణ
అధికదయావలోకసుందర-కృష్ణ అపరిమితానందసాగర-కృష్ణ
3. అఖిలాండకోటిపరిపాలక-కృష్ణ అనవద్యగోకులనాయక-కృష్ణ
అఘహరణ దుష్టనివారక-కృష్ణ ఆశ్రితకజనసముద్ధారక-కృష్ణ
4. తరళమణిమకరకుండల-కృష్ణ తాండవనటనకృతమండల-కృష్ణ
సరస పరిపాలితాఖండల-కృష్ణ సాధు గోకులవరస్థండిల-కృష్ణ
5. అవనిమండలభారఖండన-కృష్ణ ఆశ్రితజనహృదయమండన-కృష్ణ
ధ్రువవిభూతిదానవిచక్షణ-కృష్ణ శివనారాయణతీర్థరక్షణ-కృష్ణ

శ్లో॥ ఏవం స్తుత స్స గోవిందః ప్రవృద్ధ స్త మఘాసురమ్,
ఆస్ఫాట్య బాలైర్గోవత్సై స్సహ గోకులమాయయౌ. 11

—♦ గోవత్సబాలాపహరణమ్ ♦—

శ్లో॥ కదాచి ద్గోవిందే కలితమురళీనాదలలితే
సరామే గోవత్సా న్వనభువి సుఖం చారయతి వై
విధిస్తత్సౌభాగ్యం నిరవధిక మాలోక్య కుతుకాత్
ముహుర్వత్సా న్బాలా నహర దజమాయాపరవశః. 12

శ్లో॥ హృతేషు వత్సబాలేషు జ్ఞాత్వా విధివిచేష్టితమ్,
తన్మాతౄస్తోషయామాస స్వయం వత్సాది దేహభాక్. 13

అథ బ్రహ్మాగమనం—

8 నాదనామక్రియారాగము - ఆదితాళము.

ఆయాతి చతురాస్యో బ్రహ్మా సదసి
గాయ న్నాయన్ ధ్యాయ న్ధ్యాయన్ విష్ణుం చేతసి
దండకమండలుధారీ దానవవైరీ
అండబ్రహ్మాండవిధా తాఖిలజనయితా

7 వ కీర్తన - గోపబాలకులు కృష్ణుని ప్రార్థించుట.

1. కనికరమున మము పాలింపవా-కృష్ణా! కలిభక్తుల కోర్కెలీడింపవా-కృష్ణా
ఘనులౌ వైరులగములఁ జూర్ణింపవా-కృష్ణా పెనుభవాబ్ధిని తరియింపవా-కృష్ణా
2. మధుకైటభుల గెల్చినావుగా-కృష్ణా! మత్స్యకూర్మావతారుడవీవెగా-కృష్ణా
అధికమౌ దయఁజూపెదవుగా-కృష్ణా! ఆనందమున దేల్చరావుగా-కృష్ణా
3. జగములన్నింటిని నేలవా-కృష్ణా! నగధరగోకులమున నేలోలవా-కృష్ణా
సాగరదండి ఖలుల ద్రోలవా-కృష్ణా! నాగులు నీవారిగలంజాలవా-కృష్ణా
4. చెవులసొంపులమురళి వెలయుగా-కృష్ణా! దవిలినృత్యముదీర్పవలయుగా-కృష్ణా
దివిజేశుఁడే మెచ్చి తేలియుగా-కృష్ణా! నేడిగోపులము నిన్ను కలియుగా-కృష్ణా
5 విశ్వభరణము దీక్షగదరా!-కృష్ణా! విలసిల్లుము మామదిరా-కృష్ణా
శాశ్వతాత్మము గూర్తువుగదరా-కృష్ణా! నీ సన్నారాయణతీర్థునెదరా-కృష్ణా

కం మిత్రులిటు వేడ కృష్ణుడు
రాత్రించరు నోటదూరి రయముగ బెంచన్
గాత్రము, వాఁడీల్గె నవిసి
గోత్రాతయు హితులు చనిరి గోకులమునకున్. 11

మ. మురళీగాన వినోదలీల బలరామున్ గూడి గోవిందుఁడా
దరి,మందన్ వని బీళ్ళమేపి, సుఖుఁడై తానుండు సౌభాగ్యమున్
సరిలేనట్టిది చూచి బ్రహ్మ మదిలో సందేహియై దూడలన్
హరియించెన్ వ్రజబాలరాజి నొకనాఁడత్యంత మాయాధృతిన్.

కం. గోవత్సంబుల బాలుర
నా విధికొని దాచుటెఱిగి హరిదయతోడన్
తా వరలె నన్నిరూపుల
నేవిధి లోపంబు తల్లు లెఱుగని లీలన్. 13

8 వ కీర్తన

అంత బ్రహ్మ వచ్చుట—

నలు మోము లలర నలువయుడకు విచ్చేసెన్
తలఁచి తలఁచి మదిచెలఁగ చెలఁగ-పాట తా విష్ణు నుతించి
దండ కమండలముల గొని దనుజుల నొంచి
అండ బ్రహ్మాండముల తీరికల నన్నిటి నిర్మించి

శ్లో॥ ఇత్థం భూతం హరిం దృష్ట్వా వత్సరాంతే విధిః స్వయమ్,
సందర్శిత జగత్కోటిశరీరిం స్తౌతి సాదరమ్. 14

9 సురంజీ (భైరవి) రాగము - ఆదితాళము.

ప. జయజయ గోకులబాల జయసకలాగమమూల
దయయా మాం గోపాల దీనం పాలయ బాల

1. దేవ మయా చరిత మిదం దీనధియా అపరాధం
శ్రీవసుధాధవ కృపయా కేవల మిహ ధునీహి

2. ఈక్షే తావక దేహే ఈశ జగంతి నిరీహే
వీక్షా శిక్షితమోహే వేదాంతాగమగేహే

3. జగదండకోటితనో జగదుదరాంతరసుతనో
అగణితసంజాతమనో అపరమితాశ్రితధేనో

4. వితరమ యీశ్వర కరుణాం విఘటయ మోహావరణం
సతత మ్మే భవశరణం సాధయ సంసృతితరణం

5. ఇతి విధినా పరిగీతం శ్రుతివచసా హరిచరితం
యతినారాయణకథితం యదుకులభూషణముదితం

శ్లో. లీలామానుష దేహంలక్ష్మీశం త్వాం ప్రసాదయే దేవమ్,
సంసారార్ణవపతితం కంసరిపో మాం త్వముద్ధర త్వరయా 15

10 మోహనం (రేగు?) రాగము - ఆదితాళము.

ప. దేవ దేవ ప్రసీద మే-దేవకీవర బాల- దీనజనపరిపాల-దేవ

1. లీలావినోదవిగ్రహ లక్ష్మీపతే
బాల మోహవినిగ్రహ బాలోన్నతే
కలితసేవకానుగ్రహ కామాకృతే
అలఘులీలాపరిగ్రహ అఖిలాండపతే
ఖలమునిబృందానుగ్రహ గోపాలకృష్ణ

మి. బాల ఘనసీలాతిశీల హేమచేలా - నంత
లీలాగమమూల శ్రీలోలాతివిశాలఫాల - బాలగోపాలకృష్ణ

గీ. వత్సరాంతంబునం బ్రహ్మ వచ్చి మఱల
వత్స బాలక బహురూప వర్తనమున
సర్వజగదంతరవ్యాప్తి చాటు కృష్ణు
విష్ణు గుర్తించి భక్తితో వేడె నిట్లు. 14

9 వ కీర్తన - బ్రహ్మ కృష్ణుని స్తోత్రముచేయుట.

ప. మేల్ మేల్! గోకులబాల! మేలౌ వేదాలవాల!
మేల్ దయ నీక నన్నేల బోలున్ దీనుడ చాల

1. దేవా! నాయీాచరితము దీనముగడు నజ్ఞానము
శ్రీ వసుధావర! సైపుము కేవలకృప నాసేరమటి

2. ఈశా! నేగనుచుంటిని ఈజగములు నీ మయమని
నా శంకలు చనె నినుగని నమ్మితి శ్రుతులకు నెలవని

3. జగములెన్నొ తగు నీలో జన్మింతు రెందఱు మనువులో
నెగడెద వీ వన్నిటిలో నీవారిలో గోవులలో

4. కరుణన్ ప్రభు! గురియింపుము ఘనమౌ భ్రమ విరియింపుము
శరణ మెపుడు గొని పెంపుము సంసారము తరియింపుము

5. తొలిచదువుల గాన గతిన్ వెలసెను హరికథ ఫణితిన్
నలువ శ్రీకృష్ణు నుతిన్ నారాయణతీర్థ మతిన్

కం. లీలామానుష దేహున్ శ్రీలలనా నాథు కృష్ణు సేవింతు నినున్
తేలింపు జన్మ జలధిన్ సోలు ననున్ త్వరగ కరుణ సుతు కంసారీ

10 వ కీర్తన - బ్రహ్మ కృష్ణుని స్తోత్రముచేయుట.

ప. దేవ! దేవ! నన్ను బ్రోవవ-దేవకీతనయుడవా! దీనులగావవా!

1. మేలౌ రూపము నీదులీల శ్రీకాంతుడవు
ప్రీలు మోహాము నీ మ్రోల వరబాలుడవు
తాళెదా భక్తులపాల మరుసముడవు
చాలెదా సత్యంబు దేల జగదీశుడవు
యేలెదా మునుల నేవేళ గోపాలకృష్ణ

మి. నీలిమొయిలన పసిడి సేలువతో సుశీల
కేళి వేదము మొదలై శ్రీలొల్క-ఫాలంపు హేల-బాలగోపాలకృష్ణ

2. శ్రీవత్సలక్షణాంచిత శ్రీభావిత
దేవగంధర్వసేవిత దివ్యాయుధ
గోవత్సగణసంవృత గోపాలవృత
అవ్యయమునివందిత అచింతిత
భవ్యగోకులనిరత గోపాలకృష్ణ

మ. పీతాంబరవీత విధుశీతాఖిలతాతారఘువి
ఘాతాఙ్గన సూతామర గీతాగమజాతభాత - బాలగోపాలకృష్ణ

3. పూర్ణేందుమండలానన పురాతన
పూర్ణసువర్ణవాహన వరానన
తీర్ణసంసారమోహన ధీశాయన
కర్ణకుండలశోభన కంజాసన
వర్ణితవీర్యవామన గోపాలకృష్ణ

మ. నారాయణ ధీరాగమసారాఘవి దూరాసమ
హారారి వి దారామర వీరాసంసారపార-బాలగోపాలకృష్ణ

శ్లో॥ కర్పూరభా కువలయదళశ్యామలా చాభిరామా
కల్యాణానాం సకలజగతాం మాంశ్రయా గోపబాలా
భక్తత్రాణాధ్వంవరవిధా దీక్షితౌ మోక్షహేతూ
మాయామాశ్రిత్య విరచితతనూ రామకృష్ణౌ స్మరామి. 16

శ్లో॥ భగవంత మితి స్తుత్వా విధిః స్వం ధామ సత్వరమ్
హరిణా గురుణా జ్ఞాతో యయౌ కృష్ణోపి గోకులమ్ 17

అథ యాజ్ఞికానా మాగమనమ్—

11 సౌరాష్ట్రరాగము - ఆదితాళము.

1. అరణిపాలాశకుశ భారం వహంతో
ధరణితలే సతతం ధావంతో యాజ్ఞికా ఆయాంతి

2. శ్రీవత్సమను చిహ్నతోడ సిరికోరగ
దేవగంధర్వులు వేడ చక్రాదులెనయగ
గోవత్సముల మందఁగూడ గోపకుల్ గొల్వగ
సేవించు మునివరులు పాడ నవు డద్భుతముగ
తానా గోకులము నీడ గోపాలకృష్ణ

మి. బ్రోవుతండ్రివై శశి - రవి పీతాంబరమున
పోవుపాపము, పార్థసారథి-వై విబుధాగమములన్ దగ-బాలగోపాలకృష్ణ

3. మోము పూర్ణిమసోముడనగ తొల్తటి పెంపుగ
ధీ మహతి గరుడునిపై జనగ సొంపెనయగ
మేమీ మోహము దాటిమనగ బ్రాపైతివిగ
నీ మేల్కుండల కాంతిగనగ మా మెప్పు మించగ
వామనుడవై విక్రమము గొనగ గోపాలకృష్ణ

మి. ఓమి నారాయణతీర్థ - నొసగు సరముల, వేదనుతిశుభ
నామమహిమసంస్తుతిని వైరుల - నసురవీరోత్తమా: మింతువు-బాల గోపాలకృష్ణ

శా. బాల్యప్రాయము గోపభావమలరన్ భవ్యాభ కర్పూరమో
నైల్యంబున్ దగు కల్పయోయనగ విన్నాణంబుగన్ భక్తసో
శీల్యత్రాణమె యజ్ఞదీక్షగ, జగచ్ఛ్రేయార్థమాయాధుర్యలా
కల్యాణాత్ముల రామకృష్ణులను మోక్షప్రాప్తికై గొల్చెదన్ 16

ఆ. వె. బ్రహ్మ యిట్లు వేడి భగవంతు గురు కృష్ణు
సెలవుఁబొంది తనదు నెలవుఁ గాంచె
బ్రహ్మమాయ విడిన పశుబాలకులతోడ
హరియు గోకులమున కరిగె నంత. 17

అంత యజ్ఞముచేయువారి ప్రవేశము—

11 వ కీర్తన.

1. అరణులు పాత్రలు దర్భలు మొదలౌ యజ్ఞవస్తువుల గొనుచున్
పరుగులెత్తుచున్ యాగశాలలన్ పర తెంతురు యాజ్ఞికులున్

2\. పవిత్రపాణయో నిత్యం పశులక్షణవిదో
సవితృమండలాంతస్థం ధ్యాయంతో యాజ్ఞికా ఆయాంతి
3\. అహం పూర్వమహం పూర్వ మితి యజ్ఞకుశలా
గహనకర్మసామాదీని గాయంతో యాజ్ఞికా ఆయాంతి

అథ యజ్ఞపత్నీనా మాగమనమ్—

12 యదుకులకాంభోజిరాగము - ఆదితాళము.

యజ్ఞపత్నీబృంద మధునాయాతి యాగశాలామ నింద్యకర్మవిధినా
విజ్ఞానపూరిత శుద్ధమనసాసహ విశ్వాసపూర్వక సభ్రమశిరసా
దివ్యసుందరం భవ్యకంధరం ధృతనవ్యపీతాంబర మద్భుతహారం
చారుకబరీభారభరితం దివ్య చామీకరాభరణగణభాసితం

గ. ఏవం యజ్ఞపత్నీ సహిత యజమాన యాజ్ఞిక ప్రవర్తితే యజ్ఞ
కర్మణి సాక్షా ద్యజ్ఞస్వరూపీ భగవాన్ కందర్పదర్ప మహాసర్ప
గరుడాయమాన దివ్యమూర్తిధరో గోపబాలైస్సహ శనై శ్శనై
స్సంచరన్ చారయన్నపి గోవత్సాన్ తదుపవనదేశమాజగామ,
తత్ర కదాచి ద్వత్సపాలనసమయే బాలా ఊచుః. 18

శ్లో॥ వయ మిహ విచరామో హ్యన్న మాకాంక్షమాణాః
కథ మిహ భగవన్నో బాలకానా మిహాన్నమ్,
ఇతి వనభువి పృష్టో బాలకై ర్బాలకృష్ణో
వ్యవద దిహ చ భూయా దన్న మత్యంత మృష్టమ్.

శ్లో॥ యజ్ఞశాలేయ మస్మాభి రత్రైవాన్నం హి లభ్యతే,
గచ్ఛ పృచ్ఛేజ్యశాలాయాం యజమానం చ యాజ్ఞికాన్. 20

శ్లో॥ యది తే న ప్రయచ్ఛంతి యాచస్వాన్న మశంకితః,
తత్పత్న్యః ప్రతిజానంత్యో దాస్యం త్వన్నాని తాః స్త్రియః. 21

2. పవిత్రహస్తముల నెపుడు యజ్ఞ పశువులరీతులఁ దెల్పుచున్
రవిమండలమునఁగలహరి నెంచుచు రయమునవత్తురుయాజ్ఞికులున్
3. నేమించెద! నేమించెద, యజ్ఞము నోమించు విధుల నంచున్
సామగానములఁగర్మతంత్రముల జదువుచువత్తురు యాజ్ఞికులున్

అంత యజ్ఞపత్నుల ప్రవేశము—

12 వ కీ ర్త న.

యాగశాల శుభవిధి నెరవేర్పన్ యజ్ఞపత్ను లరుదెంతు రెలర్పన్
బాగరుగుపతివ్రతలుసుమతులున్ పతివిశ్వాసముగలుగు వినతలున్
ఆగరితలమేల్ మెడల సొగసులున్ అలరుపట్టువస్త్రములువిలసిలున్
సోగ నెరికురులసోయగమ్ములున్ శుభమాంగరుభూషణమ్ములున్

వ. ఇట్లు యజ్ఞపత్నులతోకూడ యజమానులు యాజ్ఞికులు, యజ్ఞ కర్మలు సల్పుచుండిరి. సాక్షాత్తు యజ్ఞస్వరూపుడైన భగవంతుడు శ్రీకృష్ణుడు మన్మథునిగర్వమనే పెనుబామునకు గరుడపక్షి వంటి (అనగా మన్మథుని గర్వమును హరించునంత సౌందర్యము గల) దివ్యమూర్తిధరించి గోపబాలురతో మెల్ల మెల్లగ తిరుగుచు గోవులను, దూడలను త్రిప్పుచు ఆ యజ్ఞశాలకు సమీపముగ నుండు, అడవులకు విచ్చేసెను. అక్కడ ఒకసమయమున దూడలను మేపుచుండగా కొందరు గోపబాలకులు ఇట్లు కృష్ణునికి విన్నవించిరి. 18

మత్తకోకిల: "ఆకలింగొని యిందుతిర్గెదమన్న! యన్నము గోరుచున్
ఏకతంబుగ మాకు బాలుర కిందు నన్నము చేకురున్
శ్రీకరా!" యని కోరు బాలురఁజేర్చి కృష్ణుడు నిట్లనున్
"మీకుచేకురు నిందు కోరిన మృష్టభోజన మిప్పుడే." 19

మత్తకోకిల: యజ్ఞశాలయదే! కనుండొక డన్నమున్నది యేగరా
యాజ్ఞశాలిని యజ్ఞకారకు నన్నమిమ్మని కోరరా
ప్రాజ్ఞు లన్నము పెట్టరో? చని భార్యలన్ మఱివేడరా
యజ్ఞపత్నులునన్నమిచ్చెదరమ్మలాగదవారురా. 20, 21

శ్లో॥ యాఞ్చితై ర్యజమానేన ప్రత్యాఖ్యాతశ్చ పైర్ద్విజైః,
యయాచే యజ్ఞపత్నీస్తాః కృష్ణార్థే గోపబాలకః. 22

శ్లో॥ సకృచ్ఛ్రవణమాత్రేణ స్వాద్వన్నాని బహూన్యపి,
ఆదాయ తాః పరం కృష్ణం ముక్తసంగాః ప్రదుద్రువుః. 23

శ్లో॥ తత్ర గత్వా తు గోపాలం గోపీజనమనోహరమ్,
భోజయిత్వాథ సంతుష్టం విహితాఞ్జలయోఽస్తువన్. 24

13 మోహనరాగము - ఆదితాళము.

ప. బాలగోపాలకృష్ణ పాహి పాహి

అ. నీలమేఘశరీర నిత్యానందం దేహి దేహి

1. కలభసుందరగమన కస్తూరిశోభితానన
నళినదళాయతనయన నందనందన
మిళితగోపవధూజన మీనాంక కోటిమోహన
దళితసంసారబంధన దారుణవైరినాశన

2. యజ్ఞయజ్ఞసంరక్షణ యాదవవంశాభరణ
యజ్ఞఫలవితరణ యతిజనశరణ
అజ్ఞానఘనసమీరణ అఖిలలోకకారణ
విజ్ఞానదళితావరణ వేదాంతవాక్యప్రమాణ

3. వ్యత్యస్తపాదారవింద విశ్వవందిత ముకుంద
సత్యాఖండబోధానంద సద్గుణబృంద
ప్రత్యస్తమితభేదకంద పాలిత నంద సునంద
నిత్యదనారాయణతీర్థ నిర్మలానంద గోవింద

శ్లో॥ యజ్ఞపత్న్యస్తు మీశానాం లీలాగోపాలవిగ్రహమ్
ప్రసాదయంతి యం వేదా స్తాత్పర్యేణామనంతి తే. 2

సుగంధి: అంత గోపబాలుడేగి యన్నమంచు కోరగా
నింతకైన విప్రవర్యు లీయకుండ పొమ్మనన్
అంత యజ్ఞశాల వెన్క కాతడేగి స్వామికై
కాంతలన్ ద్విజాంగనాళిఁ గాంచి కోరె నన్నమున్. 22

సుగంధి: బాలుకోర్కె వారు విన్చు భక్తితోడ వేగమే
చాలునన్ని రుచ్యమై యెసంగు వంటలూనుచున్
ఆలమంద కేగి గోపికాంగనా మనోహరున్
బాలకాళిఁ దన్వి మ్రొక్కి ప్రస్తుతించి రిట్టులన్. 23, 24

12 వ కీర్తన - యజ్ఞపత్నులు శ్రీకృష్ణుని స్తోత్రము చేయుట.

ప. బాలగోపాలకృష్ణ ఏలు! ఏలర!
నీలిమబ్బు బోలు మేన నిండె మోదమీయర ఈయర!

అ. గున్న చెన్నౌగమనమున గౌనబౌ కస్తూరి మోమున
కన్నులు విరితమ్ములన గారాబమున
నిన్ను నందుకు గోపికలు గన నెనరున మారుని రూపమున
భిన్నమై యిహబంధములుచన బిరుసునైరుల ద్రుంతువు తెంపున

2. యజ్ఞమై యజ్ఞము రక్షించి యదుకులము పెంపుగ జన్మించి
యజ్ఞఫలము లిప్పించి యతుల మన్నించి
అజ్ఞతమబ్బన గాలిగ్రమించి అఖిలజగము కల్పించి
విజ్ఞతన్ భ్రాంతుల నణంచి వేదాంతార్థము నిరూపించి

3. పదముల మార్పులింపొంద ప్రణతులిడ విశ్వము, ముకుంద!
సదయబోధ లెందు చెంద సద్గుణము లొంద
మొదటిభేదము లంతమంద మునులు యోగులు జ్ఞానమంద
ఎద నారాయణతీర్థు నంద నెనయు గోవింద! శుభమొంద.

గీ. వేద తాత్పర్య నుతు నీశు విష్ణు కృష్ణు
బాలలీలా విలాసు గోపాలసుతుని
యజ్ఞపత్నులు సేవించి రలరఁజేసి
బాలగోపాలక తరంగ భంగి నిట్లు. 25

14 మోహన (రేగుప్తి) రాగము - ఆటతాళము.

ప. బాలగోపాల మా ముద్ధర-కృష్ణ పరమకల్యాణ గుణాకర
అ. నీరద నీలకళేబర - కృష్ణ నిరుపమ కౌస్తుభ కంధర
1. నందనందన భక్తచందన - సుర బృందరచిత బహువందన
మందస్మిత సుందరానన - కోటి మదనసుందర జగన్మోహన
ఇందిరామందిర - భక్త సుందర హృదయారవింద
భృంగ భక్తి మకరంద నందిత గోపికాబృంద

తాం తాహతధైదత్తతాం-తక్కతో ధిమ్మిణాం గిణతో ధిమ్మిరే-త
క్కత్తోధిమ్మిధిమికిటతోధిమ్మిరే - తక్కత్తోదిగిణాందిగంగిణత్తోం
గ ధిర్గుడుదధిర్గుడు దత్తుంగ - తోదగిణంగ త్తిరుతోంగ - ధిర్గుడు
ద ధికితకిటదధిగిణతోం - బాలగోపాల

2. యజ్ఞాదికర్మఫలప్రద - కృష్ణ యదుకులజాతసుఖప్రద
యజ్ఞసంరక్షణ దీక్షిత - కృష్ణ యతిజనముక్తిదసువ్రత

తాధైయ్యధై ధత్తధా - కిటతకత తక్కణ్ణంకిణ్ణం-తరికిట తరికిట ధిమి
ధిం ధింధిమికిట - తోంగిట కిటత్తోంగ తోంగిణ - కిణకిణ ధరిధరి
కుంతకతక-దిర్గుడుతకతకదిర్గుడుతక - గణపతి గురుశ్రీపతిషణ్ముఖ
జయజయజయ - ఝుంతరి కిటతక తత్తోంగిటతోంగ - తక గిణ
దినహతధిమితాతాధాం - తకదిర్గుడుతక దధిగిణతోం - దినహత
ధిమితాతాధాం - తకదిర్గుడుతకదధిగిణతోం

మ. చింతితజన చింతామణిగణ సంతత సుఖసంతానప్రద
మందరధర మంజుళ మౌక్తిక నందితజన నందాత్మజ వర
బృందావన బృందారకగణ వందితపద వసుదేవాత్మజ

జయజయజయ-ఝుంతరికిటతక తత్తోంగిట తోంగి - తోకగిణ దినహ
తధిమితాతాధాం తకధిర్గుడుతకదధిగిణతోం - బాలగోపాల

14 వ కీర్తన - యజ్ఞపత్నులు శ్రీకృష్ణుని స్తోత్రముచేయుట, నృత్యము చేయుట.

ప. బాలగోపాలా! నను బ్రోవరా! కృష్ణ బహుసుగుణముల కీవె తావురా
అ. నీలిమొయిలను మేననెనయురా కృష్ణ నెనరా కౌస్తుభము మెడను మొనయురా
1. సుతుడంచు నందుండు తలచురా! సుర-తతి భక్తఛందనుడని గొలుచురా
స్మితము మోమున నెంతో పొలుచురా! పరు -చెలువు నెల్లరు మెచ్చ గెలుచురా
అతులమౌ సిరి నెలవు; భక్తుల మతులె పద్మము లీవె యళిరా
వితతభక్తి రసంబు తేనెల ద్రావెనెలంతలు గ్రోలెదరురా

తాం తాహతధైదత్తతాం-తక్కతో ధిమ్మిణాం గిణతో ధిమ్మిరే-త
క్కత్తోధిమ్మిధిమికిటతోధిమ్మిరే - తక్కత్తోదిగిణాందిగంగిణత్తోం
గ ధిర్గుడుదధిర్గుడు దత్తుంగ - తోదిగిణంగ త్రిరుతోంగ - ధిర్గుడు
ద ధికితకిటదధిగిణతోం - బాలగోపాల

2. యజ్ఞఫలము లిప్పించవా? కృష్ణా! యదువంశమున మేలు పెంచరా
యజ్ఞమేలుదీక్ష మించవా? కృష్ణా! యతిరక్షవ్రతమని యెంచవా

తాధైయ్యాధై ధత్తధా - కిటతకత త్కిణ్ణంకిణ్ణం-తరికిట తరికిట ధిమి
ధిం ధింధిమికిట - తోంగిట కిటత్తోంగ తోంగిణ - కిణకిణ ధరిధరి
కుంతకతక-దిర్గుడుతకతకదిర్గుడుతక - గణపతి గురుశ్రీపతిషణ్ముఖ
జయజయజయ - ఝుంతరి కిటతక తత్తోంగిటతోంగ - తక గిణ
దినహతధిమితాతాధాం - తకదిర్గుడుతక దధిగిణతోం - దినహత
ధిమితాతాధాం - తకదిర్గుడుతకదధిగిణతోం

జిజ్ఞాసులకును చింతామణివి గావ? సిరియుసంతతియొసగ సేవమిత్తువు గావ?
ప్రజ్ఞమందరమూనవ? బహుముత్యములగొనవ? భక్తులలరనందు పాలనగైకోవ?
ప్రాజ్ఞులౌ బృందావనదేవతలు మ్రొక్కు పదముల వసుదేవ భవ్యాత్మజుడవు గావ?

జయజయజయ-ఝుంతరికిటతక తత్తోంగిట తోంగి - తోకగిణ దినహ
తధిమితాతాధాం తకధిర్గుడుతకదధిగిణతోం - బాలగోపాల

3. అన్నమయాదిషుపంచసు త్వా- మంతర మానంద విగ్రహం
ఉన్నతఫలమామనంతితే జగ-దుదయలయాదిషు లక్షితం
తద్ధిత్వమేవాసితద్ధిత్వమేవాసి-తత్సర్వమేతత్త్వమేవాసినూనం
ఉత్తుఙ్గముక్తామణిప్రస్ఫురద్దివ్య - మత్తేభవద్యోగిచిత్తేస్ఫురంతం
నృత్యంత మత్యం తమానందమీడే - హితంత్వా మహంత్వా
మహంత్వామహం

తధితకుకు దకుకుత తత్త కుకుధికుకు - తత్తత్తోంగు తక్కిటకిటకుధరికిట
తతోంగ - కిట్టకితకిటదధిగణతోం - శాలగోపాల

4. సంతత మంత రవస్థితం - హృది సత్యవిజ్ఞానసుఖాకృతిం
అంతర్యామితయోదితం - యోగి చింతిత మాకలయామి త్వం

త్తధిగ్గుడుధత్తాం - తత్తధిగ్గుడుధత్తాం - కిడతకత త్తరికి తత్తరికిదోగు
డుదోగుడుతకధోంధోం - కుందకిటకిటధరికికుంద త్తకుకుధరికి -
ఢేకు ఢేకుకుధరికిఢీక్క్ప్రభేదమిహ - ఝుకు ఝుకుజర్ఝుణ

జయశీలనటనమిహ - సకలజగదాదిం సకలమునిగీతం
సకలనిగమాంతజనితాంతమతివిదితం
తంపరమయోగి గణచింతిత మఖండసుఖ
సంపద మపారమహిమాన మణిమాన మిహ
రంగత్తరంగమాతంగ వరహంసగతి
మంజీరమంజురటనట మఖిలరంజనం

తతధింతధింతతకిట ధిమిధిమిధిమి తధీతకిట ధిమితకిట ధిమితకిట హాం
తధీం - తాహత్త తాహత్త ధిన్నాం - తాహత్తధీం - ధిన్నా
ధిన్నాహత్తతాంధిన్నా ధిన్నధీం - తాతాధిన్నధీం - తద్ధిన్నతక
ధిన్న తాహత్తధిన్నాం - కత్తరిడిక త్తరిడి కాహురె కాహురె -
కంజరిడికంజరిడి దేహురే రాహురే

3. అన్నమయాది కోశమ్ముల నీవు నైదింట నలరు రూపమ్ముల
ఉన్నతమైనఫలమ్ముల నొసెద పొనరారియుణగు జగమ్ముల
ఉన్నదంతయు నీవె ఒనరెదంతట నీవె ఒప్పుతత్త్వము లెల్ల నూహింప నీవే
చెన్నొను ముక్తామణుల సింధురమ్మనయోగి చిత్తంబులందెంతో భాసిల్లెదీవే
ఎన్న నౌ నృత్యమున నెంతో యానందమున హితుడౌ నిన్నెంతుముఏమె నిన్నేమే

తధితకుకుదకుకుతతత్త కుకుధికుకు – తత్తత్తోంగు తక్కిటకిటకు ధరికిట
తతోంగ – కిట్టకితకిటదధిగణతోం – బాలగోపాల

4. ఆనయమ్ము హృదయమ్ము నందవా విజ్ఞానానందరూపము నొందవా
ఎనసి మదిలో వ్యాప్తి చెందవాయోగి జనులు చింతింప ముద మొందవా

త్తధిగ్గుడుధత్తాం – తత్తధిగ్గుడుధత్తాం – కిడతకతత్తరికిత త్తరికిదోగు
డుదోగుడుతక ధోంధోం – కుందకిటకిట ధరికికుంద త్తొకుకుధరికి –
ఢేకుఢేకుకుధరికిఢిక్క ప్రభేదమిహా – ఝుకుఝుకుజఝుణ

నిను జగమ్ముల మొదలనిగెల్చువాడను మునులపాటల నందవా
దనరు వేదాంతముల మొనసి వినుతుల చెందవా?
గనినిన్నఖండసౌఖ్యము గొనుయోగుల మనసులకు చెందవా?
ఎనలేని మహిమల ఘనుడ, విందింపొందవా?
దనరునఁచ యేన్గు తత్తడి నడకల
ఘనఘన గజ్జల జనులలర పెంపొందవా?

తధింతతధింతతకిట ధిమిధిమిధిమితధీతకిట ధిమితకిట ధిమితకిట హాం
తధీం – తాహ త్తధీంతాహత్తధిన్నాం – తాహత్తధీం – ధిన్నా
ధిన్నాహత్తతాంధిన్నా ధీన్నధీం – తాతాధిన్నధీం – తద్ధిన్నతక
ధిన్న తాహత్తధిన్నాం – కత్తరిడి కత్తరిడి కాహురె కాహురె –
కంజరిడికంజరిడి దేహురే రాహురే

సంగీత సాహిత్య విద్యావినోద పరగోవింద గోపాల
గోపీమనోహరే - మతిరస్తు - రతిరస్తు మంగళం భవతు మమ

తద్ధింత తద్ధింత తకిటధిమిధిమిధిమిత - ధీతకిట ధిమితకిటకిడ్తకత
కిటదధి గణదోం - బాలగోపాల

5. తారకసమముక్తహారకం భక్త-కారుణ్యరసపూర ధారకం
నారదముని క్షేమకారకం-ధీరనారాయణతీర్థతారకం
తాంతాహతధణతాంధణాంధణతాం-ధణ్ణాంధణ్ణతాం
తద్ధిమ్మితద్ధిమ్మితాణ్డవాలోలం-రింఝురింఝురింఝుణరాధాలోలం
కుండకిటకిటధరికిగోపికాజారం - నగధరంతోంధిత్తనవనీతచోరం
త్వామహం కలయామి ధీర - మనామయం సకలకామదం భువి
సంతతమానన్దతాణ్డవాలోలం - సద్గుణమణిగణభూషణజాలం
సుందరగోకులబాలగోపాలం - సత్యప్రతిజ్ఞసంతానగోపాలం
విఖ్యాతసత్కీర్తివిజయగోపాలం - సుందస్మితానన్దమదనగోపాలం
కందర్పకోటికల్యాణగోపాలం - భక్తజనబృంద ప్రసన్నగోపాలం
సిద్ధజనసిద్ధాంతసిద్ధగోపాలం - మత్స్యావతారాదిమహిమగోపాలం
తం త్వా మహం త్వా మహం

తద్దితకుకుధికుకుతత్తత్తకుకుధికుకుత త్త - తోంగుతక్కిటకిటకుధరికి
టతధోంగ - కిడ్తకిటతకిటదధిగణధోం - బాలగోపాల

5. ఝైధరికిటతాహంధిత్తా - జేజేఝుంతరిదిగిధిగిదిత్తా - దిత్తరిదిగిదిగ్గ
డుదిగిదిగ్గడుదిత్తా - తదిమితోదిమితోంగిటదిత్తాతత్తోంతత్తోం
గక్కిటతక్కిట-ధణధణతదిమిహిణ్ణం-ధళంగుతకతకదదిగిణధోం

సెనరా సంగీతమ్ము-గొనబౌసాహిత్యమ్ము విని వినోదము నొందవా
నినుగోపికలుగొల్వ కను! మోదముశుభమ్ము నిత్యమ్ము! గోవింద !గోపాల! శ్రీలోల

తద్ధింత తద్ధింతతకిటధిమిధిమిధిమిత - ధీతకిటధిమితకిట కిడ్తకత
కిటదధి గణదోం - బాలగోపాల

5. హారములు ముత్యముల్ తారలాా? మాపై కారుణ్యమమృతంపు ధారలాా?
నారదునిమేలౌ తోహారలా? నేమఃహా నారాయణతీర్థ సేరలా?
తాంతాహతధణతాంధణాంధణతాం ధణ్ణాంధణ్ణతాం

తద్ధిమ్మి తద్ధిమ్మి-తాండవామాడన్ రింఝు రింఝు రింఝణ-రాధికతోడన్
కుందకిటకిటధరికి-గోపికలగూడన్ నగమూని-తోంధిత్త-నవనీతము వేడన్
ధీరుడౌనీవే మాదిక్కై తనర్పన్ ఏరుజలేకెల్ల కోరికలఁ దీర్పన్
తీరౌ తాండవమెపుడు దివ్యానందములన్ నీరమ్యమానగల నెతిసద్గుణములన్
తోరమా శ్రేపల్లె దూడల మేపంగన్ ఆరూఢి సంతాన మభయమ్మొసంగన్
పీరుడవై కీర్తి విజయోత్సవమునన్ మాఽండబోయిన మందస్మితమునన్
శ్రీరహిస్మరకోట్ల చెల్వౌ శుభములన్ సారకృపన్ భక్తసాధు బృందములన్
చేరమనస్సిద్ధి సిద్ధసంఘములన్ మీరిమీనము మొదలౌ మేటిరూపములన్
మేలొందు విన్నంతుము మేమే నిను, మేమే

తద్ధితకుకుధికుకుత త్తత్తకుకుధికుకుతత్త-తోంగుతక్కిటకిటకుధరికి
టతధోంగ-కిడ్తకిటతకిటదధిగణధోం - బాలగోపాల

6. ధై ధరికిటతాహంధిత్తా - జేజేఝంతరిదిగిధిగిదిత్తా - దిత్తరిదిగిదిగ్గ
డుదిగిదిగ్గుడుదిత్తా-తదిమితోదిమితోంగిటదిత్తాతత్తోంతత్తోం
గక్కిటతక్కిట - ధణధణతదిమిహిణ్ణాం - ధళంగుతకతకదదిగిణధోం

స్వామినం విచిత్రవనమాలినం – పతత్రిరాజగామినం
పరిపాలితగోధనం – భుజగపతిశాయినం – సదానందదాయినం
సమస్తవేదసాధనం – సనాతనం – బాలగోపాలకం – భజామి

రేఘు రేఘు రేరింఖణ రింఖణ – కాహు కాహు రేకంజరి కంజరి –
ఝురు ఝురురో ఝణతజ్జగగిణ – ఢేకు ఢేకు రే – ఢింకుకుఢింకుకు –
ఝంఝురుంఝుహరిటకుముఠింఖణ – తక్కిటకిటతక దిక్కిటకిటతక –
తోంగిటకిటతకనంగిటకిటతకతహతహతదిమిత – ధణేకుదధిగిణ
తోం – బాలగోపాల

శ్లో॥ స్తుత్వా తం యజ్ఞపురుషం యజ్ఞపత్న్యస్తదాజ్ఞయా,
పునః ప్రవివిశు ర్యజ్ఞశాలాం తద్గతమానసాః. 26

శ్లో॥ యాజ్ఞికాస్తేపి తాః పత్నీః ప్రశస్య చ పునఃపునః,
అంగీచక్రు ర్భగవతో మాహాత్మ్య ద్గతకల్మషాః. 27

ఇతి శ్రీ నారాయణతీర్థ విరచితాయాం – శ్రీకృష్ణలీలాతరంగిణ్యాం –
శ్రీకృష్ణగోవత్సపాలనవర్ణనం నామ తృతీయతరఙ్గః.

లలివనమాలతో విభుడవై పులుగు రాజునెక్కి ప్రభుడవై
విలసిల్లు శేషశాయివై అలరుమానంద దాయివై
వెలయింపు గోధనము వేదములే సాధనము
చెలగింపు జ్ఞానము తొలిసీవే దైవము
బాలగోపాలక భక్తి నిను గొల్తుము

రేహలు రేహలు రేరింఖిణ రింఖిణ – కాహలు కాహలు రేకంజరికంజరి –
ఝేకుఝేకురో ఝుణతజ్జగగిణ–ధేకురే ధేకురే ఢింకుకుఢింకుకు –
ఝంఝుఝంఝురిహరిటకుమురింఖిణ –తక్కిటకిటతక దిక్కిటకిటతక –
తొంగిటకిటతకనంగిటకిటతక తహతతహతదిమిత–ధణేకుదధిగిణ
తోం – బాలగోపాల

ఆ. వె. యజ్ఞపురుషు నిట్లు యజ్ఞపత్నులు భక్తి
గాన నృత్యసేవ గదురఁ గొలిచి
యాజ్ఞనంది చనిరి యజ్ఞశాలకు నంత
మనసులన్ని కృష్ణు మననసేయ. 26

ఆ. వె. వారినచట పతులు వరభక్తు రాంద్రంచు
మిగుల పొగడి పొగడి మెచ్చుకొనిరి
"సతులమహిమ కతన సమసె లోపంబులు
యజ్ఞఫలము మాకు నబ్బె" ననుచు. 27

ఇట్లు శ్రీ నారాయణతీర్థ విరచితమగు శ్రీకృష్ణ లీలాతరంగిణియందు శ్రీకృష్ణుడు గోవత్సములను పాలించిన వర్ణనగల మూడవతరంగము.



శ్రీ ర స్తు

# శ్రీ కృష్ణలీలాతరఙ్గిణి-సంస్కృతము

## చతుర్థ తరఙ్గము.



—♦ కథాసంగ్రహము ♦—

శ్లో॥ గీయతే రామకృష్ణాభ్యాం కృతం గోపాలనం తతః,
నందాద్యాగమనం పూర్వం తతశ్చ బలకృష్ణయోః.
కాళీయమర్దనం నాగపత్నీస్తోత్రం తతః పరమ్,
ఖరాసురవధశ్చాథ ప్రలంబస్య చ మర్దనమ్,
దావాగ్నిభక్షణం బాలస్తుతిరత్ర నిగద్యతే.

అథ నందస్యాగమనమ్—

1 సౌరాష్ట్రరాగము - ఆదితాళము.

గోపైరనుగతో నిత్యం గోబృందాని విచారయన్
గోపాలకస్వామీ నంద గోపో మహాన్విరాజతే.

శ్రీరస్తు

# శ్రీకృష్ణలీలాతరఙ్గిణీ - తెనుగు

## చతుర్థతరఙ్గము.



—♦ కథాసంగ్రహము ♦—

రామకృష్ణు లిఁక వనమున గోవులు రాజిల మేపించుటయున్
ఈమెయి నందాదులు గోగణముల నెంచి సంతసించుటయున్ 1
కాళీయుని బలగర్వము లడఁగంగా హరి మర్దించుటయున్
కాళియపత్నులు స్తోత్రము సేయఁగఁ గరుణబూని విడుచుటయున్
ఖరుని ప్రలంబుని కృష్ణుడు గెడపుట ఘనదవాగ్ని భక్షణమున్
హరిని బాలకులు స్తుతించు కథలివి, యార్తులకగు లక్షణమున్. 2

వ. అంత నందుని ప్రవేశము—

1 వ కీర్తన.

మందలు మందలు గోవులపై బృందావనగోపాలురపై
నందగోపు డధినాయకుడై పొందుగ నేలును మహితుండై

అథ బలభద్రస్యాగమనమ్—

2 సౌరాష్ట్రరాగము - ఆదితాళము.

హలీ బలీచ ముసలీ | లలితాంగదకుండలీ
నీలాంబరీ శ్వేతరూపీ | బలభద్రో విరాజతే.

అథ శ్రీకృష్ణాగమనమ్—

3 నాదనామక్రియారాగము - ఆదితాళము.

శంఖీ చక్రీ గదీ పద్మీ | శార్ఙ్గీ కిరీటకుండలీ
శ్రీవత్సీ కౌస్తుభీ దివ్య | పీతాంబరో విరాజతే.

4 నాదనామక్రియారాగము - చాపుతాళము.

| | | | |
|---|---|---|---|
| ప. పాహి పాహి జగన్మోహన | కృష్ణ | పరమానంద | శ్రీకృష్ణ |
| 1. దేవకీవసుదేవనందన | కృష్ణ | దివ్యసుందర | శ్రీకృష్ణ |
| 2. నందయశోదానందన | కృష్ణ | ఇందువదన | శ్రీకృష్ణ |
| 3. కుందరదనకుటిలాలక | కృష్ణ | మందస్మిత | శ్రీకృష్ణ |
| 4. కింకిణీరచితఘుణంఘుణ | కృష్ణ | క్రీడాలోల | శ్రీకృష్ణ |
| 5. కుంకుమపంకవిపంకిల | కృష్ణ | గూఢమహిమ | శ్రీకృష్ణ |
| 6. చంచలఝుళఝుళనూపుర | కృష్ణ | మంజుళవేష | శ్రీకృష్ణ |
| 7. తరళితకుండలమండిత | కృష్ణ | తాండవలోల | శ్రీకృష్ణ |
| 8. ధిక్కృతసురరిపుమండల | కృష్ణ | దీనపాలక | శ్రీకృష్ణ |
| 9. సాధు నాధు నటవేష శ్రీ | కృష్ణ | సత్యసంధ | శ్రీకృష్ణ |
| 10. పాలితనారాయణతీర్థ | కృష్ణ | పరమపావన | శ్రీకృష్ణ |

—♦ రామకృష్ణులు గోవులం బాలించుట ♦—

౫. అథ కదాచిదేతౌ నందకుమారౌ - నిర్మల నిరుపమ రజతాంజన శిఖరి శిఖర సముత్తుంగ దివ్యమంగళ సుందరాంగౌ - దుర్వినయ దుర్వీర్య గర్వప్రచుర విషయ విపినసంచారి మహాసుర మత్తమాతంగమహోదర కేసరిణౌ - సంతత సముల్లసిత కమల కుశేశయ కుముద కల్హార ది కుసుమ సౌరభ్య సౌభాగ్య భోగసమున్మిషదానందాసంభవ దివ్యదర్శనైః హంస కారండవ సారస చక్రవా

వ. అంత బలరాముని ప్రవేశము—

2 వ కీర్తన.

హారము గద కుండలములన్ బలమౌ కవచమునన్
తెలి మెయి నీలాంబరములన్ బలరాము డలరి విచ్చేయున్

వ. అంత శ్రీకృష్ణుని ప్రవేశము—

3 వ కీర్తన.

లలిత పీతాంబర కిరీట కుండల ములు గద శంఖము చక్రములతో
జలజ కౌస్తుభ శ్రీవత్సములతో వెలసెను కృష్ణుడు శార్ఙ్గముతో

4 వ కీర్తన.

ప. ఏలర! ఏలర! జగన్మోహన! కృష్ణ! హెచ్చు మోదమీయర శ్రీకృష్ణ!
1. దివ్యసౌందర్యమున వెలసితివి కృష్ణ! దేవకీవసుదేవులకు శ్రీకృష్ణ!
2. అలరింతువు చంద్రాననమున కృష్ణ! యశోదానందులను శ్రీకృష్ణ!
3. చిఱునవ్వుల మొల్లల పల్వరుసల కృష్ణ! వరలువంపౌ ముంగురుల శ్రీకృష్ణ!
4. ఘణకిణగజ్జెల గంటల కృష్ణ! కలయ నాడుకోర శ్రీకృష్ణ!
5. గూఢమౌ నీ మహిమ తెల్పునె కృష్ణ! కుంకుమంపు పూత శ్రీకృష్ణ!
6. ఝుళంఝుళమని మ్రోగు నందెల కృష్ణ! చాల సొంపరివి శ్రీకృష్ణ!
7. తాండవమున కదలి తూగును కృష్ణ! తళతళ కుండలములు శ్రీకృష్ణ!
8. రక్కసిమూకల ధిక్కరింతువు కృష్ణ! రక్షింతువు దీనుల శ్రీకృష్ణ!
9. మేలు! సత్యము పాలింతువు కృష్ణ! మేటియాటకై నేత శ్రీకృష్ణ!
10. శ్రీరమణ! పావనునిఁ జేయర కృష్ణ! శివనారాయణతీర్థ శ్రీకృష్ణ!

వ. అంత నొకప్పుడు నందకుమారులౌ ఆ బలరామకృష్ణులు ఇరువురు పావనములైన వెండికొండ అంజనపర్వతము ఈరెంటికి శిఖరములవలె దివ్యగుణములైన శోభగల ఎత్తైన శరీరములు గలవారై దుర్వినయము దుర్వీర్యము గర్వము అనే పర్వతములపైన పెనుగువిషయలంపటత అనే అరణ్యమున, సంచరించురాక్షసుల నే, మదించిన ఏనుంగులకు, సింహములై విహరించుచుండిరి. అందు నెల్లపుడు నలరు కమలములు తెల్లదామరలు కలువలు మొదలౌ నీటిపూవుల పరిమళము, నిండుచే కలుగు, ఆనందానుభవము దివ్యమైన దర్శనము గలవై, హంసలు, కొక్కెరలు, బాతులు, జక్కవలు మొదలౌ నీటిపక్షులచే అనుదినము చూప

కాదివివిధవిహంగమైరనుదినముదితమహోత్సాహసాహససమృద్ధ సముచ్ఛృంఖల కలరవావబోధితనిజానందావధీరితబ్రహ్మలోకాది సుఖైర్నిజతటసమాగతసురవిటపిబృందైశ్చ సంతత పరిశోభమానాయాః కాళింద్యాస్తటభువి పర్యటంతౌ-కరతలకలితవేణువిషాణ వేత్రౌ-నిరవధికకృపావలోకనహాసపరిహాసవిలాసైర్నిజపరిజనానానందయంతౌ-సకలలోకపాలకావిహ గోపాలౌ బభూవతుః. తే చ గోపబాలాః తదీయవిలాసాపన్నసుధారస మాకంఠమాపీయాత్యంతతృప్తతయా సముద్గిరంత ఇవ భగవదనుగ్రహప్రతిబోధిత సకలకలాస్తదీయకల్యాణగుణగణానిత్థంగాయంతో వభువిసుఖంచేరుః. 3

5 మధ్యమావతీరాగము - ఆదితాళము.

ప. కలయత వనభువి కామగతిం-కలభగమన మఖిలాత్మరతిం

1. రజతశైలశిఖరోపమకాయం-రమణీయమిహ రామనామధేయం
సజలజలదరుచిరం గతమాయం-సకలవల్లవీజారభాగధేయం

2. లలితతరమురళీనాదవినోదం - లావణ్యరసపూరసరిదాస్పదం
అళికులమిళితతులసీబృందమోదం - ఆనందనటనసుందరపాదం

3. దివ్యత్రిభంగిలలితతరగాత్రం - దేవాదివిరచితనుతిపాత్రం
భవ్యకరకమలకమనీయవేత్రం - భాస్కరకోటిప్రభంజనమిత్రం

4. సకృదవలోకనకృతజనానందం - సరసకుండలశోభిమృదుగండం
ప్రకటితబ్రహ్మాండశతకోటితుణ్డం-ప్రాకృతాసురతిమిరమార్తాణ్డం

5. రవితనయాతటసుఘటితఖేలం - రక్షితసకలగోకులబాలం
నవరసపరిపూర్ణగానవిలోలం - నారాయణతీర్థగీతసులీలం.

శ్లో॥ గోవిందానుచరా స్సర్వే గోవిందాసక్తచేతసః,
గోవింద మనుగాయంతో సానందం ననృతు ర్వనే. 4

బడు గొప్ప యుత్సాహము అతిశయము స్వేచ్ఛ వీనితో, వానిసొంపగు ధ్వనులచే తెల్పబడునట్టి సంతోషాతిశయమువల్ల సౌఖ్యమువల్ల, బ్రహ్మలోకమును మించునవై, వెలయు గట్లపైగల దేవతావృక్షములతో ఎల్లప్పుడు మిగుల శోభాయమానములౌ కాళిందీతీరభూములందు, వెలయుచుండెను. అచట రామకృష్ణులు తమచేతులలో వెదురు బెత్తములను బూని, అవధిలేని దయగల చూపులతో పరిహాసములతో నవ్వులసొంపులతో తమపరిజనులను, ఆనందపరచుచు, సకల లోకములను పరిపాలించువారు ఇచట గోపబాలస్వరూపులై వర్తిల్లుచుండిరి. వారిననుసరించు ఆగోపాలబాలురును వారివిలాసములను, అమృతమును కంఠముల వఱకు గ్రోలి, విశేషమైన తృప్తిచే నించుచున్నగోపకులు, భగవదనుగ్రహ ప్రేరణగల సమస్తమైన కళాజ్ఞానముగలవారై, ఆ రామకృష్ణుల కళ్యాణగుణ సమూహములను యిట్లు గానముసేయుచు, వనభూములందు సుఖముగా సంచరించుచుండిరి. 3

5 వ కీర్తన - గోపబాలకులు శ్రీరామకృష్ణుల స్తోత్రము చేయుట.

ప. ఇదె! కనరే వనిం దిరుగు నెంతయో స్వేచ్ఛన్ - ఏన్గుగున్న నడక నెల్లరు మెచ్చన్

1. వెండికొండకొమ్ము దండిగల సౌనన్ - వెనుక బలరాముడును చను నాటలోనన్
నిండునీటిమబ్బు నిలిమెయి గానన్ - పండు గోపికలపంట పటుహాయినైనన్

2. కడు రమ్యమౌ వేణుగానంబుతోడన్ - కలంగాక్క నెలయేటి గమకమ్ముతోడన్
నడరు తులసీమాల నళులగమితోడన్ - అలరునృత్యము దీర్చు నడుగులతోడన్

3. నెమ్మెయి త్రిభంగిమము నేర్పు నెనయింపన్ - నెనరుగని దేవతలు వినుతులొనరింపన్
నెమ్మి చేతమ్మి బెత్తమ్ము జిగినింపన్ - సమ్మతిగ రవికోటి సరణి దీపింపన్

4. నీకటాక్షమున నే నెరిజగము వెలయున్ - శ్రీకరముగ చెక్కుల్ నృ చెవి గ్రొవ్వులగోలయున్
లోకముల్ నినోటిలోనెన్నో నెలియున -వీక రవి పసురతతి చీకటులు పొలియున్

6. కాళిందీతీరమున గడు ఖేలనములన్ - యే లెదా గోకులము బాలుగ ముదమునన్
ఆలింతు నవరసము లలరు గీతములన్ - కేలుము నారాయణాఖ్యగు గానములన్

కం. గోవిందమిత్రులెల్లరు
గోవిందాసక్తమతుల గురునందితులై
గోవిందగానలోలతఁ
గావించిరి నృత్యములను గడు తన్మయతన్. 4

—♦ కాళీయమర్దనము ♦—

శ్లో॥ వినా తు బలభద్రేణ కృష్ణో గోపాలకైస్సహ,
కాళియస్య హ్రదం గత్వా న్యపతత్ తజ్జలే బలాత్. 5

శ్లో॥ కాళియస్తద్ధ్వనిం శ్రుత్వా క్రోధసంరక్తలోచనః,
బబంధ కృష్ణం భోగేనదదృశు స్తం వ్రజౌకసః. 6

శ్లో॥ పశ్యత్సు నందాదిషు గోపికాసు శ్రీకృష్ణమే వాఖిలమిత్రభూతం
తుష్టావరామస్సకలాత్మదర్శీ సర్వాత్మకంకృష్ణమనన్యదృష్ట్యా. 7

6 కర్ణాటసారంగరాగము - ఆటతాళము.

ప. బంధనా న్మోచయ-కాళీయకృత_బంధనా న్మోచయ

అ. బంధనా న్మోచ యాత్మాన మనుపమ
బల మనుస్మర తావక మధునా

1. కారణం జగతా మఘౌఘవి-దారణం హి భవాన్
దురితా శేషశోక మహీంభార
వారణాయ కృతమానుష వేష శ్రీకృష్ణ

2. బాలచాపలతయా తవానఘ-లీలయాల మిహా
కాళియవిష మాశు వినాశయ
కలయ గోకులకల్యాణ మథ భో

3. నందగోపమహిషీ తవేయ మ-నిందినీ జననీ
నంద మేన మానందయ తామపి
నందనందన సుందర శ్రీకృష్ణ

4. కృష్ణతత్త్వవిదాగీత మతి-వృష్ణిజనముదే
విష్ణుభక్తశివనారాయణతీర్థ
విరచితం విపులానంద ముదితం

గీ. నందు డెందొ! రాముని పంపె; నాడు శౌరి
గోపయువకవీరుల నెల్ల గూడి చనుచు
పందెమూని యాపుహితాళిఁ బల్మి దాటి
కాళియాహి పెన్మడుగులో ఘనతఁ దూఁకె. 5

— ఉత్సాహము —

కలగు మడుగు సడిని వించు కాళియాహి కోపియై
చెలగి కృష్ణుఁ జుట్టిపట్టె; చెంత గట్టునుండియా
కలకలమ్ము గోపగోపికలను జూచి భీతిమై
తలచి రఖిలమిత్రు కృష్ణుఁ దాకె సర్పమంచటన్. 6

కం. గోపికల రవము విని చని
రాపల్లికు నందరాము లఖిలజ్ఞుండై
గూసించి కృష్ణు సర్వ
వ్యాపకుని ననన్యదృష్టి హాలి వినుతించెన్. 7

6 వ కీర్తన - బలరాముడు శ్రీకృష్ణుని హెచ్చరించుట.

ప. త్రెంచుమా కట్లు - కాళీయుచుట్లు - త్రెంచుమా! కట్లు
అ.ప త్రెంచుమా కట్లు - నెంచుమా యీపల్లె
మించు నన్నింటికి నీ - మేటిబల మాటయట్లు
1. జగముకల్పించి - పాపమ్ముల - సరగ నీ వడంచి
మిగులుభూభారమ్ము - తెగడంగా నెంచి
నెగడు మానవరూప - మొగి గైకొంటివి, కృష్ణ!
2. చిన్నవగు వేణుకన్ పావనతేజ! అన్న! విడువు మికన్
ము న్నీ కాళీయువిష - మున్ దీర్పుము వీకన్
చెన్నుగా మనగోకులము - చెందు కళ్యాణము కృష్ణ!
3. నందగోపురాణి - మనతల్లి నందు డిదుగో తండ్రి
ఎందు కీభయ్యల - కుందనిచ్చుట? మేల?
తొందరగ వీరికి నా - నందము గూర్పుము కృష్ణ!
4. కృష్ణుమహిమలను - రాముడుపల్క వృష్ణిజనులకును
జిష్ణుముదమునుగను - శివనారాయణు
విష్ణుభక్తితోను - వెలయు పాటలి వాను

శ్లో॥ రౌహిణేయకృతం గీతం శ్రుత్వాస్ఫాట్య చ కాళియమ్,
పాతయిత్వా జలే నృత్య మకరో త్తస్య మూర్ధని. 8

అథ నాగపత్నీనా మాగమనమ్—

7 నాదనామక్రియా రాగము - ఆదితాళము.

1. ఆయాతి నాగదారకదంబం
ప్రతి - మాయా కలితలోక కదంబం
2. నందాది యోగిబృంద చింత్యపాదం
పరమా - నందైకకంద మాశ్రిత వేదం
3. ఫణిఫణాసమర్పితపాదారవిందం
నిత్య - మణిమాదిభూతిద మఖండితానందం
4. కమనీయకాలమేఘాభిరామం
గోప - కామినీబృందకలితకామం
5. నానావిచిత్ర లీలావినోదం
శ్రీ - నారాయణతీర్థాభయవరదం

శ్లో॥ ఫణేషు తస్య నృత్యంతం క్షీణశక్తి ర్ముహు ర్ముహుః,
భర్తృభిక్షాం ప్రార్థయంత్యో నాగపత్న్యో జగు ర్హరిమ్. 9

8 ముఖారిరాగము - ఆదితాళము.

ప. దేవ కురు శిక్షాం దేహి పతిభిక్షాం
అ. దీనపరిపాలనాయ స్వీకురు దీక్షాం
1. ఆగమైకశరణ మశేషలోక కారణం
ఆహు రాగమేన తాత్త్వ మానంద మఖండితం
2. యోగిమతిభూషణా ఘౌఘపరిశోషణ
భోగిశయన భువన భూషపాహి పతితం

గీ. రోహిణేయుఁడు తనయన్న రాము డనిన
పలుకు లాలించి ఫణిభోగపటలి ప్రీల్చి
మడుగులో ద్రొక్కి వెలయించె పడగలందు
మహితనృత్యంబు కాళీయమర్దనుండు. 8

వ. అంత నాగపత్నుల ఆగమనము—

7 వ కీర్తన - నాగపత్నులు శ్రీకృష్ణుని దర్శించుట.

1. త్వరగ వచ్చి కనిరి నాగ - దార లంతన్
వరమాయ జగములెన్నో - విరచించు శ్రీకాంతున్
2. నందాదియోగులు - నతిసేయు పాదములవానిన్
పరమా-నందుడని వేదము లభి - నందించు వానిన్
3. పాముపడగల ద్రొక్కు - పాదారవిందములవానిన్
నిత్య - భూమల నణిమాదిసిద్ధిన్ - బ్రహ్మానంద మేలువానిన్
4. సొగసైన నీలిమబ్బు - సోయగమువానిన్
గొల్ల - మగువలెల్ల కోరి చుట్టు - మరి చేరువానిన్
5. తోరమా చిత్రనటనన్ - ద్రొక్కుచున్నవానిన్
శ్రీ - నారాయణతీర్థయతిని - నమ్మి వరము లిచ్చువానిన్

కం. ఫణముల కృష్ణుడు నృత్యము
ధణధణ నెనయింప బలముతగ్గి మఱిమఱిన్
ఫణిస్రుక్కె, నాగపత్నీ
గణము హరిని వేడిరిట్లు ఘనపతిభిక్షన్. 9

8 వ కీర్తన - నాగపత్నులు శ్రీకృష్ణుని ప్రార్థించుట.

ప. దేవ! శిక్ష చేయనగును దీనలము పతిభిక్ష తగును
అ. ప. నీవు దీనుల గాచు దీక్ష నెంచి మము మన్నింపదగును
1. నీపర మెల్ల వేదములని నీవె లోకకారణమని
రూపింతురు పూర్ణానందమని రూఢిగ తత్త్వజ్ఞులు మునుకొని
2. యోగుల నలరించవా ఓగుల ఖండించవా
భోగిశయ్యనుండి జగతికి పొల్పుగ మము నెంచవా

3. జాతికులశరణ మ | శేషజంతుతరణం
జాతం భవతాకృత | మిత్యాగమవిదితం

4. సర్వజంతుసమతా | సాధు తవ విదితా
సర్వబుద్ధిషు ప్రహితా | సా చ వేదవిదితా

5. అజ్ఞాతవస్తు కిమస్తి | విజ్ఞాన ఘనస్య తే
అజ్ఞాపయ యదుచిత | మస్మాకం జగత్ప్రభో

6. నాగపత్నీగీత మిదం | నారాయణచరితం
యోగివరనారాయణ | తీర్థయతిఫణితం

శ్లో॥ ఏవం స్తుతే జగన్నాథే నాగపత్నీభిరాదరాత్,
నమస్తే దేవదేవేతి ఫణీ ప్రాహ శనైశ్శనైః. 10

—♦ శ్రీకృష్ణుడు కాళియుని రక్షించుట ♦—

శ్లో॥ శ్రీకృష్ణస్తం పరిత్యజ్య సాగరం గచ్ఛ నిర్భయః,
మత్పాద చిహ్నిత ఫణై రిత్యుక్త్వా గోకులం యయౌ. 11

—♦ శ్రీరామకృష్ణులు ఖరాదిరాక్షసులం జంపుట ♦—

శ్లో॥ పరం గోపబాలై ర్మహత్తాళబృందం
క్రమేణ ప్రవిష్టౌ ఖలాన్ సంహరంతౌ,
ముదా రామకృష్ణౌ సఖేలం చరంతౌ
ఫలైస్తోషయామాసతు ర్గోపబాలాన్. 12

శ్లో॥ ఖరాసురవధం కృత్వా ఖగాధిపతివాహనః,
నిరాయాసః పరానందో రమతే నందనందనః. 13

౫. తమేవమసురకుల కదళీవనోన్మూలన కేళికలాకుశల కలభమూర్తి ధరం నందకుమారం సర్వే చ గోపబాలాః సంపూర్ణ మనోరథా ఇత్థం ప్రార్థయామాసుః. 14

3. ఏ జాతి కులములకైన ఏ జీవజంతువునకైన
నీజన్మ శరణము తరణమ్మని నిగమములు పల్కెనందైన
4. సమతనెల్ల జంతువుల సాకెదా నీవన్ని తావుల
సుమతులందఱెంతు రావల శ్రుతులు సన్నుతించు త్రోవల
5. నీకు విజ్ఞాననిధికి లోకముల తెలియనిది కలదే
లోకేశ! ఇక నేది తగునో మాకు సెలవీయగ వలదే
6. శ్రీకృష్ణుని ప్రార్థించు చిలువ నెలంతలు నించు
శ్రీకరమౌ నారాయణతీర్థు నీకీర్తన శుభ మొనరించు

ఆ. వె. పత్ను లిట్లు కృష్ణు బ్రార్థింప నాపాము
గర్వబలము లుడిగి కలుష మడగి
దేవ! దేవ! యనుచు తిరిగి తిరిగి మ్రొక్కి-
యల్లనల్ల వేడె హరి కరుణను. 10

గీ. హరియు కరుణగల్గి "అహి! భయపడ కర్థి
కడర బొమ్ము నీకు పడగపైన
నా పదముల గుర్తు దీపించు" నని పంపి
గోకులమున-కేగి గురులఁ దనిపె. 11

ఉ. అంతట గోపబాలవరు లందఱితో జని రామకృష్ణు లా
చెంత విశాలతాళవని జేరి క్రమంబుగ దుష్టకోటినిన్
హంతలెయాచు తోలి సుఫలావళి గోపకబాలు లాప్తిమై
గొంతులదాక మెక్క-, నఁట గూడి చరించిరి పెక్కు- వేడ్కలన్.

గీ. గరుడుపై లీల వేంచేసి గగనమందు
సత్త్వతతినెల్ల నియమింపఁజాలిన హరి
కృష్ణు డవలీలగా నందె; కెడపి ఖరుని
గోపబాలురతో వనిన్ గూడి యాడె. 13

వ. అట్టి (ఈ శ్రీకృష్ణుని) రాక్షసులు అనే అరటితోటలను పెరికివైచు ఆటయందు నేర్పరియౌ ఏనుగు గున్నయైన వాని నందకుమారుని అందరు గోపబాలకులు సంపూర్తిచేయబడిన మనోరథములు గల వారై, యిట్లు ప్రార్థించిరి.

9. కాంభోజీరాగము - త్రిపుటతాళము.

ప. రామ సఖే కృష్ణ సఖే రమణీయ గోకులమథయామో

1. కమలబంధురిహ కమలమనుపతతి కమలినీ ములినేవ విభాతి
కుముదబంధురపికుముదమనుసరతి కుముదినీచపరంపరిహసతి.

2. శశధరం శస్త్రైరనుపశ్యతి శర్వరీ వనితా నిజకాంతం
వశము పైతివనితారుషబృందంవామమన్మథదాశస్యమందం.

3. అళికులం కమలోదరమిళితం అలఘుగీతరసామృతభణితం
కలయ గోధనమిహ సముదితం లలితవేణురవేణ త్వరితం.

4. ముక్తలజ్జేవ ముహురవిచపలా ముంచతి వీటికారసమబలా
రక్తచందనలేపనలోలా రాగిణీ పశ్చిమా భాతి బాలా.

5. చక్రవాకయుగళంచ విగళితం చారునీర నిరంతర మిళితం
వక్రకంఠవిగళితరవలలితం వనజబృందమధునైవ ముకుళితం.

6. వారుణీసేవనాదబ్జమిత్రం వారుణో నీతవాన్నిజగాత్రం
తారకామలనిజదంతకాంత్యా తామసీ హసతీతి విచిత్రం.

7. శృణ్వతా గోపబాలకగీతం శ్రీధరేణ గోకులమాయాతం
తృణరానుసరేణ సముదితం ధీరనారాయణతీర్థసుఫణితం.

శ్లో॥ ఉషిత్వా గోకులే రాత్రౌ బలేన సహితః సుఖీ,
ఉషస్యుత్థాయ గోవిందశ్చోదయామాస గా వనమ్. 15

—♦ భాణ్డీరకవనవర్ణనము ♦—

శ్లో॥ అద్య భాండీరకం నామ వనం యామో వయం ముదా,
ఇత్యాహ భగవా న్బాలాన్ బలం చ బలినాం వరమ్. 16

9 వ కీర్తన - గోపబాలకులు సాయంకాలవర్ణనము చేయుట.

ప. రామ! సఖా! కృష్ణ! సఖా! రాజిలు గోకులమున కిదె పోదవ?

1. తమపతి రవి నీరమునన్ వ్రాలె తామరపూలవె తోడుగ సోలెను
తమపతి చంద్రుడు తమజిగి గ్రోలును కుముదము లెల్లను గొనసై తేలెను

2. రాత్రియను రమణి రమణుడైన శశిరాకకై వెలసి మెల్లగ గాంచును
చిత్రముగా మారుండను జాలరి చేపలుగా కామినుల గ్రహించును

3. ముకుళించిన కమలముల జిక్కుకొనె మూగి తుమ్మెదలు సుధలో జుమ్మనె
ప్రకటమా వేణురవమున త్వరగొనె ప్రజలు గోవు లివిగో సిరులన జనె

4. రమణబాల సింధూరపుప్పుతయాన రక్తిమ తాంబూలపురంగుల గొన
ప్రమదమెనసె, సిగ్గును వదలెనో యన పడమటిదిక్కొక ప్రౌఢకాంతయన

5. సరసుల నెంతయు సయ్యాటల మను జక్కవలకును బాసగ నెడబాటును
నెరివంపుమెడల పల్కులు నడగెను గిరియు టుడిగి తమ్ములు ముకుళించెను

6. వారుణిసేవల పద్మమిత్రుడదె వారుణమున్ తనువంతట గొనెగద
తారలనెడి తెల్లని పల్ జిగి నతె తామసి నిసి నవ్వను చిత్రముగద

7. గోపాలకు లిటు పాటలఁ గోరగ గోవులతో హరి ముద మొనరారగ
మాపునకున్ గోకులమున్ జేరగ మరలెన్ నారాయణతీర్థులు తగ.

ఆ. వె. గోకులమున కరగి గోవిందు డలరుచు
రామమిత్రు లెనయ రాత్రిఁ గడపి
వేకువను మున్నె విహితులతో లేచి
మంద నంత సర్ది మలపె వనికి. 15

ఆ. వె. పలికెఁ గృష్ణుఁ డంత బలవంతు బలరాము
కెలన గోపబాలకులను జూచి
''ప్రబలు ముదముతోడ భాండీరకంబను
వనికి నేను పోయివచ్చెద'' మని.

10 సావేరీరాగము - ఆదితాళము.

ప. రామ రామ విచరామో వయం-రమ్యభాండీరకవన మధునా

అ. రామ రవికిరణదూరం-రమణీయసరోవరబహుళం

1. చంద్రకాంతోపలమణివాలుకా-చారుతరఝరీసుందరసలిలం
చన్దనచంపకతరుమన్దార-చ్ఛాయాతిమిరసూర్యమణిజాలం

2. ఉన్నతతరుషుసమాసన్నతబలవ-త్పన్నగరిపుముఖనిహన్నతవిహగాః
ఉన్మత్తాఇవసన్నద్ధాయుధి-మన్యన్తేముహురిహ ఖలుయోద్ధుం

3. నందనం వన మేత దుపమితం - నానారసఫలైరపిమధుసుధయా
మందమారుతస్పన్దనవిగళిత-మందారాదిశ్రీచందనకుసుమైః.

4. ముక్తాఫలసమముద్రితవల్లీ - సక్తమధువ్రతశంసితవిభవం
త్యక్త్వాశంసద్దివివనమేతత్-చేతస్స్పృహయతి దివ్యవధూనాం.

5. స్వర్గారోహణసోపానపఙ్క్తిరివ-సురలోకావధిసుందరవిటపం
నిర్గళితోపమమతిరమణీయం-నిహ్నుతసకలసంతాపవిభూతి.

6. బంధుప్రియఇవబంధూనయమిహ-సంధత్తేఖలుసాదరమస్మాన్
మందస్మేరసుధామధుసేచన-మంగళపూర్వమహోవనదేశః.

7. నారాయణఫణితం రమణీయం-ధీరోదాత్తగిరా బలభద్రం
ఘోరాఘౌఘనివారణమేత--న్నారాయణతీర్థార్యసుఘటితం.

శ్లో॥ గాయన్ గాయన్ వనభువి శనైర్గోపబాలైస్సమేతో
దేయం దేయం కరతలమితి ప్రీతిత స్తాడయం స్తత్,
పాయన్ పాయన్ సరసవచనాహ్లాదపీయూషధారాం
సోయం మాయీ విహరతి ముహుర్నాదయన్వేణు మీశః. 17

—♦ ప్రలంబాఘబకాదివధ ♦—

శ్లో॥ క్రీడామారబ్ధవాన్ కృష్ణో జయశీలాన్ పరాజితాః,
స్కంధే వహంతి యస్యాంతాం బాలకైస్సహసంభ్రమాత్. 18

10 వ కీర్తన - శ్రీకృష్ణుడు భాండీరకవనము వర్ణించుట.

ప. అన్నా! శ్యామా! అందే గదమా? ఆ భాండీరక వనిఁ దిరిగెదమా?
అ. ప. అన్నా యెండ మతి నటచోఁ గదుసుమా ఎన్నాళ్లకొలందు లెనయునిదెదమా?

1. మంచినీళ్ళవాగు లిసుకతిన్నెలు సద్యలన్ శశికాంతశిలల వన్నెలు
నించు నిరుల చెట్లనీడల చెన్నులు నెరి మరకత సూర్యమణుల చిన్నెలు
2. మేటి ప్రాకుల కొనగుబురులలో మెలగు గరుడపక్షులు మరి తమలో
ధాటిగ వీగా వేశవాదములో చాటును రెక్కలసడి కలహములో
3. చందనమున మందారపుష్పాల చెంగు మందమారుతముల కేవల
నందనవనమనదగు నటక్రోవల నానాఫలముల రసముల తావుల
4. ముత్తెములంతటి తీవలవిరులన్ మూగి తుమ్మెదలు వరలున్ సిరులన్
చిత్తములన్ సురవనితలు మరులన్ చెందుదు రమరుల వనమని వరులన్
5. సురలోకమునకు సోపానములన పెరుగున్ కొమ్మలు పైపై క్రమమున
సరిలే దా వనమునకున్ సొంపున వెరసులే కెనయును మరి వైభవమున
6. ప్రియబంధువు వలె ప్రేమల జూపును పిలుచు నాదరమును పెంపున మనలను
దయ నవ్వుపూల తేనెసోనలను దనరు నివని యోహో! శుభములను
7. ఈరహి కృష్ణుడు చెన్నొవిధమున ధీరత బలరామునకు వినయమున
తీరగ కొలతలు పల్కె హితులు విన నారాయణతీర్థుల రచనలు గొన

—♦అంతట శ్రీకృష్ణుడు స్నేహితులతో భాండీరకవనమునందు నిట్లాడుకొనెను♦—

మత్తకోకిల: పాటపాటలనల్ల గోపకబాలురన్ వని గూడుచున్
ప్రేటుప్రేటున వారిచేతుల వేడ్క మెల్లగఁ దట్టుచున్
మాటమాటకుతియ్యనౌసుధమాడ్కి మెప్పుగబల్కుచున్
ఆటయాటకు వేణువూదుచు నందుకృష్ణుడు రాజిలెన్. 17

కం. ఆడుటలోనన్ విజయుల
నోడినవా రూని మోచు నొకయాటఁ గడున్
వేడుక కృష్ణుడు మొదలిడి
యాడఁదొడగె హితులతోడ నావనమందున్. 18

శ్లో॥ ప్రలంబో నామగోపాలవేషధారీ మహాసురః,
పరాజితో రౌహిణేయం స్కంధేనోఢ్వా పలాయితః. 19

శ్లో॥ సంకేతస్థాన ముల్లంఘ్య పలాయనపరో బలః,
మాం నయత్యేష కిం కార్యం వద కృష్ణేత్యభాషత. 20

శ్లో॥ వీర్య మావేదయన్ కృష్ణో బలభద్రస్య ధీమతః,
ఇదమాహ మహావీర్యమార్యం బలసమున్నతమ్, 21

11 కాఫిరాగము - అటతాళము.

ప. తావకం పరభావ మనుస్మర - తారకం స్మరతాం

అ. సేవకసంకల్పసిద్ధతనో పర - దైవత నరభావభావనయాలం

1. స్మర తవాతులబల మతివీర్యం సాహ -
సంచబలభద్ర! గాంభీర్యం
నరవపుర్ధర మసుర మిమంజహి -
నగవరాధికధైర్య! దుర్వీర్యం

2. ఖేలనే సమయో నాయ మిహ బల -
నీలాంబర! తవ భో
తాలనికేతవ! తాడయకుటిలం తవ -
ఖేలనమిత్రమమరశత్రుభృత్యం

3. అఘటితం ఘటయతితవమాయా -
అఖిలలోకజననీ
విఘటితభవబంధమూలమోహనిబద్ధ -
విపులబోధానందరసఘనజయభో

కం. గోపాలురూపమున్ గొని
ప్రాపుగ నాటాడి యోడి బలరాముని తా
మూపున నైకొని పరువిడె
నాపట్ల ప్రలంబుఁడను మహాసురు డోకడున్. 19

ఆ. వె. ఆటహద్దులెల్ల దాటి వాడురుకుట
తెలిసి యూగకుంట హాలి యెఱింగి
"ఏలొ ? నన్ను నీతడెత్తుకొనుచుఁ బోవు
కృష్ణ ! చూడు" మనుచు కేకనైవ. 20

ఆ. వె. అన్న కేక కృష్ణు డాలించి యాతని
బలమహాత్త్వమెల్ల తెలుపుటకును
ఆర్యవర్యుడౌ మహావీర్య బలరాము
నెంచి యిట్లు హెచ్చరించి పల్కె.

11 వ కీర్తన - శ్రీకృష్ణుడు బలరాముని హెచ్చరించుట.

ప. నీ మహిమ పరమహా నిజము స్మరింపుము - ఏభక్తులెల్ల తరింపన్
అ. నీ మిత్రులౌ వీరి - నోమగల దైవమవు నేడింక చాలు నర - నీమము సహింపన్

1. స్మరియింపుమన్న ! నీసాహసము ధైర్యమ్ము
సరిలేనిబలము గాంభీర్యమ్మునన్
గిరివరుని మించు ధీరవరుడనై యెంచు వీని
నరరూపాసుర దుర్వీర్యమ్మునన్
2. చాలు నన్న ! తరిమించె ఖేలనము నీ కిపుడు
నీలాంబరము సద్ది నెగడన్ దగున్
తాలధ్వజుని నిన్ను దనుజభృత్యు లెఱుగంగ
తన్ను వీనిమోసమునకు తగు శాస్తి యగున్
3. చాలు నెట్టిదైన సల్పగ నీమాయ
జనని సకల లోకములకు
ఏల భ్రాంతి భవబంధమెల్లఁ దీర్పగల బోధ
నెనయు నీకు తడవే ? జయములకు

4\. లోకబంధుఫణిత మేత దాశ్రిత -
శోకమూలహరణం
భక్తసంసిద్ధిసాధక శ్రీహరి -
భక్తనారాయణతీర్థాభరణం

శ్లో॥ జఘాన బలభద్రస్తం శ్రీకృష్ణేన ప్రచోదితః,
ప్రలంబం ముష్టినా మూర్ధ్ని ప్రలంబోऽపి పపాత చ. 22

శ్లో॥ అఘాసురబకాసురప్రముఖకంసదూతాసురాః
హతాస్తు హరిణా గుణవ్యతికరప్రసూతాః ఖలాః,
వనే విచరతాఘునే వకుళమంజరీపుంజకే
ప్రవన్మధురఘురీచరద్భ్రమర కామవిద్యాగురౌ. 23

—♦ దావానలభక్షణము ♦—

శ్లో॥ దృష్ట్వా దావానలం బాలాః కృష్ణ కృష్ణేతి చుక్రుశుః,
గృహీత్వాంజలినా కృష్ణో దావానల మభక్షయత్. 24

శ్లో॥ జీర్ణో దావానలో యస్య జాఠరేణ మహాత్మనః,
బాలా స్తమస్తువన్ కృష్ణం వేదాంతార్యస్తు లక్ష్యతే. 25

శ్లో॥ శ్రీగోపాలక మేక మేవ పరమం దైవం సదా మానయే
శ్రీవత్సాంకితవక్షసం శ్రితజనాధారం సమారాధయే,
ఆమ్నాయాంతసరోజహంస మఖిలానందాత్మకం శాశ్వతం
కుక్షిస్థాఖిలలోకరక్షకమముం గీర్వాణగేయం ప్రభుమ్. 26

4. ఈ కీర్తన భవ్యు లెంచి తరించంగ
శోకమ్ములను బాపఁజాలున్
చేకూర్చి వరభక్తలోక హితార్థముల
శివనారాయణతీర్థు నేలున్. 23

కం. తమ్ముని హెచ్చరికల్ విని
యమ్మానవఖాదిశిరము నవియ పిడికిటన్
గ్రుమ్మి బలరాముఁ డడఁచగ
ధిమ్మని పడె వాఁడు హలియు తెలిపిగ నిలచెన్. 22

మ. ఖలులై జన్మఫలవ్యతిక్రములునై కంసాప్తులై దూతలై
హాలియింపంబడి రా యఘాసుర బకప్రోద్దాములున్ కృష్ణుచే,
లలి పుష్పాసవమాను భృంగముల కల్యాణార్థముల్ దీర్చుచున్
వెలయంజాలిరివిష్ణుభక్తులగుటన్ వ్రేపల్లెగోపాలకుల్. 23

—♦ శ్రీకృష్ణుడు దావానలమును లోఁగొనుట ♦—

గీ. అంత నొకనాడు దావాగ్ని యడవి రేగి
చుట్టు గ్రమ్మగ గోపకుల్ చూచి బెగడి
“కృష్ణ! కృష్ణా! యనుచు నార్తి కేకలిడగ
హరి కరంబున గొని దాని నారగించె. 24

ఆ. వె. వేదసారమెల్ల వివరించి లక్షించు
విష్ణుజఠరమందు విపినవహ్ని
జీర్ణమౌట చూచి శ్రీకృష్ణు గోపకుల్
చేరి మ్రొక్కి వినుతి చేసిరిట్లు. 25

ఉ. శ్రీకరవత్సవత్సుని నశేషముదావహు గోపబాలకున్
లోకము లన్నిటన్ దనకు లోఁగొని పాలనసేయు శాశ్వతున్
నాకనివాసగేయు, భువనప్రభు, భక్తజనార్థు, దేవు, లో
కైకపరాత్పరున్ దలతు మెప్పుడు వేదసరోజహంసమున్. 26

12 కాంభోజిరాగము - ఆదితాళము.

ప. శ్రీగోపాలక మేక మేవ దైవతం హృదయే
అ. ఆగమారవింద బృందహంస మాకలయే

1. సర్వలోకైకశరణ్యచరణారవిందం
దుర్వినీతమదభంగదోర్దండబృందం
నిర్విశేషనిరంతరనిర్మలానందం
గీర్వాణగంధర్వకోటిగీతగోవిందం

2. నిజజనస్వర్గాపవర్గనిత్యదా తారం
అజ మవ్యయ మాదిదేవ మనుపమాచారం
విజయసారథి సుశేషవిదుషా మాధారం
భుజబలనిర్జితవైరిభూపాలశూరం

3. లక్షితసర్వభువనలక్షణ మేకం
పక్షిరాజవాహనం విపక్షశిక్షకం
కుక్షిగతజగదండకోటిధారకం
అక్షీణగోకులనివాసలక్ష్మీనాయకం

4. నారదాదిమునిగేయనామధేయకం
నామరూపనిర్వాహక మామ్నాయమానకం
వారిజాసనాదివినుతవారితశోకం
నారాయణానందతీర్థానందదాయకం

శ్లో॥ ఇత్థం గోపాలకైర్గీతో భగవాన్ భక్తకామదః,
గోభిర్గోపాలకైః కృష్ణో గోకులం పునరాగతః. 27

ఇతి శ్రీ నారాయణతీర్థవిరచితాయాం-శ్రీకృష్ణలీలాతరఙ్గిణ్యాం
శ్రీకృష్ణగోపాలనవర్ణనం నామ - చతుర్థతరఙ్గః.

12 వ కీర్తన - గోపబాలకులు శ్రీకృష్ణుని స్తోత్రము చేయుట.

ప. శ్రీగోపాలునే దేవుచిత్తమున గొలుతుగ

అ. ప. ఆగమములను పద్మముల హంసను దలతుగ

1. సకలజగముల నోము చరణాబ్జములవానిగ
వికలుల మద మడంచు వేయిచేతులవానిగ
అకలంకముగ నిండు ఆనందమువానిగ
ప్రకటగీతగోవిందమును పల్కు సురగంధర్వులవానిగ

2. దాసులకు స్వర్గము మోక్షము దయచేయువానిగ
వాసి, తరుగు, మొదలు లేని వరచరితవానిగ
భాసిలి పార్థసారథిగ భక్తవిదులఁ గాచువానిగ
తా సకల శత్రురాజుల దండింపగలవానిగ

3. లక్షించి జగతి కోరు లక్షణములవానిగ
పక్షిరాజు నెక్కి వైరుల శిక్షించువానిగ
కుక్షిలో లోకముల నెన్నికోట్ల దాచువానిగ
రక్షించి గోకులమున పెంపౌరవు నేలువానిగ

4. నారదాది మునులు పొగడు నామధేయమువానిగ
పేరు పెంపుల దాల్చి శ్రుతులఁ బేర్కొనబడువానిగ
భారతీపతి పొగడ, వెతలఁ బాపుచున్నవానిగ
నారాయణతీర్థునకు, నానంద మొసగువానిగ

కం. నుతియించు గోపబాలుర
నతిదయఁ గని కృష్ణుఁ డేగె నావులగమితో
హితులును గోపికలును స
మ్మతితో గోకులమునందు మన్ననసేయఁగ. 27

ఇది శ్రీ నారాయణతీర్థులవారిచే రచింపబడిన, శ్రీకృష్ణలీలాతరంగిణి యందు శ్రీకృష్ణగోపాలనవర్ణన మను నాల్గవ తరంగము.

శ్రీరస్తు

# శ్రీకృష్ణలీలాతరఙ్గిణీ-సంస్కృతము

## పఞ్చమతరఙ్గము.



—♦ కథాసంగ్రహము ♦—

శ్లో॥ గోపీవస్త్రాపహారాఖ్యం చరిత్ర మభినీయతే,
గోవర్ధనాద్రే రుద్ధార శ్చరితం హరిణా కృతమ్. 1
పాత్రప్రవేశ స్తు పున ర్నందో గోప్య స్తతః పరమ్,
బలకృష్ణౌ తతః కృష్ణకృతం వస్త్రాపహారణమ్. 2
ఉద్ధృత్య రక్షితే చాస్మిన్ గోకులేద్రిం కృతా స్తుతిః,
ఇంద్రేణ కామధేన్వా చ కృష్ణస్యా త్రైవ సంగ్రహః. 3

శ్రీ ర స్తు

# శ్రీ కృ ష్ణ లీ లా త రఙ్గి ణి - తె ను గు

## ప ఞ్చ మ త ర ఙ్గ ము.



—♦ జో హ ర లు ♦—

గోపీవస్త్రాపహరణ మనబడు గూఢార్థ కథన మిందున్
శ్రీపతి గోవర్ధనగిరిఁ దాల్చిన చిత్రనాటకము నందున్. 1

పాత్రలుగా నందుడు గోపాలురు ప్రవేశమాడురు మరలన్
సూత్రధారి శ్రీకృష్ణు డన్నతో శుభవిలాసములు వరలన్
చిన్నిగోపికల చీరల దాచును; చేరి మ్రొక్క మరి యిచ్చున్
ఉన్నతగిరి పైకెత్తును, రక్షణమొగి గోకులమున కిచ్చున్. 2

గోకులమెల్ల నుతింతురింద్రుడును కోరి కృష్ణుదయఁ బొందున్
శ్రీకృష్ణునకున్ సురగవి సేయును క్షీరాభిషేక మిందున్. 3

— గోపీవస్త్రాపహరణము —

శ్లో॥ నితంబినీగణం హ్రదే దిగంబరం విలోక్య తత్
వరాంబరం బహిఃస్థితం కరాంబుజే సముద్వహన్
బహూన్నతే తటద్రుమే మహోన్నతో హరిః స్థితో
వదన్ విచిత్రనర్మ తం హస న్నగాయతే దృశమ్. 4

శ్లో॥ బధ్వా దుకూలం శాఖాగ్రే కుతూహలతయా హరిః,
వల్లవీవల్లభః కృష్ణో హస న్నిద మువాచ తాః. 5

1 కేదారగౌళరాగము - త్రిపుటతాళము.

ప. ఆయాహి వ్రజయువతిబృంద త్వరయా
మాయాహి సలిలే దూరం

అ. ఆయాసో మా భవతు అల మధునా తవ
తోయక్రీడయా వరయా

1. సరిణామవిరసఫలోదయకర్మణి - పాటవ మతివితథం
పరిణామవిరహితపరమపురుష మేవ - భజ జగదేకనాథం

2. పరిగృహాణ భువనబాహ్యాదృగావరణం - పరిహరసి వృథాకథం
పరమబాంధవ స్తవ ప్రకట మేవ వదతి - పరిహారఖేలనబంధం

3. ఆనందమయభువనే తవ జననీ - సానంద మనుసరతి
మాయాతీతవపుషం మాధవమేవజనకం - మానయమానయసతి

4. హరివిరచితపరిహాసకథారసగౌరవసంస్మరణం
గురుభక్త శివనారాయణతీర్థకృతమిదం - గోవిందజనభూషణం.

శ్లో॥ గోవిందం గోపికానందం వదంతం నర్మశర్మదమ్
పున్నాగవిటపాగ్రస్థం పుణ్యపుంజఫలోదయమ్. 6
భక్తానుగ్రహసువ్యగ్రగృహీతాద్భుతవిగ్రహమ్,
ఇత్థం గోప్యో జగుః కృష్ణం కంఠదఘ్నజలే స్థితాః. 7

—♦ మత్తకోకిల ♦—

చాటుచెర్వున వట్టిఘేన్పుల చానలీమట గాంచి తా
వాటుగా గొని, గట్టునన్ గల వారి చీరెల నన్నిటన్
మేటిచెట్టున కెక్కి కృష్ణుడు మేలమాడుచు పిల్వగా
బోటు లాలతనిఁ జూచి సిగ్గును బొంది దాగిరి నీటిలో. 4

ఆ. వె. వేడ్క గొమ్మకొనల వ్రేలఁ జీరెలఁ గట్టి
వల్లవీ మనోజ్ఞ వల్లభుండు
కృష్ణు డింత నవ్వి కీరవాణులతోడ
సరసవచనరచన వరలఁ బలికె. 5

1 వ కీర్తన – జలక్రీడలు సేయు గోపికలను శ్రీకృష్ణుడు హెచ్చరించుట.

ప. నారీమణులార! రండు! తీరమిందు గలదు
దూరాన లోతౌ నీరుండు! పోవలదు

అ. నీరునం దాడుట! మీరు శ్రమలఁ గూడుట
నేడు చాలు! తడియు టిఁక తగదు!

1. విరసమౌ ఫలమే పరిణామమౌ పనుల నెరప నేర్పు గొనిన మేలేమి
పరమాత్ము జగదీశు భజియించి పూర్వేని పదవిఁ గోరుట కింపు రాదేమి
2. పయివారు చూతురేమొ! కృపడకుం డీవనౌను పయిచేలముల నిట్లు దూరమునన్
దయతో చనువుతోడ తరుణులార! పల్కుచుంటి తాళుడాట చాలు నీరమునన్
3. సంతోషమింట వెలయు జననీ మాతల్లులు వరియాని మిమ్ము నుసరింపన్
కాంతలార! మాధవుని భ్రాంతులన్నిటిమించువాని గడు లెస్స మీకు సేవింపన్
4. పరిహాసముగ, గోపతరుణులకు నీతి తెల్పు సరసమౌ శ్రీకృష్ణవచనముల్
గురుభక్తు లలరారు వరనారాయణతీర్థు హరిపరమౌ వచనమ్ముల్.

—♦ మత్తకోకిల ♦—

అన్నమిన్నలు గొంతులోతగు నా జలమ్ముల దాగుచున్
సన్నుతించిరి, భక్తరాండ్రకు సంతసంబగు చెన్నులన్
పున్నమన్నిట వన్నెమిన్నగ పొందునంద మిదానవన్
పొన్నచెట్టున కల్కిపల్కుల, పూలరంగని కృష్ణునిన్. 6, 7

2 పున్నాగవరాళి రాగము - ఆటతాళము.

ప. శ్రీకృష్ణ తావకమహిమా    కేన వర్ణ్యతే
అ. లోకాలోకనావరణం    లోకేశ దేహి నౌమి తే

1. పున్నాగ రాజాధిరూఢ    పురుషోత్తమ
ఉన్నత వంశవిస్తార    ఛిన్న పాపాఖండిత
2. శాఖాగ్రలక్ష్యసద్విగ్రహా    శం విధేహి భో
శోకసాగరా దుద్ధర మాం    శుద్ధభావం సందర్శయ భో
3. నందయశోదా నందన    నళిననాభ
సుందర హాసవిలాస    సూచితైరఖిలం విమలాభ
4. సర్వకామాది గుణాకర    సర్వపాలక
శర్వరీనా యకానన    శాతకుంభవర్ణవసన
5. గోవింద కింకరవామ    గోపబాలక
నవ్యగోపీ గీతమిదం    నారాయణతీర్థరచితం

—♦ శ్రీకృష్ణ గోపీసంవాదము ♦—

శ్లో॥ గోపీభిః ప్రార్థితః కృష్ణో గోవిందో భూర్యనుగ్రహమ్,
కుర్వాణ స్తాసు సంవాదం భూయోప్యకృత సాదరమ్. ౬

3 ధన్యాసిరాగము - ఆటతాళము.

1. కృష్ణః. ఆవరణం మమ న హి తే దాతుం
భావయ గోపవధూజన బృంద
2. గోప్యః. దేవ య దావరణం మమ నీతం
దేహి విభో భవతా త దనంత
3. కృష్ణః. నీతం నైవ మయా పరకీయం
నైవ మ యా వరణం నిజదృష్ట్యా
4. గోప్యః. ఆహ గృహాణ భీషా నితి పూర్వం
దేహి త దావరణం మమ బంధో

2 వ కీర్తన - గోపికల వర్ణోక్తి.

ప. శ్రీకృష్ణ! నీమహిమవర్ణనము సేయనేర్తుమే
అ. లోకులకు చాలా నావరణము లోకేశ! యీయవోర్తుమె
1. ఉన్నతవంశమువారు లోపముల మన్నింపకుంట మేలో?
అన్నిటపూర్ణులు పురుషసత్తములు పొన్నను బ్రాకుటేలో?
2. నమ్మిన మావెత బాపి సుఖమ్మిడ నాయకులాగెదరే?
సమ్మతితో శుభరూపముఁ జూపక కొమ్మల డాగెదరే?
3. నలిననాభు లిల వెలయుట మమ్మిమ్మ నవ్వుల దెప్పుటకా?
అల యశోదనున్ నందు మప్పుట మమ్ములయిక ద్రిప్పుటకా?
4. అన్నిటి నేలు గుణాఢ్యులు నెన్నఁడు సన్నియు గోరెదరా?
చెన్నగుమోమున పీతవస్త్రమ్మున చెల్వలఁ జేరెదరా?
5. గోవిందులు గోపాలురు మమ్మున్ గొని నియమించెదరా?
భావింపుచు నారాయణతీర్థుల పాటల మించెదరా?

కం. వల్లవకుమారికలు తను
నుల్లాసముతోడ బ్రార్థనోక్తుల వేడన్
పల్లవపాణుల వేడ్కకు
సల్లాపము కృష్ణు డిట్లు సలిపెను దయతో. 8

3 వ కీర్తన.

1. కృష్ణుడు. మీ యావరణము - మాయలో చీరలో
మాయెడ లేవే - మానినులార
2. గోపికలు. మా యావరణము - మంచిచీర లే
మాధవ! కొంటి వీవే దయవార
3. కృష్ణుడు. పరుల యావరణ నెరి చీరలఁ గాన
అరయ మాయ నా కావరణ మగున?
4. గోపికలు హరి! కొమ్మంటివి - యావరణములన
కరుణ నిమ్ము నీ - సరస నవె పయిన

5. కృష్ణః. అక్షినిమీలన మేవ మయోక్తం
సాక్షా దిహ తు గృహాణావరణం

6. గోప్యః. లోకాలోకనవిహితావరణం
లోకేశ్వర మమ దేహి సముదితం

7. కృష్ణః. లోక స్యావరణం న విధాతుం
లోకే కోపి సమర్థః పురుషః

8. గోప్యః. కశ్చన నాలోకయతి యథాస్మాన్
కలయ తథా విధ మే వావరణం

9. కృష్ణః. లోకో నాలోకయతి హి లోకే
లోకం కశ్చన క మపి విరోధాత్

10. గోప్యః. లోక్యా ఏవ వయం పరభోగ్యాః
లోకే శావరణం తు విదేహి

11. కృష్ణః. తర్హి తదావరణైరల మస్త్వైః
తస్య న కించి దలోక్య మిహాస్తి

12. గోప్యః. కి మిద మలౌకికసిద్ధావరణం
కే వా వయ మిహ లజ్జాభరణాః

13. కృష్ణః. యుక్తిసహం నహి భవదావరణం
యోగిభి రత్ర మీమాంసిత మబలాః

14. గోప్యః. అస్మాభి ర్న విధేయం కి మపి
హ్యవగత మచ్యుత త ద్వద భగవన్

శివనారాయణతీర్థసుగీతం
శ్రీహరిగోపీజనసంవాదం

శ్లో॥ ఆబాల్య మేత ద్యస్మాక మబలాః కేవలం మతమ్,
ఉభాభ్యా మేవ హస్తాభ్యాం గృహ్ణంతు వసనాని వః. 9

5. కృష్ణుడు. కన్నులు మూసిన - కాంతల కగునే
చెన్నా నావరణం బిది తగునే
6. గోపికలు. ఎన్నగ సఖులకు నీయగఁ దగునే
ఇతరులు చాటగు నావరణగనే
7. కృష్ణుడు. పరుడెరుగని యా - వరణము నెసగన్
పురుషుం డెవ డోపును మీ కొసగన్
8. గోపికలు. ఒరు లెఱుగని యావరణము ససిగన్
విరచింపుము మా కిరవై పొసగన్
9. కృష్ణుడు. లోకులు గాంచరు లోకమును సరిగన్
లోకము వేర్వేరా క్రమ మెసగున్
10. గోపికలు. లోకుల కగపడ మా కహింత మగున్
లోకేశ యావరణ మా కీయం దగున్
11. కృష్ణుడు. వరచేలము లావరణము లౌనే
పరుని యెరుకలకు తెర లవియానే
12. గోపికలు. పరమమైన విట పల్కగ నౌనే
వరలు లజ్జగతుల తరుణుల కౌనే
13. కృష్ణుడు. సరిగ యుక్తికిది సమ్మతి గాదే
సరి! యోగుల సాఖ్యము గొనరాదే
14. గోపికలు. సరియుక్తుల మేమరయము! వాదే
హరి! విధేయులకు నానతి యేదే

వర గోపీకృష్ణ సం - వాద వచనములే
గురునారాయణతీర్థ సరస రచనములే.

ఆ. వె. అబలలైన మీకు ననుమత మాగదా
చిన్ననాటనుండి కన్నెలార!
ఎత్తి రెండు చేతు లీవస్త్రముల గొంకు
సిరియు వరశుభాళి సిద్ధ మగును.

శ్లో॥ ఇత్యుక్త్వా వసనాన్యాసాం దత్వా గోపాలకైస్సహా,
అవరుహ్య తరోః కృష్ణః ప్రయయౌ స్వగృహం ముదా. 10

—♦ గోవర్ధనోద్ధరణము ♦—

శ్లో॥ ఇంద్రయాగ సమారంభం నందాదీనాం విలోక్య సః,
ఐశ్వర్యం ఖ్యాపయన్ స్వీయం నంద మాహేద మచ్యుతః. 11

4 యదుకులకాంభోజీరాగము - అటతాళము.

ప. ఇంద్రయాగ సమారంభ సంభ్రమ - మిహతు ముధా మన్యే
అ. చంద్రరవిపావక ముఖసురవర - పరిగణిత విభూతిరయంహి తాత
1. సకలలోకజనకం సకలాగమ-సంబోధితమహి మానమనింద్రం
ప్రకటిత జగదణ్డ కోటివదనమిహ-సాక్షా దేవవిహాయ మహేంద్రం
2. వనచరాహివయం వనపర్వత-వర్ధితభువి వనమేత దధునా [ధినా
అనుపమాన్నరసా దిభిచర చలేంద్ర-మనుపమమారాధయామోవి
3. గిరివనసరి దమర నరఖగాదిషు-పరిపూర్ణబోధరస మాగమవిదితం
హరిమిహాగో వర్ధనగిరియుత-మచ్యుతమేవ భజామోనిరతం
4. నందనందన గీత మిదం భువినందగోపహితం మహు రధునా
నందయోగివి చింతితమనుశివ-నారాయణతీర్థ కృతమితి విధినా

శ్లో॥ గోవర్ధనగిరేః పూజాం గోవిందవచనాదరాత్,
చక్రు ర్నందాదయ స్తూర్ణం సవనస్య గవాం తథా. 12

శ్లో॥ క్రుద్ధస్య తస్మాదింద్రస్య వవృషు స్సతతం ఘనాః,
గోకులం వ్యాకులం తస్మా ద్విలోక్య ధృతవాన్గిరిమ్. 13

శ్లో॥ ఛత్రీకృతగిరిరాజే రక్షితగోపాల గోధనసమాజే,
గోవిందేతమనంతం భక్త్యా గోప్యో జగుః పరం తుష్టాః. 14

ఆ. వె. ఇటుల సెలవొసంగి, యింతుల రంజించి
చీరలిచ్చి వారి నూరి కనిపి
ఆజ్ఞ వెంట దూరమందు గోవులమేపు
హితులతోడ కృష్ణు డింటి కేగె. 10

గీ. ఇంద్రయాగవార్షికమున కెల్లవారు
నుత్సవారంభులౌట నచ్యుతుఁడు చూచి
శక్రుపై నీశ్వరత్వంబు చాటఁ దలఁచి
పలికె నిట్లని నందగోపాలునొద్ద. 11

4 వ కీర్తన.

ప. ఇంద్రయాగము సేయు! నీసంభ్రమము తండ్రి!-ఎల్ల వృథయని యెంచరే
అ. చంద్రసూర్యులగ్ని సర్వ,సురతతి జగతి-సకల మాతడే యంచు సత్యమ్ముగాంచరే
1. వెలయించి లోకముల వేదములబోధించి-విభులందఱను మించి శుభ మెంతో నించి
లలివాస్యున నెజగముల నెన్నింటినో గాంచి-యేలరువాని నెంచరే! అమరేశునట్లుంచి
2. మనవిగా గోవులు దిరిగి దనరు గిరులు కొలకులు వనములు వర్ధిల్లు నీవసుధపై గాదా
మనకోషధుల పంటలను పచ్చికలనిచ్చు ఘనమా నీగిరి కారాధన సేయరాదా
3. గిరుల నదుల నడవుల సురల ఖగముల వరలునని శ్రుతి పొగడు పరమానందున్
హరి నీ గోవర్ధన గిరిలోఁ గనఁగలము కాన హరికై గిరికే పూజలర్పింతమిందున్
4. నందగోపాదులు నమ్మఁ బల్కిన గోవిందుని వాక్యము లానందమున వినుచున్
సందాదియోగులు నతులై మతినుతి సేసిరి-నారాయణతీర్థుని నవ్యరచన యనుచున్

కం. గోవిందు వచనవాదము
భావించు సురేంద్రుపూజ బదులుగ నంతన్
గోవులు మేయు నిరవుగల
గోవర్ధనగిరిని గోపకులు పూజింపన్. 12

గీ. అందులకు వజ్రి కోపింప నంబుదములు
ధారగా నిరంతరవృష్టి ధరణి నింప
గోకుల మ్మాకులత ముంపుగొనుట జూచి
కృష్ణు డెత్తె గోవర్ధన గిరివరమును. 13

కం. గిరి గొడుగు నట్లు పట్టుచు
హరి గోకులగోధనముల నట రక్షింపన్
పరితుష్టి వినుతి సేసిరి
పరమున్ గోవిందు కృష్ణు భక్తిన్ వ్రేతల్. 14

5 ముఖారీరాగము - అటతాళము.

ప. గోవర్ధనగిరిధర     గోవింద
గోకులపాలక     పరమానంద

అ. శ్రీవత్సాంకిత     శ్రీకౌస్తుభధర
భావకభయహర     పాహి ముకుంద

1. పురుహూతమఖవి     ఘాతసుచతుర
పురుషోత్తమ     పూరితజగదుదర
మేరుభూరిధై     ర్యాఘవిదూర
మీనకేతుశత     కోటిశరీర

2. అమితకల్యాణగుణ     అగణితలీల
అపరిమితానంద     ఘననందబాల
శమితదైత్యదంభ     శాంత్యాదిమూల
విమలమానసవృత్తి     విలసితశాల

3. వహతో జగదండ     కోటీస్త వేదం
వరద కి మద్భుత     మచలేంద్రవహనం
మహనీయకీర్తి మా     వహసి దేహి ముదం
మాఘవనం మద     మపనయసికథం

4. ఆనందామృత     వారిధిఖేల
అలఘుపరాక్రమ     అనుపమలీల
శ్రీనందాత్మజ     శ్రితజనపాల
శ్రీకరకిసలయ     లాలనలోల

5. పాటితసురరిపు     పాదపబృంద
పావనచరిత     పరామృతకంద
నాట్యరసోత్కట     నానాభరణ
నారాయణతీ     ర్థార్చితచరణ

5 వ కీర్తన.

ప. గోవర్ధన మెత్తినావు! గోవింద!
గోకుల మోమితి, వెల్లరు కూడిముద మొంద

అ. ప. శ్రీవత్స మలరార శ్రీకౌస్తుభ మొప్పార
భావించు భక్తుల భవ భయముఁ దీర్తువౌ ముకుంద

1. నిలిపినా వింద్రయాగము నేర్పు మీరంగ
బలు నీ మగటిమి, జగ ములు నిండంగ
కలుష మెడల బంగరు గట్టుదిట్టము పొంగ
వలరాజుల కోట్లు మింతువు లలి మే నెనయంగ

2. సుగుణంబు లెన్నన్నో [illegible]
నెగడి యానందమున నీ [illegible]
తెగడి క్రూరుల శాంతి ధీరత నేల
తగు నెలవౌదువు శుభమా ధ్యానముల పాల

3. వరదా! జగములకోట్ల వహియింప లేద?
బరువే! యీగిరియునీ బాహువుమీద
సురరాజుగర్వమును సుక్కణపఁ గాద
వరలింతువు నీకీర్తి కరుణ మము నేద

4. ఆనందమా కేళి నమృతాబ్ధి పైన
జానా గాంభీర్య మె సగు లీలలోన
శ్రీ నిన్ను చేచివురుల సేవించు పతిపైన
మా నందు సుతుడవౌట మమ్ము నేలుట కేన?

5. క్రూరులను నడవుల కుదిలించివైవ
నీ రమ్యకథ సుధయా నిత్యభూతికి త్రోవ
తీరా నగలూని నృత్యము తీర్చెదము రావ?
నారాయణతీర్థుల నతిగై కొను మీవ

—♦ ఇంద్ర కామధేనువులు శ్రీకృష్ణుని మహించుట ♦—

అథ దేవేంద్రాగమనం—

6 నాదనామక్రియారాగము - ఆదితాళము.

సహస్రామరసేవిత స్సహస్రాక్షః కృతక్రతుః
సహస్రగోత్రభి ద్వజ్రీ శచీనాథో విరాజతే

శ్లో॥ రక్షితే గోకులజనే హరిణా గిరిధారిణా,
లజ్జాభరానతశిరా స్సురరాజోఽభవత్తదా. 15

శ్లో॥ నివృత్తే మేఘసంఘూ తే స్వస్థే గోకులవాసిని,
స్థాపితే చ గిరా కృష్ణ మింద్రః స్తౌతీతి సాదరమ్. 16

శ్లో॥ శ్రీగోపాల కృపానిధే కరుణయా స్వామిన్ మయానుష్ఠితం
క్షంతవ్యం భవతాపరాధశతకం యద్యత్ క్షణే తత్తదా,
ఆదిత్యాదిసమస్తదేవనివహో యస్యాజ్ఞయా వర్తతే
సత్వం సాత్వతపుంగవః శ్రుతిశిరోవాగ్గోపికావల్లభః. 17

7 తోడి (శంకరాభరణ) రాగము - ఆదితాళము.

ప. మామకాపరాధశతం క్షమ్యతాం త్వయా

అ. మామకాపరాధశతం మాగణయాథ వాయుతం
శ్యామవర్ణ శమాన్విత శాశ్వతానందసందోహ

1. అత్యంతకృపాసాగర ఆదిపురుషానాధార
నిత్యద జగదాధార నిహ్నుతాసుర
శ్రుత్యంతవన సంచార శోభనఫల దాచార
భృత్యదయాధృతాకార భ్రమకారణ విదార

వ. అంత ఇంద్రుని ప్రవేశము——

6 వ కీర్తన.

ప. చాల గిరుల వజ్రమ్మున గెలఁకన్    జాలి నూర్ల యజ్ఞము లొనరించెన్
అ. వేలకొలఁది సురవీరులు గొలువన్    వేయికనుల శచీవిభు డరుదెంచెన్

కం. గిరిధరుఁడౌ కృష్ణునిచే
పరిరక్షణ గోజనాళి బడయుటఁ గనుచున్
సురరాజు గర్వముడిగిన
శిరమును గడు వంచి నయము సిగ్గును గాంచెన్, 15

ఆ. వె. మబ్బు పట్టువదలి మాయమై పోయెను
గోకులమ్ము వారు కుదురుకొనిరి
గిరిని తొలుతచోట కృష్ణుండు నెలకొల్పె
స్వామి నింద్రు డిట్లు సన్నుతించె. 16

శా. శ్రీగోపాల! దయామయా! కరుణతో శిక్షార్హు మన్నింపవే
రాఁగా నెప్పటితప్పు లాక్షణమె నూర్లక్ష సైచి రక్షింపవే
యోగుల్ సాత్వతు లెంచలేరు నిను వేదోక్తాళినీయాజ్ఞలే
వాగీశార్కసురాళి వర్తనలు నీవాల్లభ్యముల్ మాధవా. 17

7 వ కీర్తన - ఇంద్రుని క్షమార్పణ.

ప. మాయపరాధములు నూఱు    మన్నన గోరు
అ. మా యపరాధములు నూఱు    మఱి పదివేలైన మీఱు
సేయుమా క్షమ; శ్యామలుధీరు శ్రీశు నినుగన ముద మొప్పారు

1. తొలి నీవై నెలవు మించవ    జలధి యన కల్పమాపై నించవ?
కొలిపి మోక్షము భువి భరించవ ఖలుల నొంచవ
అల వేదవని చరించవ?    ఫలముశుభ మిప్పించవ?
లలిదయన్ మము మన్నించవ? కలిగిన భ్రమ తొలగించవ?

2. కామశతకోటివేష ఖండితనిఖిలదోష
దామోదరో దారభాష దాసపోష
కమలాకృతాభిలాష కామనాకలితాశేష
సామగీతా శ్రితాశేష సాధుజన సంతోష

3. ఆదిత్యచంద్రమండలా భ్యంత రాధార నిర్మల
బోధరూపా నందాచల పోషితాఖిల
వేదపురాణాదిమూల వేణుగానక్రీడాలోల
సుందరతరగోకుల శ్రీధర నాథ గోపాల

4. ధారాధరాకార ధిర ఘోరారిసంహార శూర
నీరజనాభ నిరుపమ నిర్మలానంద
పారావార శ్రీవిహార పాపతిమిరభాస్కర
నారాయణతీర్థసంతార నానాగమాంతసంచార

౫. ఇంద్రసహాయార్థ మాగతా కామధేనుః స్వకీయ క్షీరాభి
షేకపూర్వకం శ్రీకృష్ణమిత్థ మాహ.

శ్లో॥ నందకుమారక మనఘం నౌమి పరానందఘన మఖిలవంద్యామ్,
సుందరసరసిజనేత్రం మందస్మితసాంద్ర చంద్రికాచంద్రమ్

8 సావేరీరాగము - త్రిపుటతాళము.

ప. నందనందన గోవింద నౌమి తే పదం
అ. మందరభూధరోద్ధార మధురగోపాలకృష్ణ
1. సరససుందరహాస సముదితనిజభాస
నిరసితాంధతమస నిత్యానందరస
2. అపరిమితకరుణ అసురబృందనిర్వారణ
తపనీయాంబరాభరణ దాసపోషణ
3. కలితకస్తూరీతిలక కమనీయఫాలఫలక
లలితత్రివళీపులక లక్ష్మీపాలక

2. స్మరుల నూర్లకోట్లఁ బోలవ? దురితమెల్లను బాపజాలవె?
హరి! దామోదర భక్తిఁ గ్రోలవ? వరభామ లోలవ?
సిరికూరిమి పరతఁ దేలవ? మరికోర్కెలఁ దీర్చి యేలవ?
సరససామము వినుచు తాళవ? సాధులన గరుడుపై వ్రాలవ?
3. భానుచంద్రుల మండలమున లోన పై నాధారశుభముల
జ్ఞానబోధల రూపముదముల సకలత్రాణముల
పూని వేదపురాణముల పొగడఁబడు వేణుగానముల
జానుగా గోకులభూముల శ్రీనిధవి! ప్రభు! గోగణముల
4. నీరదమువలె గర్జించి ధీరతఁ వైరుల నొంచి
సారసము నాభి ధరించి సరిలేని ముదము నించి
శ్రీరవిగ పాల్కడలిమించి చీకటుల పాపముల ద్రుంచి
నారాయణతీర్థు నెంచి నన్నేలుము శ్రుతి నలరించి

వ. ఇంద్రునికి సహాయముగా వచ్చిన కామధేనువు తనయొక్క క్షీరాభిషేకపూర్వకముగా శ్రీకృష్ణస్వామివారికి ఇట్లు విన్నవించెను.

కం. నందుని నందనుని పరా
నందు ననఘు మోముకళల సగవులచంద్రున్
సుందరసరసిజనేత్రున్
వందన మిడి కొలుతు నఖిలవంద్యు ముకుందున్. 19

8 వ కీర్తన.

ప. నందనందను గోవిందు నతిసేతు పదములందు
అ. మందర మెత్తితివి ముందు మధురగోపాలకృష్ణ!
1. చిరునవ్వు నేర్పు యింపు హరి నీ తేజంపు సొంపు
ఇరుల తామసముదింపు నెరి నానందంపు పెంపు
2. సరిగె సేల్వ నగల తోడ వరలి యెంతో కరుణ తోడ
సురల భక్తుల గాపాడ తరిమెదా రక్కసుల పీడ
3. లలి కస్తురి బొట్టు వెలయ అలరు నుదుటి సొబగు దెలియ
పులకలు మెయి వళుల నొలయ పొందుగ సిరి నిన్నే కలియ

4. కౌస్తుభశోభితకంఠ కలితశ్రీవైకుంఠ
విస్తీర్ణదయోత్కంఠ వినతశ్రీకంఠ

5. వారిహాయమణినీల హాటకమణికుండల
నరనారాయణలీల నందితాఖిల

6. గోపరమణీనయన కుముదచంద్రవదన
తాపసమానసాయన తాపనాశన

7. శరణాగతహితార్థ శంసితనతపార్థ
వరనారాయణతీర్థ వర్యపురుషార్థ

శ్లో॥ స్తుత్వా సురేంద్ర శ్రీకృష్ణంవిజ్ఞాప్య జ్ఞాతకౌశలమ్,
ఆజ్ఞాతో లోకగురుణా ధేన్వా సహ దివం గతః. 20

ఇతి శ్రీనారాయణతీర్థవిరచితాయాం శ్రీకృష్ణలీలాతరఙ్గిణ్యాం
శ్రీకృష్ణగోపీవస్త్రాపహారగోవర్ధనోద్ధారవర్ణనం నామ
పఞ్చమ తరఙ్గః.

4. కౌస్తుభము మెడశోభిల్ల    కాంతులను వైకుంఠ మొల్ల
విస్తరిల దయ వెదజల్ల    వేడు నీశుఁడు ప్రేమ చెల్ల

5. హరినీలతనువు వెలుఁగ    మరి కుండలములు చెలఁగ
నరనారాయణ సేవగలుఁగ    వరలెదా భక్తులు మెలఁగ

6. గోపకాంతల కన్నులను    కుముదములకు మోముశశియన
తాపసుల మది నిలయమన    దనరెదా తాపము చన

7. శరణన్న మేలుగూర్చి    పురుషార్థముల నెలర్చి
నరుని నతి నుతిగొందుచేర్చి    నారాయణ యతినలర్చి

కం. లోకగురువైన కృష్ణు మ
హో కౌశల మెఱిగి యింద్రు డాజ్ఞ బడసి తా
నాకమునకు సెలవుం గొని
నా కామగవియును సురలు ననువర్తింపన్. 20

ఇది శ్రీనారాయణతీర్థులవారిచే రచింపబడిన శ్రీకృష్ణలీలాతరంగిణి
యందు శ్రీకృష్ణస్వామివారిచే జరుపబడిన గోపీవస్త్రాపహారము
యొక్కయు గోవర్ధనోద్ధరణముయొక్కయు వర్ణనమును

అ యి ద వ త ర ం గ ము

శ్రీరస్తు

# శ్రీకృష్ణలీలాతరఙ్గిణి-సంస్కృతము

## షష్ఠ తరఙ్గము



—♦ కథాసంగ్రహము ♦—

శ్లో॥ బృందావనేథ శ్రీకృష్ణగోపీసంగోభినీయతే,
ఆదౌ గోప్యస్తతః కృష్ణో గోపీనాం కృష్ణసంగమః.
గోపీ శ్రీకృష్ణసంవాదస్తతో గోపీపరిగ్రహః,
షష్ఠేస్మిన్ సంగ్రహేణైవం రాసారంభో నిగద్యతే.

—♦ శ్రీకృష్ణగోపీసమాగమవర్ణనమ్ ♦—

శ్లో॥ శారదేవ శరదాగతా స్వయం తారకోదయవిశేషభాసురా
వారితేషు సలిలేషు ధీమతాం స్మారితార్థమవభాసయంత్యసౌ.

శ్రీరస్తు

# శ్రీకృష్ణలీలాతరఙ్గిణి - తెనుగు

## షష్ఠతరఙ్గము.



—♦ తోహరలు

ఇది శ్రీగోపీకృష్ణసమాగమ మెనయున్ శుభ నాట్యమునన్
ముదమొసగున్ బృందావన రంగాస్పద షష్ఠతరంగమునన్. 1
ఆదిని గోపిక లట్టుపై కృష్ణుడు నరుదెంతురు వనమునకున్
వాదము సరసోక్తుల నగు హరిగొను వనితలను న్గ్రాసమునకున్. 2

—♦ శరత్ కాలవర్ణన ♦—

గీ. వాహినుల చెరువుల నింపి వానలాగె
రమ్యతరముగ మింట తారకలు వెలసె
నర్థచింత సుధీవర్గ మందుకొనియె
శారదాగమ మలరారె శారదవలె 3

ర. తత్ర భగవతి శ్రీనివాసే పరిపాలితనిజదాసే సంతతానంత కల్యాణ గుణగణనవరత్నరత్నాకరే సరళమురళీనాదసముదంచిత వివిధగీత సముద్ఘోష మందగమనోల్లాస వివిధవిలాసబహుతర కల్లోలజాలే భువనసుందరే శ్రీకృష్ణే విహరతి తస్మిన్ వ్రజయువతీమనోనద్యః స్యందమానాః సమభివ్యక్తశారదవిమలీకృత వృత్తివిశేషానుభవ రసాఢ్యాః తద్దైకరస్య మఖిలషం త్యస్సత్వర మావివిశుః, ఇత్థంచ తాసాం వచోవిలాసాః ప్రాదుర్బభూవుః. 4

1 కేదారగౌళ (తోడి) రాగము - ఆదితాళము.

ప. పరమపురుష మనుయామవయంసఖి-పరమపురుషమనుయామ

అ. సురుచిరహాసం సుందరనాసం తరుణారుణకిరణాధరసరసం

1. నందకుమారం నగవరధీరం బృందావనభువి వివిధవిహారం
బృందారకగణవందితచరణార విందమిళితమణి మధుకరనికరం
2. భావుకచరణం భవసంతరణం భవ్యసేవకజనభాగ్యవితరణం
అవ్యయవిమలవి భూతివిజృంభిత దివ్యమణిరచిత వివిధాభరణం
3. పరమోదారం పాపవిదూరం స్మరసాయకస్రగ్ధరమతిచతురం
విరచితమురళీ గీతరసామృత భరితఘనసంఘన కౌస్తుభహారం
4. యువతీ మణిగ ణసులలితం కవిజనమానస కమలవిలసితం
శివనారాయణతీర్థవిరచితం శ్రీగోపాలదయారసమిళితం.

శ్లో॥ భోభో వ్రజపుర్యార్యాః శారదసమయం పరం శివం మత్వా,
కృపయా తత్ర జామోగోవిందం ప్రాహురితి సదాన్యోన్యమ్. 5

వ. అప్పుట భగవంతుడును, శ్రీనివాసుడును, పరిపాలింపబడిన తనయొక్క భక్తులు గలవాడును, ఎల్లప్పుడును అనేకశుభగుణములను నవరత్నములకు సముద్రుఁడును, మృదువైన వేణుగానముతో మిగుల నొప్పుచున్న వివిధములౌ పాటలయొక్క చాలమంచిధ్వనియు, సెమ్మదియైన గమనమును, సంతోషముతో కూడిన అనేక రీతుల విలాసములును, అను చాలచాల తరగల సమూహములు గలవాడును, లోకములకన్నిటికి సౌందర్యవంతుఁడును, అగుశ్రీకృష్ణుడు, ఆ నేసముద్రుఁడు విహరించుచుండగా,

అందు (ఆసముద్రమునందు) గోపయువతుల మనస్సులను నదులు ప్రవహించుచున్నవై, బాగుగా వ్యక్తమైన శరత్కాలముచే స్వచ్ఛముగాఁజేయబడిన, తమ ప్రవృత్తివిశేషముయొక్క అనుభవమును రసముచే నొప్పినవై ఆ శ్రీకృష్ణసముద్రమునందు ఐక్యమును కోరునవై వేగముగా ప్రవేశించెను. అంత ఈప్రకారముగా ఆ గోపికల వాగ్విలాసములు ప్రభవిల్లెను. 4

1 వ కీర్తన.

ప. పరమపురుషు ననుసరింతమే చెలీ! పరమాత్ముని సేవించి తరింతమే

అ. చిరునగ వెనయన్ వరనాస మొనయన్ సురుచుల మృగు వౌన ధరరసమువానిన్

1. నందుముద్దులపట్టిని నగరాజంతజెట్టిని-బృందావనిన్ మనసో ప్రేమనాడువానిన్
వందనములు సేయుసురలవరలు కిరీటముల-యంచునీలములకు లైయానుపాదాబ్జముల వానిన్

2. చరణములు మేల్ నింప జన్మలెల్లతరింప - వరమిచ్చిభక్తుల కుసిరుంగాసగువానిన్
సిరమూ శుభమూ పదవి చేకూర్పగా నొదవి-వరమణుల నగలొప్ప వైభవమువానిన్

3. ఔదార్యమునకొల్ల అణచు పాపుల నెల్ల-అతనుశరములమాల నతి నేర్పుగలవానిన్
మోదమ్ముదొలకంగ మురళీనాదముపొంగ-ముస్తాబుతో మెడనుకౌస్తుభమువానిన్

4. గోపతరుణులపాటగురుయోగులకు తేటగొనికవులమనోజ్ఞములౌననుమాటలవానిన్
గోపాలుదయారసమునగూడినరచనమున-ప్రాపౌనారాయణతీర్థభక్తు సేవువానిన్

కం. నారీమణులారా! యిదె
శారదసమయమ్ము తగ నెసగె శివసమ్మైమె
గోరి భజింతము కృష్ణుని
నారయుద మటంచు వనిత లన్యోన్యముగన్. 5

— శరదృతువర్ణనమ్ —

2 కల్యాణి (సారంగ) రాగము - త్రిపుటతాళము.

ప. శంకే శంకరం శారదసమయం

అ. ప. పంకేరుహపరాగ విభూతిధవళం

1. పాపపంకశోషణ పటుతరరవికిరణం
పరిహృతాపరిమిత ఘనావరణం
కపటకేతకకుసుమభారవిరహిణం
కలితతారకగణ స్ఫటికాభరణం

2. పరపురుషసురతిపతి కామవిదూరం
పండితమండలపరమాహ్లాదకరం
వరహంసగతివిన్న్యాసనచతురం
వాంఛితసముదితఫలవిధాతారం

3. నిర్మలరసపూరనిరుపమగంగం
నిఖిలమానినీజనమానవిభంగం
శర్మదశశిధరసరసోత్తమాంగం
సముదితగోవిందకృత బహుసంగం

4. ఇతి గోపవధూగీత మిద మతిలలితం
ఈశోపమశారదసమయవిలసితం
యతివరశివనారాయణతీర్థ ఫణితం
యాదవాబ్ధిజరత్న రత్నసమ్మిళితం

శ్లో॥ ఇతి ప్రలపతి వ్రజే శరది గోపికామండలే
సుధాకిరణమండలే పరిహృతాంధకారే నిశి,
పరాక్రమిణమానసా స్సఖిలు కృష్ణ సారాః స్ఫుటం
మురారిమురళీరవ స్సపది తా స్సమాకర్షతి. 6

శ్లో॥ కాపి గోపీ పరం కాంతం కామచారఫలోదయమ్,
గంతుకామేతరాం గోపీం గోపీం త్వరయం తీద మాహ తామ్.

2 వ కీర్తన

ప. శంకరుడే యననౌనే శారదవేళనే

అ. ప. అంకిలియే తమ్మిపొడి అదే భూతితెల్పుతోనే

1. పాపమను బురద నంత భానుకరమన నింకించున్
పైపై మబ్బుల నెల్ల పటాపంచలు గావించున్
ఏపున మొగలిపూల హెచ్చనీయక డించున్
ప్రాపుగ నక్షత్రముల స్ఫటికమాల ధరించున్
2. పెరవారి యాస లుడుఁగ తరుణుల భర్తలఁ గూర్చున్
పరమా మోదమ్మున పండితులఁ దేర్చున్
పరమహంసల విఘ్నఘణితిం బోకార్చున్
సరిదైన కోరికల సఫలముగ సమకూర్చున్
3. గంగపోలు నదుల తేట గంగతోడ నింపున్
పొంగు కోపముగల్గు సతుల పొలయల్కల దింపున్
సంగడించు తలమీద శశికళల సొంపున్
చెంగలించు గోవిందు చేరు నాట పెంపున్
4. ఇది గోపికలపాట మృదువై యొప్పారున్
అదను శరత్తు శివుడో! యనగా నలరారున్
మది నారాయణతీర్థు ముదమై చేకూరున్
యదువంశాబ్ధిరత్న మలర దనరారున్.

శా. ప్రేమాలాపము నిండు శారద నిశాప్తిన్ గోపికామండలిన్
సోముం డాత్మసుధాంశుమండలముచే స్రుక్కించె చీకట్లు, భ
వ్యామోదాత్మల నీలలోచనల కర్ణాకర్షణంబయ్యె ది
గ్వ్యామోహంబగు కృష్ణదేవమురళీగానంబు ప్రేపల్లెకున్. 6

కం. కామార్థశుభఫలోదయు
స్స్వామిన్ పరమాత్ము కృష్ణు సందర్శింపన్
తా మది వేగిరపడుచున్
భామ యొకతె తోడిచెలిని పదపద మనియెన్. 7

—♦ గోపిక లన్యోన్యము సరససల్లాపంబు లాడుట

3. ముఖారీ [పున్నాగవరాళి] రాగము - త్రిపుటతాళము.

ప. బృందావన మధు నా మన్యే సఖ
బృహదారణ్య మహం

అ. సుందరతరవంశనాద సంసూచిత స్వా
నందబోధామృత మయపురుషం

1. ఉన్నత శాఖాగ్ర పరానంద
నిర్ణయ రసపూర ఫలభారం
పుణ్యావతామతి రమణీయ మమరేంద్ర
వర్ణితభూమ పదంభవపారం

2. మునివరపరిసేవితం మోహవిరామ
మూల మశేష విశేషాస్పదం
అనికేతనికేతన మఖిలశోకహర
మనుదయలయపర తరసిద్ధఫలదం

3. సకృ దిదమవలోకితం సమ్యగిహ
స్వసుతకళత్రాదికృత ధనవిరసం
ప్రకటయతిపరమ హంససమాకుల
మమలమానసవృత్తి విలసితసరసం

4. జితకృతరిపువర్గం పరమయోగి
పరిపూర్ణ భావ విశేషోదయం
హరిపర భావన యాగోపికాగీత
మితిఫణితం నారాయణతీర్థయతినా.

గ. ఇత్థమన్యోన్యస్నేహ దయారసస్యందన ద్రవీకృత చిత్తవృత్తివిలా
సోల్లాసితవాగ్విలాసవతోభిగోకుల పురవరయువతోభిర్గోవిందం బృం
దావనసముదంచిత విపులతరలక్ష్మీవిలాసలాస్య రంగస్థలా యమా
నరమ్య వక్షో విశాలఫాలాదిసుందరసర్వాంగర స్వకాంతిమాలక్ష్య

3 వ కీర్తన.

ప., బృహదారణ్యోపనిషత్తన చెలి!
బృందావని తగునే

అ., మహనీయుఁడు వేణుగాన, మాధుర్యము సూచించుచున్
మానాథు నానందమయుఁ దలపించున్

1. ఉన్నతశాఖలందొనరు నానంద మిచ్చున్
వన్నెల రసమైన ఫలముల హెచ్చున్
పున్నముల వెలయునని పొగడి సురరాజు మెచ్చున్
ఎన్న హరినెలవు జన్మకిది తారక మనవచ్చున్

2. మునులు సంసేవింప మోహమును డింపన్
మునుకొన్న విజ్ఞానమును నెంతో పెంపన్
తనకై తానిందు శోకతాపము లుడిగింపన్
ఎనసి తగ్గని ఫలముగను పర మిప్పింపన్

3. అగుదుగనే గన నాలుబిడ్డలన్
మరి ధనాశలన్ బరపు మఱపులన్
పరమహంసలున్ ప్రబలు యిరవులన్
వరలున్ మానస సరసులఁ దరులన్

4. వెలిలోవైరులు దొలగన్ మునులన్
తలపుల ధ్యానో దయవర్ధనలన్
అలరించు గోపికల హరికీర్తనలన్
అల నారాయణతీర్థయతి విరచనలన్

వ. ఇట్లు, ఒకరిపై నొకరికిగల స్నేహము, దయారసము, జిలుకుటవల్ల, ద్రవించినమనస్సుల ప్రవృత్తిసొంపుచే నుల్లాసముతోకూడిన మాటల సొంపునింపుచు వ్రేపల్లెగోపికలు, శ్రీకృష్ణుని, బృందావనము యొక్క అతిశయమైన వైభవమును లక్ష్మీదేవియొక్క సొంపగు లాస్యమునకు రంగస్థలమౌ రమ్యమైనవక్షమును విశాలమైన నుదురును మొదలగు సర్వావయవముల శోభగలవాని, తమకాంతుని,

మదనమహీపతికార్ముక మహామేఘ సముద్గళితశరవర్ష ధారా ఇవ నిబిడతరబృందారణ్యానిగూఢం నవనీతముషం స మాసాద్య సకల లోకాభీష్టఫలం ఫలయుతం విశ్వంభరా ప్రదేశమివ వర్షధారా స్ఖ్సతయఇవ శ్రోత్రియం సమధిగతా స్సత్వర మాజగ్ముః. నయనోత్పలాని చ తస్మిన్ శ్రీనివాసే ప్రసారయామాసుః 8

శ్లో॥ జ్ఞాత్వా హరిః స్థిరం భావం పరస్మిన్ పుంసి యోషితాం,
అవిష్కరిష్యన్ గోవింద స్తాసాం ప్రాహేద మాదరాత్. 9

—♦ కృష్ణుడు గోపికలకు నీతిమార్గ ముపదేశించుట ♦—

4 శంకరాభరణరాగము - అటతాళము

ప. వల్లవాంగనా మా కలయత ధర్మోల్లంఘనం

అ. వల్లవాంగనా నిజ వల్లభపదయుగ
పల్లవసేవన మేవ పరోధర్మో

1. కులశీలకర్మాది కుళీరాదిజాలం
కోపసంతాపాది నిబిడకల్లోలం
అల మిహ సంసార జలధి మాగమకృత
కులధర్మసేతు రథ తారయతి బహుళం

2. రహసి నిశి వనే కిం రమణీయచరణం
మహనీయగృహపతి మపహాయ తరుణం
సహసా పరపురుషానుసరణే నాలమిహ
గృహపతి మిహ యాత గృహిణీశరణం

3. గురుబంధుజనావజ్ఞా కుత్సితాచారం
పరిహారత కురుత పరపరిహారం
త్వరయైవ గృహ మను యాతపాతకబుద్ధి
మరివర్గ మపి పరి హారత నిస్సారం

దర్శించి మన్మథుడను రాజుయొక్క విల్లుఅను గొప్పమేఘమునుండి వెడలు జడివానవలె (గోపికలు) దట్టమగు బృందావనమున దాగియున్న నవనీతచోరుని సమీపించినవారై సకలలోకముల కోర్కెలనే ఫలముల నిచ్చుటకై, భూమిపై జారు వర్షధారలవలె, శ్రోత్రియునియందుచెందు వేదములవలె, త్వరితముగ స్వామిని సేవించిరి. ఈ గోపికలు తమకనులనేకలువలనుఆశ్రీనివాసునియందుప్రసరింపచేసిరి. 8

ఆ. వె. పరమపురుషుడైన హరియైన తనయందు
మతుల నిల్పుకొన్న సతుల నెఱిగి
వారి భక్తిభావ వరసుస్థిరత్వంబు
వెలువరింపఁగోరి పలికె శౌరి. 9

4 వ కీర్తన

ప. పల్లవాంగనలార! వలదు ధర్మమువీఱ
అ. ఎల్లరకు మీమీ వల్లభుల పాదములే
పల్లవము లని ప్రేమ భక్తి సేవించవలె
1. కులము శీలము కర్మ అలలౌ సంసారజలధి
కలఁగు కోపసంతాప కల్లోలములుగలది,
చెలులార! ఇదిదాట అల వేదము పల్కినది
కులధర్మ మనునది కల దొకటే సేతు వది
2. మహనీయుల గృహపతుల మఱపి యిట రానేల?
విహితమ్మో? వని రేయి విహరించుటమేల?
నహి, తగవు పరునికై మీ నడక లెవ్వియు చాల
గృహముల కేగుఁడు, పతులే గృహిణుల దిక్కెవేళ
3. కూడని దీపని యంచు కులమెల్ల నిందించు
పీడనౌ, మీమతుల వెగటిది యనుకొంచు
తోడనేయింద్రియపొందు తొలగుడిది పెడబుద్ధియంచు
చేడెలార! యరివర్గముఁ నిస్సారమును పెంచు

4. పరిపూర్ణ బోధైక రస మఖిలసారం
పరమపురుష మను సరత బాలగోపాలం
గురువర కరుణా సుధాసముదంచిత
శివనారాయణతీర్థ యతిగీత మతులం.

శ్లో॥ శ్రవణాంజలిభి ర్గోప్యో గోవిందవచనామృతమ్,
పీత్వాపి జాతిస్వాభావ్యా ల్లజ్జాభారతరైః స్థితాః. 10

శ్లో॥ పునఃపునర్బోధయంతం ధర్మసారగిరా హరిమ్,
ఊచు ర్గోప్యో హరేస్తత్త్వం వ్యంజయంత్యోయథాగమాః. 11

—♦ గోపికలు కృష్ణు నుతించుట ♦—

5 మంగళకాఫీరాగము - అటతాళము

ప. శరణం భవ కృష్ణ! సం సరతాం భవకృష్ణ!

అ. కరుణా తవ సం సరణపయోధి సం
తరణీతి వరముని ఫణితి రస్మాకం

1. ఆరంభణ మథ జగతి ఫలావధి
ధీరమునిభి రిహ నిశ్చిత మఖిలం
భూరికృపాలయ ముహురి హాగమ
సారం త్వా మఖిలాత్మక మమలం

2. నూనం త్రిభువనగృహిణీపతి రితి
గానం మహతా మనుసంవిదితం
శ్రీనందాత్మజ శ్రీవసుధాధవా
నందం త్వా మనుయామో నిరతం

3. కామినీజనసకలకామదుహం పరమ
కారుణికం ప్రాహు రేవ భవంతం
కోమలగిరా గోపికాగణగీతం
గోవింద మితి నారాయణతీర్థఫణితం

4. పరిశుద్ధము నీతిసారము పదతులకు పూర్ణముగ
పరఁజో బాలగోపాలుడు మరి తెల్పె తెల్లముగ
గురువరుల కరుణయే పరమామృతముగ
నరసి శివనారాయణ యతి గూర్చె నతులముగ

కం. వివరించి కృష్ణుడిట్లను
సువచనముల యమృతధార సుందరులెల్లన్
శ్రవణములను నంజలులన్
చవిఁ గ్రోలియు వినతలైరి సహజవ్రీడన్. 10

కం. సారంబై ధర్మార్థక
పూరితమా కృష్ణవాక్యబోధ మతిమతిన్
కూరిమి వేదాంతమువలె
నారీమణు లెంచి యనిరి నందసుతునకున్. 11

5 వ కీర్తన

ప. శరణ మిమ్ము కృష్ణ! జన్మ తరణమిమ్ము కృష్ణ!
అ. వరదా! నీ కరుణ సంసరణ మను కడలిని
తరింపఁ జేయునని వరమును లనిరి మముఁ గని

1. హరి! తొలినుండి సృష్టి అంత్యఫల మందు దనుక
నెరయింతువని మునివరు లందురు గనుక
మరి మరి శ్రుతులు నీకరుణకు మేర గనక
పరిశుద్ధు నఖిలాత్మ ప్రణుతు లిడు, నిది చాలు ననక

2. ముల్లోకముల గృహముల సంపదల పతివన
ఎల్లమునిహితుల నుతుల నెనయు గానము విన
వల్లభుండవు శ్రీ వసుధా నీలలకన
చెల్లు నందకుమారు సేవింతు మెప్పుడు నినుగన

3. మంచికోర్కెల నెల్ల మగువలకు తీర్చెదవని
మించె డెంతో దయానిధిము పెద్దలు కొల్తురని
యెంచి, యింతవా మాటలెనయ గోపికలు భక్తిని
గాంచి నారాయణతీర్థ కరణి వేడిరి గోవిందుని

శ్లో॥ జన్మాంతరసహస్రేషు కృతపుణ్యఫలోదయా
ఇదమాహాపరా కాంతం కుర్వంతీ ప్రణతిర్ముహుః 12

6 బిలహరీ (మోహన) రాగము - ఆదితాళము.

ప. పూరయ మమ కామం గోపాల పూరయ మమ కామం
అ. వారంవారం వందనం మస్తుతే-వారిజదళనయన గోపాల

1. మన్యేత్వా మిహ మాధవదైవం -
మాయాస్వీకృత మానుషభావం
ధన్యైరాదృత తత్త్వస్వభావం -
దాతారం జగతామతివిభవం

2. బృందావనచర బర్హావతంస -
బద్ధకుంజవన బహులవిలాస
సాంద్రానందన ముద్గీర్ణహాస -
సంగతకేయూర సముదితభూష

3. మత్స్యకూర్మాదిదశ మహితావతార -
మదనుగ్రహ దేవ మదనగోపాల
వాత్సల్యపాలితవరయోగిబృంద -
వరనారాయణతీర్థ వర్ధితమోద

శ్లో॥ నృణాం బంధహతిం కుర్వన్ నృసింహోసి దయాఘన
ఇతి సంబోధ్య గోవిందం సానందం ప్రాహ గోపికా. 13

7 సావేరీరాగము - త్రిపుటతాళము.

ప. కరుణయాఽవ లోకయ మాం శ్రీనృసింహ
అ. శూరా సురసంహార శోభనాద్రి శ్రీనృసింహ

1. పరిపూర్ణ దయారస పాథోధిబృంహణ
ప్రహ్లాదచంద్రోదయ శ్రీనృసింహ
నిరసిత తామస నిర్విశేషమానస
గురుతరవీర శ్రీ గూఢసుగుణాలయ

గీ. వేయి జన్మాంతరములందు వెలయు కర్మ
పుణ్యరాశి ఫలించిన పోలతి యొకతె
పరమపూరుషునకు మఱి ప్రణతి సేసి
చిత్తతన్మయ గానంబు చేసె నిట్లు. 12

6 వ కీర్తన.

ప. తీర్చవో నాకోరికన్ గోపాల! తీర్చవో నాకోరికన్!

అ. అర్చింతు మఱిమఱి ఆర్తి వందనము లుంచి అల తమ్మికనులఁ గాంచవో? గోపాల

1. మాయ నేలు నిను మానవరూపుని
మాధవుని దైవమని మదిధన్యులుగని
నీ యాధిక్యము జగముల నిర్మించునదని
నెమ్మిఁ గొల్చెద రెపుడు నీ తత్వమహాతిని.

2. నెమలి పింఛమున నెరి విలాసమున
నెనరా బృందావని పొదల కొలనున
తమి నిండు నవ్వున దాసురాండ్రు విన
తనరారవో నగల నెనయు నెమ్మేనున

3. మీను కర్మ మను పదిమేటి రూపు లొందినావు
పూని మధనగోపాల పూజ్యలీల నన్నుఁ బ్రోవు
మానులకు వాత్సల్యమున జ్ఞాన మొనగూర్చినావు
శ్రీనారాయణతీర్థు సేవ లందుము నీవు.

కం. ''నరులకు భవబంధములన్
హరియించు నృసింహదేవ! అచ్యుత! కృష్ణా!
పరమగురువర్య! కావుము
కరుణ'' నని మఱొక్క గోపికామణిపలికెన్. 13

7 వ కీర్తన

ప. కరుణతోడ నన్ను గాంచుమా శ్రీనారసింహా!
అ. శూరులౌ ఖలుల ద్రుంచిన శోభనాచల శ్రీనరసింహా
1. నెరి నీదయ కడలి నసిగ వరలు ప్రహ్లాదుడు శశిగ
మరి పొంగు నిండెసగ శ్రీనాగసింహా!
సరగ తామస మడగ సరిసమత మది మెప్పగ
ఇరవుగ సుగుణములు తగ నెరయు శౌర్య మొప్పగ!

2. పాతకమహాటవీ పఙ్క్తిశోషావల
భక్తచందనశీతల శ్రీనృసింహా
ఉత్తుంగసుకిరీట ఉన్నతకేయూర
మత్తచిత్తమాతంగ మర్దనమహాబల

3. త్రైగుణ్యఫలాతీత తత్త్వఫలాత్మక
తాపజలధితారక శ్రీనృసింహా
శ్రీగురుకరుణయా శ్రితభక్తిసుధారస
శ్రీనారాయణతీర్థ శ్రేయోవిధాయక

శ్లో॥ అన్యాపి యువతీ కాచి దన్యాదృశగిరా హరిమ్,
ధన్యా సంబోధయం త్యద్ధా నన్యాయం ప్రాహ సాదరమ్. 14

8 పున్నాగవరాళిరాగము — ఆటతాళము

ప. భూయో భూయో యాచేఽంజలినా
భూమన్ త్వయి మే దాస్యం దేహి

1. నిమిషార్ధ మపి తవ దర్శనవిధురా
నింద్యా హి తను రేషా
తామరసేక్షణ తవపాదకమలే
తనుతాం తనుతాం మమ తనో రతులాం

2. కాంతం కాంతార మపి తవ యోగే
కమలేక్షణ మన్యే
కాంతారం గృహ మపి తు వియోగే
కరుణా తరుణీ మయి తవ భవతు

3. వరమురళీగోపాలవల్లభ మధునా
త్వరయాహ మభిలషితం
సరసగిరా గోపయువతీ కథిత మితి
కరుణాకృష్ణనారాయణతీర్థ ఫణితం

2. పాపంపు పనుల కెల్ల    పటుకోపాగ్నివై చెల్ల
ప్రాపౌ భక్తులకుఁ జల్ల    నా శ్రీనృసింహా
దీపించు మేల్ కిరీటమున    దివ్యాలంకారమున
కోపింతువు పెనుబలమున    క్రూరుల మదగజము లన

3. సత్వము రజస్సు తమము    సమకూర్చు ఫలము మించు
తత్వమై తాపాబ్ధిఁ మాన్చు    శ్రీనృసింహా
స్వత్వమౌ భక్తి సుధనించు    సౌమ్యమౌ గురుదయఁగాంచు
సత్వరము శ్రేయస్సు గాంచు    సాధునారాయణుని విన్చు

ఆ. వె. అన్యయువతి యొక తె హారిని సంబోధించి
మాన్యముగను వేరు మాటలానర
ధన్య గణ్యయాట సన్న్యాయ విజ్ఞప్తి
సాదరముగ గానసరణిఁ నెరపె. 14

8 వ కీర్తన

ప. మరి! మరి! నంజలినేఁ జేసి వేడెద-
పరమేశ! నీసేవ! అరుదయ్యెనుగద

1. నీ దర్శన మర నిమిషమైన లేక
నిష్ఫల మీతను వెంతదాక
పాదాబ్జములు నీవి ప్రభు! నాపై సోకసోక
పద్మాక్ష! ధన్యనౌ భాగ్య మబ్బును గాక

2. కాంతారమే మైన కడు ప్రియమౌ నీవున్న
కన్నుదమ్ముల నన్నుఁ గన్న
కాంతారమౌ గృహమే గన నీవు లేకున్న
కరుణింపవలె నీవే తరి నన్ను గన్న విన్న

3. వరియింతు గోపాల వల్లభుని నిన్ను గడు
త్వర బాపు గురువై మాయ గడు
సరసవాక్కుల గోపతరుణుల పాట పొగడు
వరనారాయణతీర్థ పరమాప్తి నింపి నెగడు

శ్లో॥ మురారివచనావ్యగ్రా వల్లవీ కాపి తత్పరా
సంబోధయిత్వా స్వసఖీమితి గాయతి సాదరమ్. 15

9 కల్యాణీరాగము—అటతాళము

ప. వద కిం కరవాణి సఖి హే
వద కోకిలశుకవాణి

అ. బత వనభువి బర్హి బర్హావతంసో
వదతి కి మపి వక్రతయాలం

1. నిమిషార్ధమపి యుగ సహస్రసమతయా
నీతం మయా దిన మాసాయం
అమితకృపానిధి రయ మితి సహసా
అధునా గత మిహ త్యజతి కథమయం

2. గృహ పతిపుత్రధనాదిషు మమతా
గ్రహపరిగృహీతాం తరంగం
మహనీయమురలీ సరళగీత మంత్రేణ
మోచిత మపి రచ యతి గృహసంగం

3. తపసా కిల మహ తా భువి కల్పక
తరు ముపలభ్య కోపి కామితదం
సఫ లేయ మితి గోపికాగణగీతం
విపులం శివనారా యణతీర్థే నేదం

—♦ శ్రీకృష్ణుడు గోపికల బరిగ్రహించుట ♦—

శ్లో॥ మధ్యే కృష్ణం మరకతమణిచ్ఛాయ మిచ్ఛావిహారం
కృత్వా గోప్యః కువలయదృశో నాయకం వేష్టయంత్యః,
గాయంత్యస్తం సరసవచసా దాస్యభావం భజంత్యో
బృందారణ్యే మణయ ఇవ తాః పద్మరాగా ఇవాసన్. 16

శ్లో॥ నిగమబృందసరోరుహసంగతం నిఖిలలోక మధుస్వసుఖాత్మకం
మధురిపుం ప్రతిలభ్యచ వల్లవీమధుకరా స్సుకరంజగురిత్యలమ్ 17

ఆ. వె. కృష్ణపరవరాత్మ విష్ణుతత్త్వజ్ఞాత
యైన గోపియొకతె హరివచనము
విని మనంబులోన వినతార్తి గానమ్ము
సలిపి చెలియ నిట్లు పలుకరించె. 15

9 వ కీర్తన.

ప. చెలి! పల్కవే శుకవాణీ! ఏమి
సేయనే వాని పికవాణీ!

అ. అల నెమ్మి పింఛమున నడవి నంతట వెలయు
పలుకు నేమేమో కలికియై రాక నొలయు

1. నిమిషార్ధ మొక్కొకటి నే వేయి యుగములుగ
తమియై పగలంతయు తరలించి రేయి డాయగ
అమితదయగలవాడని ఆతనికై యుందరుగ
అకటా! యెట్లోర్తునే అగుపడకనే పోయెగ

2. గృహపతి సంతతి యని గృహమని ధనమని
గ్రహములఁ జిక్కిన నా సహనంపు మతిని
మహామురళీమంత్రమున మఱి దక్కిన దనుకొంటిని
గృహముల గ్రహముల మించిన కీలకమ్మున జిక్కు కొంటిని

3. ఘనమౌ తపమునగాని కనబడని యీ కల్పతరువును
గనునదియే సఫల మొం దినదౌ సీధరను
అని గోపకామిను లలరించిన పాటను
విని శివనారాయణ ముని గూర్చె కీర్తనను

సీ. మధ్య నాయకముగా మరకతమణి వెల్గ చుట్టు కెంపులసొంపు శోభిలంగ
నిచ్ఛాంచితవిహారు నిందీవరశ్యాముఁ గదియ సంవేష్టించి సుదతులెల్ల
కువలయ లోచన ప్రవిమల వీక్షలన్ భక్తి దాస్యప్రేమ భావ మెనయ
సరసవచోరాగ సంగీతనృత్యముల్ భజన బృందావనిన్ బరిఢవిల్ల

గీ. వేదకమలాలయుండగు విశ్వసేవ్యు మధురిపుని మధురంబైన మహితసేవ,
లంబ రోలంబ కచపాళి లలి నటింప, సుకరముగ సల్పి గోపికల్ శుభము గనిరి.

10 కేదారగౌళ (కాంభోజీ) రాగము - అటతాళము

ప. వనభువి గోపాల మిహ విహరంతం

అ. వల్లవయువతిజన వలయభాస్వంతం

1. నిగమసరోరుహ నిత్యసంగతమధు
మధుహారాత్మత యేహ సముదితం
అగణితగోధన మపరిమితానందం
ఆనందకర మమ రేశితు రపి తం

2. ఇనశశిపావక తారకాభాసక
మీక్షణసముదితజగదేక నాథం
మునిజనమానససారసవరహంస
మహనీయ దైవత మఖిల దేహరథం

3. లావణ్యసరిదేక నాయక మఖిలసం
రక్షణ మమరసంరక్షణ మధునా
సేవకశివనారాయణతీర్థభావిత
శ్రేయోవిధాయక మిహ వేదవిధినా

శ్లో॥ గాయంతో్య నన్నృతు శ్చేష్టం గాయంతం నఁదనందనమ్,
వేణునాదసుధాధారా ముద్గిరంతం ముహు ర్ముహుః. 18

ఇతి నారాయణతీర్థవిరచితాయాం శ్రీకృష్ణలీలాతరఙ్గిణ్యాం
శ్రీకృష్ణగోపీసమాగమవర్ణనం నామ షష్ఠతరఙ్గః.

10 వ కీర్తన

ప. వనినిండే కృష్ణుండు వరలి విహరించెన్

అ. తనచుట్టు గోపికలు తనరి సేవించగ

1. వేదములే పద్మముల్ వెలయు భృంగము దారి
పూఁదేనె సార మెప్పుడు గ్రోలు నన శౌరి
మోదమునన్ గోగణముల నేలె, భక్తిఁ జేరి
ప్రోది సురరాజైన పొగడు నట్లలరారి

2. రవి చంద్రుఁ డగ్ని తార లెవనివల్ల వెలుఁగు
ఎవని కటాక్షమున నీజగము లన్ని కలుగు
ఎవడు మానసహంసగ హృదయముల మానులకు మెలఁగు
ఉవిద! మేమలను రథములు నొకడె దేవుం డితడు చెలఁగు

3. లావణ్యముల నదులా లలనల సముద్రుఁ డితడు
దేవతల నెల్లర దీనుల బ్రోచు నితడు
సేవించి భావించు శివనారాయణతీర్థు
శ్రేయమున వేదవిధి రక్షించు మాస్వామి యితడు

గీ. వేణునాదసుధాధార వెలయ గురిసి
యనువుగా పాట మఱిమఱి నందగించు
నందనందను సేవించి రిందుముఖులు
గాన నృత్యాభినయ కళాఘనతఁ దనరి. 18

ఇది శ్రీనారాయణతీర్థులవారిచే రచింపఁబడిన శ్రీకృష్ణలీలాతరంగిణి యందు శ్రీకృష్ణగోపీసమాగమవర్ణన మను ఆరవతరంగము.

శ్రీ ర స్తు

# శ్రీ కృష్ణలీలా తరఙ్గిణి-సంస్కృతము

## సప్తమ తరఙ్గము



—♦ కథా సంగ్రహము ♦—

శ్లో॥ అథాభినీయతే రాసక్రీడాఖ్యం చరితం ప రేః
గోపీకదంబసహిత శ్రీకృష్ణా గమనం వనే.

శ్రీ ర స్తు

# శ్రీ కృష్ణలీలా తరఙ్గిణి - తెనుగు

## సప్తమ తరఙ్గము.



—♦ తోహరలు ♦—

రాసక్రీడ యనఁగ హరిచరితము రమ్యముగా నభినయమున్
జేసెదమిదె, సల్పెదరు గోపికలు శ్రీకృష్ణుని యనునయమున్ । 1

తాసాం తత్త్వోపదేశశ్చ తాభి రానందతాండవమ్,
తత్కృతం హరిణా సర్వం పుష్పవృష్టి స్సురైః కృతా. 2
లాస్యతాండవసంగీతైః గోపీనాం చిత్తరంజనమ్,
సంగ్రహః కథిత స్త్వేవం సప్తమేఽస్మిన్ తరంగకే. 3

—♦ శ్రీకృష్ణుఁడు గోపికలకు తత్త్వోపదేశము సేయుట ♦—

శ్లో॥ అనేకజన్మసాహస్ర తపసా పరితోషితః,
అవిద్యాభి స్స భగవాన్ తాసు గోపీషు జన్మని. 4

గ. తత్ర ఖలు బృందావనే, మందారపారిజాత సంతానకల్పకహరిచందనాదితరుబృందానందిత శుకపికశారికాది బృందవినిందిత నందనోద్యానే, సముత్ఫుల్లశారదమల్లికాదిమకరందపరిమళలాలసతయాసంచర చ్చంచరీకఝుణఝుణాత్కార నూపుర రవైః విచిత్రపత్రివర్గోద్గళిత నానావిధవినోదనినాదతాళమృదంగ సంగీతాది కలావిశేషైః, అలఙ్కృతానేకకోటి వనదేవతా నాట్యరసోత్కటే కళిందనందినీ పుళిందసముల్లసిత లవఙ్గలతాది వివిధలతాభవనే, క్వాపిక్వాపిశారదసాంద్రచంద్రికాసంగవిలసితమణివాలుకామౌక్తిక సితసికతా సుధా రమణీయవేదికాజాలే, దివ్యవిమానసమారూఢసురకిన్నరాది వరవనితానేకేషు పశ్యత్సు వర్షత్సు చ ముహుర్ముహుః పారిజాతాది దివ్యసుమగంధికనుమాని భక్తసంకల్పసిద్ధి మాతన్వానో గోపరమణీనయనోత్పలారాధిత మదనగోపాలమూర్తి ర్వాసుదేవో గోపీభి స్సహ రాసక్రీడా మహోత్సవారంభసంభ్రమ చేతాః గోపీభిః సార్థ మాత్మతత్త్వ ముపదిశ న్నిదమాహ. 5

శ్లో॥ బ్రహ్మసుధాతిరసికాం శారే ర్వాగ్లతికాం సుధామ్,
గోప్యః పిబంత్యో మోదంతే కృష్ణబ్రహ్మణి తాః స్థితాః. 6

పాలతులకున్ హరి వనమున తత్వముబోధించు దయాదృష్టిన్
అలరు వారి తాండవమున గురియుదురమరులు పుష్ప సువృష్టిన్.
గాన లాస్య తాండవముల గోపీగణము లెనయ వర్ధిల్లున్
మానిత సప్తమ తరఙ్గ సంగ్రహ మహిత కథన మిది చెల్లున్. 3

కం. ఎన్నో వేల సుజన్మల
సన్నియమము తపము సల్ప సంతుష్టుండై
పెన్నిధియై గోపికలకు
వెన్నుఁడు జన్మించె వారి విమలకులమునన్. 4

వ. ఆ బృందావనమున మందారము, సంతానము, కల్పకము, హరి చందనము మొదలైన దివ్య వృక్షముల సమూహము పై నలరు చిలుకలు కోయిలలు గోరువంకలు మొదలౌ పక్షులసమూహముచే నందనవనమును మించునట్లుండగా, డగా, వికసించిన శరత్కాలపు జాజి మల్లిక మొదలగు పూవుల తేనెలచేతను, సువాసనలచేతను మిక్కిలి సంతోషపడి తిరుగు తుమ్మెదలయొక్క ఝుంకారముచే ఝుణ ఝుణ యను అందెల సందడిని పోలగా, విచిత్రములౌ పక్షుల కంఠముల వెడలు అనేకవిధములైన వినోదధ్వనులే, తాళములు మృదంగములు సంగీతము మొదలౌ కళలుకాగా, చూడబడు అనేకకోట్ల వనదేవతల నాట్యమే రసమును సంపాదింపగా, కాళిందీనది చెంత వసించు పుళిందులు వెలయు లవంగములు మొదలౌ పెక్కుపొదరిండ్ల యందును, అచ్చటచ్చట శరత్కాలపు వెన్నెలనిగ్గుల వెలయు మణుల యిసుకల ముత్తెముల తెల్లని సున్నపులిన్నెల పై నుండియు, విమానముల పైనుండియు, దేవతలు, కిన్నరులు, దేవతాస్త్రీలు, గుంపులుగ కూడి చూడగా, మరియు నురియు వారు గురిపించు పారిజాతములు మొదలైన దివ్యపుష్పములు జారగా, భక్తులయొక్క కోరిక్కలు తీర్చువాఁడై, గోపికల కనుల నే కలువలచే పూజింపబడు, ఆనుదనగోపాలస్వామి వాసుదేవుడు గోపికలతో రాసక్రీడామహోత్సవము ప్రారంభింప నుత్సాహపడుచు, వారికి లనయొక్క పరమాత్మతత్వము నుపదేశించుటకై ఈరీతిగా సెలవిచ్చెను. 5

ఆ. వె. అమృతసమములైన హరిలక్షణోక్తుల
బ్రహ్మ ననుభవించు భావరసము
ముదముతోడ గోపముగ్ధ లెంతయుఁ గ్రోలి
బ్రహ్మమైన కృష్ణు భక్తిఁ గనిరి. 6

శ్లో॥ నృత్యంత్యస్తేన తద్గీతం గాయంత్యో రాసమండలే,
తే నోపదిష్ట మద్వైత మనుకుర్వంతి మానతః. 7

1 ముఖారీరాగము - ఆదితాళము.

1. అద్వయ మఖండిత మ శేషజగదాదిం
యత్ర చ జగత్త్రితయ మాస్థిత మనంతే
యత్ర విలయం పున రుపైతి మృది కుంభో
యద్వ దవధారయత సత్య మితి మా మోం

2. యచ్చ నిజశక్తియుత మైక్షత పురస్తాత్
యత్పున రభూ ద్వికృత మైక్షత సుతేజః
యచ్చ కమభూ త్పున రుదైక్షత యదన్నం
జాత మవధారయత సత్య మితి మా మోం

3. యత్పున రభూ త్త్రివిధపూరుషశరీరం
యత్త దను విశ్వ మఖిలం త్రివృత మాసీత్
జీవకలయా సకలసా క్ష్యవికృతం సత్
తత్త్వ మవధారయత సత్య మితి మా మోం

4. అన్నసలితే అథవతా మసితపీతే
ప్రాణమానసపరిణతే పరమసూక్ష్మే
వా గభవ దప్యసిత మల్పపరిణామి
జ్యోతి రవధారయత సత్య మితి మా మోం

5. షోడశకలః పురుష ఏష పరిశిష్టః
తాసు విలయం పరిగతాసు న చ వేద
తాసు తు సమస్త మనుపశ్యతి తదిత్థం
తత్త్వ మవధారయత సత్య మితి మా మోం

6. యేన పురుష స్స్వమరసత్వ ముపలభ్య
స్వాపసమయే స్వపితినామక ఇతి స్యాత్
యత్ర విలయం సమనుయాతి మన ఆది
తత్త్వ మవధారయత సత్య మితి మా మోం

ఆ. వె. అతనితోడ నృత్య మాతనిగానమ్ము
నంది, రాసమండలానువృత్తి
నలరి యతనిబోధ నద్వైతసంసిద్ధి
నభినయించి రబల లాత్మశుద్ధి. 7

1 వ కీర్తన - స్వామి గోపికలకు తత్త్వోపదేశము చేయుట.

1. అంతమై విడదీనిదై జగతి కాదియై
అందె ముల్లోకములు నలర తుది లేనిదై
అందు లయ ముదయమగా ఆ మన్ను కుండ వలె
ఆ నిజమె 'ఓంకార' మన నన్నెఱుఁగనో
2. ఏది తనలో శక్తి నెఱిఁగి క్రమముగ పెంప
ఆదివలె నాకసము ననిల మగ్ని జనింప
ఆదటన్ జలము భువి, యం దోషధుల నింప
అన్నమగా "ఓం" సత్యమని నన్నెఱుఁగనో
3. అదె బయలు గాలి నిప్పను దేవతలునై
అదె విభజనం బొంది యఖిల విశ్వమునై
అదె జీవకళ వికృతి నందని సాక్షియై
ఒదవు సత్యము నేనె "ఓమ్" అనియు నెఱుఁగనో
4. ఆహార పానముల అన్న సలిలములన్
అదె ప్రాణమై మనసునై సూక్ష్మతమమై
అగ్నియై మార్పునం దల్పమై వాక్కునై
అలరు నిజమే "ఓమ్" యన నన్నెఱుఁగనో
5. పదునారు తత్త్వముల బరగు జీవుండున్
పదునైదు విడి తాన ప్రాణమై మిగులన్
ఏది నెఱుఁగకే యెఱిగెనెల్లగొని మఱలక
అదె నిజముగ 'ఓంకార' మని నన్నెఱుఁగనో
6. నిదుర జవుడు పరమునిన్ బొంది జగతిన్
ఎదియు నెఱుఁగని లయము మది నొందు సుగతిక్
అదె సమరసత్వంబు నాత్మకును నాకో
అదె నిజము "ఓంకార' మని నన్నెఱుఁగనో

7. యత్రతమధుపాహృతమధూపమితి మేతత్
చిత్రరస మేకరసతాం నమధిగమ్య
నైవ రసభేద మిహ వేద జగదాది
తత్త్వ మవధారయత సత్య మితి మా మోం

8. యత్ర జలధౌ సమరసత్వ మనుయాతాః
తత్పృథ గశేషసరితో న విదు రేవం
బ్రహ్మణి జనా అనుదినం సమనుయాతాః
తత్త్వ మవధారయత సత్య మితి మా మోం

9. యస్య కల యాయ మఖిలస్య స హి భోక్తా
తత్పరిహృతో మృత ఇతి ప్రతివదంతి
యచ్చ భవమృత్యురహితః సకలసాక్షీ
తత్త్వ మవధారయత సత్య మితి మా మోం

10. యత్ర చ విజృంభిత మిదం స్వగతశక్త్యా
స్యాత్పృథ గవస్థిత మశేషజడజాతం
య చ్చ వటబీజసదృశం పరమసూక్ష్మం
తత్త్వ మవధారయత సత్య మితి మా మోం

11. సింధుజనితం సలిలమిశ్రిత మివాత్మా
సత్స్వగత ఏకరసతా మనుగతో యః
వేదశిరసాం పరిచయేన సువివిక్తః
తత్త్వ మవధారయత సత్య మతి మా మోం

12. బద్ధనయనో వనభువి ప్రతివిముక్తః
ప్రశ్న ముపలభ్య నగరం పున రవాప
యద్గురుమతం పున రవాప నిజబుద్ధ్యా
తత్త్వ మవధారయత సత్య మితి మా మోం

13. యత్రి లయ మేతి మన ఆది పరమాత్మ
నన్య దనుపశ్యతి స బంధుజన ఏషః
సర్వవిలయో వ్యవిలయం య దవశిష్టం
తత్త్వం మవధారయత సత్య మితి మామోం

7. చెట్టుకొక పూఁదేన చేర్చి మధుపములుఁ
తెట్టెలో నొకటిగా బెట్టియుఁ దామే
ఎట్టు విడదీయగా నెఱుగవో మఱలన్
అట్టి నిజమే "ఓమ్" యన నన్నెఱుఁగనో

8. జలధిలో బహునదులు గలిసియున్ తమవౌ
జలములన్ వేర్వేర తెలుపవో మఱలన్
తెలియ రట్లు నుదినము గలిసి నను జీవుల్
అల నిజము 'ఓంకార' మని నన్నెఱుఁగనో

9. ఎవనికళ గలజీవు డెల్ల ననుభవముల్
దవిలి, యదిచన మృతుడు తా నౌనో? అదియే,
భవము మృతి లేనిదా పరమసాక్షియునో
వివరింప నేనె "ఓమ్" విని నిజ మెఱుఁగనో

10. జడపదార్థము లెల్ల నడగి యొందుండుఁ
అడరి యెవ్వాని శక్తి నంతటన్ నిండున్
కడు సూక్ష్మ మాగింజ నిడుద మఱ్ఱియునో
కడ నిజమొ "ఓమ్" అనంగా నన్నెఱుఁగనో

11. కడలిలో నుప్పు యేకడ రుచిని నొకటౌ
వడువునన్ పరమాత్మ వర్ధిల్లు నెచటఁ
బడయనౌ నుపనిషద్భాష నీనిజమున్
అడరు నిదె "ఓంకార" మని నన్నెఱుఁగనో

12. కనులు మూయఁగఁ గట్టి గహనమున విడువన్
జనుల నడుగుచు పురికి జనువాని రీతిన్
తనధిషణ గురుమతము గను ముముక్షువు ఏ
ఘనసత్య మదియె 'ఓ' మ్మన నన్నెఱుఁగనో

13. పరమాత్మలో లయము బడయు తన మదిచే
నరయ డేజీవుండు అన్య బంధువులన్
నెరి సర్వవిలయమున నిలుచు తత్వంబై
వరలు 'ఓం' సత్యమా గురుని నన్నెఱుఁగనో

14. అక్రియతయా సకలవిక్రియదృశిత్వా
నైవ హాననాదివిషయో య దవశిష్టం
తత్పరశుస్స్వ గివ సత్యపరిగుప్తః
తత్త్వ మవధారయత సత్య మితి మా మోం
15. కిన్ను కథనీయ మబలా య దనుభూతం
సర్వ మనుభూతి మపహాయ న తు తత్త్వం
నిత్య మనుభూతి సుఖవిగ్రహ మచింత్యం
తత్త్వ మవధారయత సత్య మితి మా మోం
16. స చ్చి దితి సర్వవిషయే ష్వనుగతం యత్
భాసకతయా ప్రియతయా చ పరిశిష్టం
మానమితి మేయమితి హీనమతిరిక్తం
విద్వ దనుభూత మవధారయత సత్యం
17. నిశ్చిత మశేషనిగమాంతవచనై ర్యత్
తత్త్వమయ మి త్యఖిలసార మనుభూతేః
తర్కశతకై రపి దృగేకరస మాద్యం
ధీరమతిగమ్య మవధారయత సత్యం
18 పర్యవసితం నిగమవాక్యతతి మీళే
లక్షకత యాస్య విషయే పరిసమాప్తేః
సర్వవిషయస్య చ తదాత్మకతయా తం
శిష్ట మవధారయత సత్య మితి మా మోం
19. శ్రీమురరిపో ర్వదనపద్మమకరందం
బ్రహ్మసుఖసారవచనం బహు పిబంతః
గోకులవధూమధుకరాస్తు పరితృప్తాః
రాసభువి మండలకృతో బహు రమంతే
20. సామనిగమాంతవచనార్థ ముపలభ్య
స్వానుభవ మేక మఖిలైకరసభూతం
ఏతదమృతం భవభయాపహరమాద్యం
నారాయణానందతీర్థపరిగీతం

14. కను కర్మలన్ బడని మనసు నిష్కర్మన్
గొని, సత్యరతుడు ముట్టునో? కాలునినుముం
గొన డక్లై మృత్యాదులను, మిగులువాడౌ
నన, సత్య మదియె 'ఓ' మ్మన వ న్నెఱుఁగనో
15. అనుట కేమున్న దిఁక అబలలారా! మీ
అనుభవములన్ బడక ఆత్మ తత్త్వమునే
గన, తలపు మించు సౌఖ్యము నిత్యరూపున్
గొననో నిజమె 'ఓమ్' అన న న్నెఱుఁగనో
16. ఎది సత్తు చిత్తు వెలు గెది? ప్రేమమయమౌ
ఎది జ్ఞానము ప్రమాణ మెల్లెడల మిగులున్
ఎదియు విద్వాంసుల మహితసేవ నెసగున్
అదియె నిజ మోంకార మన న న్నెఱుఁగనో
17. వేదాంత వాక్యలన్ విపుల వాదములన్
ఏది యనుభవమునం దేకమై స్థిరమై
ఆదియై సాక్షియై అర్థంపం దగినదై
మీదిదౌ సత్య మని మీరు న న్నెఱుఁగనో
18. కాదు కాదిది యంచు కడు పోల్చి తలచన్
వేద వాఙ్నిర్ణయం బేది తుద గెలుచున్
ఏది అన్నిటి కాత్మ యిదె యనగ దలుచున్
ఆది దదె ఓమ్ 'సత్య' మన న న్నెఱుఁగనో
19. శ్రీకృష్ణు వాక్యమల సీధువౌ మధువున్
శ్రీకరము బ్రహ్మసుఖసేవ గొను విధముం
గోకుల వధూటు లటఁ గ్రోలు భృంగములై
చేకొనిరి రాస కేళీ కళావతులై
20. ఛాందోగ్య ముపనిషత్ సామ వేదమునన్
చెందు ననుభవ మంత చెలువౌ రసములం
ఇందు. భవ భయ ముడుగు నెనయు సుధ తేటన్
అందమౌ నారాయణతీర్థపాటన్

—♦ రాసక్రీడావర్ణనము ♦—

శ్లో॥ సంసారరోగసంతప్తాః కృష్ణబ్రహ్మ రసాయనమ్,
గోప్యః పిబంత్య స్తన్ముక్తాః రమంతే హ్యాభయం గతాః. 8

శ్లో॥ ఆత్మారామాః పరానందనిత్యతృప్తాః పునఃపునః,
ఆత్మానుభూతిం గాయంత్యః కృష్ణైకరసతాం గతాః 9

శ్లో॥ రమంతే పరమానందే కృష్ణబ్రహ్మణి తా భృశమ్,
వ్యక్త దేహాద్యహంమానా నిర్విశేషసుఖే స్థితా. 10

2 వ ఘంటారవం (ఘంటా) రాగము - అటతాళము

ప. పర మిహ పశ్యత పూరుషం స్వీకృతమాయికమానుషం
1. నిజపరభేదరహితదృశ మక్షర మీక్షణకృతభువనం విభుం
ఉపనిష దేకసమధిగత మద్వయ బోధసుఖైకరసం ప్రభుం
2. ఇదమిదమి త్యఖిలేషు సమనుగత సత్యచిదద్వయవిగ్రహం
శ్రుతిశిరసి ప్రవివిక్త మసక్త మభక్తజనైర్ రతిదుర్గ్రహం
3. గగనమరుమ్ముఖభూతసముదిత సమస్తజగత్ప్రతిభాసకం
తదను తదన్తరసమయ మశేష విశేష మఖండసుఖాత్మకం
4. అధిగతమన్నమయాదిషు యోగిభి రాంతరమాంతరమవ్యయం
హరి మఖిలైకరసం జననాది వికారవిహీన మనామయం
5. విదురిహయం నిగమాంతవచోభి రహో హ్యపరాంచమఖండితం
అఘటితసంఘటనాఘటితాకృతి మద్భుతకుండలమండితం
6. స్వజనదయాధృత దేహమ దేహాత యావిహరంతమిహాభూతలే
వనభువి రాస సమయరస పండితం గోపవధూకృత మండలే
7. అతను మశేషతనుం జగతా మభయంభయకారణకారణం
నిజకలయా పరిబృంహితసర్వ జనాత్మతయాఘ నివారణం

ఆ. వె. భవరుజార్తి నొంది పటు రసాయన మంది
విడుపు గొన్నయట్లు వ్రేతలెల్ల
సంసరణమునుండి సర్వేశు వాక్సుధఁ
గ్రోలి భయము వీడి మేలుకొనిరి. 8

కం. తమను తమలోని దేవుని
తమ లో వెలి నిండు పరమధాముని గనుచున్
తమ నిత్యానందానుభ
వముగని రా కృష్ణు పాట వలన మరిమరిన్. 9

కం. పరమానందము గోపీ
తరుణులు గని కృష్ణు బ్రహ్మతత్త్వ మరయుచున్
గురు దేహాహంకృతి విడి
నిరవధిక సుఖానుభూతి నెగడిరి. మిగులన్. 10

2 వ కీర్తన.

ప. పరమపురుషు నిటఁ గాంచరే నరుడౌమాయ నుతించరే

1. మాపున నే జగములఁ గల్పించును శుభముగ సముదయ నెపుడేలున్
ఔపనిషద్వ్యాధ బోధన సేయును అద్వయ మహిమములో నేలున్
2. అన్నిటిలో "నిదియది" యనబడి తా నలరు చిత్ప్రతిభతో నెసగున్
గ్రన్నన శ్రుతినుతి నొకడై భక్తులు గానివారలకు దూరమగున్
3. ఆకస మనిల మ్మగ్ని జలము భువి ఆపయి నోషధు లన్న మనన్
చేకూర్చుచు జగమంతయు వర్ధిల చెలగును పూర్ణానందమునన్
4. అన్నమయము మొద లైదుకోశముల కన్నింటికీ లోలో తా నిండున్
అన్నిరసంబుల గ్రోలి జనన మిను అలఁత వికారము లేకుండున్
5. వీడి యహోహం జ్ఞానులుం, గొల్వగ వేదాంతము లెవ్వని పొగడున్
పోడిమి నఘుల నఘుటించు నతడిచె పొలుపౌ కుండలముల నెగడున్
6. తనువేలేళి మనకై తనువును గొని వనభుని దయతో విహరించున్
వనితలార! మన రాసమండలము గొనగా సేర్పున నెనయించున్
7. తనువునఁ జిక్కక తనువు లన్నిటన్ దనరి జగతి కథయను గూర్చున్
తనకల లాత్మల నన్నిట వెలుగన్ జనుల మతుల కలుషముఁ దీర్చునో

8. సకృదవలోకనిరాకృతగోప వధూజనతాప మరిందమం
నవజలదాభతనుం తటిదాభ పటం నటవేషధరం సమం

9. హరిచరణస్మరణైకపరాయణ జనసుఖదం పరదైవతం
మునినారాయణతీర్థసువిరచిత గీతమిదం నిగమాన్వితం

శ్లో॥ జగదుదయలయాదేస్సాదరం సాధకైర్య
చ్ఛ్రుతిగురుదృఢభక్త్యా లబ్ధ మద్వైతతత్త్వమ్,
శ్రుతిశిరసివివిక్తం పంచకోశాన్తరస్థం
నరభువి విహరన్తం తం తు పశ్యంతి గోప్యః. 11

శ్లో॥ ఏవం కృష్ణాత్మతత్త్వజ్ఞాః కృష్ణబ్రహ్మాత్మనా స్థితాః,
సర్వోపనిషదాం సారం గాయంత్యః కృష్ణ మానసే. 12

శ్లో॥ హృదయనిహితం కాంతం కాచిత్కళిందసుతాతటే
ప్రియతమ మథాలింగ త్యద్ధా నిరంకుశతృప్తితః,
నిజపరభిదాతీతం ధైర్యాచ్ఛ్రితే శ్శిరసాం బలాత్
ముహురపి భృశంగాయం త్యేనం చిరం సహ మోదతే. 13

8 కాంభోజీ (పున్నాగవరాళీ) రాగము - ఆదితాళము

ప. కలయే దేవ మిహ సుఖకందం-కలయే దేవం

అ. నిగమనిగూఢ మఖిలదృశ మేకరసం ప్రజానందముకుందం

1. య దశనయావికారవిహీన మశేష మజరదురంతం
ఇహమున యోమ్న్యాగయంతిశమాదిభి-రాంతరమేన మనంతపీం

2. ఇహ పరభోగ మసురపదపీ మపి యదధిగమేన భజంతే
విష మివ ధీరధియో మరమ్న్యాగ్య పరైకసుఖే విహరందే

3. నిఖిలతపశ్శ్రితయో సుపతంతి య మవధితయా పరదేవం
అఖిలషితం మునిభి స్స్తుతపోభి రశేషభవాంబుధినావం

4. సకలసుధర్మవిధన్త్రకృతాకృత భూతభవిష్యదతీతం
నిజపరిబృంహితజగదనుకూల తయా సతతం సువిభాతం

8. తొలకరిమబ్బు మెయిన్ మెఱపులజిగి వలువల నృత్యము చెలగించున్
లలిచూపువ మనతాపము బాపును వెలిలో వైరులఁ దొలగించున్
9. హరిచరణమ్ముల కర్పణగా జను లలర పరాత్పరు భావనన్
విరచన యగు వేదార్థము తగు నిది వరనారాయణుచే వినన్

— తరళము —

ఉదయ సంస్థ లయంబు లెట్లగునో! జగంబని సాధకుల్
కుదురుగా గురువేదభక్తిగ కోశపంచక శోధనన్
ఎది శ్రుతుల్ వివరింపఁ గాంతురొ! యేది యద్వయతత్త్వమో
ముదిత లయ్యెడ చెంత రాజిల మోదముంగొని కాంచిరొ.

గీ. ఇటుల కృష్ణాత్మ తత్త్వంబు నెఱిగి సతులు
కృష్ణు బ్రహ్మాత్మలో స్థితిఁ క్షేమము గొని
ఉపనిషత్ఫలసారమై యొప్పు కృష్ణుఁ
జెంది గానము నాసక్తిఁ జేసి రపుడు. 12

చ. నిజ పర భేదరీతిపయి నిర్మలుడౌనని వేదసారముల్
నిజము వచింప ధైర్యమున నెమ్మికమై మదినిల్పి కృష్ణు, సూ
ర్యజతటి నొక్కగోపిక నిరంకుశతృప్తిగఁ గౌగిలింపుచున్
భజనయొనర్చి మోదమున పాటల నిమ్మయి సన్నుతింపుచున్.

3 వ కీర్తన

ప. కాంతున్ హాయిగూర్చు కాంతున్ నాదేవున్, కాంతున్ నా ప్రాణకాంతున్
అ. అంతర్యమై శ్రుతికి అఖిల మెఱిగి జన సంతోష మొనరించు శ్రీకృష్ణు కాంతున్
1. అలఁతయు కలఁతయు ఆఁకలి ముదిమియు అంత మే లేనివాని భక్తిన్
తలచి యోగులు మది తరచి శమాదుల తాము గొందురు సన్ముక్తిన్
2. ఏ దెఱింగినవారు యెంతో మించునని ఇహ స్వర్గసౌఖ్యముల నెదలో
నాదరింపరు విషమట్లు, ఇక హరిప్రేమ అమరులకు దుర్లభమౌ మదిలో
3. ఏ పరమాత్ము శ్రుతు లెల్లతపంబులుఁ ప్రాపింప నవధి యని యెంచున్
ఆ పరాత్పరు జన్మ యను కడలి నోడ యని అఖిల మునిగణము ధ్యానించున్
4. సమ విశేష ధర్మసమితి కారణకార్య సరణి గతాగతముల పైనన్
సముడై తా నెగడించు జగతి కనుకూలముగ స్వప్రకాశము నెపుడైనన్

5. ప్రణవతురీయసులక్షిత మక్షర మాత్మతయా య దనన్యం
యదయమనుస్మరతిస్వయమవ్యయ మాశు స విందతి ధన్యం
6. యదధిగమాదిహజన్మమృతీహననాదిభయాని తరంతి
పునరిహ మోహవిజృంభిత మేత దతో మునయో న భజంతి
7. విరతిశమాదివిహీనదురాప మబోధసుబోధసమానం
యదవగతి ప్రతిషిద్ధ మబోధ విజృంభిత మాహురిహైనం
8. విభు మశరీర మశేషశరీర గుహాసు నివిష్టచిదంశం
వ్రజయువతీజనవల్లభ మాత్మతయా పరిశిష్టమధీశం
9. ఫణిత మనంతపరాయణశివ నారాయణతీర్థే నేదం
నిగమశిరోరసభావసయా గతమత్సరహృదయవినోదం

శ్లో॥ నిర్విశేషచిదానంద మావిర్భూతం నిజేచ్ఛయా,
కృష్ణభావేన బుద్ధ్యాదితత్త్వభూషం జగుశ్శ్రుతాః. 14

శ్లో॥ బుద్ధ్యాదితత్త్వపరిచిహ్నితగోపవేషం
సిద్ధానుభావిత మశేషజగన్నిదానమ్,
నాసాగ్రలగ్ననవమౌక్తికచంద్రబింబం
బింబాధరం భవభయప్రశమం నమామి. 15

4 కేదారగౌళ (నీలాంబరీ) రాగము - అటతాళము

ప. మాధవ మా మవ దేవ యాదవకృష్ణ యదుకులకృష్ణ
అ. సాధుజనాధార సర్వభావ మాధవ మా మవ దేవ
1. అంబుజలోచన కంబుశుభగ్రీవ బింబాధర చంద్రబింబానన
చాంపేయనాసాగ్రలగ్నసుమౌక్తిక శారదచంద్రజనితమదన
2. కపటమానుషదేహ కల్పితజగదణ్డ కోటిమోహితభారతీరమణ
అపగతమోహతదుద్భవనిజజన కరుణయాధృతదేహసులక్షణ
3. తరళకుండలరవిమండలవికసిత నిజజనమానస పంకేరుహ
కరుణాహాససుధానిధికిరణ శమితభవతాపసజనమోహ

5. మునుల తురీయస్థితిని ప్రణవముపైన దనరు యీ నిత్యాత్మ కలియన్
యనుసరించు నెప్పు డవ్యయు తా నెవ్వడతడే ధన్యతముడు తెలియన్
6. ఇతని మహిమ నొంది యీ జన్మ మృతి బాధలీ ప్రాణ వెఱపులు విడవన్
యతులు మునులు మోహ మతుల గతుల మఱి నందకుందురు కర్మగడవన్
7. భగవత్ప్రీతి శాంతి బడయకున్న బోధ బడసిన లేకున్న సమమే
యగుదు రీతనిదృష్టి; అజ్ఞాన మధికమైన అవగతిగా పెరుగు నక్రమమే
8. అశరీరియై గుహల నట్లు శరీరముల నన్నింట చిత్ కాంతి వెలగన్
విశదమా బ్రహ్మగా వేరువేరై మిగులు విభుడై గోపికలతో చెలగన్
9. సరస హృదయులౌ సౌమ్యులౌనన వేదసారమై యీ పాట మొనయున్
సిరి యెల్లరకు నిండ శివనారాయణతీర్థ శ్రీహరిపరమై యొనయున్

గీ. భేద మను విశేషము లేని యాది లేని
సచ్చిదానందమయు డుర్వి జన్మ నొనిమె
స్వేచ్ఛమై; కృష్ణుడై కళాశ్రీల దనరు
నట్టి కళ్యాణగుణు నెన్ని రతివ లంత. 14

—♦ మత్తకోకిల ♦—

సోమబింబము బోలు మోమున సొంపుమీఱపునాసతో
గోము కెంపెదవిన్ జగత్త్రియ కోటి కాదినిదానమై
శేముషీముఖచిహ్నలొప్పువిశేషు గోపసువేషునిన్
స్వామి నెంతుము సిద్ధతారణు జన్మభీతినివారణున్. 15

4 వ కీర్తన

ప. మాధవా! మమ్మేలు; దేవ! యాదవకులము బ్రోవ యదుకృష్ణుడవుగావ?
అ. సాధులౌ జనముల సర్వస్వము నీవ మాధవా! కృష్ణ మమ్మేలుదేవ!
1. శశిబింబమా మోము శంఖమా కంఠమ్ము జలజమ్ములా కనులు శారదచంద్రుడవా?
ప్రశస్తనాసచంపకమా అటను తైమ్మా భవ్యాధగము దొండపండా మన్మథుడవా?
2. బాలలీల నోట బ్రహ్మాండములు జూపవ భారతీరమణుని భ్రాంతిని దీర్చవా?
మేలౌ లక్షణముల మేనిసొంపునమించి మా లోపములు దీర మన్ననం గూర్చవా?
3. రవిదీప్తి కుండల రత్నకాంతులు జిమ్మ ప్రభు! మా హృత్పద్మముల రంజింపవా
చివురుమోవిసినవ్వు చెలువు వెన్నెలగాయ చిత్తశాంతి మునులు చెంద మన్నింపవా?

1. జగము లన్నిటి నియమించ సౌమ్యు లెల్లరు తరించ
తగు మాయ వెలయించ దర్పకుని గాంచ
నిగమముల నుద్ధరించ తెగడి వైరుల నొంచ
నగడేదా భయము వారించ నెరి సౌఖ్యము నించ

2. సరిగె వల్వలు దనరార పగమ శుభము లొనరార
మురళీరవ మింపు మీఱ మును లలరార
సరసవినయ మొప్పార శాస్త్రముల కాది చేకూర
వెరపు వెతలు దీర్చ వీర విజయగోపాలుడ వౌర

3. చనెదు యమునా తీరమున జలధివి దయా రసమున
మినుక జేతువు కంసుని మొన మేరు ధైర్యమున
అణచి కాళీయు హ్రదమున గనెదు గోపికల ప్రియమున
ఘనవరదుడవు గోకులమున కామకోటి రూపమున

4. భక్తులా జనుల నేల పరమమహా కరుణఁ దేల
సక్తుల భ్రాంతులు ప్రీల సాధుల ప్రోల
రక్తిఁ కనులబ్జములఁ బోల రాజిలు పాదముల లీల
ముక్తి నారాయణతీర్థ మునిపాల గూర్ప వేల?

కం. బృందావనమున గోవుల
మందలమధ్యమున గోపమండలమందున్
నందకుమారుని దర్శన
మంది వినుతి సేసె భక్తి నక్రూరు డటఁ. 14

—♦ మత్తకోకిల ♦—

శ్రీమనోహర! నాథ! కృష్ణ! యశేషమండలవర్తినై
భూమి నందకుమారరూపున బ్రోచు నిర్మలకీర్తినై
శ్యామసుందర! కోటిమన్మథ సౌమ్యపావనమూర్తినై
ప్రేమఁ శాశ్వతమోద మీఁగదె! విశ్వపావనపూర్తిపై. 15

5 కాంభోజీరాగము - ఆదితాళము

ప. నందగోపబాల కృష్ణ నంద యాఖిలం శ్రీ

అ. చందనకుంకుమతులసీ చాంపేయాదిసుగంధితాంగ

1. అజయ్యరమణీయలోక ఆగమబృందమానక
భజదార్తినివారక భద్రదాయక
అజిత లోకనాయక ఆదిత్యాదిశాసక
విజితాసురనాయక విశ్వమంగళదాయక

2. గోపాంగనామండల గోగోపపరిపాల
తాపసజనలోల తారకాగమమూల
శ్రీపతేఽనంతలీల శృంగారకృపాలవాల
శ్రీవత్సచిహ్నాదిమూల సృష్టికారణజాల

3. అతులకరుణాసార అఖిలజగదాధార
ధృతదివ్యపీతాంబర దివ్యసుందర
హృతనవనీతోదార హృదయనిహితేందిర
శ్రితభక్తమందార శ్రీలసత్కౌస్తుభోదార

4. సంతతానందకర సాధుజననికర
చింతితార్థదోదార చిన్మయామరవీర
సత్యకామచతుర సంసారపరాపర
నిత్యనిగమశిఖర నియతవిహార

5. వ్యత్యస్తాంఘ్రికమల విమలమణికుండల
ప్రత్యస్తమోహజాల ప్రత్యక్దృగఖల
నిత్యముక్తనిర్మల నిఖిలనిగమమూల
భృత్యజనానుకూల వ్రజగోకులలీల

5 వ కీర్తన

ప. నందగోపకుమార! సిరుల నందఱ నలరింపు కృష్ణ
అ. చందనము కుంకుమ తులసి సంపెగల ఘుమ ఘుమ మేను నింపగ

[సప్తవిధ కృత్యంత్య నియమ చరణములు]

[ప్రథమము]

1. విజయరమ్యము నీలోకము వేద్యమగా నీ కెల్ల వేదము
భజనచే తొలగు శోకము ప్రబలు భద్రము
అజిత! నీదా నఖిలజగము అర్కు గతి నీ శాసనము
ప్రజల కౌ నీవల్ల శుభము పాపముఖ్యుల కపజయము

[ద్వితీయము]

2. గోపికలు చుట్టు గలవాని గోవుల గోపకుల వాని
తాపసులయెడ తారకుని తత్త్వ వేదముల కాద్యుని
శ్రీపతిని శృంగారమూర్తిని సృష్టిలీలకు కారణుని
ప్రాపౌ శ్రీవత్సచిహ్నుని ప్రణుతింతు కృపాళుని

[తృతీయము]

3. తులయెలేని కరుణచే నెలనై తా జగతిచే
లలి పసిమి సేల్వాచే వెలయు సొంపుచే
కలగొన్న వెన్నచే కమలాలయ గల యెదచే
నలరెడా కౌస్తుభముచే నాశ్రితార్థుడ వాటచే

[చతుర్థము]

4. నాథుల సంఘములకై సదానందముఁ గూర్చుటకై
బోధ చిన్మహిమ కొఱకై పుణ్యార్థములకై
సాధన నేర్పు నిజమునకై సంసారముఁ గని తీర్చుటకై
శోధన ముపనిషత్తులకై శుద్ధవర్తన నుందు మాకై

[పంచమము]

5. పదము నటనన్ మార్పు వలన భవ్యకుండల మణుల వలన
ఒదిగిపోవు మాయ వలస ఒనరు ప్రత్యక్ దృష్టి వలన
పదిలమగా శుభముక్త వలన మొదట గాచిన చదువు వలన
ముదము భక్తులకగు నీ వలన మొనయు గోకులలీల వలన

6. వైజయంతీశోభిత వామదేవాదిసేవిత
నిజభక్తసువిదిత నిత్యశుభచరిత
ఋజుమానసలలిత ఋగ్యజుస్సామాదిగీత
వ్రజనారీపరివృత విశ్వవిఖ్యాత
7. దేవాదికృతమోద దివ్యమురళీనాద
భావితాఖిలవేద భవ్య భక్తవరద
శ్రీవసుధావినోద శ్రితజనమోక్షప్రద
శివనారాయణతీర్థ సేవితపాద

శ్లో॥ ముహు ర్ముహు ర్నమ న్నమన్ ముకుంద పాదపద్మయోః
మహాన్ మహాః మహీయసాం ప్రభో మమ ప్రబోధయ,
ఇతి స్వయంప్రభం ప్రభుం హృదా హరిం స్మరన్ గుణాన్
స గద్గదస్వరేణ తత్సమీపగోఽస్తువ న్ముదా. 16

శ్లో॥ మాయామానుషదేహీ మాధవనామాఽభివాద్య తం సబలః,
తేనాలింగితమూర్తిస్సురరిపువృత్తం తదుక్త మథ వేద. 17

శ్లో॥ అక్రూరో రామకృష్ణాభ్యాం న్యవస ద్గోకులే సుఖం,
అథోత్థితో రాత్రి శేషే సముత్థాపయతి స్వయమ్. 18

—♦ అక్రూరుడు రామకృష్ణుల మేల్కొల్పుట ♦—

6 దేశాక్షి (మలహరీ) రాగము - జంపెతాళము.

ప. హే రామ హే కృష్ణ ఇహాసముత్తిష్ఠ
అ. హే రామ హే కృష్ణ హే జగత్త్రియకరో
హే పుండరీకాక్ష రక్ష నిజపక్షం

1. ప్రాచీదిగంగనా పరిహసతి హే కృష్ణ!
పతియోగపరమసౌభాగ్యమహితా
ప్రాచీనస్మరస్య మభినయంత్యథ సా
ప్రతీచీదిశం రామ కామముదితా

[షష్ఠము]

6. తలుకుతళ్కును వైజయంతికి అల వామదేవాదుల భక్తికి
కొలుచు దాసుల తృప్తికి నెలవౌ చరిత నియతికి
లలితమౌ మది ఋజుపథికి తొలి వేదత్రయ సమ్మతికి
వెలయు గోపికామండలికి వినతు లివె నీ విశ్వోన్నతికి

[సప్తమము]

7. సరళమౌ మురళీరవమందు సురలు గాంచు మోదమందు
వరము లొందు భక్తులందు స్వరముల వేదమ్ములందు
సిరి భువియు గల లీలలందు శిష్టభక్తుల మోక్షమందు
వరనారాయణతీర్థునందు వర్ధిల్లుము నీ సేవలందు

—♦ పంచచామరము ♦—

''మహామహేశ! బోధసేయు మాకు'' నంచు సల్పుచున్
బహుప్రణామముల్ ముకుందపాదపద్మసన్నిధిన్
సుహృత్ సగద్గద స్వరాప్తి సుప్రభున్ స్వయంప్రభున్
సహానుగున్యాభంగి వేడె సంతసించి యాతఁడున్. 16

కం. ఆయక్రూరున కభినతి
మాయామానుషవిలాసి మాధవు డొనరన్
జేయుచుఁ గౌఁగిటఁ గొని, విని
''న్యాయ'' మనియె కంసుపిలుపు హాలధరుతోడన్. 17

కం. అలరాత్రిని నక్రూరుడు బలకృష్ణులతోడ గడపి ప్రముదమునన్ గో
కులమున, మఱి వేకువ మేల్ కొలిపెన్ వారలను గోపకుల నీభంగిన్

—♦ మేలుకొలుపుపాట ♦—

6 వ కీర్తన

ప. ఓరామ! ఓకృష్ణ! మీా రింక మేల్కొనరె
అ. ఓరామ! ఓకృష్ణ! ఓ జగద్గురులార!
కారుణ్యమున నమ్ముగని యేలుకొనరే!
1. పతిగ సూర్యుని పొంది ప్రాక్ దిక్కనెడు కాంత
అతిశయిలు సౌభాగ్యవతి యగుచు నంత
ప్రతిగ పడమటిదిశ స పతియునిరో! తా నింత
వితతపరిహాసమును వెలయించు, వింత!

2. నళినముకుళోదరవి దళనగళితాళయో
లలితతరగవినిహ్నుతాంధతిమిరాః
మిళిత నవ నళిన పరి మిళ బహుళమకరంద
కలనయా విచరంతి కామముఖరాః

3. దధిమథనసంజాత మధురతరసంగీత
బుధజనాగమఘోష రమ్యఘోషం
మధుమథన! సంకలయ మాధవ! విధీంద్రనుత
పదకమల పద్మాకృతాభిలాషం

4. భూపాళదేశాక్షి దేవగాంధారిశుభ
బిలహరివసంతముఖరాగబృందం
గోపికా గాయంతి గోవింద తవ తు శుభ
గుణరత్న బృంద మానందకందం

5. కలితనవమల్లికాకుసుమాని విహసంతి
కామ మిహ తారకాబృంద మమితం
లలితవచసా క్రూరకలితమితి గురుభక్త
నారాయణానందతీర్థరచితం

—♦ శ్రీకృష్ణుఁ డక్రూరునితోడ మథురాపురికి వేంచేయుట ♦—

శ్లో॥ వ్యతీతాయాం స తద్రాత్రౌ సబలం బలినాం బలం,
ఆరోప్య స్యందనే తూర్ణమక్రూరోశ్వాన చోదయత్ 19

శ్లో॥ స్యందనే వసతి నందనందనే చంద్రమండలసమాననే ఘనే
మందహాసరమణీయచంద్రికాస్సుందర-జగురిమాహిగోపికాః 29

7 కల్యాణీరాగము - ఆదితాళము.

ప. అక్రూరో గమయతి మధురా మచ్యుత మిహ సఖ సుతరాం

అ. న క్రూరో మాయావీ తస్య సాహస మథ సఖ పశ్య

1. సబలం గోపీ జనహృదయాంబుజ సవితారం సఖ సహసా
కబళితనవనీతం కలితాగమ కారణ మసురవి దారణ మిహాళం

2. నలినమిత్రుఁడు వెలయఁ దొలగు నిరులను బోలి
అళులు జలజముల వెలి కలఁగ రొదలోలి
తొలకు నునుతమ్మి పరిమళములను సుధ గ్రోలి
లలన తేంట్లను గలియు వలపులను దేలి

3. పెరుఁగుల తరుచు ఘుమ్ము వరలు సంగీతమ్ము
గురువేదఘోషమ్ము గోరవమ్ము
సురపతి నలువ గొల్చెదరు నీ పదాబ్జమ్ము
సిరుల కిది నిలయమ్ము హరి! మధుమథన! లెమ్ము

4. దేశాక్షి భూపాల దేవగాంధారి యన
శ్రీశ! బిలహరి వసం తాశిషమున
నీ శుభగుణమ్ములన్ నెలత లిదె గానమున
కేశవా! యెన్నెదరు కృష్ణ! యింపౌ విన

5. వరలి తళతళల తెలవారు నీ సమయముల
విరిసి నవమల్లికలు విహసించు తారకల
సరళమౌ నక్రూరు హరిమేలుకొలుపుల
వర నారాయణతీర్థ గురుసంస్మరణల

ఉ. ఈ రహి రాత్రి యేగగ నహీనబలాఢ్యుని కృష్ణు రాము న
క్రూరుఁడు తేరునందుఁగొని గుజ్జములన్ గదలింపఁబోవగా
నారథమందు చంద్రముఖు నంబుదవర్ణుని గాంచి గోపికల్
తీరగు నవ్వువెన్నెలలఁ దేల్చి జయంబుగఁ బల్కి రిట్టులన్. 19-20

7 వ కీర్తన - గోపికాలాపము

ప. అక్రూరుం డిదె కొనిచను నే చెలి! మన-హరిని మధురకు, నింకేమన నే
అ. సక్రూరు డీతని సాహస మేమన నే చాలమాయావి చాన! కన నే
1. మనసులను కమలముల-మనకు బలరామునితో-దనరి సూర్యుఁ బోలువానిన్
మనవెన్నగొని జ్ఞాన-మునకు కారణమై దనుజులనొందు మనప్రభువౌ వానిన్

2. బృన్దావన చంద్రమసం నిజనిజ చన్దన మింద్రాదినుతం
నందనందన మానందితవిధిముఖ బృన్ద మనిందితస్యందననియతం

3. సంసారార్ణవ తారకవిజయ గోపాలక ముఖ్యైకగురుం
కంసరిపుం శివనారాయణతీర్థ కలితమిదం కవిహృదయవిహారం

శ్లో॥ బలేన సహితం కృష్ణ మక్రూరస్యందనస్థితం.
మథురాభిముఖం దృష్ట్వా గోపికా కాపి గాయతి. 21

౫౪ సావేరి [దేవగాంధారి] రాగము – అటతాళము

ప. స్వామినం వనమాలినం సఖి! కలయ స్వామినం వనమాలినం

అ. శ్రీమహోన్నత శ్రీవత్సకౌస్తుభ విమల కామద విజయగోపాలం

1. సుందరం సత్య సుఖబోధరసికం సోమవంశజల నిధిపూర్ణసోమం
నందనందనమిహ పరమానంద స్యందనే నందయోగినుతంసఖి
సురనరకిన్నరవరమునిసేవిత – సరసగుణార్ణవసకలగురుం మమ

2. అధరబింబసమర్పితమురళీ మధురగీతరసామృతసరసం
మధురిపుంసఖిమాధవమిహపశ్య మాధురీభాగ్యభరమన్దహాసం
శక్రాదిసురగణసన్నుతపదమిహ–వక్రకున్తళభారవరరత్నాభరణం

3. భద్రదండకలయసఖిబలభద్రం–భవ్యయోగదళితమోహనిద్రం
అద్రి రాజధీర మరివర్గరుద్రం–అచ్యుతేనసహితంసుఖముద్రం
శివనారాయణతీర్థసేవితమనుపమ–భవ్యమ్ముక్తామణి భవన
[విహరణం

శ్లో॥ మథురాగమనోత్సాహం మాధవం వల్లవాంగనాః,
మంగళాన్యాచరంత్యస్తం జగుస్తస్య జయేచ్ఛయా. 22

2. బృందావని చంద్రుడన-ఇంద్రాదు లెన్న మన-చందనమున దనరువానిన్
పొందౌ రథమున గొని-పోవు బ్రహ్మాదులనుతు-లందు మన నందనందనుడౌ వానిన్

3. సంసారమను కడలి - జయముగ దాటించు - సద్గురు గోపశ్రీవానిన్
కంసుని పైకట నే-కవుల సన్నుతు లట నే-కరుణ శివనారాయణు గాంచువానిన్

క. మధురాభిముఖంబగు నా
రథమం దక్రూరు వెంట రామునితోడన్
ప్రథితుండౌ శ్రీకృష్ణుని
కథ నిట్లొక గోపకాంత గని వినుతించెన్.

8 వ కీర్తన

ప॥ [మన] స్వామి నే వన - మాలి నే - చెలి! కనవే ॥మన॥

అ॥ తన కౌస్తుభశ్రీలఁ - దనరు నున్నతవక్షు - గుణమాన్య విజయ - గోపాలు శుభు నే -మన॥

1. ఇందువంశ జలధి- కితడే పూర్ణేందుడై-హితము సత్యను మన - కెఱిగించువాని నే
నందయోగి కొల్చు మన-నందగోపునిసుతుని-అందు రథమున పరమా - నందుడౌ వాని నే
పొందౌ గుణముల నిధి యని - భువనగురువని మునులు-బృందారకులు జనులు - పొగడువాని నే ॥మన॥

2. అలరారు మురళిగల-అధరబింబమువాని-దొలఁకు నమృతమ్ముగురు - చులక గానము వాని నే
లతి చిఱునవ్వుల-కలల సంపదవాని-చెలియా! మాధవుని, మ-ధుని జయించిన వాని నే
వెలరాల నగల పంపు-జులపాలవాని నింద్రా-దులుగొల్చుపాదాబ్జ - ములుకల వాని నే ॥మన॥

3. తనయోగమున మోహ - మను నిద్ర గెల్చువాని-కనరే! బలరాము శుభ - మును గూర్చువాని నే
ధునధృతి గిరిగానై-ఖలులపై రుద్రుండై-కదనసుఖమై వారితోడను జనువాని నే
తనను శివనారాయణ-ముని బొగడ మంచి - మణుల మేడలలో - నెనయుచుదగు వాని నే ॥మన॥

గీ. మధుర కేగ నుత్సాహియౌ మాధవునకు
సర్వతమమైన విజయసూచనలు గాగ
మంగళాచరణముల మేల్ మధురగాన
మొనయఁ జేసిరి గోపాల వనిత లెల్ల.

9 సురటిరాగము - ఆటతాళము

ప. విజయగోపాల తే మంగళం జయ విశ్వంభర తే మంగళం

1. నందయశోదా నందన సుందర మందస్మిత ధృతమందర
నందసునందాది వందిత పాదార వింద గోవిందజయమంగళం

2. చారుకదంబకతరుమూలాశ్రిత చంచలమణి మయకుండలం
దారుణవైరి సంహరణ పరాక్రమ దాసపోషణ తే మంగళం

3. చందన చంపక తులసీకల్పక శీతలవనసంచారిణే
వాచామగోచర చరిత సదానంద వాసుదేవాయ తే మంగళం

4. గోపీమండలగూఢ పరాయణ గోవింద గోకులనాయక
ఆపదుద్ధారక అఖిలజనాధార తాపహరణ తే మంగళం

5. వర్ధితగోబృంద వనమాలిన్ గో వర్ధనగిరిధర వామన
తీర్థీకృత శివనారాయణతీర్థ మానససారసమందిర

శ్లో॥ అక్రూరో రామకృష్ణాభ్యాం మధురాభిముఖో వ్రజన్,
ఆచరన్ యామునే స్నానం సలిలే దృష్టవాన్ హరిం. 23

శ్లో॥ ముహు ర్ముహు స్స్యందనస్థం సలిలస్థం హృది స్థితం,
దృష్ట్వా సర్వాత్మకం కృష్ణం ప్రాహ చేదం సతత్త్వవిత్. 24

10 తోడీరాగము - ఆదితాళము

ప. జానే భువనసృష్టి చాతురీధురీణం
గోనికేతనం విజయ గోపాల మఖిలశరణం

1. సకల హృదయ కమల సవితృకోటిప్రకాశం
సలిలాదిభావమధ్య సంగమపూరితాశం
ప్రకట మేవ ఫణీంద్ర ప్రచురశయన దేశం
ప్రత్యగభిన్న మఖిల పరమానందనివేశం

9 వ కీర్తన.

ప. విజయగోపాల! నీకు మంగళం జయ విశ్వనేలు నీకు మంగళం

1. నందయశోద నానందించు సుందర మందహాసమునకు మంగళం
నందాను లెన్నగ మంథర మెత్తిన గో విందా! నీ పాదములకు మంగళం

2. కడిమిచెట్టు మొదట, కనక మణి కుండల కొంతు లెనయు నీకు మంగళం
కడిమి వైరుల నోంచికరుణ దాసుల గాంచు కళ్యాణకరునకు మంగళం

3. తులసి సంపెగ చందనముల చలువ చమనుల విలసిల్లు శ్రీకృష్ణ! మంగళం
పలుక నలవిగాని కలన వసుదేవు నెప్పు డలరింపఁ గలనీకు మంగళం

4. గోకులము నేలు గోపికల పాలి గూఢహా ప్రేమకు మంగళం
మాకష్టములఁ బాప మాతాపములఁ దీర్చి మమ్మెల్లఁ గాచునీకు మంగళం

5. గోవర్ధన మెత్తి గోవులఁ గాచిన దేవ! నీ వనమాలకు మంగళం
ఆ వామనావతారమున నారాయణుండై పావనఁ జేసిననీకు మంగళం

—♦ స్వామి అక్రూరునకు విశ్వరూపముచూపుట ♦—

సీ. రామకృష్ణులు విలసిల్లురథమునంత
మథురకై తోలుచున్ బోయి మార్గమందు
యమునదరి నాపి యక్రూరు డందు స్నాన
మాడుచున్ గాంచె మఱి కృష్ణు నాజలముల. 23

ఆ. వె. నీరమందు నలరి తేడునం దనరారి
హృదయ పథము నిండి యొనయుచున్న
సర్వమయుని కృష్ణు సారెసారెకుఁ గాంచి
యతఁడు తత్త్వ మెఱిఁగి యనియె నిట్లు.

10 వ కీర్తన

ప. కంటి భువనము లెల్ల కల్పించు నేర్పరిని
కంటి గోనిలయు నెల్ల గాచు విజయగోపాలుని

1. హృదయాబ్జముల నెల్ల ఇనకోటి దీప్తి నుండి
కుదురై పంచభూతముల గోష్ఠితో దిక్కుల నిండి
ఒదవి ప్రత్యగాత్మగా నొనరి వేద్వేర దండి
ముదముతో శేషశయ్య మొనసెదా నానోముపండి

2. నిగమాగమసారసనిచయ నిత్యవిదితభావం
సుగుణమణిసమూహ సూత్రసత్స్వభావం
అఖిలజగదంత రాత్మాన మమితవిభవం
ఖగమృగసురనరాది ఘననామరూప మభవం

3. నందితవ్రజజనా నందఘనభాగధేయం
కందర్పశతకోటి కలితకాంతికాయం
నందితయోగినిచయం నారదాదిగేయం
బృందావనవిహారం బద్ధమాయూరవలయం

4. అవనిమండలతిలక మచ్యుత మఖిలజనకం
నవనవనీతరసికం నమదభయదాయకం
భవభయనివారకం భవ్యముక్తినాయకం
శివనారాయణతీర్థ సిద్ధానందదాయకం

— మథురాపురీవర్ణనము —

శ్లో॥ దృష్ట్వాఽథ మథురాం రామం నగరీం సురనాగరీం
అహా చేదం మహోత్సాహో మాధవో మధురం వచః॥ 25

11 సౌరాష్ట్రరాగము - చాపుతాళము.

ప. రామ మథురా నగరీరమ్యా హేమగోపురప్రాకారకలితా
అ. రామ రామణీయకాభిరామ రత్నకోటీర సంభారా

1. సౌధచంద్రశాలాజాల సోమరవిలీలాలోలా
మాధురీభాగ్యా మారఖేలా మహనీయభూతివిశాలా

2. నవనవమణిశ్రేణీ నాకరమణీ మనోహారిణీ
అవనీసురభారిణీ అమరపరివారిణీ

3. కాళిందీ హేళినందినీ కల్లోలాలోలపద్మినీ
మిళితహంసమాలినీ మీనాంక రాజ రాజధానీ

2. నిగమ మెఱిఁగిన వారి కెప్పుడు నీవె జ్ఞానసారమై
సుగుణములను మఱులఁ గూర్పఁగ సుస్వభావమె దారమై
జగతి కంతరాత్మ వౌదువు సకల విభవాధారమై
ఖగమృగమ్ముల సురనరాదుల నెగడి జన్మకు దూరమై

3. ప్రజలకున్ బృందావనమ్మున భాగ్య మీవై మించియున్
నిజశరీరము స్మరులకోటి నెనరు నతిశయించియున్
భజనఁ యోగుల నారదాదుల పాటలన్ దయ నెంచియున్
విజయమైతివి నెమలిపింఛము వేడ్కగా ధరియించియున్

4. తిలక మీవై భువికెల్ల స్థిరమై అన్నిటిన్ పెంచుచు
కొలుచువారి కభయము మొసగుచు క్రొత్తవెన్న సంగ్రహించుచు
తొలగించి జన్మభయము తోనె ముక్తి ననుగ్రహించుచు
చెలగెగా యానందసిద్ధిగ శివనారాయణు నెంచుచు

ఆ. వె. అమరపురముఁబోలు నామధురం గాంచి
మదిని చాల మెచ్చి మాధవుండు
పలికె నన్నయైన బలరామునకు నిట్లు
మధురవాగ్విలాససుధలు గురియ, 25

## 11 వ కీర్తన

ప. రంగా మధురానగరము రాహా! బంగరు గోపురముల కోటఁ గనుమా
అ. హంగా రమ్యస్థలమాను సుమా! అలరు రత్నములకోట్ల ననుమా
1. చంద్రశాలల సూర్యచంద్రులున్ సంచరింతురుగన పెద్ద మేడలున్
ఇంద్రవిభవములు స్మరభోగములున్ నెసగు మహోత్తములు వాడవాడలున్
2. క్రొత్తక్రొత్త మణులివె వెలఁ దెచ్చున్ కొన నచ్చెరల మనసులే వచ్చున్
ముత్తములై భూసురతతి హెచ్చున్ మునులా! దేవతలా! వీరనవచ్చున్
3. జలజమ్ములతో నలలేపారన్ అల కాళిందియె గాదరిఁ పాఱున్
కలహంసల బారులు దనరారున్ కాము ముఖ్యపట్టణమై తీరున్

4. అబ్జయోనికృతాతిశయా అఖిలసంపదోపేతా
లబ్ధవిద్యావాదాధ్యుషితా లక్షితలక్షణసహితా

5. మాధవసుగీతమిదం మహితబలరామామోదం
బాధితసంసారఖేదం భవ్య నారాయణ తీర్థసుఖదం

శ్లో॥ ఉపవనవనజేషు హంసమాలాః
మునివర మానస నిస్పృహాస్తు యస్యాః,
నిరవధి సుఖమాత్ర లగ్న చిత్తాః
కథమపి బాహ్య మనుస్మరంతి నైవ. 26

శ్లో॥ అవతీర్ణో రథాత్తూర్ణ మక్రూరాధిష్ఠితాత్ప్రభుః,
మధురారాజమార్గేణ పద్భ్యామేవ శనైర్యయౌ. 27

ఇతి శ్రీనారాయణతీర్థవిరచితాయాం-శ్రీకృష్ణలీలాతరఙ్గిణ్యాం
శ్రీకృష్ణమధురాప్రవేశవర్ణనం నామ నవమతరఙ్గః.

---

4. నలువ చేసిన సృష్టిని మించి
కలుషముల నెల్లను సేకరించి
వెలయున్ విద్యల వాదము, మించి
కళల లక్షణములను గహించి

5. అన్నగారి సంతోషము పెంపన్
ఆసువుగా కృష్ణుడు రచియింపన్
చెన్న కీర్తన తాపమడంపన్
శివనా [illegible] యులు [illegible] నయింపన్

గీ. సరసవనజలజములు హంసముల జాళ్ళు
మునులవలె మానసావాసమును దలపవు
పరమసుఖలగ్నచిత్తముల్ బాహ్యభంగు
లెంచుచున్ ప్రీతితో స్మరియించు నెల్ల. 26

గీ. మధురకుఁ జని యక్రూరరథమునుదిగి
రమ్యముగ పాదచారులై రాజమార్గ
గాములై రామకృష్ణులు ఘనత నెనసి
మందమదగజగతిఁ పౌరమాన్యులైరి 27

ఇది శ్రీనారాయణతీర్థులవారంచే రచియింపబడిన శ్రీకృష్ణలీలాతరంగిణి యందు శ్రీకృష్ణమధురాప్రవేశవర్ణనమను తొమ్మిదవతరంగము.

---

శ్రీరస్తు

# శ్రీకృష్ణలీలాతరఙ్గిణీ-సంస్కృతము

## దశమతరఙ్గము



—♦ కథాసంగ్రహము ♦—

శ్రీ కృష్ణచరితం కంసవధాఖ్య మభినియతే.

శ్లో॥ కంసస్యాగమనం పూర్వం దేవకీవసుదేవయోః. 1

మథురానగరీవీథ్యాం రజకాదే ర్వినిగ్రహః,

కుబ్జాద్యనుగ్రహశ్చాథ మల్లమాతంగమర్దనమ్. 2

కంసాసురవధశ్చాథ పిత్రోర్దర్శన మాదరాత్,

సంగ్రహోఽయం చరిత్రేఽస్మిన్ కథితః సావధానతః. 3

శ్రీరస్తు

# శ్రీకృష్ణలీలాతరంగిణి - తెనుగు

## దశమతరంగము



—♦ శోహారలు ♦—

శ్రీకృష్ణుఁడు కంసుని వధించుకథ చిత్రచరిత్ర మనంగన్
ఆ కంసుఁడు దేవకివసుదేవుని నవరోధించి యొసంగన్. 1

పురవీధుల శ్రీకృష్ణుడు రజకుని భూరిగర్వము నణంచున్
హరి కుబ్జను సన్మానించును కరివరమున్ పోరున మించున్. 2

శౌరి కంసు నట వధించి జననీజనకులఁ గని యలరించున్
తిరుగ వినవో దశమతరంగసుసార మిది శుభము సంచున్. 3

గ. తౌ ఖలు రామకృష్ణౌ-స్ఫుటతర నీలపీతసుందర పరిధానౌ - మధ్యభాగసమభివ్యక్త సరస్వతీవిలసిత సితాసితసరిద్వరసంయోగ సముల్లసితవిచిత్ర కాంతితిరస్కరణప్రవీణౌ-సత్పథపథికపరిశ్రాంతివిరామరమణీయౌ-మునివరమనోహంస శ్రేణీసమాశ్రయకరచరణవదననయననాభిసరసీరుహసంవత్సరిద్వర కాంతి కాయౌ-తుంగప్రాసాదశృంగసంగతచంద్రకాంతమణిగణ శశాంక సంయోగసముద్గళితలలిత తరామృతసంసిక్తరమణీయసైకత మథురారాజమార్గగామినౌ విచిత్ర వనమాలినౌ - మానినీజనమోహనౌ - సరళమురళీగీతసుధాసముద్బోధితసురకిన్నరాది వరవనితామనోమయ రాజహంసగణౌ-సత్యకామాదిగుణౌ - సకలలోకసంరక్షణప్రవీణౌ - మథురాపురీనివాసి భాగ్యపరిపాకవిశేషలక్షణౌ - సురనగరీనాగరీగురుతరగీతసుధా సమారాధనానందితౌ - దుర్మదమదపభగ్నోత్తుంగధైర్య వీర్యగాంభీర్యభావౌ పరిహృతగోపకుమారభావౌ-మహానుభావౌ-దృష్ట్వా ముహుర్ముహుః సంతుష్టా స్తత్ర జనా బభూవుః.

శ్లో॥ ఆయాంతం రాజమార్గేణ మథురాపురయోషితః,
ఆశ్చర్యరూపసంపన్న మాశ్చర్యం సబలం జగుః. 5

1 సూరుకుల కాంభోజీ (ఆనంద భైరవీ) రాగము - ఆదితాళము.

ప. నందనందనం నిజభక్త చందన మాకలయ
1. నందాదిమునీంద్రభావ్యా నంద మాకలయ
2. సుందరాననచంద్రశ్రీ మందిర మాకలయ
3. శృంగారరసప్రవాహ శ్రీనిధి మాకలయ
4. భ్రూభంగకటాక్షలక్ష్య భూరికరుణ మాకలయ
5. సర్వలావణ్యతటినీ సాగర మాకలయ
6. కలభసుందరగమన కలితలలిత మాకలయ

వ. ఆ రామకృష్ణు లిరువు రిట్లు వెలసిరి. మిగుల ప్రకాశించుచు నీలవర్ణము (బలరాముడు), పసుపువర్ణము (శ్రీకృష్ణుడు), గల అందమైన వస్త్రములు ధరించినవారై, (తెల్లనివస్త్రములను ధరించిన అక్రూరుడు) సరస్వతీ నదిని బోలి మధ్యనుండగా నుభయములును గంగాయమునా ప్రవాహములవలె నుండు నదులయొక్క కూడికను అతిశయించు ప్రకాశముగలవారై, (మంచి) మార్గమున నడచువారి మనస్సులకు పరిశ్రాంతియు, విరామము నొసగు దర్శనముకలవారై, మునివర్యులయొక్క మనస్సులనే హంసల శ్రేణికి ఆశ్రయములౌ కరములు, చరణములు, మోములు కన్నులు నాభిప్రదేశములు అను పద్మములయొక్క వైభవముచే, ప్రకాశమానమూ, నదుల బోలు శరీరములు గలవారై, (మధురానగరమందలి) ఎత్తైన మేడలయొక్క శిఖరములందు స్థాపించబడిన చంద్రకాంతమణులపై వెన్నెలసోకుటచే స్రవించు, మిగుల మృదువైన అమృతముచే కలాపిగా, చల్లబడిన రమ్యమైన యిసుకగల మధురాపుర రాజమార్గములందు గమించువారై, విచిత్రమైన వనమాలలు ధరించినవారై, మానవతులైన స్త్రీలకు మోహము గలిగించువారై, మృదువైన మురళీగానము అను అమృతముచే సంతోషపెట్టబడిన దేవతలు, కిన్నరులు మొదలౌ దివ్యకాంతల మనస్సులనే రాజహంసలయొక్క సమూహముకలవారై. సత్యసంకల్పము మొదలౌ సుగుణములుకలవారై, సకలలోకములను సంరక్షించుటయందు ప్రవీణులై, మధురాపురమునందుండు జనులు తమ భాగ్యవిశేషములని యెంచునంత శుభలక్షణములుగలవారై, దేవనగరములనుండు వనితలయొక్క గొప్ప గానమును అమృతముచే ఆరాధనగొనువారై, దుష్టులయొక్క మదమును భంగముచేయుటయందు అతిశయములైన స్థైర్యము, శౌర్యము, గాంభీర్యములుగలవారై, విడువబడిన గోపకుమార లీలాభాషముగలవారై, మహానుభావులగు శ్రీరామకృష్ణులను, సందర్శించి మరిమరి, మరిమరి, సంతోషముతో ఒక్కడే జనములు అలరారిరి. 4

ఆ. వె. రాజమార్గమెల్ల రాజిల్ల బలరాముఁ
కూడి యచ్చెరువులఁ గొల్పు రూప
వైభవమున వచ్చువాని కృష్ణునిఁగాంచి
వినుతి సేసి రచటి వనిత లిటుల. 5

1 వ కీర్తన

ప. నందకుమారు భక్త — చందను నదె! కనరే
1. నందాదియోగు లెంచు, నా — నందరూపు కనరే
2. హంసా శశిమోము సిరుల — మందిరమా కనరే
3. శృంగారరస మను నదిని — శ్రీనిధినిఁ గనరే
4. హంసా కన్ బొమల లీల — నా కటాక్షముఁ గనరే
5. అందగత్తె లను నదుల — ఆ సముద్రుఁ గనరే
6. అందె గజగమనమున — నడుగు ధీరుఁ గనరే

| | |
|---|---|
| 7. పరిజనరక్షణబద్ధ | పరికర మాకలయ |
| 8. విజయగోపాల మతుల | విఖ్యాత మాకలయ |
| 9. బలభద్ర భద్రదబాహు | బంధ మి హాకలయ |
| 10. మధురామానినీజన | మనసిజ మాకలయ |
| 11. శివనారాయణతీర్థ సేవ్య | దివ్యపద మాకలయ |
| — నందనందననిజభక్త | చందన మాకలయ |

శ్లో॥ హరంతం రాజవస్త్రాణి చరంతం చారుదర్శనం,
నిరంతరపరానందసరసం కల యాళి! తం

—♦ శ్రీకృష్ణుఁడు కుబ్జ ననుగ్రహించుట ♦—

అథ రజకనిగ్రహో వస్త్రాపహారశ్చ మాలాకారానుగ్రహః.
కుబ్జాగమనమ్—

2 నాదనామక్రియారాగము - ఆదితాళము

| | |
|---|---|
| 1. కుబ్జా సమాయాతి గోవిందచిత్తా | అబ్జయోనిచాతుర్యసర్వస్వ |
| 2. ఉజ్జ్వలవిచిత్రభూషణోజ్జ్వల | కజ్జలనేత్రశోభిత [భూతా |
| 3. కస్తూరిఫాలాళకధృత | కస్తూరిచందనాది సంభారా |

శ్లో॥ క్వాపి కుబ్జాం సునేత్రాఙ్గీం మబ్జనాభో విలోక్య తాం,
ప్రాతిలోమ్యగిరాం సార్ధైః ప్రహాస న్నిద మాహ సః. 7

3 పంతువరాళీరాగము - అటతాళము.

ప. కామమోహిని కథయ కిన్ను నామ తే పదం
అ. కోమళాధర కరపాద పల్లవ కుముదబంధు వదనకుంతలజాలే
1. తన్వఙ్గితావక తనురియమార్ద్రవ
మతివహతిసుతరా మానన్దకారిణి
అన్వహమభినవ యౌవనఘనవన
మాచరసిభువన జనమనోహారిణి

7. నిజభక్తుల రక్షవూను — నెనరు సాధన వానిఁ గనరే
8. విజయగోపాలు బిరుదు — వెలయువాని గనరే
9. అన్నగారిని బాహువూనెను — అతఁడె కృష్ణుఁడు కనరే
10. అన్నుమిన్నల కెల్ల నీవురి — నలరు మన్మథుఁ గనరే
11. చెన్నుగా శివనారాయణు — సేవఁ గొను పాదముఁగనరే
నందకుమారు భక్త — చందను నదె! కనరె

కం. హరియించు కంసు దుష్టుల
చరియించి యొసంగు దివ్యసందర్శనమున్
నిరవధిక పరానందుఁ
సరసున్ చెలులార! కనుడు జన్మ తరించుఁ. 6

వ. అంత రజకుని శిక్షించి కంసునివస్త్రములుహరించి మాలాకారునివల్ల పుష్ప
మాలలుగొని అనుగ్రహించిన శ్రీరామకృష్ణుల, సమీపమునకు కుబ్జప్రవేశించెను.

2 వ కీర్తన

1. ఆరుచెంచె నంత కుబ్జయను కాంత — సరగ బ్రహ్మ చూపె తన చాతుర్యమంత
2. మరిచిత్రమా నగలు వరల నెంత — నెరి కౌతుక కనులాక వింత
3. సరి నుదుట కస్తూరి, కరమందు చంద నాదులుగలిగికృష్ణునెంచుత్రివక్రయను కాంత

గీ. మించు కన్నులు కుబ్జయా మేనివికృతి
గలుగుకాంత నీమె నొకర్తఁ గాంచి కరుణ
నించి ధన్యాత్మఁ గాఁజేయ నెంచి పక్కె
నర్మవాక్కుల కృష్ణుండు నవ్వి యిటుల 7

3 వ కీర్తన.

ప. కామసుందరి! పల్కవేమే నామమేమే పదవియేమే
అ. నీ మృదు కరపదముల సౌరే మోముకళి కెంబెదవిచివురే
[నెరికురు లెంతో బారే

1. వనిత! నీరూప మెంతో నెనరు వహించునే
జను లలర యౌవన వన మని పించునే
అనిశము నీ సొగసు ఆనందము నించునే
తనరారెదా జగతి తనివి దీరఁగాంచునే

2. చన్దనమృగనాభి చంపకాదికుసుమ
గన్ధసుగన్ధిత గగనదిఙ్మండలే
కందర్పరథిరథ కల్పితశుభగాత్రి
కలహంసభాషిణి కల్యాణశీలే

3. తవరూపమన్వర్థ నామవిదితమిహ
భువి పౌరజాన పదైరపి విపులం
శివనారాయణతీర్థ శివగీతమిదమిహ
భవభయభంజన మభయద మతులం

శ్లో॥ హసంతం వదంతం సమీపే వసంతం
ముహుస్సంస్మరంతం తపః ప్రాక్తనం తత్,
పరప్రేమభక్త్యా ప్రభుం ప్రార్థయంతీ
స్వయం ప్రాహ చేదం వచ స్సాధుకుబ్జా. 8

4 సౌరాష్ట్రరాగము - ఆటతాళము

ప. ఏహి ఏహి విజయగోపాలబాల
పాహిమాం పాలయ లోకపాల

1. భువనసున్దర చారువదనాబ్జ భూరికృపాలయభూమాభిధాన
సవితృమండల కోటిభాస సంసృతిదృఢపాశబంధవిదళన

2. గోపరమణీ జారరమణ గోవిందగుణమణిగణవరాభరణ
పాపాసుర బృందనివారణ పరమపావనచరిత పాతకహరణ

3. గంధమాల్యాది గృహాణ గళితభవ ఫణీంద్రగరుడవిహారణ
సున్దరమమదేహిసురత మిహ సుఖయ మామిహ దేవమమభవశ

4. కలితకస్తూరికాతిలక కరధృతమురళీకలనాదరసిక[రణం
బలజితసుర వైరిని వహ బర్హమాయూర పింఛవనజాభన

5. పరిపూర్ణానందసముద్ర పాపమహాటవీపావకరౌద్ర[యన
పరిజనకృతబహుభద్ర వరనారాయణతీర్థధృతబోధముద్ర

2. చందనము కస్తూరి సంపెంగ విరుల
పొందగు పరిమళము దివిని భువి నెల్ల దరుల
కందర్పు రథమై పెం పొందు మేని సిరుల
సుందరి! కలహంస లీల శుభమైన మరుల

3. పొరులు పల్లెవారు పేరు రూపునుజూచి తెలియ
నీరీతి త్రివక్రత యేల? భక్తనోలయ
తీరుగా భవభయము వీడును దివ్యశుభములు గలియ
నారాయణతీర్థు పాట నవ్యమై వెలయ

—♦ సుగంధి ♦—

వింత వింత మాటలాడి వేడ్కమించి డాయుచున్
కాంతపూర్వపుణ్య మెంతొ గా స్మరించు నా ప్రభున్
స్వాంతరంగదైవ మంచు సాధువాక్యసమ్మతిన్
చెంత ప్రేమభక్తితోడ చేడె వేడె నీరహిన్. 8

4 వ కీర్తన

ప. రార! రార! విజయగోపాలబాల!
ఏర! నన్నేలర! ఎల్లలోకము నేలుశీల

1. జగము మెచ్చు మోముతమ్మి సొగసువాడ నిగడి భామామున కరుణ నించువాడ
తగి కోటిసూర్యదీప్తిం దనరువాడ ఒగిగాను సంసారపుకట్లం దెగచువాడ
2. గోపకాంతల ప్రేమ గొన్నవాడ గోవింద! నగసాకు గుణములవాడ
పాపుల మూకల నొంచు గెలిమివాడ పావనచరిత నఘము బాపువాడ
3. మాలలివే! గరుడు నెక్కు మహిమవాడ చాలగంధమిదే! శేష శయ్యపైవాడ
లేలు కేళి జన్మసక్తి దీర్చువాడ ఏలు శరణంటిని దయ నెనయువాడ
4. తిలకమ్ముగ కస్తూరిగలుగువాడ లలితములగు వేణురవములవాడ
ఖలులౌ సురవైరుల గెలుచువాడ జలజాక్షు! నెమలిపింఛ మలరువాడ
5. ఆనందమున కడలియాడువాడ అఘముం బాప రుద్రుని యట్టివాడ
జ్ఞానము మేల్ భక్తుల కొసంగువాడ దీన నేలు నారాయణతీర్థునివాడ

శ్లో॥ సర్వాంగసౌన్దర్య సుధావగాయా
మపారసంసారవిశోధికాయాం,
కంసద్విషస్తస్య సుఖం చరంతీ
కుబ్జామనోవృత్తి రతన్నివృత్తా. 9

శ్లో॥ ఆకర్ణ్య కుబ్జావచన మాశ్చర్యం తా మనిందితాం,
అకరోత్కరసంస్పర్శా దమరీం సుందరీం హరిః. 10

శ్లో॥ రిరంసయా తేన సాకం కుబ్జా సా కామమోహితా,
పీతాంబరధరం శ్యామం మధురం ప్రాహ మాధవం. 11

5 కాపి [భైరవి] రాగము - అటతాళము

ప. మాధవ మేరతిం దేహి—నాథనాథ మాధవ మాధవ మేరతిం దేహి

అ. మధురాధరబింబ! ధన్యేయం మాననీయా త్వయా నూనం

1. దీనజనదయాఘన దేవకీవరనందన
మానినీమానభంజన మదనమదన
మునిమనోనికేతన మోహాతిమిరనిధన
కనకమయపరిధాన కలితనిఖిలభువన

2. న త్యజామి చేలాంచలం నాథ తవ సురతిమూలం
అతినీలఘనసుందరం ఆనందలీలం
సత్య మాశాస్మి గోపాలం సత్య కామాదిగుణజాలం
భృత్యవర్గపరిపాలం బలభద్రానుజం బాలం

3. తరణికోటికిరణ తామసగుణనిర్వారణ
తారకముక్తాభరణ దాసపోషణ
దూరితదుర్జనగణ దోషరహితచరణ
వరనారాయణతీర్థ వర్ణితనిజచరణ

గీ. గాఢసంసార పాప పంకమును గడుగు
కంసరిపు దివ్యసౌందర్య గంగయందు
పూర్ణసుస్నాత విజ్ఞానపూత యగుచు
మనసాకింతయు కుబ్జకు మఱలదయ్యె. 9

కం. విని కుబ్జా వచనంబుల
గొని యాశ్చర్యంబు నామె గుణపావనియా
ట నెఱిగి కరసంస్పర్శ నె
వనితకు సురనారిసొంపు వరదుఁడు కూర్చెన్. 10

కం. పీతాంబరధరు మాధవు
నాతతసుశ్యామవర్ణు ననయముఁ గొలువన్
బ్రీతి మది నెసఁగ కామిని
యీ తెఱఁగున మధురవాక్కు లెనయఁగ పలికెఁ. 11

5 వ కీర్తన

ప. నన్ను ప్రేమ నేలర! నాథ! మాధవ! రార
అ. మన్నించి ధన్య జేసి! మధురవాక్ సుధల నీర

1. దేవకికొడుకు వని దీనుల దయ బ్రోతువని
నీవు మరుని మింతువని నెలతల మది గొందువని
తావు మునిమనసులు నీ కని తరిచెదు ఘనభ్రాంతులనని
ఠీవి జరీసేల్వవాడని తెలిసె భువనకర్తవని

2. నీలిమబ్బన తగుదువోయి నీవారిలోదాన నోయి
మేలౌ సుగుణరాసి వోయి లీల వేడ్క గాదోయి
పాలించవలె నిజము నోయి బలరాము తమ్ముడవోయి
సేలువచెంగు విడువనోయి ఏలితీరవలె నోయి

3. కోటిసూర్యుల మించి క్రూరతామస మడగించి
నీటు ముత్తపునగ ధరించి నీవారి రక్షించి
మీటిఖలుల దూరముంచి మేలిచరణసేవ నించి
పాటించు శివనారాయణు పాటల నంగీకరించి

—♦ శ్రీకృష్ణుడు కువలయాపీడాదుల వధించుట ♦—

శ్లో॥ ప్రార్థిత స్త్వనయా కృష్ణ స్తాం సమాధాయ సత్వరం,
బలా త్కువలయాపీడం కుంజరం నిజఘాన సః 12



శ్లో॥ హత్వా ముష్టికచాణూరౌ ధనుర్భంగం విధాయ చ,
సాగ్రజో మాతులసభాం ప్రవిష్టో గీయతేమరైః. 13

—♦ దేవతలు కంససభం జేరిన శ్రీకృష్ణు నుతించుట ♦—

6 శంకరాభరణరాగము - ఆటతాళము

ప. అవలోకయత శ్రీగోవిందం భోభోభూమా వవలోకయత
అ. నవజలధరశ్యామం నందితబలరామం
1. భువనసుందరాకారం భూరికరుణాకరం
అవనీభారసు రారివిదారం
నవముక్తామణిహారం నానావిధవిహారం
ధ్రువపదవిధాతారం దూరితసంసారభారం

ఆ. వె. ఆమె ప్రార్థనమున హరి సమాధానంబు
పలికి, వెడలిచనుచు, బాట నడుమ
నడరి పైకి కువలయాపీడమను నేన్గు
దార్పఁబడగ బలిమి దాని నడఁచె. 12



గీ. అంత తమపైకి వచ్చిన యమితబలుల
ముష్టికాఖ్య చాణూరుని మొనసి యడఁచి
మేటివిలుద్రుంచి యన్నతో మేనమామ
కొలువునెక్క, దివ్యుల గానములు సెలంగె. 13

6 వ కీర్తన.

ప. సేవింపుడహో! శ్రీగోవిందున్ చిత్రమా భామలో భువి చెలువొందున్
అ. భావింపుడు నవమేఘము పొందున్ బరపున్ బలరామునితో నిందున
1. భువనము తనసొంపు లెంచున్ భూతదయ పెంచున్
భువికి భారమౌ దివిజవైరుల నడంచున్
వివిధలీలల చరించున్ వెలయు ముప్పుపేర్ల మించున్
ధ్రువపదవి నిప్పించున్ భవబంధము విడిపించున్

2. మల్లచాణూరమథనం మత్తమాతంగనిధనం
ఫుల్లపంకజదళ సన్నిభనయనం
పల్లవాంగనామదనం వాసుదేవాభిధానం
కల్లోలమాలిశయనం కంసేభకేసరిణం

3. ఏకాంతభక్తవశం యాదవాబ్ధిసముదితం
శ్రీకాకుళనగరీ శ్రీభూమిసహితం
నాకవల్లభగీతం నారాయణతీర్థరచితం
వికటమోహరహితం విజయగోపాల మసితం

శ్లో॥ అవరుహ్యాసనా ద్వీరః కంసో రంగగతః ఖలః,
యుద్ధాయ సహ కృష్ణేన స్మరన్ ప్రాగ్దేవభాషితం. 14

—♦ కంసవధ ♦—

శ్లో॥ హతః కంసారిణా కంసః సంసారభయహారిణా,
శౌరిణా హరిణా యుద్ధే జగుస్తం సురభూసురాః. 15

7 సురటి (భూపాళ) రాగము - అటతాళము.

ప. పాహిపాహిమాం పరమకృపాళో
దేహిమేత్వయి దేవసుభక్తిం

1. అసురసంహార శ్రీవిజయగోపాల
అమరసంతోషణ విజయగోపాల
వసుదేవతనయ శ్రీవిజయగోపాల
వాసవాదినుత విజయగోపాల

2. సంగీతలోల శ్రీవిజయగోపాల
సద్గుణశీల శ్రీవిజయగోపాల
శృంగారరసాకార విజయగోపాల
శ్రితజనపాల శ్రీవిజయగోపాల

2. మల్లుని చాణూరు నోర్చెన్
చల్లని కటాక్షముల
వల్లవల మరుడన చేర్చెన్
అల్ల క్షీరవారిధిశయనుడు
మత్తగజమును మదమార్చెన్
జలజనేత్రములఁ దనర్చెఁ
వాసుదేవుడన నెలర్చెన్
హరిగ కంసకరిని దీర్చెన్

3. ఏకాంతులకు సులభుడగును
శ్రీకాకుళనగరమున
ఈకీర్తన సురరాజు చేసెను
వీకమై శివనారాయణు
ఎనసి యదుకుల ముద్ధరించును
శ్రీతో భువితో సేవలొసగును
హీనభావము లేక వెలయును
విజయగోపాలుని నుతి గను

గీ. అంత దిగియు కంసుండు సింహాసనమును
వెలగి కృష్ణునితో, పోర సిద్ధుడగుచు
నెదుటి యుద్ధరంగంబున కేగుచుండి
తలఁచె మునుపటి దివ్యవాక్కులను మఱల, 14

కం. హరిచే! సంసృతిభయకరి
హరిచే నాశౌరిచేత హతుఁడై కంసా
సురుడు రణరంగమునఁ బడ
సురభూసురులిల్లు పొగడఁజొచ్చిరి కృష్ణుఁ. 15

7 వ కీర్తన.

ప. పాహి! దయామయ! – భవ్య! మమ్మేలుమా
"దేహి" యంటిమి భక్తి – దేవ! యొసఁగుమా

1. సంహరించి తసురు శ్రీవి – జయగోపాల
సంరక్షించి సురల, వి – జయగోపాల
సింహవీర! వాసుదేవ – శ్రీవిజయగోపాల
సేవింతు రింద్రాదులు – శ్రీవిజయగోపాల

2. వినుతు నీ జయగానము శ్రీ – విజయగోపాల
వెలసి సుగుణశీలమున – విజయగోపాల
జనులెన్న రసికుడ! వి – జయగోపాల
సాధుభక్తుల నేలు శ్రీవి – జయగోపాల

3. ధీరగుణాధార విజయగోపాల
ధేనుకాదిహరణ విజయగోపాల
నారదమునిగేయ విజయగోపాల
నారాయణతీర్థ విజయగోపాల

శ్లో॥ మథురాయాం హతే కంసే మాధవేన మహాత్మనా,
వవృషుః పారిజాతాది పుష్పాణ్యాకాశతస్సురాః. 16

శ్లో॥ అనంతకల్యాణగుణాభిరామౌ
దురస్తసంసారతమోవిరామౌ
నిరంతరం సంస్మరతోః స్వపిత్రో
రథాంతికం సమ్యగవాప్తవంతౌ. 17

శ్లో॥ పరిష్వజ్యాంకమారోప్య మూర్ధ్న్యవఘ్రాయ సాదరం,
దేవకీవసుదేవౌ తావాశిషం చక్రతు ర్ముదా. 18

శ్లో॥ జగతీపతిరపి భగవాన్ యదుపతిబంధు స్సుబంధు రఖిలాత్మా
హరిరథ మథురానగరీనరపతి మానందయన్ సతత్రాస్తే. 19

ఇతి శ్రీనారాయణతీర్థవిరచితాయాం - శ్రీకృష్ణలీలాతరఙ్గిణ్యాం
కంస నిర్హరణంనామ దశమతరఙ్గః.

---

3. వీరుల వీరుడవు శ్రీ - విజయగోపాల
విక్రమత ధేనుకు నొంచితి - విజయగోపాల
నారదాదుల పాటలు వి - నవా! విజయగోపాల
నారాయణతీర్థు వ - ర్ణనల విజయగోపాల

గీ. మథురలో కంసు డచ్యుతు మహిమచేత
నదె! వధింపంబడె నటంచు ముదముతోడ
పారిజాతాది సుమవృష్టి బరపి రపుడు
నంబర విమానములనుండి యమరవరులు. 16

గీ. అంత సుగుణాభిరాములై, యవధిలేని
సంసృతితమంబుఁ బాపగాఁ జాలువారు
రామకృష్ణులు తమ్ము నిరంతరంబు
నెంచు తల్లిదండ్రులను సేవించఁజనిరి. 17

కం. వచ్చిన కుమారు లిద్దఱ
మచ్చిక నెదఁజేర్చికొనుచు మాతయు పితయున్
దెచ్చికొని యొడికి శిరముల
మెచ్చున మూర్కొనిరి యిచ్చి మేల్ దీవనలన్. 18

కం. జగదధిపతి సర్వాత్ముడు
భగవంతుడు సర్వభక్తబంధువు మథురా
నగరేశు నుగ్రసేనుని
తగ ముదమున దనిపి యచట దయతో నుండెన్ 19

ఇది శ్రీనారాయణతీర్థులవారిచే రచింపఁబడిన - శ్రీకృష్ణలీలాతరంగిణి
యందు కంసవధయను దశమతరంగము.

శ్రీరస్తు

# శ్రీకృష్ణలీలాతరఙ్గిణి-సంస్కృతము

## ఏకాదశతరఙ్గము



—• కథాసంగ్రహము •—

శ్లో॥ శ్రీకృష్ణస్య ద్వారవతీప్రవేశాఖ్యం చరిత్రకం,
వర్ణ్యతేఽత్ర మహాచిత్ర మేకాదశతరంగకే. 1
ఆదౌ గోప్య స్తతః కృష్ణ స్తదనంతర ముద్ధవః,
సమాధానాయ గోపీనా ముద్ధవప్రేరణం తదా. 2
గోపికోద్ధవసంవాదః పునః కృష్ణస్య దర్శనం,
విద్యాభ్యాసశ్చ విధినా గురోర్వాంఛితపూరణం. 3




ద్వారకలో శ్రీకృష్ణప్రవేశ మీ రమ్యచరిత మెంచన్
శ్రీరంజిలు నేకాదశతరంగ చిత్రకథన మిది గాంచన్
గోపకాంతలక్ కృష్ణుడు తలపునకున్ గొని వారల చింతన్
బాపు నమాధానమునకు నుద్ధవు బంపగ నాతం డంతన్ 1
చని వ్రజకాంతలతో సంవాదము సల్పి మరలి శ్రీకృష్ణున్
గని భక్తురాండ్ర విన్నపమంతయు వినిపించి తనుపు జిష్ణున్ 2
గురువుల కోర్కెల గామకృష్ణు లొనగూర్చి విద్యలందుటయుక్
జరాసంధు రణమున గెల్చి యతని సైన్యములన్ జెండుటయున్

జరాసంధేన సంగ్రామ స్తస్య సేనానిబర్హణం,
తతో గుహాప్రవేశశ్చ నిధనం యవనస్య చ. 4
ముచుకుందస్తుతి శ్చైవ కృపయా తత్ప్రసాదనం,
ద్వారకాయాం ప్రవేశశ్చ సంగ్రహోఽయం ప్రకీర్తితః. 5

ఉద్ధవాగమనమ్—

1 నాదనామక్రియా రాగము - ఆదితాళము

ఉత్సాహం సర్వభూతానాం　　ఉగ్రకంసాదినిధనం
ఉచ్చైరనుగాయంగాయం　　ఉద్ధవోఽయం విరాజతే.

—♦ గోపికోద్ధవసంవాదము ♦—

శ్లో॥ సమాధానాయ గోపీనాం గోవిందేన ప్రచోదితః,
ఉద్ధవో గోకులజనైః పృష్టః ప్రత్యాహ కౌశలమ్. 6

శ్లో॥ నందాద్యైస్తోషిత స్తత్ర మాధవోక్తం నివేద్య చ
సంతతం రహసి గోప్యస్తం ప్రాహు ర్మధుపకల్పితమ్. 7

—♦ భ్రమరగీతలు ♦—

2 కల్యాణి (సావేరి) రాగము - ఆదితాళము

ప. మధుప మధుప దూతం　　మన్యే త్వాం మాధవీయమధునా
అ. మధురాపురనారీ　　వదనాంబుజ
మకరంద మాకలయ　　మాయాహి యాహి యాహి
1. మధుప మధుపూరితం　　మాధురీవదనకమలం
మాధవభాస్కర　　మహితకరకలితం
అధునా యాదవకరుణా　　సుధయా సముల్లసితం
కథయ కథయ కిమిహ　　కామయ కలయ కామం

ఘనగుహ కృష్ణుడు ప్రవేశించుటయు కాలయవనునిధనంబున్
గని ముచుకుందుని శ్రీకృష్ణుం డట కరుణించిన కథనంబున్. 4
ద్వారావతియన పశ్చిమవారిధి దనరు పురవరమునందున్
శ్రీరహి కృష్ణుడు శుభప్రవేశము సేయుట చెప్పెద మిందున్. 5

వ. ఉద్ధవుని ప్రవేశము.

1 వ కీర్తన

ఉగ్రులైన కంసాదుల వధచే - ఉత్సాహముఁ గొనె జగమెల్లన్
నిగ్రహముడుగగ నుద్ధవు డంతన్ - నెగడెన్ మఱి గోకులగానము చెల్లన్
గీ. గోపికల సమాధానంబుకొఱకు శౌరి
ఆజ్ఞ సేయగా నుద్ధవు డంత నేగి
గోకులంబున గురుజన గోపికలను
గాంచి కుశలవార్తలను భాషించుచుండె. 6
క. నందాదులచే సంతస
మందుచు మాధవుని వార్త లటఁ దెల్పి, యతం
డం దొక దుండినతఱి వ్రజ
సుందరు లిట్లనిరి, మధుప సూక్తగఁ వాక్కుల్. 7

2 వ కీర్తన

ప. తుమ్మెదా! తుమ్మెదా! తోనె మాకుఁ దెల్పెదా?
మాతవా! మాధవుని, నమ్మగా? - తుమ్మెదా!

అ. పొమ్ము! పొమ్ము! మధుకరో    పొలతుల గాపాడిరో
ఇమ్మైన మధువులో    నెనయు కు మాలరో
1. మధుర సతులు లేరో    మధుముఖాంబుజలు గారో
మాధవుడే సూర్యుడైరో    మఱి కరిసేవకు రారో
సుధ యన దయ, వారో    నగాపి, ముదము గైకోరో
కథ లవేమి తీరో    కదియుటేల మీరో!

2. భ్రమర భ్రామ్య మకరందసంభృతేషు
పావనగోవింద పదచిహ్నితేషు
కమనీయమధురా కాంతారపాదపేషు
కిమపి మాధవవృత్తం కేన వాదగణీయ మిహా

3. అల మసితసఖ్యేన స్మితభాషణే నాలం
చల చంచలస్వభావ చంచరీక
పఠకలయ మాధవం బహు భ్రామరగీతం
వరనారాయణతీర్థ వరదం విజయగోపాలం

శ్లో॥ శ్రుత్వా తద్గోపికాగీతం శ్రావ్యం శ్రుతిమనోహరం,
తత్త్వమావేదయన్ గోపీః ప్రత్యాహోద్ధవ ఉత్సుకః. 8

3 తేగుప్తి [మోహన] రాగము – అటతాళము

ప. గోపీజనగోమధ్యచరంతం గోపాలం విద్ధి గోపాలం

1. అంతరంగే సతతం భ్రాంతం ఆదిమధ్యాంతవసంతం
సంతతం సత్సు చరంతం సత్య మేకాంతం
అంతరే యోగివిచింత్యం అనుపమసకలాగమాంతం
హంత దురంతసంసారబంధ హంతారం విహరంతం

2. సంయోగవియోగవిహీనం సాధుమానసజీవనం
మాయోపాధివిదళనం మానసాసనం
కాయక్లేశాదివిహీనం కారణమానవజన్మానం
భూమోభూయోవిచార్యైనం భూమానంభూరిమహిమానం

3. బుద్ధివికల్పితభేదాభేదం బోధబాధితసర్వఖేదం
సిద్ధసంభావితసిద్ధదం శ్రితజనబర్హివారిదం
బుద్ధముక్తసిద్ధవేదం బోధితానందమోదం
సిద్ధనారాయణతీర్థ సేవితశ్రీపాదం

2. పోయి తిరుగు మధురనే | పూల చెమని చెల్లనే
ఆయన పద చిహ్నాలనే | అలరు మధువు దొరకునే
ఈయెడ మాధవునే | ఎంచి యాదరణనే
సేయఁ గోర కెవరినే | చేరు మీాయూరినే

3. నీలవర్ణ స్నేహముల్ | చాలు నర్మవాక్యముల్
ఏలనవ్వు? చపలముల్ | పోలునె నూజొక్యముల్
చాల దేవసంఘముల్ | నల్పు కృష్ణగానముల్
మేలు శివనారాయణు | నేలు హరిచరితముల్

ఆ. వె. సమ్మతములు శ్రుతికి, శ్రావ్యమ్ము, లుఙ మనో
జ్ఞములు గోపికాళి భ్రమరగీత
లుత్సుకతను విన్న యుద్ధవు డెటిగించె
గోపికలకు తత్త్వరూపమహిమ. 8

3 వ కీర్తన.

ప. మీాలో దిరిగిన గోపాలు డఖిల పాలకుడౌగ దే భామినులార!

1. అంతరంగముల నేకాంతుండై ఆది మధ్య తుద లందు నొకండై
భ్రాంతిపై సత్యసాక్షిరూపుడై భవ్యసత్త్వపరుడై
ఎంతగ యోగులు చింతించువాడై ఎల్లవేదాంతముల నెనయువాడై
అంతములేని సంసృతి కధికుడై ఆర్తభక్తులకుఁ దీక్షను శుభుడై

2. కలవే సంయోగ వియోగములు నెలవౌ సాధుల మానసములు
సులువౌ మాయల ఛేదనములు అలరు మనసు లను పీఠములు
ఒలయు వతని మెయి క్లేశములు ఒందెను స్వేచ్ఛగ జన్మవిధములు
అలఘుతములౌ హరిమహిమములు తలపుడుమతిమతీత త్త్వభామములు

3. వేరౌ కాడను నూహ లవెల్లన్ వెతలుఙ దీరును జ్ఞానమువల్లన్
చేరు భక్తులను నెమళులకెల్లన్ చెలునొౌమ్ము్బగసాధుసిద్ధవహిల్లన్
వారక ముక్తులబోధరహిల్లన్ వరహ్రాదయములముదముశోభిల్లన్
ధీరశివనారాయణతీక్షుని ధిషణ శౌరి పాదములపై సంధిల్లఙ

శ్లో॥ విగళితభయశోకా విద్యయా లబ్ధతత్త్వాః
కథమపి పరతత్త్వే స్థాపయిత్వా మనాంసి,
ముహురపి పరభక్త్యా విశ్వవంద్యే ముకుందే
మధుకరపరిక్లప్తం ప్రతిప్రాహు రిష్టమ్. 9

4 ధన్యాసీరాగము - త్రిపుటతాళము.

ప. కిము రాజతే రాజసదసి

అ. కుముదగణేషు కోటి-కోటిసంఖ్యాకేషు
కుముదబంధు రివ-కోటి మదన ఇవ

1 మధుప కుల వతంస కథయ-మధుమాధవచరితమిహ
మధుకరాచారరసికోఽథ-మాధవో విజయతే
కథ మపి కదా కిం-స్మరతి న స్వదసి రహసి
కిము కుశలీ వన-మాలీ సుగుణశాలీ

2. స్మరతి కిం మథ-బృందావనభువి
పరమరహసినిశి - ముదా పరయా యత్సుకృతం
సరళమురళీరవ-సుధయా సమాకృష్ట
సురవనితాగణ - సరససంగీత మిహ

3. కతి కతి సంతి న-కలహంసగతయః
తత్పరిచర్యావి-ధానైకకుశలాః
త దిహ నన స్మర తీతి - సాధు విదిత మిహ
త దల మసితసంగ - వార్తయా విఫలయా

4. మధుపానగరీ నాకి-మధురసంగీతరసికే
మాధవే వసతి-మను సురాయాం మధురం
నందిమాగధై రధికం-గీయతే గీతం జయ హే
గోపికాజార గోపీ-నాథేతి న హి కిం

5. నృతపంచదశకలం-చంద్ర ఇవ జీవామో
ధ్రువకలయా-వయ మధునా
ఇతి మధుసూదనం-వద యాహి మాధవం
ప్రతి నారాయణతీర్థ - ప్రత్యగాత్మాన మసితం

—♦ మత్తకోకిల ♦.—

జ్ఞానసాధన సత్యతత్త్వము చాలనందుచు నెట్టులో
మానసంబుల కృష్ణు నిల్పిరి మాని శోకభయాదులన్,
ఐన క్రమ్మర విశ్వవంతు నా ముకుందు పరత్వమున్
పూని కాంతలు భక్తి భృంగముఁ బోల్చి యిట్లని దుఃఖరున్. 9

4 వ కీర్తన.

ప. రాజసభ నెటుల రాజిలునో

అ. ఆజను లెన్నో కోర్కులు-అలరు కల్యాలన
రాజై మన్మథుని-తేజమున నగరమున

1. పలుకు మింక తుమ్మెదల తేడ-అలరు కృష్ణుని చరిత లవి నేడ!
వెలయు మాపురసతులగూడ-అలివాలె మధువు గ్రోలి వేడ
తలచునె యెప్పుడైన మాజాడ-తన నేటి లోపటి మేడ
అలరునో కుశలముగ నీడ-నల వనమాలతోడ

2. ఈ బృందావనమంచు-ఈ చోటి యాటలంచు
దోబూచి కేలంచు-దొడరిన యుత్సాహమంచు
తాఁ బరపె నటంచు-దనరు వేణుగానమంచు
వేఁ బర తెంచిరంచు-వేల్పులంచు నెపు డెంచు?

3. ఎందరెందరు లేరు - ఎనయు నంచనడకవారు
అందు తనసేవమీఱు-నలరు నేర్పుగలవారు
అందుచేత మా సారు-హరి మేల దలచితీరు
ఇందు మేము తనపేరు-నెంచ నేమి చేకూరు

4. వరలు దాసురాంగ్రడ గని-వారి మృదుగానము విని
హరి మధుర నేలుకొని- యలరుగాక నిద్రగొని
కెరలి వైతాళికు లతని-"కృష్ణ! గోపీజార" యని
"హరి గోపీనాథ" యని నెరపరో? మేల్కొల్పు విధిని

5. పదునైదు కళలు మాయ-అది యొక శశికళ చాయ
ఒదిగి ప్రాణములను పాయ నోపకుంటి మదనుడాయ
ఇది కృష్ణుని చెవినివేయ-నేగు మింత మేలుసేయ
మది శివనారాయణయతి-నోదవు సామికి పాటవ్రాయు

శ్లో॥ దత్త్వోత్తరస్సమాధాయ గోపీబృందం స చోద్ధవః,
పునర్వివేశ మథురానగరీం హరిమందిరమ్. 10

—♦ ఉద్ధవుఁడు గోపికలమాటలఁ శ్రీకృష్ణున కెఱింగించుట ♦—

శ్లో॥ మధుఘ్నం మధురాపురనాయకం
సమధిగమ్య స చోద్ధవనామకః,
రహసి గోపవధూపరిభాషితం
మధుర మాహ మనోభవగూషితమ్. 11

కాంభోజీరాగము - ఆదితాళము.

ప. ఇతి వదతిహి గోపీ-గోపాలకృష్ణ!-ఇతివదతిహి [విహితాః

అ. నత యోనుతయః స్మృతయః కృతయః-ప్రతిపదమస్మాభిస్త్వయి

1. మధురం మధురానగరీనారీ-మధురంగాయతి మధుసూదన తే
అధునా మాధవ తవ కియదస్మత్ - కృతిభిర్నుతిభిర్నతిభిః స్మృతిభిః

2. నందముకుందం పరమానందం-మందస్మేరసుధావరనేందుం
బృందావనభువి సంతం వందే-స్మారంస్మారం వారంవారం [సంతతం

3. శ్రుతయస్స్మృతయః కథయంతి త్వాం-సుధియః స్వాంతఃకరణే
తదపి మనో మే నందకిశోరం-స్మరతిహి యువతీకరిణీకలభం

4. మణినాయకమణిరపిపరమధునా-గుణయోగే సతి కాచమణీనాం
మరకతమణిరపి మధ్యేఘటితో-గణనీయః కిం నహి కాచేషు

5. ఇతి గోపీజనకథితం ప్రథితం-నిజజనకథితం విదితం హరిణా
యతినారాయణతీర్థగ్రథితం-గురువరకరుణాభరితం గీతం

శ్లో॥ నిత్యసిద్ధాగమజ్ఞోపి భగవాన్ స బలోఽగమత్,
విద్యార్థీ లోకశిక్షార్థం సాందీపనిమునిం గురుమ్. 12

—♦ రామకృష్ణులు సాందీపనియొద్ద విద్యాభ్యాసము సేయుట ♦—

సాందీపనే రాగమనం గీయతే—

గీ. ఉద్ధవుడు గోపికాళికి నుచితరీతి
ప్రతిసమాధానవాక్యముల్ పల్కి వెడలి
మాధవుని సన్నుతించుచు మధురకరిగి
స్వామిమందిరమున కేగె సంతసమున. 10

గీ. మధుర కధినాయకుండైన మధురిపునకు
నుద్ధవుడు మ్రొక్కి యేకాంతయుక్తవేళ
సన్నిధిని మధురోక్తుల విన్నవించె
గోపికా మనోభావనాలాపములను. 11

5 వ కీర్తన

ప. అతివల్ గోపిక లిట్లనిరి, గోపాలకృష్ణ! అతివల్ గోపిక లిట్లనిరి

అ. నతులన్ నుతులన్ స్మృతులన్ సుకృతులన్-ప్రతినిముసము నీపాదసం-గతియే
[కోరెదము కృష్ణ

1. అతిమధురమ్ముగ నటకాంతలచే నలరు గానముల నాలించు నీచే
మతిఁ దల్పఁబడుదుమే! మఱియేల? మాచే నుతిచే నతిచే స్మృతిచే సుకృతిచే

2. నందసుతుడని యానందరూపుడవని-మందహాసముల నిందువదనుడవని
బృందావని మా పూజ గైకొంటివని వందన మిందే సేతుము వారక వారక మరిమరి

2. జ్ఞానుల్ శ్రుతులు స్మృతులుఁ సర్వాత్ముడని నిన్ను-చాలపల్కు రీతి సరిదూనుగాక
ఐనమామతులెల్ల ఆనందనూనురాక హస్తిమేటిని హస్తినీలటు-లభిలషించునువీఁక

4. నాయకమణికడ నాణెముగానివి-నవ్యదీప్తులఁగొని భవ్యతలఁ గాంచును
నాయకమనదగు నాణెమైనమణి-ఏయెడ తాపిన నెన్నికతో మించును

5. ఇది గోపికల హృదయవార్త యని-యెఱుగ నుద్ధవుడు హరికి తెల్పె వారి భక్తిని
ఒదవె నిదె గురుని విదితకృపాప్తిని-మది నారాయణతీర్థ సదమల ఫణితిని

గీ. నిత్యసిద్ధమైన నిగమార్థవిజ్ఞాన
నిధియె కృష్ణుడయ్యు, నియమదీక్ష
జనులు తెలియ, గురుని సాందీపమునివర్యు
నన్నతోడ విద్య కాశ్రయించె. 12

వ. సాందీపగురుని ఆగమనము గానముచేయబడును.

5 నాదనామక్రియా రాగము - ఆదితాళము

నిష్పన్న వేదవిజ్ఞానో నిత్యం స్వాధ్యాయతత్పరః
శిష్యోపశిష్యసేవితో సాందీపని ర్విరాజతే

అథ విద్యాగ్రహణమ్—

శ్లో॥ గృహీతవిద్యో భగవాన్ బలరామసహాయవాన్,
గురుం ప్రసాద్య విధినా స తస్థౌ బ్రహ్మచారిభిః 13

—♦ అద్భుతమైన గురుదక్షిణ నిచ్చిన శ్రీకృష్ణుని సహాధ్యాయులు నుతించుట ♦—

6 సారంగ (కేదారగౌళ) రాగము - ఆదితాళము.

ప. కంసాసురసంహారణం కలయ కృష్ణ
సంసారసింధుతారణ

అ. పుంసామనన్యపురాణపురుషోత్తమ
హంసయతీశ్వరశంసితచరణ

1. పంచజనాసురపాటనకలితశ్రీ
పాంచజన్యదరపటుతరనాద
వాంఛితగురుపుత్రజీవనకారణ
మంజుళమార్తికమాధవధృతవేద

2. వాచామగోచర వసుదేవతనయ స
దాచారపాలక దనుజాన్తక
హే! చారుకమలవిలోచన భవపాశ
మోచన శతకోటిమన్మథమోహన

3. వారిజసంభవవందితపాదాబ్జ
భూరిదయాపారసభువననాథ
నారాయణతీర్థనతచరణాంబుజ
నానావిధలీలావినోద

5 వ కీర్తన.

ఛందస్సుల వేదజ్ఞానముతో శాస్త్రరీతి నధ్యయనముతో
సాందీపముని వెలయున్ సత్ శిష్యులతో నుపశిష్యులతో

వ. శ్రీబలరామకృష్ణుల విద్యాభ్యాసము.

క. వటువులతో రామునితో
నట కృష్ణుడు విద్యలెల్లనేర్చి యా గురువున కం
తట మృతసుతుడు బ్రతుకు ను
త్కటమౌదక్షిణ యొసంగె కరుణాళుండై. 13

—♦ గురుదక్షిణ యిచ్చిన స్వామిని భక్తులు స్తుతించుట ♦—

6 వ కీర్తన.

ప॥ కంసాసురు సంహరించితి వో, కృష్ణ!
సంస్కృతికడలి దాటించుము, కృష్ణ!

అ. శంసనొంచిన ధీరుడవు శాశ్వతుడవు ఉత్తముడవు
హంసలౌ యోగులు గొల్చు అడుగుదమ్ముల వాడవు

1. పంచజనాసురు సంహ-రించి కడలిమధ్యగ
పాంచజన్యమను శంఖము-బడసి, గురుదక్షిణగ
నెంచి గురుసుతు బ్రతి-కించి ముత్యము లెనయగ
మించి శ్రుతుల గాచి నల్లల-రించినా వెల్లర మేలుగ

2. వసుదేవతనయ!-వర్ణింపగలమా నిను
అసురాళి నొంచి - ఆదరింతువు సుజనులను
ఎసగి తమ్మికనుల దీర్చు-వీ జన్మబాధలను
అసమశోభ మింతువు-ఆ మరుల శతకోట్లను

3. నలువ నల్వు నీపాద-నలినముల సేవను
కొలమించు దయు నేలు-కొందు వెల్లజగమును
పలు తెరంగుల లీల-వెలయింతువు వేడ్కను
అల నారాయణతీర్థులు-గొలుతురు నీపదములను

— కాలయవనాదివధ —

శ్లో॥ జరాసంధస్య సైన్యాని హతాని హరిణాఽసకృత్,
నిహతః కాలయవనో ముచుకుందముఖాగ్నినా. 14

శ్లో॥ చిరసుప్తోత్థితస్యాస్య ముచుకుందస్య పశ్యతః,
అనుగ్రహాయ భగవా నావిర్భూతో గుహాంతరే. 15

శ్లో॥ ముచుకుందోఽపి తం దృష్ట్వా బంధహంతార మాత్మనః,
నృసింహపదసంలక్ష్యం ప్రణమన్ స్తౌతి దివ్యదృక్. 16

7 కాంభోజి [కల్యాణి] రాగము - జంపెతాళము

ప. వేదాద్రిశిఖర నరసింహమాకలయామి
విమల విద్యుజ్జ్వలితజిహ్వాం

అ. వేదాంతవేద్య విమలానందవిజ్ఞాన
విదళిత దురంత భవమోహం-త్వాం నౌమి

1. పరభావ భావనాదృఢబంధహర మఖిల
సురవైరి దళన ఖర నఖరం
పరిపూర్ణ కరుణా సుధా సమాస్వాదిత
ప్రహ్లాద భయహరముదారం-త్వాం నౌమి

2. ఘోరసంసారతారక తారకాధిపతి
తరణిమండలకోటిభాసం
క్షీరగంభీరవారిధి మథనసంజాత
వరలక్ష్మికౌస్తుభోల్లాసం - త్వాం నౌమి

3. జగదణ్డ శతకోటి జననీకళత్రమిహ
జన్మమరణాదిభయ విదూరం
నిగమమయ ఖగవర్య వరయానసంచార
నియతలీలామయశరీరం-త్వాం నౌమి

గీ. ఆ జరాసంధు సేనల నణఁచి తఱుచు
కృష్ణు డరినృపాలసమాజ జిష్ణుడగుచు
కాలయవనుండు తమపైన గవియ వాని
తీవ్ర ముచుకుందకోపాగ్నిఁ ద్రెళ్ళఁ జేసె. 14

కం. చిరనిద్ర నిట్లు మేల్కొని
యరయుచు ముచుకుందు డున్న నాతని యెదుటన్
పరమాత్ముండైన కృష్ణుడు
కరుణన్ దర్శనమొసంగె ఘనగుహాలోనన్. 15

ఆ. వె. దివ్యదృష్టిచేతఁ దెలిసి యా ముచుకుందు
డాత్మబంధహరుని హరిని కృష్ణు
నారసింహవిభవ వీరసంలక్ష్యుని
చేరి మ్రొక్కి వినుతి చేసె నిట్లు. 16

—♦ 7 వ కీర్తన. వేదాద్రిస్వామిస్తవము ♦—

ప. కొలుతు వేదాద్రిపై - నలరు నరసింహుని
వెలుగు విద్యుత్ దీప్తి-గల జిహ్వావానిఁ

అ. వెలయు శుభ వేదాంత-ములు జ్ఞానమా వాని
బలమౌ భవభ్రాంతిఁ - దొలగించువాని - నిను

1. పరులు మేమను భేద - భావము నడచువాని
సురరిపుని జీల్చు ఖర - తరనఖము వానిన్
పరిపూర్ణతమమైన - కరుణఁ జూపినవాని
వరభక్తు ప్రహ్లాదు - వరలించువాని - నిను

2. ఘోరమౌ సంసృతికి - తారకమౌ వాని
మీరి రవి శశి కోట్ల - మించు జిగివానిన్
క్షీరసాగర మథన-భార మోర్చినవాని
శ్రీరమను కౌస్తుభముఁ - జేకొన్నవాని - నిను

3. జగములకుతల్లి రమ - సతిగాఁ దనరువాని
జననమును మృతిలేని - ఘనభూమవానిన్
ఖగనాథు శ్రుతిరూపు-గరుడు నెక్కినవాని
నెగడు లీలల మేని - నెనరు గలవాని-నిను

4. మణిమయ కిరీటమణి మకరకుండలకాన్తి
మథితదిగ్దశ తిమిరభారం
అణిమాదిభూతిద మనన్య శరణార్థినాం
ఆధారమఖిలసుఖసారం - త్వాం నౌమి

5. నిరవద్య గుణరత్న నిర్మలాంతఃకరణ
వరణీయవరదాన నిపుణం
ధీర శివనారాయణానన్దతీర్థయతి
గూఢపరమార్థ మతికరుణం - త్వాం నౌమి.

శ్లో॥ ఉద్ధరోద్ధర గోవిందపతితం భవసాగరే,
భీకరే శ్రీహరే కృష్ణ వృష్ణి వంశ సముద్భవ 17

శ్లో॥ ఇతి స్తువంతం ముచుకుందమాదరాత్
కృపాసుధావర్షి దృశావలోక్య సః
హితం సమాదిశ్య చ సత్వరం పునః
వివేశ శౌరి ర్మథురా మరిందమః. 18

—♦ ద్వారకానగర నిర్మాణము ♦

శ్లో॥ ద్వారకానగరీ హర్మ్యశారికా గీతసారికా,
తారకోత్కలికా మానితారకా నందపూరకా. 19
శర్మదా నిర్మలధియాం నిర్మితా విశ్వకర్మణా
తత్ర సంతం హరిం పౌరా స్తుష్టా స్తుష్టువు రీశ్వరమ్. 20

6 సావేరీరగము - అటతాళము

ప. వయం ధన్యా వయం ధన్యా
వయం ధన్యా దేవ వసుధాతలే

అ. స్వయం వ్యక్తం పరం తత్త్వం
హరిం త్వా మవ లోకయామః

4. మకరకుండలకాంతి - మణికిరీటమువాని
ప్రకటముగ దిశలందు - ప్రభనించువానిన్
సకలసంరక్షకుని - సర్వసిద్ధులవాని
సుకరమై మూలమై - శోభిల్లువాని - నిను

5. తన శుభగుణమ్ములే - యనయము నుతులౌ వాని
తనమదిన్ దయ వరము - లను నొసగువానిన్
తనరు శివనారా-యణతీర్థమునివాని
తనకృపన్ పరమార్థ - మును నించు వాని - నిను

గీ. ఉద్ధరింపుము కృష్ణ! న న్నుద్ధరింపు
మోహభీకరజన్మాబ్ధి మునుగనీకు
వృష్ణికుల ముద్ధరింపగా వెలసినావు
శ్రీహరివిగావె! గోవింద! పాహి పాహి 17

గీ. ఇటుల వినుతించు ముచుకుందు నెంచి శౌరి
ఆదరకృపామృతసుదృష్టి నతనిఁ గాంచి
హితముబోధించి సత్వరం బేగి మఱల
విజయలక్ష్మితో మధురాప్రవేశ మొందె. 18

మత్తకోకిల.

శారికల్ వినిపించు పాటల సౌధముల్ పరిపాటిచే
తారలానగ మోదమొందుచు ధన్యులౌ మునికోటిచే
ధీరశాంతులు మెచ్చఁ దీర్చిన దివ్యశిల్పుల మేటిచే
ద్వారకాపురి శౌరికిందగె పౌరసన్నుతవాటిచే. 19, 20

—♦ ద్వారకాపౌరులు స్వామిని నుతించుట ♦—

8 వ కీర్తన

ప. మేమే ధన్యులము మేమే ధన్యులము
మేమె ధన్యులము, కృష్ణ! మేదినిమీద

అ. తామై వెలసి దైవతత్త్వమై
స్వామివై మమ్ము నోమఁగ గనుటచేత

1. నిఖిలలోకనిదాన నిగమబృందైకమాన
సుఖసత్యామితజ్ఞాన సురపాలన
మఘవదాదిపావన మాయయా కృతభువన
అఘమూలవినాశన అచ్యుతానంగమోహన

2. జలధిమధ్యనిర్మిత జాంబూనదవర
కలితగోపురహర్మ్య గణకమనీయా
జలజనాభ భవన జనరమ్యద్వారకా
అల మధునాఽపి శుభ్ర రవలోక్యతే

3. వసుధాసుధాసాధ వసతీకృతవాస
కుసుమబాణవిహార కూలవన
వసుదేవభాగధేయ వామదేవాదిగేయ
వసుధ నారాయణతీర్థ వరద విజయగోపాల.

శ్లో॥ అమరదుర్లభభూతిరియం సతీ
విమలమానసహంససమాకులా,
కమలనాభరమాంతిమనోరమా
సతతమస్తు శివాద్య మహాపురీ. 21

శ్లో॥ అద్యాపి భక్తాననుకంపయన్ ముదా
హృద్యానవద్యాం నగరీ మధిష్ఠితః,
నిరస్తశత్రుర్భగవాన్ విరాజతే
శ్రియా చ లక్ష్మ్యా సహ సర్వసంపదా. 22

ఇతి శ్రీనారాయణతీర్థవిరచితాయాం – శ్రీకృష్ణలీలాతరఙ్గిణ్యాం
శ్రీకృష్ణద్వారవతీప్రవేశవర్ణనంనామ ఏకాదశతరఙ్గః.

1. నెలవై లోకముల నెగడి వేదముల
నిలిపి సత్యజ్ఞానముల అలరించి సురల
అల యింద్రుని శుభముల అఖిలజగతిని మాయల
వెలయించి, తీర్థ వఘముల చెలగెడా మరుసొంపుల

2. కడలి నడుమఁ జేర్పించి కనకమ్మునఁ బేర్పించి
గుడుల మేడలఁ గూర్పించి గోపురములఁ దీర్పించి
అడరు ద్వారకఁ గట్టించి అలరెడా సిరుల నించి
తొడరి మాకుఁ జూపించి తోయజనాభ కరుణించి

3. ధరయంత సౌధమై స్మరుని నివాసమై
వరలు నిది యుద్యానమై శరధిదీవి తీరమై
వరవసుదేవు ఫలమై వామదేవు గానమై
గురునారాయణతీర్థు వరమై గోపాలు జయమై

గీ. పరమహంసల మానససరసు లోనర
కమలనాభ! యీ పురవరం బమరులకును
మించు వైభవలక్ష్మిమై మీకుఁ దగిన
నిత్యసంవాసమాన్యత నెగడుగాక. 21

గీ. అలరి శ్రీ భూ సతులు సంపదలను గూర్ప
భక్తులకు వైరులన్ బాపి పరమశోభ
నించుచున్ ద్వారకను నధిష్ఠించి శౌరి
నిండుదయ "సేవసాయించు" నేటికైన. 22

ఇది శ్రీనారాయణతీర్థులవారిచే రచింపఁబడిన-శ్రీకృష్ణలీలాతరంగిణి
యందు శ్రీకృష్ణస్వామి ద్వారకను ప్రవేశించినట్టి వర్ణనమును
పదునొకండవ తరంగము.

2'

శ్రీ రస్తు

1

# శ్రీకృష్ణలీలాతరఙ్గిణీ-సంస్కృతము

## ద్వాదశతరఙ్గము



—♦ కథాసంగ్రహము ♦—

—♦ అథ శ్రీరుక్మిణీకల్యాణమహోత్సవవర్ణన మభినీయతే ♦—

శ్లో॥ భీష్మోథ రుక్మీ తత్పుత్రో రుక్మిణీ తత్సుతా సతీ,
వసుదేవో దేవకీ చ బలకృష్ణౌ సబాంధవౌ. 1
రుక్మిణ్యా లిఖితం పత్రం శ్రీకృష్ణాయ నివేదితమ్,
బ్రాహ్మణేన తత స్తత్ర రథే నాగమనం హరేః. 2
రాజ్ఞాం సమక్షం రుక్మిణ్యాః పాణిగ్రహణమంగళమ్,
రుక్మిణ్యా సహ కృష్ణస్య ద్వారకాయాం సమాగమః 3
రుక్మిణీకృష్ణయో స్సమ్యగ్వివాహ స్తదనంతరమ్.
అష్టపత్నీసమాహారః కథాసంగ్రహ ఈరితః. 4

శ్రీరస్తు

# శ్రీకృష్ణలీలాతరఙ్గిణీ - తెనుగు

## ద్వాదశతరఙ్గము



వ. శ్రీరుక్మిణీకల్యాణ మహోత్సవ వర్ణనము అభినయింపఁబడుచున్నది.

—♦ శోహారలు ♦—

శ్రీరుక్మిణీ వివాహచరిత్రము చెలువౌ వర్ణన లొనరన్
ఈ రమ్యద్వాదశతరంగమున నెనయుఁ భక్తులు దనరన్ 1
విదర్భపతి భీష్మకు జాతనిసుత వెలయు రుక్మిణియనంగఁ
ఒదవిరి సూనులు రుక్మ్యాదులు, పిత ముదితకు పతిని గనంగన్
వసుదేవుడు దేవకి బలకృష్ణులు వలయు బంధువరు లౌటఁ
వసుధామరు డట, రుక్మిణిలేఖను వాసుదేవు మేల్ పీటఁ 2
గొనిచని యొసగన్ కృష్ణుడు రథమున కుండినమున కరుదెంచుఁ
వనితను పాణిగ్రహణముచే నృపవైరులయెదుటనె గొంచున్
రుక్మిణితో ద్వారకకు కృష్ణుఁట గూఢినేగి వర్ధిలుఁ
రుక్మిణీకృష్ణ శుభవివాహమును ప్రోన్నతిమై శోభల్లున్
ఆమెతో క్రమంబుగ నెనమంద్రను హరి భార్యల గాఁగొనుచున్
శ్రీమంతుడు విలసిలు సంగ్రహకథ చెలువై భక్తుల మనుచున్. 4

—♦ భీష్మకుండు సభలో రుక్మిణీకల్యాణముంగూర్చి యాలోచించుట ♦—

తత్రాదౌ భీష్మకాగమనమ్—

1 నాదనామక్రియారాగము - ఆదితాళము.

ధీమా నిహ శ్రీమానయం భీమపరాక్రమాన్వితః
భూమౌ విఖ్యాతమాహాత్మ్యో భీష్మో రాజా విరాజతే

అథ రుక్మ్యాగమనమ్—

2 నాదనామక్రియారాగము - ఆదితాళము.

రుక్మీ రుక్మిణ్యవరజో రుచిరాంగదకుండలీ
తిగ్మాంశుసమకిరీటీ దివ్యాయుధ స్సమాయాతి

గ. అథ భీష్మకమహారాజో రుక్మిణ్యాః స్వసుతాయా వివాహమహోత్సవాయ వర మన్విష్యన్ స్వమంత్రిభిః కులవృద్ధైశ్చ సమం పర్యాలోచ్య వాసుదేవం వరం రోచయామాస కిల. రుక్మీచ తద్వృత్తం జ్ఞాత్వా ద్వ్యపకృతత్వా త్సామర్ష మువాచ. అలమహో విచారేణ గోపాలవరకన్యాప్రదాన విషయేణ. అయం హి జారచోరశిఖామణిః పరతంత్రో నాస్మత్కులోచిత వర ఇతి. రాజాపి పుత్రస్నేహవశాత్తద్రోచయామాస. 5

అథ రుక్మిణ్యాగమనమ్—

3 నాదనామక్రియారాగము - ఆదితాళము

ఆయాతి శ్రీరుక్మిణీ శనై రిహ గేయయోషిద్భి రధునా
కృష్ణమేవ చింతయంతీ సదా హృది వృష్ణివంశ సింధు చంద్రం
సౌందర్యనిందితామరీ నిరంతర చారుతరనీలకబరీ
తన్వీ స్వతనుభానునా పరాజిత తపనకిరణా తరుణీ

శ్లో॥ క్రీడాగృహం సమాయాంతీం క్రీడంతీం స్వసఖీజనైః,
ప్రత్యాహ రుక్మిణీం మాతీ యద్వృత్తం భీష్మమందిరే. 6

వ. అక్కడ మొదట భీష్మకమహారాజు ప్రవేశము.

1 వ కీర్తన

శ్రీమంతుడు ధీమంతుండితడన భీమపరాక్రమవంతుడౌ నన
తా మహిమ వెలసి లోకమ్మున దనరు కుండినేశుడు భీష్మకనృప

వ. అంతట రుక్మియొక్క ఆగమనము.

2 వ కీర్తన

సోదరుడౌగద రుక్మిణికిల సూర్యదీప్తి కిరీటముతో
మేదురహారకుండలాంగదములతో మెఱసివచ్చు దివ్యాయుధములతో

వ. అంతట భీష్మకమహారాజు, తన కుమార్తెయైన రుక్మిణీదేవి యొక్క వివాహమహోత్సవమునకు వరుని వెదకుచు తనమంత్రులతోడను కులవృద్ధులతోడను కూడ బాగుగనాలోచించి, వాసుదేవుడైన, శ్రీకృష్ణుని తగినవరునిగా నిర్ణయించెనుగదా! ఇంక రుక్మి (భీష్మకమహారాజుకుమారుడు) ఈసంగతివిని చేదిభూపాలుడైన శిశుపాలునియందు అభిమానముగలవాడగుటచే, కోపముతో నిట్లుపలికెను. "చాలును ఓహో! ఈఆలోచనలు. గోపాలవరునకు కన్యాప్రదానము ఏల? ఇతడు జారులలో, చోరులలో శ్రేష్ఠుడు. పరతంత్రుడు, మన కులమునకు తగినవరుడుకాడు" భీష్మకమహారాజు పుత్రస్నేహమునకు వశుడగుటచే ఆమాటలను అంగీకరించెను.

వ. అంత రుక్మిణీదేవి ప్రవేశించును.

3 వ కీర్తన.

1. శ్రీరుక్మిణీకన్య విచ్చేయు లీలతో చేరి పాటల నాటల చెలులతో
2 వారక శ్రీకృష్ణుదలచు ననురక్తితో వలచి వృష్ణికులజలధిశశిని భక్తితో
3. తారుణ్యమున దేవతరుణులు నెనరుతో—దనరు సొంపొసఁగు వేషముతో
4. తీరౌ తనమేని సోయగముతో దినమణిప్రభనుమించుశుభముతో

కం. క్రీడాగృహమున రుక్మిణి
చేడెలతో నాడుచుండ చెలియొక్కతె యా
నాఁడా మొగూర్చి జనకుని
మేడఁగ దా వినినవార్త మెల్లగఁ దెలిపెన్.

శ్లో॥ రోహిణేయే కృష్ణే ద్వాహే రేవతీప్రాణవల్లభే
శ్రీకృష్ణస్యాథ సమయో వైవాహికమహోత్సవే 7
ఇతి ద్వారవతీపౌరాః ప్రశశంసుః పునః పునః
రుక్మీ చ రుక్మిణీం దాతుం శిశుపాలాయ రోచతే 8
పుత్రస్నేహవశా ద్రాజా తదైవ హృది నిశ్చితః,
ఏవమాలోచితం సర్వైః బంధుభిశ్చాపి మానిని! 9

శ్లో॥ ఇతి దూతీవచః శ్రుత్వా రుక్మిణీ న్యపతద్భువి
ఉపలభ్య శనైస్సంజ్ఞాం ప్రలపత్యమలాశయా. 10

— రుక్మిణీ మనోనిశ్చయము —

+ ఆహిరి [ఆనందభైరవి] రాగము - ఆది [జంపె] తాళము.

ప. వీక్షే కదా దేవదేవం గోపాలమూర్తిం
అ. సాక్షాన్మదనకోటి సౌందర్యభావం
1. ప్రకటమృగమదతిలక రమణీయఫాలం
సకలగుణసంపత్తి సహిత మురుఖేలం
2. బృందావనాంత భువి విశ్రుతవిహారం
నందనందన మఖిల నందితాకారం
3. కాలమేఘశరీర కలితవిద్యుద్వసనం
కేళీకలాకుతుక కించిత్కుంచితాధరం
4. తధిమి ధిమికి ధి మిత్రి తాండవవిలోలం
సిద్ధజనవినుత ప్ర సిద్ధతరశీలం
5. సరసమురళీగీత ర సామృతలహరీ
నిరతనారాయణతీర్థ నిర్మలమనోహంసం

శ్లో॥ నిధాయ హృది గోవిందం రుక్మిణీ రుక్మభూషితా,
మనః సంబోధ్య గోవిందే సమాధాయేద మాహతత్ . 11

సీ. వినవమ్మ! రేవతీవనితయే భార్యగా నా భార్యగా నా బలరాము పెండ్లైన దియట
శ్రీకృష్ణునకు పెండ్లిసేయ సమయమాట నిన్నియ మీ పెద్ద లెన్నెదరట
మఱిమఱి నీయూహ మన ప్రజల్ ద్వారకా పౌరులెంతయు మెచ్చి పల్కెదరట
శిశుపాలునకు నిన్నుఁ జేర్ప మీయన్న గాద నన్నగారా రుక్మి పన్నెదనట
గీ. తనయుమాట కాదనలేక తండ్రిగారు సంగతికే మది నిశ్చయ మొందెదరట,
సర్వబంధుజనంబు లీ సంగతి విని మానిని! చింతిలుచు నెంతో ప్రమాప్పడిరట.

కం. అను తన దూతిక వచనము
విని రుక్మిణి సోలె నేల వివశత మూర్ఛన్
వనిత లుపచర్య సల్పఁగ
గను లల్లన విచ్చి పలికె కలఁగి సదార్తిన్ 10

3 వ కీర్తన.

ప. సేవించు టెపుడో శ్రీకృష్ణున్ దేవతలదేవున్ గోపాలమూర్తిన్
అ. ఆ వలరాజుల కోట్ల నతిశయిల్లు సొంపువానిన్
1. సొగసౌ కస్తురిబొట్టు తగు నెన్నుదుటివానిన్
సుగుణ సంపదవానిఁ జోకౌ వేడ్కల వానిన్
2. మిగుల బృందావని సొగడఁబడు క్రీడవానిన్
నగడి నందసుతుఁడై జగ మలరు రూపువానిఁ
3. మేలౌ మబ్బను మేన మెఱయు సేల్వవానిన్
కేళికళ నోకింతవంపు దేలు కెంబెదవివానిన్
4. లీల తధిమి ధిమికి యని లివగా నటించువానిన్
శీలమున మిన్నయని సిద్ధు లెంచువానిన్
5. ఆ వేణురవ రసముల అమృత వాహిని నించువానిఁ
భావన శివనారాయణు పరమహంసయౌ వానిఁ

ఆ. వె. తొల్మినగల మించు మెలత రుక్మిణి యంత
మదిని కృష్ణు దివ్యమహిమ నిల్పి
యాత్మ నిటుల నెంచి యనునయంబుగఁ బిల్చి
పలికె సమ్మతోక్తిఁ బరమభక్తిఁ. 11

శ్లో॥ రేరే చేతః శ్రుణు విమలహృత్పుండరీకాంతరస్థే
యస్మిన్ మాయావిలసితజగత్కోటయ స్సంతి భూమ్ని
గోపాలం తం భజ నిగమవిద్యావిలాసానుపాలం
భూపాలం తం పరిహర పునర్జన్మబంధైకమూలమ్. 12

5 సావేరీ [రేగుప్తి] రాగము - అటతాళము

ప. రే రే మానస గోపాలం భజ దూరే పరిహర భూపాలం

అ. ఆరాదంతరతర సుఖలాత్మక బోధానందఘనం బాలం

1. విమలహృదయ కమలోదారం వేదశమితవివిధ విషయాకారం
కమనీయతర కరుణాసారం సర్వ సమభావ భావ మహోదారం

2. సామాదినిగమాంత సంచారం ధీరం ధీమదనుస్మృతసుగుణాకారం
సమరసమేకమ నంతమనన్వయ మమితనిరంతర సుఖసాగరం

3. జగదండకోటిపరాకాశం సర్వ నిగమాంతవిదిత స్వప్రకాశం
అగణితగుణమణి వాగీశం దేవ మాగమరూప నిజాదేశం

4. విగళితమోహాజ్ఞానపాశం విశ్వ మంగళకృతతను మఖిలేశం
భగవత్తమాది గురుం శివమద్వయ చిద్ఘనం నవనీతాశం

5. సుందరతర మురళీనాదం ముని బృందవిచింత్య సుందరపాదం
నందతనయ ముఖ లానందం శరదిందువదన మిహ గోవిందం

6. బృందావనహిత గోబృందం ధృత మందర మఖిల నిగమ కందం
నందసునందాది వంద్యమనన్యకం నారాయణతీర్థ యతివరదం.

శ్లో॥ ఇతి నిశ్చిత్య సా భైష్మీ గోవిందావాప్తయే హృది,
ఆరాధయంతీ తం కృష్ణం ప్రేమభక్త్యైద మాహ చ. 13

6 కమాస్ [పంతువరాళి] రాగము - ఆదితాళము

ప. గోపాలమేవదైవతం భజే సదా గోపాల మేవ దైవతం

1. సర్వలోకకారణం సత్యకామాదిగుణం

ఉ. ఓ మనసా! జగంబు లివి యొప్పెడు నెవ్వని మాయ పెంపుచే
నా మహనీయు హృత్కమలమందు విరాజిలు గోపసింహునిన్
ప్రేమ భజింపవే, నిగమవిద్యల సత్కళ నేలు కృష్ణునిన్
భూమి పునర్భవార్హులగు భూపుల నన్యుల సంత్యజింపవే. 12

5 వ కీర్తన

ప. ఏమే! మనసా! గోపాలుని సేవించు-ఇతరనృపుల మాటలేల? దవ్వు త్యజించు
అ. స్వామి యెంగున్న-సర్వాంతర్యామియై-సానంద హా బోధ-సన్నిధి సాధించు
1. విమలమౌ హృదయ-కమలమం దలరారి-వికలత్వమును వేద విహితచేఁ బాపువాని
కమనీయతరమైన-కరుణారసము చేత-సముద్రైన గుణగణుఁడై సకల నేలువాని
2. సామగానమ్ముల-సకల వేదాంతముల-సంస్తుతిఁ గొను ధరుల-సచ్చరితవాని
సామరస్యత నొకఁడై సర్వుఁడై గూఢుఁడై సౌఖ్యమును దరలేని జలధి నోలువాని
3. బ్రహ్మాండముల పైన-పరమాకాశమునుండి-బహుబ్రాంతు లెంచు స్వయం-
[ప్రకాశమువాని
బ్రహ్మ పొగడు నెన్న-భవ్యగుణజాలములో-ప్రభుఁడై అజ్ఞతే వేద-భావమౌవాని
4. తరిగి భ్రాంతుల-నెరవౌ భవబంధముల-వరతి సంభృతుఁడై గుల్లగ-నొరగ్గునవాని
గురుఁడై తొలి జ్ఞానమొసగిన-పర మేశుఁడై, శివుఁడై-నెరిచిదాకాశమై, నవ-సతము
[గొనువాని
5. సరసములో సంగతుల-మురళీగానముఁ బ్రోలు-సాధువులు మ్రొక్కు-పాద-జలజ
[ములవాని
వరల చెల్లగు. సూను-గరదించుడనవంగు-సగసుతుడౌ గోవింగు-పరమాత్మరూపవాని
6. గిరిఁ దాల్చి బృందావని-తరిపె మందలగాచి-మరి వేదగానమౌ-మహిమమ్మువాని
స్థిరమౌ వరమొసంగి-శివ నారాయణు బ్రోచి-నెరి నొకఁడై నందాది-గురుయోగులు
[మ్రొక్కువాని

ఆ. వె. ఇటులనిశ్చయించి హృదయమున్ శ్రీకృష్ణు
నందు ప్రేమభక్తిఁ జెందఁ జేసి
రాజతనయ యతని రమణుగాఁ గొలుచుచు
లలితవాక్యసరణిఁ బలికె నిట్లు. 13

6 వ కీర్తన

ప. గోపాలదేవు నాశనిసే భజింతు నెపుడుగోపాలదేవు నాశనిసే
1. ప్రాపౌ నెల్లలోకములకు రూపౌ సత్యఫలములకు

2. భక్తానుగ్రహాభివ్యక్త భవ్యమూర్తిధారిణం
3. యాదవాబ్ధిచంద్ర మిహ యతిజనమోహాపహం
4. కంసాదిసురవిరామ కలితదివ్యవిగ్రహం
5. గోపికాననకుముద గురుతరచంద్రోదయం
6. ఘోరసంసారకారణ వారణకేసరిణం
7. మనసాఽపి న గణయామి మాధవా దన్యదైవం
8. భవ్యనారాయణతీర్థ దివ్యదృగ్విధాయినం

గ. తతో రాజవిగ్రహధారిణే సురవిద్వేష కారిణే శిశుపాలనామ్నే స్వాం దాతుం కృతనిశ్చయం స్వజనం జ్ఞాత్వా సా రుక్మిణీ గోపరమణీమానస మానససరోవరరాజీవరాజి విరాజమాన రాజహంసం మర్దితమహాసురకంసం భక్తజనరచితప్రశంసం గోవిందం ఆత్మానందం స్మారంస్మారం విగతమానుషభోగతృష్ణా శ్రీకృష్ణైకబంధుత్వనిష్ఠా తా నిజసహచరే సాహచర్యావలంబినీ సదాఽఽస్తే.

—♦ రుక్మిణి శ్రీకృష్ణునకుఁ బత్రిక నంపుట ♦—

శ్లో॥ బ్రాహ్మణం బ్రహ్మవిద్వర్యం బ్రహ్మణ్యేవ పరాయణమ్,
దృష్ట్వా తు లిఖితం దత్వా తమాహానయ శౌరిమ్. 15

శ్లో॥ లిఖిత్వా లిఖితం దత్తం విప్రహస్తే తు కన్యయా
గృహీత్వా లిఖితం విప్ర స్త్వరయా ద్వారకాం యయౌ. 16

శ్లో॥ స గత్వా ద్వారకాం రమ్యాం దృష్ట్వా గోపాలనందనమ్,
విజ్ఞాపయామాస వచో రుక్మిణ్యా లిఖితం ద్విజః 17

2. దాసుల ననుగ్రహింపఁ దనరు భవ్యాకారమున
3. యదుకులమ్మును కపిలికి నిలి యతులకున్ భ్రాంతులను దీర్చు
4. కంసాదులౌ దైత్యుల ఖండించిన దివ్యమూర్తిని
5. కలువలౌ గోపికల మోముల నలరించు చంద్రోదయుని
6. ఘోరమౌ సంసారమును కుంజరమునకు సింహమును
7. మాధవుని గాక తక దేవుని మనసులో నెన్న తలంపను
8. దివ్యదృష్టిని నారాయణ తీరునకు ప్రసాదించిన-గోపాల దేవు

వ. అంతట, నరరూపము ధరించిన (జన్మించిన) రాక్షసుడౌ శిశుపాలుడనువానికి తనను (రుక్మిణిని) ఇచ్చుటకొరకు కృతనిశ్చయులని స్వజనులను తెలిసికొని, ఆ రుక్మిణీదేవి, గోపకాంతల మనస్సులనే మానస సరోవరకమల సమూహమునందు ప్రకాశించు రాజహంసమును, కంసుడను మహాసురుని చంపినవానిని. భక్తులచే చేయఁబడిన స్తుతికలవానిని: ఆత్మలకానందప్రదవానిని, గోవిందుని తలచి తలచి, ఐహికసౌఖ్యములందు కోర్కెలేనట్టిదియు, పరమాత్ముడగు శ్రీకృష్ణుని యొక్క ఆత్మబంధుత్వమునందే ప్రవీణురాలైనట్టిదియు తన చెలుల సహవాస సహాయము కోరునదియునౌ ఆసక్తిగల (రుక్మిణి) యుండి,

కం. పరమాత్మ పరవివేచను
పరతత్త్వజ్ఞను నొక్క బ్రాహ్మణు నార్యున్
సరగఁ బిలిపించి రుక్మిణి
హరిఁ గోర్తున్ననుచు లేఖ నతని కొసగెన్. 15

ఆ. వె. లేఖకత్వ మెనయ లిఖియించి ప్రభునవ్య
చేతి కీయ లేఖ, నాతఁడు గొని
భక్తితోడ దాచి, బహుజాగ్రతగ వేగ
ద్వారకాపురంబు జేరఁ జనె 16

గీ. రమ్యమౌ ద్వారకాపురిన్ బ్రాహ్మణుండు
చేరి శ్రీకృష్ణు నేకాంతశీఘ్రముగ
బడసి, భీష్మరాజకుమారి ప్రణయలేఖ
మాధవునకిచ్చి సంగతుల్ మనవిచేసె. 17

రుక్మిణ్యాః పత్రికాలేఖనప్రకారః—

గ. తథా హి శ్రీమతే సత్యకామ సత్యసంకల్ప సర్వకామ సర్వరస సర్వగంధ సర్వసంకల్పాదిగుణవతే, కృతాకృత మాతృమాన మేయభేదభిన్న సకల జగదాధారావభాసకాయ, నిష్ప్రత్యూహ నిరతిశయానందావస్థితాయ బ్రహ్మలోకానందాయ విశ్వస్మై విశ్వా ధారాయ సకలనామరూపనిర్వాహకాయ సర్వత్ర శక్తిసమన్వితాయ సర్వాంతర్యామినే దుష్ట నిగ్రహ శిష్టప్రతిపాలకాయ భక్తాను కంపయా పరిగృహీత గోపకుమారభావాయ కరచరణ నళిన నిలసితధ్వజవజ్రాంకుశాది రేఖాయ మహాపురుష లక్షణాయ కనకమణిమయ మకరకుండలకటకకటిసూత్రాంగదాది దివ్యభూ షణభూషితాయ భక్తజన కామిత కామవర్ష మహామోఘ నీల మేఘానుఘన సముజ్జ్వలవిద్యుత్పుంజకల్ప దివ్యపీతాంబర ధారిణే శ్రీవత్సకౌస్తుభాదిశోభితాయ దీనదయాపరమూర్తయే శ్రీకృష్ణాయ శతకృత్వః సహస్రకృత్వశ్చ నమో నమః

శ్లో॥ త్వత్ప్రసాదం పరం కాంక్షే కృష్ణ నాన్యం తు కామయే,
మనసా వచసా నూనం మత్పాణిగ్రహణం కురు. 19

7 వ పదీ [మధ్యమావతీ] రాగము - ఆటతాళము

ప. కాంక్షే తవ ప్రసాదం గోపాలబాల కేవల మే వాహం

1. అమితభాగ్యదాతారం అతులభూరివిస్తారం
కమనీయకరుణాకరం గోపాలబాల
వినుతమునినారదాదిక విద్వజ్జనాధారం
శమితభూరిభూభారం సకలీకృతారినికరం

2. కామదో నాన్య మహం | కంసారేతిదురూహం
శ్యామసుందరవిగ్రహం | గోపాలబాల
నామరూపనిర్వాహం | నానాభువననివహం
త్వా మే వాశ్రితోఽహం | త్వరయానయమాంస్వగేహం

3. ధరణీమండలతిలక | తాపసతారక
పరిజనసుఖకారక | గోపాలబాల
కలవేణునాదరసిక | ఘనతరమాతృక
వరనారాయణతీర్థ | వారితదుస్తరానర్థ

శ్లో॥ నాన్యం వృణే పర మశేషగురో రనంతాత్
త్వత్తః స్వముక్తిగుణధామభి రప్యతుల్యాత్
క్షేమం సదైవ కురు దేవశిరోమణే త్వం
యాచే త్వదంఘ్రికమలే ప్రణతాస్మి నిత్యమ్. 20

సావేరి | ఆరోహణం - అవరోహణం | రాగము - ఆదితాళము

ప. క్షేమం కురు సతతం గోపాల! మమ–క్షేమం కురు సతతం

అ. కామం తవపాద | కమలే భ్రమరీ భవతు
శ్రీమన్మమ మానసం | మధుసూదన

1. అక్షీణకరుణానిధే–ఆనందఘన | ప్రక్షీణగోపతతే
శిక్షితాసురగణ | రక్షితనిజజన
కుక్షిస్థితానేక | కోటిలోకావన

2. ప్రహ్లాదభయవిదూర–పరమయోగి | పావన భువనాధార
మోహారహితచిత్త | మానిమానసహంస
సాహసహతపురి | సంఘ మహోదార

3. అజితవిజయగోపాల–అనంతలీల | అద్భుతపదకమల
విజయద్వారకాపురి | విమల కమలాలోల
నిజనారాయణతీర్థ | నిత్యానందబాల

2\. కోరను నేనింక నన్యము కొలదిదెసో కంసారిమహిమము
కోరెద నీ శ్యామరూపము గోపాలబాల
పేరుపెంపుల దాల్చి భువనము లారసి తీర్తువు నటనము
ధీర! యిమ్ము ఆశ్రయము వేగరహిన్ నను కొ[illegible]ల్పము

3\. తిలకమై భూమండలమునకు దిక్కై మునిగణమునకు
కొలుచు భక్తుల సేమమునకు గోపాలబాల
అలరు వేణునాదమునకు లలి మేలిముత్యమునకు
నెలవై శివనారాయణునకు ఆలకు దీప్యము మేలునకు

మత్తకోకిల

మాన్య సద్గుణధామ మీనె సమంబు లేకని, నిన్నె గా
కన్యునిన్ పతిగా వరింప, ననంత! సర్వగుణాకరా!
ధన్యనైతిని నీకు మ్రొక్కుట త్వత్పదాబ్జము కోరి దాన్
కన్యకన్ గురుదేవనాయక! కాంచి భద్రము గూర్చవే. 20

నవకీర్తన

ప. సేమమా సెలవిమ్ము! గోపాల! నా-ప్రేమనైన మీనె సుమ్ము
అ. నామది నీ పాద నలినముల తుమ్మెదై
స్వామీ! మధుసూదన! ఆ- సక్తనేను మసలనిదై

1\. అలఘుకరుణ గాంచి ఆనందమునించి అఘములఁ దొలగించి
ఖలుల శిక్షించి కరుణ భక్తుల నెంచి
లలి కుక్షిలో నుంచి వెలయ లోకకోటిఁ బెంచి

2\. ఆధారమై జగతికి అభయమొసగి ప్రహ్లాదునకు ఆర్యులపావనులఁ జేసి
సాధు మానస హంసవై స్వాత్మభ్రాంతికి దూరుడవై
సాధింతువు వైరివీరుల సాహసౌదార్యుడవై

3\. వెలయు నెల్లెడ, గోపాల! విజయమైనీలీల కొలుతు నీపాదముల
నిలుచు సిరులు నీ పాల నెమ్మి ద్వారక నేవేళ
అల నారాయణతీర్థు నలరింతువు నందబాల!

శ్లో॥ గౌరీశఙ్కర పూజార్థం యాత్రా మే నగరా ద్బహిః
యదా తదా హ్యవసరో భవతో మత్పరిగ్రహే. 21

శ్లో॥ ఇతి విప్రముఖా చ్ఛ్రుత్వా రుక్మిణ్యా లిఖితం హరిః,
ప్రహృష్యోత్తరం లిఖిత్వాఽథ తత్ర గన్తుం మనోదధే 22

-- ♦ ఇక విదర్భలో శ్రీరుక్మిణీవిరహము. రుక్మిణీవచనము ♦ --

శ్లో॥ హే సూనాస్త్ర! సముల్లసద్విరహిణీసంహారదోషా దిహ
ప్రాప్తోఽసి త్వ మనఙ్గతాం, తవ శరాః పఞ్చత్వ మాపుర్ధ్రువమ్
చాపస్తే ధరణీం గతః, స్మర! నదీగామీ త్వదీయో ధ్వజః
త్వేవంకృచ్ఛ్రగతోఽపి మన్మథ! వధూహింసాగుణంనోజ్ఝసి. 23

శ్లో॥ అకళంకః కమలాప్తః స్సౌమ్య శ్శౌరి, ర్భవాంస్తు సకళంకః
కమలారి రుగ్రమౌళిః కథ మిన్దో తవాప్యహో విధునామ. 24

శ్లో॥ శ్రీకృష్ణహృదయం జ్ఞాత్వా పునరాగమనే ద్విజః
శ్రీకృష్ణాగమనోత్సాహం ప్రాహ భైష్మీం ప్రతి ప్రియమ్. 25

9 సాముకులకాంభోజిరాగము - అటతాళము.

ప. శరణం జగతా మేవ సకలాంతరాత్మా
త్వరయైవాయాతి-హరిః తేమతి మాతనుతే

కం. నగజాశంకర పూజకు
నగరము వెలి కాప్తజనులు నను గొనిచనగా
తగు నదె సమయం, బటకున్
నగధర! దయచేయవలయు నాపై దయతోన్. 21

గీ. రుక్మిణీ రేఖ సంగతుల్ మాధిగాగ
విప్రుమాటలచే కూడ వినియు శౌరి
మగువ పై యట విచ్చేయ మనసుపూని
యంపె ప్రత్యుత్తరము విప్రు నాదరించి. 22

వ. శ్రీరుక్మిణీదేవివాక్యం. మన్మథనింద.

శా. నీ సత్ చాపము నేల ప్రీలె, కలిసెన్ నీటన్ ధ్వజాంకంబులున్,
వాసిన్ బాసి యనంగుడైతి, వలుగుల్ పంచత్వమున్ బొందె, బల్
దోసం బీ విరహాగ్నిఘూంతె; మదనా! దుష్టత్వమారా! స్మరా!
హో! మానాస్త్ర! యుక్తిన మానవుగదా! యోపాళి పై
[రోపముల్. 23

—♦ శ్రీరుక్మిణీకృత చంద్రనిందాయుము ♦—

ఆ. వె. కమలవైరివీవు, కమలాప్తుడా శౌరి,
యుగ్రమాళి, వాత డౌనరు సౌమ్యు
డౌను, నిష్కలంకు డాతడు, నకలంకు
డీవు; విధుడవగుట యెట్లు? చంద్ర. 24

కం. శ్రీకృష్ణుని సుహృదయమును
జేకొని బ్రాహ్మణుడు మఱలి చెప్పె నలరుచున్
రాకన్నె కుఁ బ్రియతమమౌ
శ్రీకృష్ణాగమనవార్త సిద్ధార్థముగన్. 25

—♦ బ్రాహ్మణుడు రుక్మిణీదేవికి ధైర్యము చెప్పుట ♦—

౪ వ కీర్తన.

ప. సకలాత్ములన్ దనరి జగమేలు విష్ణుండు
ఇఁక నిన్నంగీకరించి యే తెంచు కృష్ణుండు

1. వనమాలీ కిల నూనం వసుదేవాపత్యం
సనకాదిమునిహృదయ సత్కమలసంవేద్యం

2. చామతరేణ రథేన దారుకసారథినా
ద్వారవతీనగరా దాయాతి తవ స్వామీ

3. మా బాలే! కురు చింతాం మంజుతరాలాపే!
మాధవ మేష్యసి నూనం వసుధాతలతిలకం

4. క్షేమం కురుతే తవ క్షీరాబ్ధిశాయీ
శ్రీపురా సఖిలాత్మా చామీకరపరిధానీ

5. హరిచరితమధు నారాయణ తీర్థముఖోద్గళితం
పరిజన మునివర మత్త భ్రమరైరాపీతం

శ్లో॥ ద్విజముఖసరసిజగళితం హరివచనామృతం సమాపీయ,
ఆనందానుభవాఢ్యా రుక్మిణ్యాస్తే మన స్సమాధాయ. 26

♦ రుక్మిణీస్వయంవరము ♦—

గ. అథ కోసల కురు పాంచాల మైథిల చేది మాగధ మత్స్య మాళవ వంగ కళింగ సౌరాష్ట్ర ఘూర్జర మహారాష్ట్ర సైంధవ కాశ్మీర కేరళ కొంకణ ద్రవిడ నేపాళ కర్ణాట కాది దేశాధ్యక్షా స్తారో మహాప్రభావాః, అతిరథమహారథాది పద్మ మహా పద్మసంఖ్యాక సైన్యకాః. రాజత జాంబూనద మహార్హ వజ్ర వైడూర్య మరకతాది విచిత్ర రత్న యుతానేకకోటి తటి ద్రత్న ప్రద్యోతమాన దివ్య దివ్య విమాన సమారూఢాః, ధిక్కృత సురసంపదః, మత్త మాతంగ తురంగ వాహన వాహినీశత పరివేష్టితాః, మదన మదాపహారి సౌందర్యశాలినః, సకలకలా కుశలాః, కుండిననగర వర పతినా సముదితాః పంక్తిరథాః సమాసతే. 27

1. సనకాదుల మనసు లను వనజముల వనమాలి
చనుదెంచు వసుదేవ తనయుఁ డిదె నీకై బాలి
2. తీరైన రథమున దారుకు సారథ్యమున
ద్వారకనుండి కడువడిన దయచేయు స్వామి నినుఁగొన
3. చింతింప కో యమ్మా! చెలగి వేడ్కగ పల్కుమమ్మా
ఇంతకు రాఁగలడమ్మా ఇలకు తిలకము కృష్ణుడమ్మా
4. శ్రీమంతు డఖిలాత్ముఁడు క్షీరసాగర శయనుడు
క్షేమముగ ని న్నేలగలడు చెలువుగా స్వర్ణాంబరుడు
5. వరనారాయణతీర్థ వదనాబ్జ సుధ యగును
హరి చరిత భక్తులు మునులు అళు లనఁగ గ్రోలెదరే విను

గీ. విప్రు వదనపద్మమునుండి వెలయుచున్న
కృష్ణవచనామృతమ్మును కెరలి క్రోలి
మది సమాధానమును రాకుమారి చెంది
యనితరానంద మొందె లేఖార్థమరసి, 26

వ. అంత కోసల కురు పాంచాల మైథిల చేది మగధ మత్స్య మాళవ వంగ కళింగ సౌరాష్ట్ర ఘూర్జర మహారాష్ట్ర సింధు కాశ్మీర కేరళ కొంకణ ద్రవిడ నేపాళ కర్ణాట కాదులైన దేశముల అధిపతులై, మహాప్రభావముగలవారై, అతిరథులు మహారథులు గల పద్మ మహాపద్మముఖ సంఖ్యలుగల సైన్యములతో కూడిన వారై, వెండి బంగారు గొప్ప వజ్రములు వైడూర్యములు పచ్చలు మొదలౌ విచిత్రములైన రత్నములు అనేకకోట్లు గలిగి మెఱుపుతీగల వలె ప్రకాశించు దివ్యమైన విమానముల నెక్కినవారై, దేవతల వైభవమును మించు సంపదలుకలవారై, మదించిన ఏనుగులు గుఱ్ఱములు మొదలగు వాహనములపైన నున్న సేనాభాగముల సమూహములచే చుట్టబడ్డవారై, మన్మథుని గర్వమును హరించునంత అందము గలవారై, సమస్తమైన కళలందు నేర్పరులై, (వెలసిన రాజకుమారులు) ఆ కుండిననగరముయొక్క సమీపప్రాంతమునందు రథముల పంక్తులుగలవారై, కూడుకొనిరి.

శ్లో॥ త్రైలోక్య సంపత్కలయాఽవతీర్ణా
యా రుక్మిణీ సాగర రాజకన్యా
సేయం భవానీభవభావయుక్తా
సంపూజ్య నిర్యాతి సఖీసమేతా. 28

శ్లో॥ అత్రాంతరే ద్వారవతీనగర్యా
రథేన గత్వా స రథాంగపాణిః
ఆస్తే మహీపాలమహాసభాయాం
సూర్యో యథా దీపసహస్రమధ్యే. 29

గ. తత్ర ఖలు వేత్రపాణయః నిరస్తసమస్తసమ్మర్దా రుక్మిణ్యాః పరి
జనాః పరితో బభూవుః. 30

శ్లో॥ పదాంగులిన్యస్తదృశం వ్రజన్తీం
భైష్మీం ప్రతి ప్రాహ చ దర్శయన్తి
తస్యా స్సఖీ రాజసుతాన్ క్రమేణ
వేత్రేణ విజ్ఞాపయతీవ దూతీ. 31

10 సుఖారిరాగము – ఆటతాళము.

1. దూతీ. కోమలాధరే! రుక్మిణి! కోసలాధిపతి రయం
కామసుందర మాకలయ కల్యాణి! రాజకన్యకే!

2. రుక్మిణీ. దూతి! నూపురు విలంబం నీతిసారజ్ఞే! సుందరి!
భాతి కిన్న తే మామకం భావుకం మానసవృత్తం

3. దూతీ. పశ్య పాంచాలమైథిలౌ పార్థివా వథ సంపన్నే!
నిశ్చలా విభూతి ర్యత్ర నీతి రప్యబ్జలోచనే!

4. రుక్మిణీ. తారకా ఇవ దృశ్యంతే శారదచంద్ర సన్నిధౌ
వారియ దూతి! పార్థివాన్ సారవివేకచతురే!

5. దూతీ. కౌరవం కలయ దేవి! కురుదేశాధిప మినా-
పౌరజానపదోపేతం పద్మపత్రవిలోచనే!

గీ. ముజ్జగముల సంపత్కళల్ మొనసి భువిని
రూప మెనయు సాగరకన్య రుక్మిణి, యట
పార్వతీశుల పూజించి భక్తిభావ
మున సఖీజనయుక్తయై చనుచునుండ. 28

గీ. అంతలో ద్వారకాపురి నరద మెక్కి
చక్రపాణి కృష్ణుడు వచ్చి, సకల నృపులు
వెలయు భీష్మకనృపుసభ నలరియుండె
దీపములు వేయిపై మించు దినకరు వలె. 29

వ. అక్కడ బెత్తములు చేతులలోఁబూని జనులయొక్క సమస్త సమ్మర్దమును వారించు పరిజనులు శ్రీ రుక్మిణీదేవికి చుట్టును కాపుగ నుండిరిగదా! 30

గీ. అలరు తన పదాంగుళులఁ జూపులను బరపి
మానితాచార భీష్మకుమారి దనర
నామెసఖి వేత్రవతి దూతి యధిపసుతుల
చూపి క్రమముగఁ, జేసె విజ్ఞాపనంబు. 31

10 వ కీర్తన.

1. దూతి. రాకుమారీ! లలిపెదవుల రాజిలు కల్యాణి! రుక్మిణీ!
ఈ కోసలాధిపతి ఎనయు మరునికీవిఁ గనుమా

2. రుక్మిణి. నీకు విశదము నీతిసారము నెలత! దూతీ! ప్రాజ్ఞరాలవు
ప్రాకటము నామనోభావము భామా! జాగేల? చనుమా

3. దూతి. బహుళ సుస్థిర సంపన్నుల పాంచాల మిథల రాజుల
విహితుల నీతిమంతుల వీరల నబ్జాక్షీ! కనుమా

4. రుక్మిణి. మహితుడౌ శరదిందుసన్నిధి మగువ! చుక్కలు తేజరిలునే
మహివులేలనే? చతురవతివే మరియు విజ్ఞత ముందుచనవే

5. దూతి. పురములున్ పల్లెలు సంపద నెరయు కురుదేశమున కధిపతి
అరయుమిూ వైభవవిచిత్రము విరితమ్ముల కనుల తల్లి

6. రుక్మిణీ. అత్ర కి న్నుతే విచిత్రం చిత్రచారిత్రసంపన్నే!
తత్ర త త్రాట తన్వంగి! తామసీ మా భవ దూతి!
7. దూతీ. మగధ మత్స్య మాళవ వంగ కళింగ సౌరాష్ట్ర
నగరఘూర్జర దేశ నరపాలా నాలోకయ
8. రుక్మిణీ. సంతు రాజానో దూతికే! సఖి! సహస్రశో భువి
కిం తతో మే? చల బాలే! కీర్తి మాకలయ మయి
9. దూతీ. కేరళ నేపాళ కొంకణ ద్రవి డాన్ధ్ర కర్ణాటక
ధారిణీపాలకా నవ ధారయ రాజకన్యకే!
10. రుక్మిణీ. చర్వితచర్వణే నాలం చక్రిణం దర్శయ బాలే!
సార కమలసంకాశాక్షం శారదచంద్రసన్నిభాస్యం
11. దూతీ. సుందరం పశ్య సుందరి! నందయశోదానందనం
నందనందన మాకలయ నారాయణతీర్థ గీతం
12. రుక్మిణీ. ద్వారకాపురీపాలకం దూరితదుర్జనజాలకం
ధీర మాకలయే కృష్ణం-వసు దేవ దేవకీ తనయం

శ్లో॥ స్తైదర్భీవసుదేవసూను నయనా, న్యన్యోన్యవిన్యాసతో
ధన్యానా మపి ధన్యతాం విదధతే కన్యావరాణాం ధురి,
అన్యోన్యోపమితాని యాని భువి సంత్యన్యాని వస్తూని, తత్
సర్వస్యా ప్యుపమాపయం త్వితి తయోశ్చిత్తైకతాం కుర్వతే.

—♦ శ్రీకృష్ణుండు రుక్మిణిని రథముపై నిడుకొని ద్వారక కేగుట ♦—

శ్లో॥ గృహీత్వా పాణినా పాణిం రుక్మిణ్యా స్త్వరయా ప్రభుః,
ఆరోప్య స్యందనే భైష్మీం ద్వారకాం ప్రస్థితో హరిః. 33

శ్లో॥ రుక్మీ తు సమరే కృష్ణం జేతు మగ్నిం పతంగవత్
ప్రవృత్తః, స్తేన నిర్జిత్య రథే బద్ధః పశు ర్యథా. 34

6. రుక్మిణి. అరయఁ జిత్రము నీమాటయె మరి విచిత్ర మికేమికలదే
సరి సరియె ఇట తామసింపకు చాన! దూతీ! సరగ చనవే

7. దూతి. అంగ మగధ మత్స్య క- ళింగ మాళవ సౌరాష్ట్ర
బంగాళ ఘూర్జ దేశుల పరికించితె? రాకుమారీ!

8. రుక్మిణి. అంగన! వేలకొలదిగ నధిపు లెం దలరెదరులే
సంగతు లివి యేల? కీర్తులు చాలు మనవి మనకు లే

9. దూతి. కేరళాంధ్ర ద్రవిడ కొంకణ ధారుణీశుల నెంచుమా
వీరు నేపాల కర్ణాట భూరమణులు, కాంచుమా

10. రుక్మిణి. నారి! పల్కినదె పల్కకు శారదేందుడను మోమున
సారసములను కన్నులుగల చక్రి కృష్ణునిఁజూపుమిందున

11. దూతి. శూరు గంభీరు సుందరు సుందరీ! యిదె కననౌనే
నారాయణతీర్థు పాటల నందయశోదాసూనునే

12. రుక్మిణి. ద్వారకాపురి నేలునే దూరము దుష్టులఁ గొలునే
ధీరు కృష్ణునిఁ గంటినే దేవకీ వసుదేవ తనయునే

వ. అప్పుడు.

శా. అన్యోన్యం బనురాగ తారకములై యా రుక్మిణీకృష్ణ దృగ్
విన్యాసంబు లెసంగె పావనములై విశ్వోపమానంబులై
మాన్యంబౌ సమతన్ వధూవరుల సేమం బొప్ప చిత్తైక్య సం
తన్యత్వంబున లోకవర్ధకములై ధన్యాతిధన్యంబులై. 32

గీ. పాణిచే శౌరి రుక్మిణీపాణిని గొని
తన రథంబున నెక్కించుకొని, ప్రభుత్వ
ఘనత మించి యశ్వంబులన్ దనరి తోలె
ద్వారకాపురికై దివ్యదర్ప మొనయ. 33

గీ. రుక్మిణీదేవి యన్నయా రుక్మి యంత
నడరి కృష్ణునిపై బోరి యగ్ని నేచు
మిడుతవలె నోడె, కృష్ణుడా మేటి నంత
పట్టి రథమునకుం గట్టె పశువును వలె 34

శ్లో॥ రుక్మిణ్యా ప్రార్థితః కృష్ణో రుక్మిణం చ తదగ్రజమ్,
ప్రాగ్బంధా న్మోచయిత్వాఽథ ప్రహర్ష ద్వారకాంయయౌ, 35

శ్లో॥ సమగ్రసేనయా సార్థం మధ్యేమార్గం సమాహితః,
బలభద్రోఽఖిలాన్ జిత్వా పార్థివాన్ ద్వారకాం యయౌ. 36

శ్లో॥ రుక్మిణీసహితే కృష్ణే ద్వారకాపుర మాగతే.
వసుదేవాదయ స్సర్వే సంతుష్టా స్తాశ్చ యోషితః. 37

౫. తత్ర ఖలు ద్వారావత్యాం సకల సుర భూసుర గరుడ గంధర్వ కిన్నర విద్యాధర ప్రముఖామరసహిత సంపదధరీకృ తేంద్రమహా సభాయాం, త ప్తజాంబూన దానేకకోటి చంద్రరవికాంత స్ఫటిక సంఘటిత వజ్ర వైడూర్యా ద్యనేకరత్న స్తంభ మంటప విరాజ మాన సురగురుస్పర్ధావర్ధితవిద్యావ ద్విబుధోన్నత సంకులాయాం, అనేకకోటి మహాకవి వంది గాయక పరిహాస కాది లక్షణ లక్షి తాయాం, ఇక్షు క్షీర దధి మధు ఘృత గుడ గోరోచన జీరక మరీచికాది మంగళద్రవ్యసంభారవత్యాం, గర్గప్రభృతయః వసు దేవానుమత్యా మహాసంకల్పపూర్వకం శ్రీరుక్మిణీకృష్ణయో ర్గాంధర్వవిధినా వైవాహిక మహోత్సవాయ లగ్నాష్టక మా రభంత.

గీ. రుక్మిణీదేవి ప్రార్థింప, రుక్మి నపుడు
ఆమెయన్నగారని కట్లు నచట విప్పి
వేడ్కగా నవ్వి కృష్ణుండు వేగ నేగ
ద్వారకాపురమునకును తన్వితోడ. 35

గీ. సర్వసేనతో శౌరికి సాయపడగ
వచ్చు బలరాము డరిరాజ వర్గమెల్ల
వారి నడ్డుటఁ గని వారి బారఁదోలి
తమ్మునిన్ గూడి నగరికై తాను మఱలె. 36

గీ. స్వామి రుక్మిణీదేవితో క్షేమముగను
ద్వారకకు నైరివిజయుడై తరలిరాగ
పడతులున్ వసుదేవాది బంధుజనులు
ముదముతో శుభార్థములతో నెదురుచనిరి. 37

వ. కలదుకదా ఆ ద్వారకయందు సుధర్మ యను సభ. సమస్త దేశముల బ్రాహ్మణులతో, గరుడులు గంధర్వులు విద్యాధరులు కిన్నరులు మొదలుగాగల దేవతలతో కూడినదియు, సంపదచేత ధిక్కరింపఁబడిన ఇంద్రసభ గలదియు, మేలిమిబంగారునందు అనేకములైన చంద్రకాంతములు సూర్యకాంతములు స్ఫటికములు కూర్పఁబడి, వజ్రములు వైడూర్యములు మొదలౌ అనేకరత్నములు గల స్తంభముల మంటపమందు ప్రకాశించువారై దేవగురువును ధిక్కరించి జయింప గల విద్యావంతులైనట్టి పండితులచే మిగుల సంకులమైనదియు, అనేకకోట్లు మహాకవులు స్తుతిపాఠకులు గాయకులు పరిహాసకులు కలదియు, కావుననే సమస్తమైన సభాలక్షణములతో కూడినదియు, చెఱకు పాలు పెరుగు తేనె నెయ్యి బెల్లము గోరోచనము జీలకఱ్ఱ మిరియములు మొదలగు మంగళద్రవ్యముల సామగ్రి గలదియు, సగు సభయందు గర్గుడు మొదలగు మునులు (పురోహితులు), వసుదేవుని యనుమతిచే మహాసంకల్ప పూర్వకముగా శ్రీరుక్మిణీకృష్ణులకు గాంధర్వ విధిచే వివాహమహోత్సవముకొఱకు లగ్నాష్టక మను మంగళాశాసనమును ప్రారంభించిరి.

30

—♦ లగ్నాష్టకము ♦—

శ్లో॥ సత్యజ్ఞానసుఖస్వరూప మమలం సర్వోత్తమం నిత్యదృక్
ప్రత్యక్తత్త్వ మచింత్యశక్తివిలసద్విశ్వం పరంబ్రహ్మ యత్,
లోకానుగ్రహవిగ్రహస్య జగతాం నాథస్య త స్యామరాః
రుక్మిణ్యా స్సతతం వివాహసమయే కుర్వంతు తే మంగళమ్.
—సులగ్నే సావధాన. 39

శ్లో॥ గంగాద్యాః సరితో గ్రహాశ్చ శుభదా గంధర్వవిద్యాధరా
దిక్పాలా ఋషయశ్చ దేవమునయో దేవ్యశ్చ గౌర్యాదయః,
శ్రీవత్సాంకితవక్షసం స్సుమనసా మద్గేసరస్య ప్రభోః
రుక్మిణ్యా స్సతతం వివాహసమయే కుర్వంతు తే మంగళమ్.
—సులగ్నే సావధాన. 40

శ్లో॥ యేషాం గోపీనయనోత్పలై రనుపమై రారాధితో గోకులే
గోభి ర్గోపసుతై రనేకమునిభి ర్హృత్పద్మకోశాంతరే
మాయామానుషవిగ్రహస్య మరుత స్తే వాలఖిల్యాదయో
రుక్మిణ్యా స్సతతం వివాహసమయే కుర్వంతు తే మంగళమ్.
—సులగ్నే సావధాన. 41

శ్లో॥ బ్రహ్మా విష్ణు రుమాపతి శ్శ్రీరిచ యో వాణీరమోమాయుతా
ఆదిత్యా వసవో గణాధిపముఖా రుద్రాశ్చ భద్రప్రదాః,
కాలాంభోధరదివ్యకాంతివిలసత్కాయస్య మాయావినో
రుక్మిణ్యా స్సతతం వివాహసమయే కుర్వంతు తే మంగళమ్.
—సులగ్నే సావధాన. 42

శ్లో॥ వంశీనాదవినోద నందితసునందాద్యోఽన వద్యోమహాన్
నందాద్యై రభిపూజితః పరమయా భక్త్యా ముహు ర్లాలితః
యః పూర్వం కమలేక్షణస్య కమలానాథస్య త స్యామరాః
రుక్మిణ్యా స్సతతం వివాహసమయే కుర్వంతు తే మంగళమ్.
—సులగ్నే సావధాన. 43

సీ. సత్యజ్ఞానానంత సార రూపము నీవు - పరమమహానందభావ మీవు
చింతావధుల దాటు చిచ్ఛక్తినిధి వీవు - విలసత్కళాపూర్ణ విశ్వ మీవు
ప్రత్యగాత్మవు పరబ్రహ్మతత్త్వము నీవు - సర్వోత్తముడు నిత్యసాక్షి వీవు
కరుణించి జగములఁ గాచు విగ్రహ మీవు - సకలలోకాధినాయకుడ వీవు
గీ. నీకు రుక్మిణీదేవికి శ్రీకరముగ - లగ్న శుభ సావధాన కల్యాణ వేళ
సంతరింతురు గాక నిరంతరంబు - స్వర్గవాసులు మంగళాశాసనములు. 39

సీ. శ్రీ సతీ వాణ్యాది సీమంతినీమణుల్ - గంగాది పుణ్య విఖ్యాత నదులు
గంధర్వ కిన్నర గరుడ విద్యాధరుల్ - దేవేంద్రు డాదిగా దిగధిపతులు
విహిత కారక శుభగ్రహ దైవశక్తులు - సుర మునీశులు ఋషివరు లనఘులు
కీర్తించి సేవలొసఁగసరు నిను బ్రభు - శ్రీవత్స లాంఛన లాంఛితుని విమలు
గీ. నీకు రుక్మిణీదేవికి శ్రీకరముగ - లగ్న శుభ సావధాన కల్యాణ వేళ
సంతరింతురు గాక నిరంతరంబు - స్వర్గవాసులు మంగళాశాసనములు. 40

సీ. ఆ ధనముఁ గొంటి వసుపుత్రులనులో - గోపికా నేత్రముల్ గోకులమున
వంచేసితివి లక్ష్మి వెలయు పద్మంబులో - యోగి మానిహృదయకో శాంతరముల
సంవేశ మొందితి సాంగవేదమ్ములో - గురువత్సలాష్టమై గోగణముల
సమస్థాత్రి గాంచితి సారూప్యముక్తులో - తనరు గోపకులు బృందావనమున
గీ. సేవ! మహాదానరాకార! వాలఖిల్య - లమరులును నీదు రుక్మిణి కనుదినంబు
లగ్న శుభ సావధాన కల్యాణ వేళ - సంతరింతురు! మంగళాశాసనములు. 41

సీ. బ్రహ్మ విష్ణు శివాఖ్యఁ బరగు వరుడవీవు-వాగ్రమోమా రూప వధువె యీమె
శ్రుతిసిద్ధయోగ్యముల్ శుభభావమంత్రముల్ - గణపతి గణములు శౌర్యధరులు
ద్వాదశాదిత్యులు తగు దీప్తికారకుల్ - వసువు లెన్మిదిమంది వరణగురులు
శాలాద్యములు భవత్కాయ భాస్వరములు-రుద్రు లేకాదశ భద్రకరులు
గీ. అగుచు, నీకు రుక్మిణికి మాయాప్రభావ! లగ్న శుభ సావధాన కల్యాణ వేళ
సంతరింతురు గాక నిరంతరంబు - సవ్యతమమైన మంగళాశాసనములు. 42

సీ. అనవద్యలౌ సునందాద్యధికుల నైన - మును వేణురవముచేఁ దనుపలేదె?
నిను ప్రేమలాలనన్ గను యశోదకు నైన - నీ పరత్వమహంబుఁ జూపలేదె?
నందాది కులవృద్ధు లందఱిచే నైన - భక్త్యాభిమతపూజఁ బడయలేదె?
కమలేశ! యుండవు కమలాపతివి నైన - వత్సగోపాలురై వరలలేదె?
గీ. నీకు రుక్మిణీదేవికి శ్రీకరముగ - లగ్న శుభ సావధాన కల్యాణ వేళ
సంతరింతురు గాక నిరంతరంబు - స్వర్గవాసులు మంగళాశాసనములు. 43

శ్లో॥ విద్యుత్పుంజనిభాంబరస్య విలసద్గ్రైవేయకస్య ప్రభోః
ముక్తాహారమహార్హ కౌస్తుభమణిగ్రీవస్య కృష్ణాత్మనః,
పూర్ణేందుప్రతిమాననస్య సుతరాం పూర్ణస్య భక్త్యాఽమరాః
రుక్మిణ్యా స్సతతం వివాహసమయే కుర్వంతు తే మంగళమ్.
—సులగ్నే సావధాన. 44

శ్లో॥ మీనాంకాధికసుందర స్సురవధూదృశ్యాతకాంభోధరో
గోపీమండలమండనాంచితతను ర్య స్సుందరః పూరుషః,
త స్యాఖండసుఖాత్మకస్య విదుషా మేకాత్మకస్య ప్రభోః
రుక్మిణ్యా స్సతతం వివాహసమయే కుర్వంతు తే మంగళమ్.
—సులగ్నే సావధాన. 45

శ్లో॥ యే సత్యం ప్రవదంతి సర్వభువనే యా ధర్మశీలాః స్త్రియః
పాతివ్రత్యపరాయణా స్సురభయో మందారముఖ్యద్రుమాః,
తే సర్వే యదునాయకస్య మహత స్సర్వాత్మకస్య ప్రభోః
రుక్మిణ్యా స్సతతం వివాహసమయే కుర్వంతు తే మంగళమ్.
—సులగ్నే సావధాన. 46

శ్లో॥ గన్ధర్వై ర్మునిభి స్స దామితమహాశీర్వాదవర్యాంచితో
దేవైః వ్యోమ్ని విమానమధ్యకలితై ర్దత్తప్రసూనాంజలిః
సంతుష్టామరసమ్యగాచరితభేరీనాదసంతుష్టవాన్ .
రుక్మిణ్యా స్సతతం వివాహసమయే కుర్యా త్సదా మంగళమ్.
—సులగ్నే సావధాన. 47

—♦ శ్రీరుక్మిణీకల్యాణము ♦—

11 శంకరాభరణరాగము - అటతాళము

ప. శ్రీవాసుదేవ ప్రభో పాలయ మాం

1. సకలహితకర సరసగుణగణ నిగమసరసిజ నియతరసఘన
విగతభవభయ వినుతసురవర గగనసువిమల గరుడవిహరణ

సీ. మెఱయు పచ్చని మేలి పేర్మి వస్త్రముతోడ-కనక భూషణ మణికాంతితోడ
ముత్తెంపు పేరుల మొనయు కంఠముతోడ - నీలంపు మేయి నిగనిగలతోడ
మహనీయ కౌస్తుభ మణిహారకముతోడ - ప్రభుశక్తి దీపించు ప్రతిభతోడ
నిండు చందురుఁ బోలు నెమ్మోము కళతోడ-పరిపూర్ణతమ భక్తపరతతోడ
గీ. తేజరిలు నీకు రుక్మిణీదేవి కపుడు - లగ్న శుభ సావధాన కల్యాణ వేళ
సంతరింతురు గాక నిరంతరంబు - స్వర్గవాసులు మంగళాశాసనములు. 44

సీ. గోపికామండలిన్ దీపించు ఘనతకాదె - మానాంరుసాంపులనే మించినావు
స్వర్గకాంతల నేత్రచాతక తృప్తికాదె - నీలాంబుధర కాంతి నెగడినావు
అఖిలాత్మకత్వ పూర్ణానంద బోధకాదె - ఏకాత్మక వ్యాప్తి నెసఁగినావు
పాండిత్య ధీరులన్ భ్రమపెట్టు ధిషణకాదె - మారుమప్రభుశక్తి బూనినావు
గీ. నీకు రుక్మిణీదేవికి శ్రీకరముగ - లగ్న శుభ సావధాన కల్యాణ వేళ
సంతరింతురుగాక నిరంతరంబు - స్వర్గవాసులు మంగళాశాసనములు. 45

సీ. ఎవ్వరు సత్యంబు నే పల్కు-ధరులో - ఎవరు సమస్తభూస్థవ మహీశులో
ఎవరు నిష్కల్మష హితధర్మశీలులో - ఎవరు పాతివ్రత్య మహిత సతులో
ఎవరు పావన కామగవి ధేనుమాతలో - ఎవరు సర్వాత్మకు నెంచు ఘనులో
ఎవరు మందారాది దివవృక్ష ముఖ్యులో - ఎవ్వరు యదునాథు నే తలతురో
గీ. వారలెల్ల నీకును రుక్మిణీరమణికి - లగ్న శుభ సావధాన కల్యాణ వేళ
సంతరింతురుగాక యత్యంతభక్తి - సతతమున్ ప్రభూ! మంగళాశాసనములు 46

సీ. అర్పించినారు భవ్యాశీర్వచనరక్ష - యను కవచమును గర్గాది మునులు
వర్షించినారు దేవతలు పైనుండి ప్ర - సూనదామముల విమానచరులు
మ్రోయించినారు సమ్మోద భేరీనాద - ముఖ్య ఘోషణవాద్యముల నరులు
ముద మొందినారు సంపదల పెండ్లిని వేడ్క-సంతృప్తి పొందిన్న సకలజనులు
గీ. నీకు రుక్మిణీదేవికి శ్రీకరముగ - లగ్న శుభ సావధాన కల్యాణ వేళ
సంతరింతురుగాక నిరంతరంబు - స్వర్గవాసులు మంగళాశాసనములు. 47

11 వ కీర్తన.

ప. ప్రభూ! శ్రీవాసుదేవ! మమ్ము పాలింపుము దేవదేవ!

1. శుభ మెచట దగు - సుగుణ గణముల శ్రుతి కమలముల-సుమధు వగు ఘన
ప్రభల గరుడుప - మయి దవిని జన ప్రణుతి సురలిడ-భవభయము-ఘన

2. సరసిజోదర చరణవిలసిత సరసనూపుర సాధుహితకర
తరళకుండల తాండవానన మురరిపో ఖిల మోహనాభవ

3. నిరుపమధ్వని నికరపావన మురళికారవ మోహితాఖిల
సురవధూగణ సుందరానన కరివరావన కాంచనాంబర

4. దివ్యమంగళ గోపవేష దీనపాలన వీతదోష
నవ్యతర నవ నీతరసిక నరసఖా నఘ నిఖిలజనక

5. దేవకీవసు దేవ తనయ దేవరాజ వి రచితవినయ
దేవ నారా యణానంద తీర్థ విరచిత దివ్యగీత

12 కల్యాణిరాగము - అటతాళము.

ప. కల్యాణం భవతు సదా కనకాంబర! కనకాభే! భైష్మి!

1. అవలోకయ భైష్మి వదనం కృష్ణ! భువన సుందర భూషశినం
నవనీతప్రియ వదనం భైష్మి! భవభయతారక మతిశుభదం

2. సంకల్పం కురు కంసరిపో! జయ సత్యం ప్రతి ధర్మాచరణం
పంకేరుహానయ నామరనరపతి వరిషది భైష్మ్యాసహ శ్రీకృష్ణ!

3. భ్రూమధ్యం పరిసమ్మృజ్యాచ్యుత! భూషయ భైష్మీవదన మిహ
కామం యుగనిహితాంగుళి మేనాం స్నపయహరే! భైష్మి మధునా

4. నవ్యసుందరపరిధానే నానఘ! దేవీ మధు నాచ్ఛాదయ
దివ్యకనకమణి మంగళసూత్రం దేవీకంఠే స్థాపయ భో

5. ద్వారావతీ నగరీ తవ సుఖదా ధీర! హరే! రమయా భవతు
కారణనిర్భర జగతా మసురవి- దారణ! నారాయణతీర్థశరణ!

శ్లో॥ భైష్మ్యాః పాణిసరోరుహాంజలిగతా రక్తాస్తు ముక్తాః స్థితా
యా ముక్తా గళితానురాగవిమలాః కృష్ణోత్తమాఙ్గాశ్రయాః
యాతా స్తస్య యదూద్వహస్య పరమం సామ్యం విశుద్ధాత్మనః
తాః కుర్వం త్వభిత శ్శుభాని సతతం శ్రీకృష్ణవైవాహికాః. 48

13 పున్నాగవరాళిరాగము - రూపకతాళము

ప. రుక్మిణీకల్యాణం సదా దృశ్యతాం

1. కల్యాణగోపాలం కరుణాలవాలం
మాల్యాలంకృత మిూడే మదనగోపాలం

2. అమరనారీగీతం ఆగమవిదితం
అమితభాగ్యోపేతం మాశ్రయేఽనంతం

3. సత్యకామాదిగుణం సకల జగత్కారణం
భృత్యసంరక్షణం భవబంధమోక్షణం

4. మురళీసగళగానం మునిబృందాధీనం
శరణాగతపాలనం శరదిందువదనం

5. భవతిమిరఘునభానుం భక్తకామధేనుం
శివనారాయణతీర్థ శీఘ్రఫలదానం

14 ఆరభి [శంకరాభరణ] రాగము - ఆది [ధవళ] తాళము

ప. జయ జయ బాలగోపాల జయ జయ మదనగోపాల
జయ జయ విజయగోపాల జయ జయ కల్యాణగోపాల

1. నిరుపమగుణరత్నాకాశ నిర్మలకీర్తి పూరితాశ
శరనిధిమధ్యనివేశ సారసనేత్ర లక్ష్మీశ

2. బ్రహ్మాదిసురపూజ్యపాద పాతకజాలవిభేద
బ్రహ్మణ్యదేవ ధృతవేద బలభద్రానుజ భక్తవరద

3. పరిజనహృదయప్రభావ పరిచితమురళీరావ
చరితపుణ్యైకసేవ శివనారాయణతీర్థదేవ

శ్లో॥ బ్రహ్మగ్రంథిం విధా యాగ్నిం ప్రతిష్ఠాపయ కేశవ!
కృత్వా సప్తపదం కర్మప్రధానం హోమ మాచర.

13 వ కీర్తన.

ప. శ్రీ రుక్మిణీ కల్యాణము సేవింతు మనయము
1. కరుణగల గోపాలుడే వరలు పెండ్లికొడుకే
విరుల దండల వాడే మరుని మించువాడే
2. అచ్చరల్ గానము సేయగ ఆగమ విధులెసగ
హెచ్చొ సిరుల్ గలుగ ఇతని సేవింతము తగ
3. సత్యసంకల్పమువాడు జగతికంతకు కారకుడు
నిత్యము దాసులనేలువాడు నెగడు జన్మవారకుడు
4. సరళ వేణురవమువాడు సాధులకు వశమౌవాడు
శరణన్న నేలువాడు శరదిందుడన మోమువాడు
5. భవమను చీకటికి సూర్యుడు భక్తులకు సురధేను తుల్యుడు
శివనారాయణు నేలు చెలువుడు వరవాత్సల్యుడు

14 వ కీర్తన

ప. మేలా! బాలగోపాలునకు మేలా మదనగోపాలునకు
మేలా విజయగోపాలునకు మేలా కల్యాణగోపాలునకు
1. శ్రీరమణ! పద్మాక్షు! జయమున సిరధి మధ్యధామమున
తారలా సుగుణముల నభమున తనరు దిశలన్ కీర్తి శుభమున
2. నలువ సురలు మ్రొక్కు పదముల జలముచే నఘములు వదల
తలప జ్ఞానులఁ గాచి శ్రుతుల హలితమ్ముడనై యుడెడా వరముల
3. దాసుడెలుగు నీమాహాత్మ్యము తనరు నీ మురళీగానము
భాసిలు నీ పుణ్యచరితము వరనారాయణతీర్థ రచితము

గీ. బ్రహ్మ ముడిని సంధింపుము పరమపురుష!
అగ్ని నెలకొల్పి పూజింపు మమరవినుత!
సప్తపదవిధి దీర్పు కేశవ! ముకుంద!
ముఖ్యహోమము సేయుము మురహర! హరి!

శ్లో॥ లాజహోమం తతః కృత్వా ప్రవేశం హోమ మాచర
గంధర్వపూజాం కృత్వాఽథ స్థాలీపాకం సమాచర. 50

శ్లో॥ భుక్త్వాఽద్య బంధుభి స్సార్థం భక్ష్యం పాయసముత్తమమ్,
శేషహోమం కురుస్వామిన్! తతో నాకబలిం కురు. 51

శ్లో॥ పుష్పశయ్యాం సమారూఢో రుక్మిణ్యా రమయా సహ,
భుంక్త్వాఽఖండసుఖం స త్వం భూమాఖ్యం కృష్ణ! కేవలమ్. 52

14 కేదారగౌళరాగము - ఆదితాళము

ప. బ్రహ్మగ్రంథిం కురు కృష్ణ! త్వం,
పరిహర మాయాకృతబంధం
బ్రహ్మసభాయా మిహ వైవాహిక
పావక మిహ సంస్థాపయ భో

1. సుప్తపద స్త్వం తవ మాయాకృత
సప్తపదాఖ్యం విహితం కర్మ
క్లుప్తం తత్ర ప్రధానహోమం
కృష్ణ! కురు త్వం కృతకృత్యోఽసి

2. లాజహోమ మథ కురు కృష్ణ! త్వం
లక్షణ లక్షిత మిహ లక్ష్మ్యై
శ్రీజానేఽథ ప్రవేశహోమం
శ్రేయస్కర మాచర శ్రీకృష్ణ!

గీ. లాజహోమంబు సేయింపు లక్షణముగ
నట ప్రవేశహోమము సేయు మర్హ రీతి
సలుపు గంధర్వపూజను శాస్త్రభంగి
నాచరింపు స్థాలీపాక మాగమవిధి. 50

ఆ. వె. భక్ష్యపాయ సాధ్య పంక్తి భోజనముల
నాప్తజనులఁ గూడి యారగించి
శేషహోమ మంత చేసి యామీఁదట
నాకబలినిఁ దీర్పు నందతనయ. 51

గీ. పూరుషోత్తమ! శోభనపుష్పశయ్య
నలరి రుక్మిణీదేవితో నంతరంగ
పూర్ణతమ శాశ్వతానంద భోగభావ
లీల ననురక్తి భూమాఖ్య నేలు కృష్ణ! 52

15 వ అష్టవిధ క్త్యంత్యప్రాసలుగల - కీర్తన.

—♦ సంబోధనాంత్యప్రాస ♦—

ప. బ్రహ్మముడివిప్పు - పావనచరిత!
పరిహారింపు మాయా - బంధము నచ్యుత!
బ్రహ్మణ్యుల సభ - పరమమునినుత!
పావకుఁ గొల్వుము - భక్తజననత!

—♦ ప్రథమావిధ క్త్యంత్యప్రాస ♦—

1. నెరయు మాయపై - ని గుప్తపదము
వరహితకర్మద - నడు సప్తపదము
పరగు నింకపై - ప్రధానహోమము
హరి! కృతకృత్యత - సమరున్ మోదము

—♦ ద్వితీయావిధ క్త్యంత్యప్రాస ♦—

2. భాజనతఁ దీర్పుము - లాజహోమమును
యోజింపుము శా - స్త్రోక్తలక్ష్యమును
వేఁ జరుపుము ప్ర - వేశహోమమును
శ్రీజాని! కనుము - శ్రేయశ్శుభమును

3. గంధర్వం సం పూజ్య చ విధినా
గరుడధ్వజ! కేశవ! కృష్ణ!
కురు విధినా స్థాలీపాకాఖ్యం
కర్మ చ కరుణా రస జలధే!

4. ఇష్టతమం పాయస మతిమృష్టం
పిష్టక మతిసంతుష్టమనా
ఇష్టజనైస్సహ భుంక్త్వా యథేష్టం
తుష్టిం పుష్టిం కురు జగతాం భో

5. శేషశయన! లీలామయ విగ్రహా!
శేషహవన మిహ కురు కృష్ణ!
దోషరహిత! కురు నాకబలిం భువి
భూషయ భైష్మ్యా మిహ భూమన్!

6. లక్షణానేయుత్వ మధియూహ్ త్వా
లక్ష్మీత్రయ సహా భవ భవనాశనా
లక్షీయసుఖ మనుభవ నిగమాంత
లక్షణసంబోధిత మనుజం భో

7. శ్రీకల్యాణ గోపాలక
రుక్మిణ్యాః కల్యాణ మిహ
శ్రీకర మిహ నారాయణాఖ్య
ప్రకటిత మితి యతివరసుఖదం

శ్లో॥ ఆచార్యవచనా త్సర్వ మకరో ద్యదునందనః
వాచా మనోచరాత్మాఽపి వాసుదేవ స్స్వమాయయా. 58

—♦ తృతీయావిధ కృత్యంత్యప్రాస ♦—

3. కరుణ కృష్ణ! పూజించు - గంధర్వుల నతిచే
సరియౌ నేమము - సక్రమవిధిచే
నెరపు స్థాలీపాకము - నిష్ఠనుగతిచే
గరుడధ్వజ! కేశవ! - కర్మానుమతిచే

—♦ చతుర్థవిధ కృత్యంత్యప్రాస ♦—

4. నన పాయసములు - జనుల సంతృప్తికై
ఎనయు వంటలను - హితుల తుష్టికై
తనరు పంక్తి భో - జనము ప్రజలకై
కొని తనర్తు లీ - లను జగములకై

—♦ పంచమావిధకృత్యంత్యప్రాస ♦—

5. ఉరగశయన! శేష - హోమమువలన
మరియు నాకబలిని - నెరపుటవలన
వరమణిభూషల - వధూటివలన
వరలు కొఱంత లేని - సరసతవలన

—♦ షష్ఠవిధ కృత్యంత్యప్రాస ♦—

6. అవని వెలయు సిరి - యౌ రుక్మిణికి
ప్రవిమలమై తగు - భవ్య వసతికి
నవన వేదాంత - సౌఖ్యోన్నతికి
ధవుడవై, వెలయుము - ధర్మానుగతికి

—♦ సప్తమవిధ కృత్యంత్యప్రాస ♦—

7. శ్రీరుక్మిణీకృష్ణ - శ్రీకల్యాణమున
శ్రీరమ్యమై వెలు - వార శ్రేయమున
నారాయణతీర్థ - నంద గానమున
పారి మొనయు ముని - జనుల మోదమున

కం. వాచామగోచరుండగు
నా చక్రియె వాసుదేవుఁడై నిజమాయన్.
ఆచార్య వచన ధోరణి
నాచరణము సందసూను డట నెరవేర్చెన్.

—♦ శ్రీకృష్ణుఁడు జాంబవతి మున్నగువారలఁ బెండ్లియాడుట ♦—

శ్లో॥ భైష్మీ జాంబవతీ భామా సత్యా భద్రా చ లక్షణా
కాళిందీ మిత్రవిందా చ మహిష్యోఽష్టాఽభవన్ హరేః. 54

శ్లో॥ ద్వారకా నగరీమధ్యే సహస్రస్తంభమంటపే
రత్నసింహాసనారూఢం సకళత్రం జగుస్సురాః. 55

16 కాంభోజీరాగము - ఆదితాళము.

ప. ఆలోకయే శ్రీరుక్మిణీ కల్యాణగోపాలం

అ. నీలమేఘనిభాకారం బాలార్కసమానచేలం
నీలాంబరానుజం గోపాలం నీలాలకాంతం

1. ద్వారకాపురమంటపే ద్వాదశాదిత్యసన్నిభే
భూరిరత్నసింహాసనే భూసురఘనే
వీరాసనే సమాసీనం వికసితాంబుజాననం
ధీరయోగిసేవ్యమానం దేవకీవసుదేవసూనుం

2. శంఖదుందుభినాదితే శతశో గంధర్వాదిగీతే
పుంఖానుపుంఖ నిగమ బుధజనావృతే
పంకజేక్షణరంభాది పటునటన వినోదితే
కుంకుమకేసరవర్షితే కోమలాకారచరితే

3. దివ్యకిరీటకుండలం దీప్తపీతాంబరధరం
నవ్యముక్తామణిహారం నానావిహారం
అవ్యయభూతివిస్తారం అమరనారీసురాధారం
భవ్యకౌస్తుభకంధరం భక్తమానససంచారం

4. అష్టమహిషీసమేతం అమరనారీసుసేవితం
తుష్టపుష్టజనావృతం తుంబురుగీతం
ఇష్టజనసమాశ్రితం ఈశ్వర మపరాజితం
దృష్టసర్వలోకజాతం దేవరాజాదివినుతం

గీ. అయ్యె రుక్మిణి కృష్ణున కగ్రమహిషి
మీదటన్ జాంబవతి సత్య మిత్రవింద
భద్ర లక్షణ కాళింది భామ యనగ
మాన్య లెనమండ్రుడు శౌరికి మహిషులైరి. 54

గీ. ద్వారకానగరము మధ్యఁ దనరు వేయి
కంబముల మండపమ్మున ఘనత రత్న
సింహపీఠి భార్యలతోడ సేవ్యమానుఁ
డైన శ్రీకృష్ణు వినుతించి రమరు లెల్లు. 55

16 వ కీర్తన.

ప. కాంచితిరే! శ్రీరుక్మిణీ కల్యాణ గోపాలుని

అ. మించు నీలిమబ్బు మేన మెఱయు లేమెండ సేల్వాన
మంచినిగ్గుల నలకముల మాన్యుని బలరాము తమ్ముని

1. ద్వారకాపురిమండపమున ద్వాదశాదిత్యులకు సమ మన
తీరౌమణిసింహాసనమున ద్విజవరులలోన
పేరులు గూర్చుండువిధమున విరితమ్మునిబోలు మోమున
ధీరయోగులకొల్వున నున్న దేవకీవసుదేవసూనుని

2. శంఖముల దుందుభుల ధ్వనులు గతిములు గంధర్వుల పాటలు
సాంకముగ వేదాంతులు చాలమంది పండితులు
పంకజాక్షులు రంభాదులు భవ్యనృత్య వినోదములు
కుంకుమపూలజాలరులు కొమరౌ సభలో నలరువాని

3. దివ్యకుండలముల్ కిరీటము దీపించు పీతాంబరము
నవ్యముల్ ముత్తములసరములు నవనవములౌ నద్భుతములు
అన్యయములౌ వైభవములు అమరకాంతల సురల సేవలు
భవ్య గళ కౌస్తుభ శోభలు ప్రబల భక్తుల నేలువాని

4. అష్టమహిషీ కల్యాణములు అప్సరసలచే నృత్యములు
తుష్టి పుష్టి గలుగు ప్రజలు తుంబురుని మేల్గానములు
శిష్టులైన భక్తజనులు సిరులును దిగ్విజయములు
దృష్టి విలసిలు సర్వజగములు దొడర నింద్రుడు పొగడువాని.

5. హేమముక్తామణిఛత్రం హీరరత్నకటిసూత్రం
చామరవ్యజనావృతం శరదిందువక్త్రం
కామకోటిసమగాత్రం కనకాంగదాదివిచిత్రం
శ్యామసుందరం పవిత్రం శరణాగతోద్ధారగోత్రం

6. చంద్రానన భైష్మీ భామా జాంబవతీ సత్యా మిత్ర
విందా భద్రా లక్షణా కా - ళిందీ నాయకం
నందనందన మాశ్రిత బృంద బృందారక వంద్యం
నందిత నారాయణతీర్థ నందన మానందకందం

యాదవ పాండవ కౌరవాది బంధువులఁ గూడి
తండ్రిగారిచే యజ్ఞము చేయించు శ్రీకృష్ణస్వామి



5. ము_త్తముల బంగారుగొడుగులు మొనయు నడుము పట్టేరవ్వలు
మొ_త్తములు వింజామరలు మోమున చంద్రకళలు
చి_త్తజుండన మేని ఠీవులు చెలువు తలిరు నంగదములు
క్రొ_త్త నిగ్గుల శ్యామలతలు గొనబా భ_క్తకులోద్ధారకుని

6. శ్రీరుక్మిణీ శ్రీసత్యా శ్రీమిత్రవిందా శ్రీకాళిందీ
శ్రీజాంబవతీ శ్రీలక్ష్మణా శ్రీనాగ్నజితీ శ్రీభద్రలు
దారలౌ నందకుమారు ధీరు దేవమందారు
నారాయణతీర్థుల నేలు శౌరి నానందగోపాలు

—♦ స్వామివారి అష్టభార్యలు, ద్రౌపదీ బంధు మిత్ర దేవీమణులు ♦—



శ్లో॥ శ్రీగోపాలఘనా దపార కరుణా పీయూష ధారా సృతా
యానారాయణతీర్థభూధరపరిక్షిప్తా సమస్తా తదా
సంభూయాఽచ్యుతభక్తభూమిషు వహం త్యానందయంతీ జగత్
పావిత్ర్యం విధునోతు కృష్ణవిలసల్లీలాతరంగి ణ్యసౌ. 56

—♦ ఫలశ్రుతి ♦—

శ్లో॥ కామదా కామినా మేషా ముముక్షూణాం చ మోహదా
శృణ్వతాం గాయతాం భక్త్యా కృష్ణలీలాతరంగిణీ. 57

---

శ్లో॥ సకలభువననాథం సంతతానంద యుక్తం
నిగమ విదిత నిత్యైకైక చైతన్య రూపం
నిరుపమ గుణదీప్త్యా వీత మోహాంధకారం
పరమ పురుష వేషం తం స్మరామి ప్రపూర్ణం.

శ్లో॥ స్మర హృదయ మదీయం జీవనాధార మేకం
మునిజనగణవంద్యం వేదవాక్య ప్రమాణం
తిమిర హరణ దీప్తం దీనసంసార పారం
సకల జగదతీతం సచ్చిదానంద రూపం.

శ్లో॥ మరకతమణిమాల్యాలంకృతాత్యంతశోభం
శతమదన సమానం శ్యామమేఘాభిరామం
వ్రజవిహారణలోలం వంశవాద్యానురాగం (మోదం)
స్మర హృదయ! నితాంతం శ్రీ యశోదా కుమారం.

— శ్రీ లలితాదేవి.

సీ. ప్రభవించె తొలుతన్ కృపారసస్ఫూర్తిపై - తనరు శ్రీగోపాలఘనమునుండి
స్రవియించి నెలకొనె భువిని నారాయణ - తీర్థ భూధరమందు సార్థకముగ
ప్రవహించె సరస సంభావార్ద్రి సంభూయ - భూతి నచ్యుతభక్త భూములందు
ఒనరించె నందనందనలీల నానంద - సంవ్యాపనంబుగా జగతినంత

గీ. స్వామికరుణాసుధాధార సకలలోక - సేవనము దాసజన మనః పావనంబు
పాపవారక మత్యంత భద్రదంబు - రమ్యతమ కృష్ణలీలాతరంగిణి యిది. 56

గీ. ఐహిక సుఖార్థులగువారి కవి రొయిసంగు
మోక్ష మొసగూర్పజాలు ముముక్షువులకు
గాన మొనరించినను భక్తి గలిగి వినిన
రమ్యతమ కృష్ణలీలాతరంగిణి యిది. 57

---

సీ. కాళ భీకరరాత్రి కారాగృహమ్మున తల్లి తాఁ గన్న సౌందర్యనిధిని
యమునదీ పరిసర వ్రజవాటికలయందు పశుపక్షులాఁగొన వంశధరుని
కుంజపుటీరాల గోపగోపకులెల్ల [illegible] ంచి కొంచిః కొంపుయు
ప్రణయవారిధియందు పరవశమ్ముగ దేలి రాధ సేవించిన ప్రమదకాని

గీ. నమర [illegible] మ్మునన్ ధనంజయుడు గనిన
విశ్వసమ్మోహనాకార విగ్రహమును
దివ్యమంగళమూర్తిని దేవదేవు
నుదయసంధ్యల నేవేళ మదిఁ దలంతు.

* * * * *

గీ. నవ వినీల నీరద లవని నింపి, పరచిర కృపాప్త పరః [illegible] సను గురిసి
యౌవనవిలాసదేహవిన్యాస మొప్ప, విరిసి మెఱసి, మమ్ములపాఱిపించు చెప్పఁడో?

— శ్రీ లలితాదేవి.

# మంగళము

శ్లో॥ స్వామిన్ ! సర్వజగన్నివాస ! రచితాం డోలాం సురేంద్రాదిభిః
వజ్రస్తంభవిచిత్రరత్నఖచితస్వర్ణస్థలే మంటపే,
అరుహ్యామరవర్యగీతమునిభి ర్ధ్యేయాత్మమూర్తే . హరే!
లావణ్యామృతవారిధే! విహార సత్కీర్తిం సువిస్తారయ. 58

17 గౌరీరాగము - ఆదితాళము

ప. జయమంగళం - నిత్యశుభమంగళం

1. మంగళం రుక్మిణీ రమణాయ శ్రీమతే
మంగళం రమణీయ మూర్తయే తే
మంగళం శ్రీవత్సభూషాయ శార్ఙ్గిణే
మంగళం నందగోపాత్మజాయ

2. పూతనాకంసాదిపుణ్యజనహారిణే
పురుహూతముఖ దేవహితకరాయ
సూతాయ విజయస్య సుందరముఖాబ్జాయ
శీతకిరణాదికులభూషణాయ

3. కాళీయమౌళిమణిరంజితపదాబ్జాయ
కాలాంబుదశ్యామ దివ్యతనవే
కారుణ్యరసవర్షినయనారవిందాయ
కల్యాణగుణరత్న వారినిధయే

4. నవనీత చోరాయ నందాదిగోపగో
రక్షిణే గోపికావల్లభాయ
నారదమునీంద్రనుతనామధేయాయ తే
నారాయణానందతీర్థగురవే

# మంగళహారతి



సీ. తీర్పించినారు ప్రదీప్త వజ్రస్తంభ - దివ్యమంటప మిందు దేవరాజు
రచియించినారు చిత్రస్వర్ణ కంబళి - రమణీయ సుస్థల మమరవరులు
వెలయించినారు నిర్మల హంసతూలికా - శయ్యాకలిత డోల నసురవరులు
స్తుతిచేయుచున్నారు జోలపాటల నిన్ను - పరమ పతివ్రతల్ భవ్యమునులు

గీ. అత్మిమూర్తి! లావణ్యామృతాంబుధి! హరి!-స్వామి!సర్వజగన్నివాసా!ముకుంద!
దివ్యడోల నారోహించి దేవమునుల-కీర్తనలు విని పెంపొందు కీర్తిగొనుము 58

17 వ కీర్తన

ప. జయ! మంగళము ఎపుడు సన్మంగళము

1. మంగళము రుక్మిణీ మానినీ రమణునకు
మంగళము శార్ఙ్గధనువుం గలుగు శ్రీశునకు
మంగళము శ్రీవత్స శృంగార మాన్యునకు
మంగళము నందుని కుమారునకు కృష్ణునకు ||జయ||

2. పూతనన్ కంసునిన్ హరిగొన్న శౌరికి
ప్రీతి నింద్రుని సురలఁ బెంచు సొంపరికి
సూతుడై పార్థునకు నీతిఁ జెప్పిన సూరికి
శీతాంశు కులనృపుల శ్రీల పెన్నిధికి ||జయ||

3. కాళీయు తలమణుల నేలు పదపద్మముల
కాలమేఘముఁ బోలు ఘనతమునకు
చాలదయ వర్షించు జలజమ్ములను కనుల
శ్రీల గుణరత్నముల సింధువునకు ||జయ||

4. నవనీత రసికునకు నందనందనునకు
ఉవిదలను గోవులను నోము రక్షకునకు
స్తవములను నారదుడు సల్పు నామమునకు
శివనారాయణతీర్థ సేవఁగొను గురువునకు ||జయ||

18 మధ్యమావతీరాగము - ఆదితాళము

ప. మదనగోపాల! తే మంగళం మందరధర! తే మంగళం

1. శ్రీరమణీకుచకుంకుమపంకవిలిప్త విశాలభుజాంతర!
వారిజలోచన! వల్లవయువతీ జార! సదా తే మంగళం

2. కుండలయుగళీమండితమృదుతర గండస్థల! తే మంగళం
భండనసముదితచండపురాసుర ఖండనచరణ! తే మంగళం

3. రంగదభంగ పరాక్రమ! సంగత గంగాధర తే మంగళం
అంగజజనక! తుంగతరంగ భుజంగశయన! తే మంగళం

4. దినకరమండలమధ్యగ! సంతత వినతామర! తే మంగళం
వనజభవార్చితపాదసరోరుహ! మునిజనహిత! తే మంగళం

5. సామజపోషణ! శత్రువిభీషణ! సంభృతకౌస్తుభభూషణ!
కామితదాయక! కమలానాయక! సోమాన్వయ! తే మంగళం

ఇతి శ్రీనారాయణతీర్థవిరచితాయాం శ్రీకృష్ణలీలాతరఙ్గిణ్యాం
శ్రీరుక్మిణీకృష్ణ కల్యాణమహోత్సవ వర్ణనం నామ
ద్వాదశతరఙ్గః.

---

18 వ కీర్తన

ప. మదనగోపాల! నీకు మంగళం మందరధర! నీకు మంగళం
1. శ్రీరుక్మిణి మేని కుంకుమ దనరారు చెలువౌవక్షమునకుమంగళం
వారిజాక్షుడవై వల్లవ యువతుల గోరు నీ లీలకు మంగళం
2. ఒనరు నీచెక్కిళ్లమణులకుండలముల దనరారు జంటకు మంగళం
ఘనమౌ రణమందు దనుజులనెల్ల గెలిచి-మొనయు నీబాణమునకు [మంగళం
3. రంగైన శౌర్య మెసంగు ధీర! నీగంగాధరు మైత్రికి మంగళం
అంగజతండ్రి! పాల్కడలి నలల శే - షాహి శయ్య నలరు నీకు [మంగళం
4. రవిమండలముమధ్యరాజిల్లిసురలుగొల్వ-రమణీయుడౌనీకుమంగళం
భువనకర్త బ్రహ్మపూజించు నీపదముల-పొగడు మునుల నేలునీకు [మంగళం
5. కరినిసంరక్షించిఖలులనుశిక్షించి-కౌస్తుభమునదనరు నీకు మంగళం
వరముల నిప్పించి సిరికి పతివై మించి - వరచంద్ర వంశ మేలు [వరద! నీకు మంగళం

ఇది శ్రీనారాయణతీర్థయతీంద్రులచే రచింపఁబడిన శ్రీకృష్ణలీలా
తరంగిణియందు శ్రీ రుక్మిణీకృష్ణ కల్యాణ మహోత్సవమను
పండ్రెండవ తరంగము.

---

ఆ. వె. కష్టసమయమందుఁ గాంచి న న్నేమిన
పార్వతీశు సదయు భక్తిఁ గొలిచి,
వర్తమానదశకు వరలు సత్ప్రభువైన
బుధునిమండలేంద్రు పూజ సేతు.

చ. సమరథులన్ మహారథుల సైన్యములన్ దగఁ గూర్చి కౌరవుల్
సమరమునన్ బెనంగొనఁగ శక్రతనూజునకు న్నియంతవై
క్రమమున శత్రులన్ దునిమి రాజ్యము ధర్మజుఁ జేర్చినట్టి నె
య్యము గణియింప శక్యమె దయామృత నీరధి! పార్థసారథీ!

-- పార్థసారథి శతకము.



చ. జయ జయ దేవదేవ జలజాత భవార్చిత పాదపంకజా
జయ జయ వామదేవ శరజన్మ ముఖామరజాలసంస్తుతా
జయ జయ వాసుదేవనవసారసపత్ర విశాల లోచనా
జయ జయ శారదాభ్ర సురపాల యశోనిధి! పార్థసారథీ!

— పార్థసారథి శతకము



స్వస్తి శ్రీ తారణసంవత్సర పుష్య శు ౧౧ సోమవారము ది 25-12-1944
శ్రీవైకుంఠైకాదశీ పర్వదినము ఉదయమున జరిగిన గరుడోత్సవమందు
ద్వార దర్శనసమయమున నూజవీడు కోటకు అధిదైవమైన

## శ్రీ గోపాలస్వామివారికి సమర్పింపఁబడిన
## నివేదిక

కం. శ్రీమన్నారాయణు డిల - ప్రేమన్ భక్తులకు హితము పెంపగ కృష్ణుం
డై మహిమ దనర్చిన కథ - శ్రీమద్భాగవతమున విశిష్టత నెనయున్. 1

గీ. అందెనయు దశమస్కంధ మాదిభాష-నలరుకీర్తనలున్ శ్లోకములుగ సులభ
భంగి శ్రీకృష్ణలీలాతరంగిణి యన - ధిషణఁగూర్చె నారాయణ తీర్థయోగి. 2

సీ. మును శ్రీశు నవతారమునకు కారణమును - దనరారు శ్రీకృష్ణ జననకథయు
బాలగోపాలునిలీల యౌవనకేళి - దుష్టశిక్షణమును శిష్టరక్ష
పరమమౌ వేదాంత భావనాబోధంబు - సంగీత సాహిత్య సరసగరిమ
లలిత వాక్చాతురీ సులభశైలి విధంబు - కృష్ణ సంబోధనా కీర్తనంబు

గీ. పరవశత్వ సమంచిత భక్తి మహిమ - రమ్యతమ భువనత్రయ రంజనంబు
రహి నెనయు కృష్ణలీలాతరంగిణి యిది - పరలు నారాయణమునీంద్ర విరచితమ్ము.

కం. శ్రీకృష్ణానుగ్రహమున - నీకావ్యము నాంధ్రభాష నెనయ రచింపన్
నాకౌదవె మహాభాగ్యము - శ్రీకరమౌఁగాక యిది విశేషశుభదమై! 4

చ. తెనుఁగా! యనంగ నర్థములు తీరగు - సంస్కృత కీర్తనంబులన్
తెనుఁగొనరించు టెట్లు? యన - దివ్యవచోరచనానురమ్యతన్
దనరు వరార్థభావములఁ దద్గతి - తేటతెనుంగు మాటలం
దనువగు పాటలం దనయు - హాయి నెలర్పఁగ సంతరించితిన్. 5

గీ. "దేశభాషలఁగడు లెస్స తెనుఁగ"యనఁగ - తగుపురాణకావ్యము లెన్నొ తనరుచున్న
మా తెనుఁగునందు, కృష్ణలీలాతరంగ - భంగి భక్తిలోమక మాట భావ్యమెకద! 6

గీ. వెలయు జయదేవు గీతగోవింద మేను - గొల్చి యష్టపదుల తెల్గు కూర్చినట్లె
కృష్ణలీల నాంధ్రతరంగ కీర్తనలుగఁ - దీర్పఁదగ దె నారాయణతీర్థుఁదలఁచి! 7

గీ. మరియు నీప్రమేయమ్మున మాన్యమైన - కృష్ణనామ కథానుసంకీర్తనంబు
పరమతత్త్వార్థమహిమానుభావనంబు - శుభలమ వ్యాపనం బలవడెఁ గద!

సీ. శ్రీవేణుగోపాలు సేవించునప్పుడు - ఈశ్వరోపాసనము సేయించునపుడు
వ్యవహారములు సభల్ వివరించునప్పుడు - పురములన్ పేద్కాల నరయునపుడు
యంత్రయానములలో నరుగుచున్నప్పుడు - ప్యారిసుజ్జపుదోడు సాగునపుడు
దినచర్య వరుసగా తీర్చుచున్నప్పుడు - నిదురకై మెలకువ మొదలునపుడు

గీ. తనువు తద్ధర్మచర్యలన్ దనరునపుడు - మనసుధారగ జాపవ "కృష్ణ!వంధః ." యని
కవనధారణి హరిపాద కమలమందుఁ - బరగుచుండుట మత్ పుణ్యఫలముగాదె! 9

ఉ. ఎంతటి వింతలో ఘటన లెంతటి తీవ్రసమస్య లెంత లో
కాంతివిఘాతముల్ మదిని చాల పరీక్ష యొనర్చుచున్న, శ్రీ
కాంతుని కృష్ణుసత్కథలు గల్గిన యీ వరకావ్యసక్తియే
సంతత మంతరంగమున సాధుసుధీరత నింపి పెంపగన్. 10

కం. ఇంతకుఁ గారణమై శ్రీ-కాంతు కరుణ, పార్వతీశు కరుణయు, వాణీ
కాంతుకరుణ, ఖేచరభా-స్వంతులు గ్రహపురుషవరుల సత్కరుణ తగన్. 11

గీ. కావ్యములలోడ తమవంశఘనత కవులు - తెలుపుపద్ధతి తగుఁగాన తెలుపుచుంటి
తిరిగి, ఆంధ్రాష్టపది తుదిన్ దీర్చినట్లె - అస్మదీయ వంశీయ భవ్యప్రశంస. 12

[శ్రీ మేకా బసవదండనాథులు]



సీ. కాకతిగణనాథ ఘన సైన్యసేనాని
బసవకుమారులు మాకు ప్రాథమికులు
విజయరాప్పరా యాధివీరులు గోల్కొండ
దళవాయి సప్తమాంతరమువారు
ఏలూరు గడి దివి లీల నేలిన రామ
చంద్రు లా మీద వంశప్రథితులు
గూల్ బర్గ రణసర్గ గురువైభవులు జగ
న్నాథు లా తరువాత యోధవరులు
ధర్మాప్పరాయాఖ్యు దనరు వేంకటనర
సింహప్పరావు వంశీయఘనులు

తే.గీ. నరస సింహ వరద తిరుమల సంజీవ
శేషనాద్రి నార యాభినుతుల
ప్రబలు నూజవీటి ప్రభువు లెందఱో కల్గు
అప్పరాయ నామ కాన్వయమున.

[శ్రీ రాజా విజయాప్పారాయణింగారు]



సీ.। కన్నారు। నన్ను వేంకటరంగరాయప్రా
[illegible]యులు నారయామ్మక్షైనిర్మల విభవులు
రాజ రంగయప్పరాయ బహదరు చెల్ల
యామ్మ ప్రేమను పెంచి రధిపదవికి
ధీరతా సౌమ్యతా ధీయుతాసారంబు
లానగూడె గురుదయాఘనత కలన
ఉయ్యూరు మొదలెన్నో యూళ్ళ మా రైతులు
మత్ప్రాభవాగ్రసమ్మతులు హితులు
గీ. వంశవర్ధనుల్ సుతులను వరతనయల
నేలు కృపావర్తి వేణుగోపాలమూర్తి
వేంకటాద్ర్యప్పరాయండ విశ్వానుజన
హిత విధేయుండ వైష్ణవమతపరుండ.

# నివేదిక

[శ్రీ రాజా రంగయ్యాప్పారాయణింగారు]



[అస్మజ్జాతకచక్రవర్ణనము]

సీ. దీపించె నుచ్చస్థితిన్ సూర్యభగవానుఁ,
డనువర్తనన్ వెల్గె నమరగురువు,
అనువొందె నాతృతీయమున నే శుక్రుండు,
సాహచర్యము గాంచె రాహు వందె,
పరివర్తన కుజుండుఁ బడసె నాల్గవ కేంద్ర
మెనసె వాగ్భావమందున బుధుండు,
అతనిన్ గనెన్ లగ్నపతి శని సమదృష్టి,
మొనసె భాగ్యస్థానమున విధుండు,
గీ. అచట కేతు వాతని వీడి యరుగుచుండె,
కుంభలగ్న చిత్రా తార కుజదశలను.
రమ్య వైశాఖ శుభ చతుర్దశిని, నిశిని,
విజయ వత్సర శుభజన్మ వెలసె నాకు.

## [జన్మస్థానవర్ణనము]

సీ. శివ కేశవ బ్రహ్మ సేవాభిమత విప్ర
వర్యాగ్రహారమ్ము వరలుచోట
రాము తమ్ముని పేర రహి తమ్మిలేరు నేల్
పంటలిచ్చుచు చెంతఁ బారుచోట
తాతగారికి పెదతాత ధర్మప్పరా
యాలు కొల్వ నెలకొల్పినట్టిచోట
వారికి కోడలౌ పాపయామ్మరావు
సంతానపాలనల్ సలుపునాఁట
గీ. మాన్య గౌతమీకృష్ణాఖ్య మండలముల
మధ్యమైన హేలాపురి కలిత వీట
జన్మ నాకు వైభవపూర్తి జరుగు చోట
పాటిలెన్ శనివారపుపేట కోటఁ. 16

గీ. అంత కాల వయోవృద్ధు లగుగు కొలది
గురుకృపన్ జ్ఞానలవ మొనగూడు కొలది
పెద్దలన్ గొల్చి వినయంబు పెరుగు కొలది
ఆంధ్రభారతీ సేవనం బలరె కొలఁది. 17

సీ. తొలుతగా లఘుకావ్యములను గీతములుగా
ద్విపదలన్ లలి కథల్ దీర్చినాఁడ
చారిత్రక పురాణ శాస్త్ర సంగతు లంత
నాటకములుగ నొనర్చినాఁడ
కాకతి రుద్రాంబ కథ యక్షగాన ప్ర
బంధశోభల సొంపుపరచినాఁడ
సులభబోధనకుఁగా జ్యోతిష సంగీత
విషయ జంత్రికలఁ గావించినాఁడ
గీ. ఐదువేలును నలువదిమూఁడవ కలిఁ
తారణాబ్ద మదీయ వర్ధంతి పూజ
గాఁగ నా తెల్గుతల్లికీ కావ్య మేను
శౌరి దయతోడ సంధింపఁ జాలినాఁడ. 18

కం. ఈ కావ్యము ప్రకృతమ్మున
లోకోత్పాతముల నడచి లోకహితముగా
శ్రీకరమై తారకమై
శ్రీకృష్ణక్షేమ వెలయుఁ జేయుత శుభమై. 19

---

శ్రీ కొండపల్లి ముద్రాక్షరశాల, రాజమండ్రి.